# కావ్య సమీక్షలు

సంపాదకులు

డా॥ ఎం.వి. సత్యనారాయణ, ఎం.ఏ., పిహెచ్.డి.

తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు






1983



ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్

వాల్తేరు, విశాఖపట్నం 530 003

# కావ్య సమీక్షలు

సంపాదకులు

డా॥ ఎం.వి. సత్యనారాయణ, ఎం.ఏ., పిహెచ్.డి.

తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు




1983

ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్

వాల్తేరు, విశాఖపట్నం 530 003

# తొలిపలుకు

M. R. APPAROW, M.A.
VICE-CHANCELLOR
ANDHRA UNIVERSITY

WALTAIR
December 10th, 1980

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు స్వర్ణోత్సవ సందర్భంగా ప్రచురింపబడుతున్న గ్రంథాలలో ఈ 'కావ్య సమీక్షలు' అన్నది ఒక గ్రంథం. ఈ సంపాదకుడు డాక్టర్ ఎం.వి. సత్యనారాయణ, పబ్లికేషన్ అసిస్టెంటు, తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, ముప్పై ప్రాచీనాంధ్రకావ్యాలమీద సమర్థులయిన విమర్శకులచేత కావ్యసమీక్షలు వ్రాయించారు.

ఈ కావ్య సమీక్షలో కవి జీవితం, జన్మస్థలం, కాలం, తలిదండ్రులు, గురువులు, రాజాశ్రయం, కృతులు మొ.; కథాసంగ్రహం; సంగ్రహ సమీక్షలో—కథావస్తుతత్త్వం, పాత్రచిత్రణ, వర్ణనలు, రసం, శైలి, కవియాత్మీయత మొ. రచింపబడ్డాయి. సమీక్షలో ఉదాహృత పద్యాలలోని కొన్ని పదాలకు అర్థాలు, విడిగా అనుబంధంలో చేర్చబడ్డాయి. ప్రతి వ్యాసానికి ఉపయుక్తగ్రంథాలు సూచింపబడ్డాయి. సమీక్షావ్యాసరచయితయొక్క జీవిత సంగ్రహంకూడా ఇందులో చేర్చబడింది.

ప్రతి కావ్య సమీక్ష ఆకాశవాణిలో 15 నిమిషాలలో ప్రసారం చేయటానికి అనువుగా వుంది. సహృదయులు ఈ రచనల్ని చదివి ఆనందిస్తారని ఆశిస్తున్నాను.

ఎం.ఆర్. అప్పారావు
ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

# కృతజ్ఞతలు

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు స్వర్ణోత్సవ సందర్భంగా విశ్వకళాపరిషత్కులపతులు, లలితకళాతపస్వి అయిన శ్రీ ఎం. ఆర్. అప్పారావు మహోదయుల ప్రోత్సాహంవల్లనే డాక్టర్ ఎల్. చక్రధరరావుగారి సంపాదకత్వాన 'కవితా సంకలనం' (నన్నయ – వీరేశలింగం) ; డాక్టర్ ఎం.వి. సత్యనారాయణ సంపాదకత్వాన 'నవకవిత' (1900 – 1976) అన్న పద్య గేయ వచన కవితా సంకలనం ; ఆచార్య యస్వీ జోగారావుగారి సంపాదకత్వాన 'కావ్య సౌరభాలు,' 'శారదదరహాసాలు' అన్న సాహిత్య వ్యాసాలు, సమీక్షలు ప్రచురింపబడ్డాయి. శ్రీ అప్పారావు మహోదయుల సంకల్పబలంవల్లనే ఇటువంటి ప్రణాళికతో ఆకాశవాణిలో 15 నిమిషాలలో ప్రసారం చేయదగిన 'కావ్య సమీక్షలు' వెలువడ్డాయి.

శ్రీ ఎం. ఆర్. అప్పారావు మహోదయుల ప్రేరణమువల్లనే ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా, శ్రీ ఎమ్వీయల్ రచించిన కావ్య పరిచయాలు ప్రచురించటం ; వారు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంలో సాంస్కృతిక వ్యవహారశాఖామాత్యులుగా నున్నపుడు ప్రోత్సహించుటవల్లనే ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు 50 ప్రబంధాలు ప్రచురించి తక్కువ వెలకు విక్రయించటం జరిగింది.

నవకవితా సంకలనానికి, ఈ కావ్య సమీక్షలు వ్రాయించటానికి నాకు సదవకాశమిచ్చిన—

ఆంధ్ర విశ్వకళాపరిషత్కులపతులు శ్రీ ఎం. ఆర్. అప్పారావు మహోదయులకు—

తమ అమూల్యమయిన కాలమును వెచ్చించి, రచనాశక్తిని ప్రదర్శించి యిలాంటి ఉత్తమ వ్యాసరచనలు గావించిన ఉపాధ్యాయులకు, పరిశోధకులకు, తదితరులకు—

తమ పరిశోధకులను ఇట్టి రచనలకు సర్వధా ప్రోత్సహించిన ఆచార్య యస్వీ జోగారావుగారికి, డాక్టర్ (శ్రీమతి) కోలవెన్ను మలయవాసినిగారికీ—

త్వరలో అందంగా ఈ గ్రంథాన్ని అచ్చొత్తించిన ఆంధ్ర విశ్వవిద్యాలయ ముద్రణాలయం డిప్యూటీ డైరక్టర్ శ్రీ జి. మదనరాజుగారికి, అసిస్టెంటు డైరక్టర్ శ్రీ ఎం. ఆర్. బి. నరసింహారావు, ఎం.ఏ., గారికి, ముద్రణాలయో ద్యోగులకు—

నా కృతజ్ఞతా నమస్సుమనస్సులు.

తెలుగుశాఖ
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు
వాల్తేరు
30–11–1980

ఇట్లు
*సంపాదకుడు*
మోడేకుర్తి వేంకట సత్యనారాయణ

# విషయ సూచిక

| కావ్యము | సమీక్షకులు |
| --- | --- |
| 1. నిర్వచనోత్తర రామాయణము | డా॥ ఎం.వి. సత్యనారాయణ |
| 2. నృసింహ పురాణము | శ్రీ పి. విజయభూషణ శర్మ |
| 3. శృంగార నైషధము | శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి. |
| 4. హరవిలాసము | శ్రీమతి టి. కనకమహాలక్ష్మి |
| 5. భీమఖండము | శ్రీ కాసారపు తాతారావు |
| 6. కాశీఖండము | డా॥ డి. లలితకుమారి |
| 7. విక్రమార్క చరిత్రము | శ్రీ కనుమలూరు వెంకటశివయ్య |
| 8. భోజరాజీయము | డా॥ బి. అరుణ కుమారి |
| 9. వీరభద్రవిజయము | కుమారి వట్టిపల్లి సీతామహాలక్ష్మి |
| 10. శృంగార శాకుంతలము | డా॥ ఎల్. చక్రధరరావు |
| 11. మొల్ల రామాయణము | డా॥ కోలవెన్ను మలయవాసిని |
| 12. మనుచరిత్రము | డా॥ అత్తలూరి నరసింహారావు |
| 13. ఆముక్తమాల్యద | శ్రీ కె. ఎ. కృష్ణమాచార్యులు |
| 14. పారిజాతాపహరణము | శ్రీ చివుకుల రవిశర్మ |
| 15. శ్రీకాళహస్తి మాహాత్మ్యము | డా॥ మోపిదేవి కృష్ణస్వామి |
| 16. రాజశేఖర చరిత్రము | శ్రీ యెందుగుల జగన్నాథనాయుడు |
| 17. రామాభ్యుదయము | శ్రీ వావిలాల సుబ్బారావు |
| 18. ఉద్భటారాధ్యచరిత్ర | కుమారి నారపరాజు శ్రీవల్లి |
| 19. పాండురంగ మాహాత్మ్యము | డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య |
| 20. రాఘవపాండవీయం | డా॥ జోస్యుల సూర్యప్రకాశరావు |
| 21. కళాపూర్ణోదయము | శ్రీ రామవరపు శరత్‌బాబు |
| 22. ప్రభావతీప్రద్యుమ్నము | కుమారి కందాళ వెంకటరమణ |
| 23. వసుచరిత్రము | డా॥ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి |
| 24. రాధామాధవము | శ్రీ ఎలవర్తి విశ్వనాథరెడ్డి |
| 25. చిత్రభారతము | కుమారి దశిగి అన్నపూర్ణ |
| 26. యయాతి చరిత్రము | శ్రీ ఆదిభట్ల సూర్యనారాయణ |
| 27. వాల్మీకి చరిత్రము | శ్రీ వేదుల వేంకట కాళీ సూర్యనారాయణ |
| 28. రఘునాథనాయకాభ్యుదయము | శ్రీ ముచ్చు సీతారామయ్య |
| 29. అనిరుద్ధ చరిత్రము | శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి |
| 30. అచ్చతెలుఁగు రామాయణము | శ్రీ పప్పు వేణుగోపాలరావు |

# నిర్వచనోత్తర రామాయణము — తిక్కన

## సమీక్ష : డాక్టర్ ఎం.వి. సత్యనారాయణ

[జన్మస్థలం – బాడంగి, విజయనగరం జిల్లా. జననం – 15–12–1928 ఎం.ఎ., పిహెచ్.డి., డిప్లొమా [హిందీ], పబ్లికేషన్ అసిస్టెంటు, తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు. ముద్రితకృతులు – శ్రీరామశతకము, శ్రీకృష్ణశతకము, శ్రీపాండురంగశతకము, శ్రీ సత్యసాయి శతకము–కీర్తనలు, శ్రీవేంకటాచల మాహాత్మ్యము [ఆంధ్రానువాదము]. తెలుగుశాసనాలలో అన్య దేశ్యములు [అక్టోబరు 1959 భారతి] చమత్కారాలు – చాటువులు – సూక్తులు [ఆం.వి. ప్రచురణ] సంపాదకుడు 'నవకవిత' [1900 – 1976] ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణ. 12 రేడియో ప్రసంగాలిచ్చారు.]

### 1. కవి జీవితాదులు :

పంచమ వేదమయిన భారతాన్ని ఆంధ్రీకరించిన కవిత్రయంలో ద్వితీయుడు, ఆంధ్ర కవీంద్రులలో అద్వితీయుడు, కవిబ్రహ్మ తిక్కన సోమయాజి. ఈతని తల్లి అన్నమాంబ. తండ్రి కొమ్మనామాత్యుడు. ఈతడార్వేలనియోగి. ఈతని యింటిపేరు కొట్టరువువారు. ఈతని తాత తండ్రులు 'వెలనాడు'లో ఉన్న గుంటూరులో నివసించేవారు. తిక్కన నెల్లూరులో ఉన్నత పదవులలో వున్న పెదతండ్రులతో, వారి కుమారులతో వుండి రాజకుమారుడైన మనుమసిద్ధికి స్నేహితుడై అతనితో విద్యాభ్యాసంచేసి, రాజనీతిజ్ఞుడు లోకజ్ఞుడయ్యాడు. ఈ కవీంద్రుడు క్రీ.శ. 13వ శతాబ్దికి చెందినవాడు.

తిక్కన మహాకవికి ఉభయకవి మిత్రుడు, కవిబ్రహ్మ అను బిరుదులున్నాయి. తిక్కన మనుమసిద్ధి ప్రభువుకు మంత్రిగా వున్నపుడే ప్రథమ కృతియైన నిర్వచనోత్తర రామాయణాన్ని అతనికి అంకితమిచ్చాడు. వచనం లేకుండా రచించినందువల్ల ఉత్తర రామాయణానికే నిర్వచనోత్తర రామాయణమని నామకరణం చేయబడింది. తిక్కన సంస్కృత మహాభారతంలోని విరాటపర్వం మొదలుకొని 15 పర్వాలు తెలుగులోనికి పద్యగద్యరూపంలో అనువదించి ధర్మాద్వైత తత్త్వం ప్రబోధించాడు. హరిహరాద్వైతవేదిగ పరిగణింపబడ్డాడు. విజయసేనము, కవిసార్వభౌమచ్ఛందస్సు, శ్రీకృష్ణశతకం, తిక్కన విరచితములని కొందరి అభిప్రాయం ; కాదని కొందరు.

## 2. కథాసంగ్రహం :

అయోధ్యాపతి అయిన దశరథమహారాజుకు శ్రీరామాదులు నలుగురు పుత్రులు జన్మించారు. శ్రీరాముడు శివధనుర్భంగంచేసి సీతను వివాహమాడాడు. సీతాలక్ష్మణులతో వనవాసంచేస్తూ, శూర్పణఖ గర్వమణచి, రావణకుంభకర్ణాదుల్ని వధించాడు. ఆ మహానుభావుడు అగ్నిదేవతా సన్నిధిని సీతను పరిగ్రహించి, విభీషణ సుగ్రీవ వాయునందనుల్ని ఆదరించి, దేవేంద్రాదులచే స్తుతింపబడి, లక్ష్మణుడు పుష్పక విమానం తేగా, అందులో సీతాసమేతుడై సపరివారంగా అయోధ్యా పట్టణానికి సంతోషంగావెళ్లి, ప్రజల మన్ననలు పొంది, రాజ్యపాలన చేశాడు. ఇది ప్రథమాశ్వాసంలో కథ.

శ్రీరాముని కొలువుకూటానికి జనకాదులు వచ్చారు. మునులు రావణ కుంభకర్ణాదుల పరాక్రమాన్ని, వారిని సంహరించిన శ్రీరాముని గుణగణాల్ని కొనియాడగా, శ్రీరాముడు అగస్త్యమునిని రావణాదుల జన్మవృత్తాంతం, తపస్సు చేసిన విధం, శౌర్యాదులు చెప్పమని కోరాడు.

అగస్త్యుడు శ్రీరామునికి విశ్రవసువు, వైశ్రవణుడు, సుకేతువు, మాల్యవదాదులు, రావణకుంభకర్ణ విభీషణుల వృత్తాంతం తెలిపాడు.

రావణుడు దేవేంద్రాదుల్ని బాధించి, కుబేరుణ్ణి ఓడించి, పుష్పకవిమానం తీసికొన్నాడు. వేదవతి రావణునిచే అవమానితయై అగ్నిలో ప్రవేశించింది. రావణుడు చెరలోవుంచిన స్త్రీలచే శపింపబడ్డాడు. రావణుడు కార్తవీర్యార్జునుని చేత, వాలిచేత అవమానింపబడ్డాడు. మునులు శ్రీరాముని విడిచి తమ ఆశ్రమాలకు వెళ్లారు. కుబేరుని పుష్పకవిమానం శ్రీరాముని దగ్గరకు వచ్చింది. సీతారాములు ఉద్యాన జలలీలావిహారాలు సల్పారు. సీతాదేవి గర్భవతి అయింది. శ్రీరాముడు లోకాపవాదభీతిచే, సీతను అడవిలో విడువమన్నట్లు లక్ష్మణునితో చెప్పాడు. వాల్మీకి మహర్షి సీతను తన ఆశ్రమానికి తీసికొని వెళ్లి మునిపత్నుల కప్పగించాడు.

లవణాసురుణ్ణి శత్రుఘ్నుడు; శంబూకుణ్ణి శ్రీరాముడు వధించారు. శ్రీరాముడు అశ్వమేధయాగం చేశాడు. కుశలవులు యాగశాలలో రామాయణం గానంచేసి, శ్రీరామునిచే సన్మానితులయ్యారు. వాల్మీకి శ్రీరామునికి సీత వృత్తాంతం చెప్పి కుశలవుల్ని అతనికి అప్పగించాడు. సీత తన పాతివ్రత్య మహిమచే భూమిలో ప్రవేశించింది. శ్రీరాముడు లవకుశుల్ని అయోధ్యకు తీసికొనిపోయి రాజవిద్యలు నేర్పించాడు. శ్రీరామచంద్రుడు సకల జనానంద కరంగా రాజ్యపాలనగావించాడు.

3. వస్తుతత్త్వం :

ఈ కావ్యంలోని పది ఆశ్వాసాలలో 1280 పద్యాలున్నాయి. సంస్కృతంలో వాల్మీకి విరచితమైన రామాయణంలోని ఉత్తరకాండలో 111 సర్గలలో [వావిళ్లప్రతి 1951] 2731 శ్లోకాలు; ప్రక్షిప్తాలైన 13 సర్గలలో 661 శ్లోకాలున్నాయి. సంస్కృత పద్మపురాణంలోని సృష్టి ఖండంలోను, పాతాళఖండంలోను, కొన్ని సర్గలలో ఉత్తరరామాయణ కథా ఘట్టాలు కొన్ని ఉన్నాయి. తిక్కన పైగ్రంథాలలోని కథను స్వీకరించి నిర్వచనోత్తర రామాయణ కావ్యం రచించాడు. దీనికి మూలమయిన ఉత్తర కాండ వాల్మీకి విరచితం కాదని కొందరి వాదం. వాల్మీకి విరచితమని చెప్పటానికి చాలా ఉపపత్తులున్నాయి. శ్రీరామాయణానికి 'సీతాయాశ్చరితమ్' [ బాల. 4–7 ] అన్న నామాంతరం వాల్మీకి చెప్పినదే.

శ్లో. "స్వరాష్ట్ర రంజనం చైవవైదేహ్యాశ్చవి సర్జనమ్ ॥
అనాగతం చ యత్కించి ద్రామస్య వసుధాతలే ।
తచ్చకారోత్తరే కావ్యే వాల్మీకిర్భగవానృషిః॥"

[ బాల. 3–37, 38 ]

సీతాపరిత్యాగానికి పూర్వం జరిగిన కథా భాగం ఆరు కాండల్లోనూ, సీతాపరిత్యాగం మొదలు భవిష్యత్కథాభాగం ఉత్తరకాండలోనూ, భగవంతు డయిన వాల్మీకి చెప్పినట్లు, వాల్మీకిరామాయణంలోని పైశ్లోకాలలో చెప్పబడింది. కాబట్టి ఉత్తరకాండ శ్రీవాల్మీకి విరచితమే. సీత పుట్టుక బాలకాండలో చెప్పబడింది. అమె భూమిలో ప్రవేశించటం ఉత్తరకాండలో చెప్పబడింది. అందువల్లనే సీత అవతారం పరిసమాప్తం అయింది. పూర్వరామాయణానికి నాయిక అయిన సీతాదేవి ఉత్తరకాండకు కూడ నాయిక. కాబట్టి వాల్మీకి ఉత్తర కాండను రచించాడనవచ్చును. ఉత్తరకాండతో కలిస్తే కాని రామాయణంలో ప్రధానరసం కరుణ మనిపించుకోదు. రామాయణం కరుణరస ప్రధానమన్న ఆనందవర్ధనుని చూపు ఇదే.

నిర్వచనోత్తర రామాయణం మంగళంతో ఆరంభమయి, మంగళాంత మయింది. తిక్కన తెనిగించని కౌసల్యాద్యంతఃపుర స్త్రీల కాలధర్మం, శ్రీరామాదుల నిర్యాణం, ఏకాశ్వాసంలో చంపువుగా రచించాడు జయంతి రామయ్యభట్టు.

ఈ ప్రబంధనాయికా నాయకులయిన సీతారాముల కథ, ఉత్తర భాగంలో సుమారు మూడున్నర ఆశ్వాసాలకు తిక్కన పరిమితం చేసినా, తన ప్రజ్ఞా సామర్థ్యాన్ని చూపించి, సీతారాముల ధర్మనిర్వహణను ఉదాత్తరీతిని, నిర్వహించాడు.

తిక్కన తరువాత కాచభూపతి విఠలరాజు లిద్దరు "రంగనాథరామా యణము" ఉత్తరకాండను ద్విపదలో రచించారు. కంకంటి పాపరాజు వాల్మీకి విరచితమైన ఉత్తరకాండ కథనే 8 ఆశ్వాసాల మహాప్రబంధంగా తెలుగులో రచించాడు. ఈ కథను స్వీకరించి గ్రంథాలు రచించిన యితరులున్నారు.

4. పాత్రచిత్రణ :

ఈ ప్రబంధంలోని పాత్రలు కొన్ని దివ్యములు, కొన్ని మానవజాతికి, మరికొన్ని రాక్షసజాతికి, ఇంకా కొన్ని వానరజాతికి చెందినవి. శ్రీరామ చంద్రుని ఉత్తమము, ఆదర్శప్రాయమయిన రాజధర్మ నిర్వహణను, సీతాదేవి పాతివ్రత్యమును, లక్ష్మణశత్రుఘ్నులకు శ్రీరాముని యెడగల భ్రాతృభక్తి మిళితమయిన ప్రభు భక్తిని, వాల్మీకి తాపస ప్రవృత్తిని, త్రికాలజ్ఞతను ; క్షత్రియ బాలురయిన లవకుశుల ఉత్తమ వీరోచిత కార్యాల్ని, గురు మాతృపితృ భక్తి భావాలను, రావణాదుల దుష్టరాక్షస తామసప్రవృత్తిని చిత్రించటంలో అన మాన ప్రజ్ఞాపాటవం ప్రకటించాడు తిక్కన.

శ్రీరాముడు ప్రభువు కాబట్టి ప్రజారంజనకు సీతను విడిచిపెట్టాడు. కాని ఆమె ఉత్తమ శీలవతి అను నమ్మకం కలవాడని క్రింది పద్యంవల్ల తెలుస్తున్నది.

ఉ. వేవురునేల ? నేను బృథివీ సుతచిత్తము పెంపెఱుంగనే ?
భూవలయంబు సంచలతఁబొందిన వారిధి మేర దప్పినన్
దేవనగంబు పాఁత గిలిత్రెళ్లిన, నందొక కీడుగల్గునే ?
యావనజాక్షి నిట్టు పెడనాడిన నక్కట ! నోరుప్రువ్వదే.

[నిర్వ. 8-117]

క్రింది పద్యంలో సీత పతివ్రతా స్వభావం ఏలాగ చిత్రింపబడిందో చూడండి :

తే. పతియ చుట్టంబుఁ బక్కంబుఁ బతియ చెలియుఁ
బతియ తల్లియుఁ దండ్రియుఁ బతియ గురుడు
పతియ దైవంబుఁగావున నతని పంపొ
నర్చుటయగాదె ధర్మంబు నాతి కరయ.

[నిర్వ. 9-29]

5. వర్ణనలు :

కవిబ్రహ్మ తిక్కన కథాగతికి అడ్డురాకుండా, రసోచితంగా, పాత్రల స్వభా వానుకూలంగా, సందర్భశుద్ధితో వర్ణనలు గావించాడు. ఈ ప్రబంధంలో

అయోధ్యాపుర వర్ణన [1–45–64], యుద్ధవర్ణన [4–46–63], కైలాసగిరి వర్ణన [6–29–38], అంధకారవర్ణన [6-39], చంద్రోదయ వర్ణన [6-40-56], సూర్యోదయవర్ణన [6-87-92], ఉద్యానవిహారవర్ణన [8-24-43], జలక్రీడా వర్ణన [8-44-66], సంభోగ వర్ణన [8-70-80], కుమారోదయవర్ణన [10-134-141] మొ.వి. ఉత్తర రామాయణోచితంగా, రసానుగుణంగా వున్నాయి.

రావణాసురుడు కామపరవశుడై రంభను బలాత్కారం చెయ్యటానికి ఉప స్కారకంగా వున్న చంద్రికా వర్ణనలోనిది క్రిందిపద్యం :

చ. అలసత యొప్పనల్లన రతాంతమునం బ్రియునొద్దఁ బాసి నె
చ్చెలికడ కేఁగుదెంచు సరసీరుహనేత్ర విలోచనంబులం
దలఁకెడు మందహాసము విధంబున సొంపున మీఱియున్న చెం
గలువలలోన నింపడరు కౌముది వేడ్కలొనర్చెఁ జూడ్కికిన్.

[నిర్వ. 6-54]

అలాంటి వెన్నెల చూచి యాత్రీరుగా భావిస్తున్న రావణాసురుడి కంట బడింది రంభ. వాడు యుక్తాయుక్త వివేకశూన్యుడై రంభను చెఱపడానికి దోహ దం చేసింది వెన్నెల, ఇటువంటి మనోహర వర్ణనలుగల ప్రబంధమిది.

6. రసపోషణ :

ఈ కావ్యంలో వీరరసం యొక్క ప్రధాన భేదాలయిన యుద్ధవీరం, ధర్మవీరం, పూర్వోత్తర భాగాల్లో క్రమంగా నిర్వహింపబడ్డాయి. పూర్వభాగానికి ధీరోద్ధతుడయిన రావణుడు నాయకుడు. ఉత్తరభాగానికి రాజు ధీరోదాత్తుడైన శ్రీరాముడు నాయకుడు. ఇందులో ధర్మవీరం అంగిరసం. శృంగారం, కరుణ అంగరసాలు. రాజసూయయాగ దీక్షయందున్నూ, సతీవియోగానంతరం పుత్రుల్ని అయోధ్యకు తీసికొనిపోయి రాజవిద్యలు నేర్పించుటయందున్నూ, శ్రీరాముని ధర్మవీరం మూర్తీభవించింది. నాయికానాయకులయిన సీతారాముల వనవిహార ఘట్టంలో శృంగారం ; సీతాపరిత్యాగానంతరం విప్రలంభ శృంగారం ; వాల్మీకి మున్యాశ్రమవర్ణనలో శాంతరసం ; శత్రుఘ్నుడు లవణాసురుణ్ణి చంపిన సంద ర్భంలో యుద్ధవీరం ; రావణుడు కార్తవీర్యునితో వాలితో యుద్ధంచేసినపుడు రౌద్ర వీరాద్భుత హాస్యాలు వర్ణింపబడ్డాయి.

సీతారాముల లీలా విహారవర్ణనలో శృంగార రసోచిత రచనావైచిత్రిని తిల కించండి.

చ. ప్రమదము మూర్తమైనటులు రాగము రూపు వహించునట్లు వి
భ్రమ మొడలెత్తినట్లు రతిరాజవిహార కుతూహలంబు దే
హముఁ దగఁ దాల్చినట్లు హృదయంగమమై విలసిల్లుచున్న యా
రమణిఁ బ్రమోదరూఢ మదరంజితఁ జేయు విభుండు ధీరుఁడై.

[నిర్వ. 8-71]

7. శైలి :

ఈ నిర్వచనోత్తర రామాయణంలో ఒక ప్రత్యేక శైలివుంది. ఈ మహాకవి తనకు పూర్వులు సమకాలికులైన శివకవుల రచనల్ని అనుకరించలేదు. ఇందు లోని కావ్యశిల్పం, ఉత్తమశైలి, పాత్రల సహజ మనస్తత్త్వ వర్ణన తిక్కన తరువాతి కవులకు మార్గదర్శకము లయ్యాయి.

తిక్కన కాలంలో ప్రచారంలో వున్న తెలుగు మాండలిక పదాలు, నుడి కారాలు, జాతీయాలు, సూక్తులు, సామెతలు హృద్యంగా ఇందలి పద్యాలలో ప్రయోగించబడ్డాయి. వ్యర్థపదాలు కానరావు. పాత్రోచిత సంభాషణలతో నాట కీయ శిల్పం పాటించటంవల్ల ఈ కావ్యం నూతన శైలితో ఒప్పుతున్నది.

ఉదా :

సీ. అఖిల ధర్మస్థితి నపహారియందునే ?
యౌవనంబున దపమాచరించెఁ ;
గరుణా సముద్రుఁడు గాఁడందునే ? యట్టి
యపరాధిఁ గృతక వాయసముఁగాఁచె ;
నాశ్రితరక్షమైనర్థి లేఁడందునే ?
పగతుతమ్మునిఁ రాజ్యపదవి నిల్పెఁ ;
బాటించి నన్ను సంభావింపఁ డందునే ?
నాకుఁగా నెన్ని యత్నములో చేసెఁ ;

తే. బతిజనించిన కోలెను బరహితైక
లోలమతి ; యొడల్ సిదిమినఁ బాలువచ్చు
నాతఁ డిదికార్యమని నిశ్చయంబుచేత
నాయభాగ్యంబ ; యొండొక వేయునేల.

[నిర్వ. 9-22]

సీత తనను భర్త విడిచిపెట్టినందుకు విచారిస్తూ లక్ష్మణునితో అంటున్న పైమాటలలో, తిక్కన పాత్రోచితమైన కావ్యశిల్పం పాటించి కవిబ్రహ్మ బిరుదము సార్థకం చేసికొన్నాడు. ఈతడు సంస్కృతాంధ్రభాషా కావ్యప్రౌఢిని పాటించు

శిల్పకళావిదుడు. అయినా. సంస్కృత పదప్రయోగంకంటె, సందర్భోచితంగా, జాతీయములయిన తెలుగుపదాల్ని ప్రయోగించటంలో ఎక్కువ మక్కువ చూపాడు. వాక్యాల్ని కలపటానికైనా, గద్యరచన చెయ్యలేదు. శ్రావ్యంగా ఉండాలని సందర్భశుద్ధిలేని పదాల్ని ప్రాసకోసమయినా వాడలేదు. వచనంలేకుండానే వర్ణనలు సాగించాడు. లలితములు హృద్యములయిన పద్యాలతో పద్యరచన గావించాడు.

ఇందులోని సామెతలు, మచ్చుకు—

1. నిధి నిఱుపేదవాఁడు గన్నట్లు [2-81]
2. పులిమీసల నుయ్యాలలూగి [6-11]

8. ఆత్మీయత :

తిక్కన మహాకవి వేదశాస్త్ర పురాణకావ్య నాటక కళాపారగుడు, యజ్ఞయాగాది సత్కర్మాచరణ నిరతుడు, శబ్దబ్రహ్మవిదుడు, రాజనీతి పారంగతుడు అని కేతన మొదలగువారు ప్రశంసించి తిక్కనకు తమ గ్రంథాలు అంకితం చేశారు. అటువంటి కవిపండితులే తిక్కనకు 'కవిబ్రహ్మ' బిరుదము నిచ్చారు. తిక్కన సంస్కృతాంధ్ర సాహిత్య విద్యాప్రవీణుడు, దేశిమార్గకవితా విశారదుడు అని రసవత్కవులచే కొనియాడబడి వారిచే 'ఉభయకవి మిత్రు'డన్న బిరుదమును పొందాడు.

తిక్కన నిర్వచనోత్తర రామాయణ కావ్యం రచించిన తరువాతనే యజ్ఞం చేసి, అటుపిమ్మట ఆంధ్రభారత రచన గావించినట్లు, ఆరెండు గ్రంథాల యాశ్వాసాంత గద్యలవల్ల తెలుస్తున్నది. భారతం ఆంధ్రీకరించి ఐహికాముష్మిక సుఖశాంతులు పొందాడు తిక్కన. ఈ ప్రబంధంలో ప్రతిఘట్టంలోని ప్రతి పద్యంలోనూ తిక్కనకుగల లోకజ్ఞత, శాస్త్రజ్ఞత ప్రతిభావ్యుత్పత్తులు ప్రస్ఫుట మవుతున్నాయి.

## కొన్ని పదాలకు అర్థాలు

వేవురు = వేయిమంది
పృథివీసుత = సీత
పెంపు = గొప్పతనము
వారిధి = సముద్రము
వనజాక్షి = పద్మనేత్ర
ప్రువ్వట = పుచ్చుట
నెచ్చెలి = ప్రియసఖి

సరసీరుహము = తామరపువ్వు
మందహాసము = చిఱునవ్వు
కౌముది = వెన్నెల
కవియు = విజృంభించు
కృతాంతుడు = యముడు
పొడవడచు = పాడుచేయు
ప్రమదము = సంతోషము
విభ్రమము = శృంగారచేష్ట
రతిరాజవిహారము = మన్మథక్రీడ
ధీరుడు = ధైర్యముకలవాడు
పక్కము = మిత్రము
పంపొనర్చుట = ఆజ్ఞనుపాలించుట
నాతి = స్త్రీ
వాయసము = కాకి
పగతుడు = శత్రువు
అభాగ్యము = దురదృష్టము

## ఆధారగ్రంథాలు


1. నిర్వచనోత్తరరామాయణము [ఆం.ప్ర.సా. అకాడమీప్రతి, 1968]
2. భాస్కరరామాయణము [వావిళ్లప్రతి, 1965]
3. ఉత్తరరామాయణము – కంకంటి పాపరాజు [వావిళ్లప్రతి]
4. ఆంధ్రకవితరంగిణి (2వ సంపుటం) – చాగంటిశేషయ్య
5. తిక్కన కావ్యశిల్పము [1973] – డాక్టరు కేతవరపు రామకోటిశాస్త్రి
6. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (2వ సంపుటం) – ఆరుద్ర
7. ఉత్తరకాండః [వావిళ్లప్రతి, 1951]
8. సంస్కృత పద్మపురాణమ్ [1, 3 భాగాలు] సృష్టిపాతాళఖండములు [గోపాల్ ప్రింటింగ్ వర్క్స్, కలకత్తా, 1958]

# నృసింహపురాణము — ఎఱ్ఱాప్రెగడ

సమీక్ష : శ్రీ పి. విజయభూషణ శర్మ, ఎం.ఏ. (ఆనర్స్)
Producer, Spoken Word, A.I.R., Visakhapatnam

[ జన్మస్థలం : కొల్లూరు, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా, జననం : 1936. ఎం.ఏ. [ హిస్టరీ ]. బిరుదములు : ఆంధ్రాదిత్య, విశాఖ కోకిల. వృత్తి : ప్రొడ్యూసర్, ఆకాశవాణి విశాఖపట్టణం. ముద్రితకృతులు : అవధానవాణి [ సమీక్షా గ్రంథం ], యక్షవిలాసము (పద్య కావ్యము), సౌగంధికము (స్వతంత్ర శిల్పకావ్యము), 'మార్నింగ్ బర్డ్స్' (ఆంగ్ల పద్యకావ్యము). అనేక వ్యాసాలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఆకాశవాణిలో సంస్కృతాంధ్రాంగ్లాలలో ఉపన్యాసాలు, గోష్ఠులు, చర్చలు, స్వీయ కవితాగానాలు, వృత్తిరీత్యా ప్రవృత్తి రీత్యా చేశారు. ]

## 1. కవి జీవితవిశేషాలు :

నృసింహపురాణ కర్త ఎఱ్ఱాప్రెగడ పోతాంబా సూరనార్యుల పుత్రుడు. ఎఱ్ఱాప్రెగడ అరణ్య పర్వ పరిశిష్ట భాగ రచనము, నృసింహ పురాణ ప్రణయనము క్రీ.శ. 1315–1325 మధ్య నెరపినాడనిన శ్రీ శే. నాగంటి శేషయ్యగారి వాక్కు మనకు ఉపలభ్యము. ఎఱ్ఱాప్రెగడ క్రీ.శ. 1280 ప్రాంతంలో జన్మించి క్రీ.శ. 1345 వరకు జీవించి నృసింహ పురాణము, అరణ్యపర్వ శేషము, రామాయణము, హరివంశము గ్రంథాలను సమగ్రదృష్టితో రచించి ప్రబంధ పరమేశ్వరుడు, శంభుదాసుడనే విఖ్యాతిని సంపాదించుకొన్న వాడు. పురాణ ప్రబంధములను బహువర్ణనాత్మకంగా రచించిన కవిచంద్రుడు. ఈతని జన్మస్థలం పాకనాటి యందలి గుడ్లూరని తెలుస్తున్నది. ఈతడు కొండవీటిని పరిపాలించిన ప్రోలయవేమారెడ్డి ఆస్థానకవిగా విరాజిల్లినాడు.

## 2. కథా సంగ్రహం :

గాలవుడనే మహర్షికి దేవశ్రవుడనే మహర్షి వివరించిన అహోబిల క్షేత్రమహిమ ఈ కావ్యంలో చెప్పబడింది. క్షీరసాగరం మధ్యనున్న శ్వేత ద్వీపంలోని వైకుంఠంలో ఉన్నాడు శ్రీహరి. ఉత్థానైకాదశినాడు విష్ణువుని దర్శింప వెళ్ళిన సనకసనందనాది బ్రహ్మర్షులను వారించిన, విష్ణుమందిర ద్వార పాలకులైన జయవిజయులు, ఆ ఋషుల శాపంవల్ల హిరణ్యకశిప, హిరణ్యాక్షులనే రాక్షసులుగా జన్మించారు. వారిలో పెద్దవాడైన హిరణ్యకశిపుడు త్రిలోకాధి పత్యంకోసం బ్రహ్మనుద్దేశించి తపస్సు చేసి, ప్రపంచంలో ఏ వస్తువుచేత,

దేవ రాక్షస నర మునులలో ఎవరిచేత, భూమిమీదగాని, ఆకాశంలోగాని, పగటి వేళగాని, రాత్రిగాని, ఏ ఆయుధంచేత చావులేకుండా వరం పొందాడు. ఆ వరం వల్ల గర్వించిన హిరణ్యకశిపుడు మూడులోకాల్ని బాధించడం మొదలు పెట్టగా, ఇంద్రాది దేవతల కోరిక ప్రకారం శ్రీమహావిష్ణువు నరసింహావతారాన్ని ధరించి ఆతనిని సంహరిస్తానని వారికి అభయమిచ్చాడు.

త్రిలోకాలను జయించి స్వైర విహారం చేస్తున్న హిరణ్యకశిపునికి ఒక పుత్త్రుడుదయించాడు. ఆ బాలునికి ప్రహ్లాదుడనే పేరు పెట్టాడు హిరణ్యకశిపుడు. తండ్రి ఉపనయనం చేసి విద్యాభ్యాసార్థం గురుకులానికి పంపిన కుమారుణ్ణి రప్పించి సభలో సుభాషితాన్ని ఉపన్యసింపమన్నాడు. విష్ణుప్రభావంతో జన్మించిన ఆ బాలుడు విష్ణుమహత్యాన్నే ప్రవచించాడు. అందుకు కోపించి హిరణ్యకశిపుడు ఆ బాలుణ్ణి నానాబాధలు పెట్టించి నాగపాశాలతో కట్టించి సముద్రంలో త్రోయించాడు. మరొకనాడు విష్ణుభక్తి తన్మయుడైన కుమారుణ్ణి కోపంతో సభకు రప్పించి, ఒక స్తంభాన్ని కొట్టి అందులో విష్ణువును చూప మన్నాడు. ఆ స్తంభం నుండి విష్ణువు నరసింహమూర్తిగా అవిర్భవించి ఆ రాక్షసుణ్ణి వధించి భక్తుడైన ప్రహ్లాదుణ్ణి ఓదార్చాడు. ఆ స్వామి బలాన్ని దేవతలు, మునులు అహోబల శబ్దపూర్వకంగా స్తుతించిన చోటయిన ఆ తీర్థానికి అహోబలమని, తానున్న శైలానికి గరుడాద్రి అని, ఆ సమయంలో అక్కడ అవతరించిన గంగానదికి భవనాశినీ నది అని పేరు పెట్టాడు ఆ నరసింహస్వామి. శ్రీదేవి అవతరించివచ్చి నృసింహస్వామి వామాంకాన్ని అలంకరించింది. బ్రహ్మాదులు తన మాహాత్మ్యాన్ని స్తుతింపగా, లక్ష్మీనృసింహ స్వామి ప్రహ్లాదుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేసి, కోరికలు తీర్చి, ఆ అహోబలక్షేత్రంలో అధివసించి లోకరక్షణ చేస్తున్నాడు — అన్నది యీ కథాసంగ్రహం.

3. వస్తుతత్త్వం :

పేరుకిది పురాణమైనా, వస్త్వైక్యమున్న ప్రబంధం, దీని మూలకథ కొంత బ్రహ్మాండ పురాణం నుండి, మరి కొంత విష్ణుపురాణం నుండి గ్రహింపబడింది. అంతేకాక పెద్దల వలన వినిన కథను కూడా చేర్చి ఎఱ్ఱన ఈ ప్రబంధాన్ని స్వతంత్రంగా రచించాడు. నృసింహావతారానికి హేతుభూతమైన ప్రహ్లాదుని చరిత్ర ఇందులోని వస్తువు అయినా, ప్రహ్లాదుని చరిత్ర అంతా, ఇందులో వర్ణింపబడలేదు. ప్రహ్లాదరక్షణ రూపమయిన నృసింహావతారానికి, ప్రహ్లాద రక్షణకు అవసరమైనంత కథ మాత్రమే ఈ గ్రంథంలో ఉంది. హిరణ్యకశిపుని జన్మకు కారణమైన వృత్తాంతంతో ప్రారంభమై, అతని దుష్కృత్యాలతో పెంపొంది, ప్రహ్లాదుని రక్షణతో అంతమైన యీ కథ నృసింహావతారానికి కార్యకారణ భూతాలైన పూర్వోత్తర కథాంశాలతో వస్త్వైక్యతను సంతరించుకొంది.

4. రసపోషణము :

శాంతరస ప్రధానమైన ఈ గ్రంథంలో కరుణ, శృంగార, రౌద్ర, అద్భుత, బీభత్సాది పెక్కు రసాలు చక్కగా వర్ణింపబడ్డాయి. సనకసనందనాదులు కోపంతో జయవిజయుల్ని శపించిన ఘట్టంలో రౌద్ర రసం, ఆ శాపంపొంది వారు మూర్ఛిల్లిన ఘట్టంలో కరుణరసం పోషింపబడ్డాయి. ప్రహ్లాదుని జననం మొదలు హిరణ్యకశిపుని వధవరకున్న కథ భక్తిరస ప్రధానమైంది. ప్రహ్లాదుడు శ్రీమహా విష్ణువును గురించి, ప్రవచించిన వచనాలు భక్తిజ్ఞాన విలసితాలు. ఈ ఘట్టంలో అక్కడక్కడా ఇతర రసాలు పోషింపబడినా, ప్రహ్లాదుని సహనం శాంతరసానికి ఆలవాలమైంది.

> ఉ. మాటలువేయునేమిటికి మాధవు డొక్కడ దైవ మేను ము
> మ్మాటికిఁ జాటితిన్ గుటిలమత్సర భావము లుజ్జగించి య
> మ్మేటి భజింపుఁడీ తెరువు మేలుగఁగైకొనుఁ డాత్మలోన మో
> మోట యొకింతలేదు హరినొల్లమి యొప్పదు చెప్పితింజుడీ.
>
> [నృ. 4–102. ప.]

అనే యీ పద్యంలో గురువులు విభావాలై వారి బోధనలు ఉద్దీపాలై, స్థైర్యవైశారద్యాదులు అనుభావాలై, స్మృతిమతి వితర్కహర్షాదులు సంచారీ భావాలై విరాజిల్లి విష్ణుమహిమాత్మకమైన భక్త్యుత్సాహం భక్తివీరమై విలసిల్లు తోంది. ఇంద్రాదిదేవతలు తమ బాధలను నారాయణునితో మొరపెట్టుకున్న ఘట్టం కరుణరసాల వాలం. ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు బాధించిన సందర్భంలో వీర రౌద్ర అద్భుతరసాలు చక్కగా పోషింపబడ్డాయి. నృసింహావతారా విర్భావ ఘట్టం రౌద్రాద్భుతరసాల కాటపట్టు. హిరణ్యకశిపుడు నృసింహస్వామితో పోరాడిన సందర్భంలో వీర రసం, నృసింహస్వామి హిరణ్యకశిపుని చీల్చి వధించినపుడు రౌద్ర బీభత్సరసాలు చక్కగా వర్ణింపబడ్డాయి. హిరణ్యకశిపుని తపోభంగం కావించడానికి వచ్చిన అప్సరఃకాంతల విలాసవిభ్రమాలు వర్ణించు సందర్భంలో శృంగార రసం పోషింపబడింది.

5. పాత్రచిత్రణ :

ఈ నృసింహపురాణంలో విభిన్న మనస్తత్త్వాలతో కూడుకున్న భిన్నభిన్న పాత్రలను ఔచిత్యప్రదంగా చిత్రించి, ఆయా పాత్రల ద్వారా ధర్మభక్తి జ్ఞానాదుల్ని పాఠకులకు సుస్పష్టంగా వ్యక్తంచేశాడు బహు శాస్త్ర పారంగతు డయిన ఎఱ్ఱనార్యుడు. ఆతడు యోగశాస్త్రపు లోతులు చూచినవాడు. అతని దృష్టిలో ప్రహ్లాదుడు జ్ఞాని, యోగి. అతడు మునిపుంగవులను సైతము, సిద్ధులు గను, జ్ఞానయోగులుగను నిరూపించినాడు. శ్రీమహావిష్ణువును సైతం జ్ఞానయోగ

మును ప్రసాదించు పరతత్త్వంగా చిత్రించాడు. హిరణ్యకశిపుని పుత్త్రవాత్సల్యం, హరిపట్ల విరక్తి, పుత్త్రుని శిక్షించు సమయంలో వాని మనోవ్యథ, ప్రస్ఫుటంగా వ్యక్తీకరింపబడ్డాయి. ఈ ప్రబంధంలో ప్రహ్లాదుని విష్ణుభక్తి మూర్తీభవించి నట్లుంది.

ఈ కావ్యంలో ప్రహ్లాదునిచే—

ఆదియు మధ్యంబు నంతంబు నెవ్వాని
కరయలేదని చెప్పు నాగమములు
పొడముటయును లేక పొదలుటయును లేక
తఱుఁగుటయును లేక తనరు నెవ్వఁ
డెవ్వనివలనన యంతయు సంభవ
స్థాన సమాహార దశలఁజెందుఁ
గారణంబుల కెల్లఁగారణంబై యెవ్వఁ
డపగత కారణుండై వెలుంగు.

నమ్మహానుభావు నచ్యుతునవికారు
నమితతేజు విష్ణు నాదిదేవు
నాశ్రయించినాఁడ నధిప యింతయకాక
యితరమైన యర్థ మెఱుఁగనేను.

[ నృ. 4-7 ]

అని చెప్పించి, ఎఱ్ఱనార్యుడు, శ్రీమన్నారాయణ తత్త్వాన్ని విశదంగా వ్యక్తీకరించడంతో పాటు భక్తిజ్ఞానాలను వివరించాడు. హిరణ్యకశిపుని రాజస తామస ప్రవృత్తి, విష్ణుద్వేషం, సునిశిత పరిశీలనా దృక్పథంతో హిరణ్యకశిపుని పాత్ర చిత్రణలో కానవస్తాయి. దేవదానవ గురువులైన బృహస్పతి, శుక్రాచార్యుల భిన్నస్వభావాలు సుస్పష్టంగా చిత్రీకరింపబడ్డాయి.

6. వర్ణనలు :

నృసింహపురాణం, సురుచిరములు, విస్తృతములు, సుందరములు నయిన వర్ణనల సౌభాగ్యమును సంతరించుకొన్న ప్రబంధం యిది. ప్రబంధములలో అష్టాదశవర్ణన లుండవలెనను ఆలంకారిక సంప్రదాయమునకు గౌరవము కల్పించినదా అనిపిస్తుందీ కావ్యం. ఈ ప్రబంధంలో సాయం, నిశాచంద్రోదయ వర్ణనలు, శరదృతు తారకా నీలఘృణి మణిస్థగిత రంగవల్లీ పరిష్కారన భోంగణ వర్ణనలు రాశీభూతములై ఉన్నాయి. తృతీయాశ్వాసంలోని చంద్రోదయ వర్ణన, యీ ప్రబంధపరమేశ్వరుని భావనాశక్తికి నిదర్శనము. చంద్రోదయ దృశ్యం మనోజ్ఞంగా కన్నులకు కన్పట్టుచున్నది.

తిమిరభూతమునోకు తెరల జగత్త్రయీ
లలనదాల్చిన రక్త తిలకమనఁగ
నఖ్యంబునకు నిశాపతి యొసంగినఁ బ్రావి
ప్రాపించు గురివింద బంతియనఁగఁ
దోయధివెడఁగ్రుంకి తోఁచు పురందర
కుంభిసిందూరిత కుంభమనఁగఁ
గులిశాయుధుని పెద్ద కొలువున నెత్తిన
దీపించు మాణిక్య దీపమనఁగఁ
గుముదినీరాగ రసబద్ధ గుళికయనఁగఁ
గామినీరంజ నౌషధకబళమనఁగఁ
బొడపు పెంపున బింబంబు పొలుపు మిగులఁ
జంద్రుఁడుదయించెఁగాంతి నిస్తంద్రుఁ డగుచు.

[ నృ. 3 84 ]

7. శైలి :

ఇందులో లోకోక్తులు, సామెతలు, జాతీయాలు పెక్కులున్నాయి. అవి ఎల్లననాటి సాంఘిక జీవితమును, కొంతవరకు తెలిసికొనుటకు, నాటి వ్యావహారిక భాషా స్వరూపమును అర్థం చేసికొనుటకు ఉపయోగిస్తాయి.

ఎల్లనకు అలంకారాల పట్ల మక్కువ ఎక్కువ. ఉత్ప్రేక్ష, ఉపమ, రూపకములు, మిక్కిలిగా వాడినాడు. స్వభావోక్తి విరోధాభాసములప్పుడప్పుడు వాడినాడు. ఇక ప్రతి ఆశ్వాసము, విశేష వృత్తాలతో కూడిన ఆశ్వాసాంత పద్యాలతో ముగియుట చూస్తాం. అవి మాలిని, పంచచామరము, స్రగ్విణి, భుజంగ ప్రయాతము మొదలయినవి.

ఎల్లన కవిత సంస్కృతాంధ్ర పదభూయిష్ఠమై ధారాశుద్ధి కలితమై శబ్దార్థ సహితమై, సత్కవి పండితప్రశంసాపాత్రమై హృద్య సంభాషణ సంయుక్తమై శబ్దాలంకారాలతో సొగసైన వాగుదార గుణమై అలరారుచున్నది. ఎల్లన తెలుగుపదములను, ఉదాహరణ

ఇంద్రుడు మార్కండేయుని తపము చెరుప పంపిన సుందరులగు అప్సరల రూపురేఖాలావణ్యముల ప్రస్తావన :

సీ. బాయులసగుమోముఁ బండురు పొంతును
రాగాంబుధులు నిట్ట గ్రమ్మునటు
.... .... ....
బలుపలలుగావె కాంతల చెలువులెల్ల.

[ నృ. 2–50 ]

ఎఱ్ఱన సరళ సుందరశైలికుదాహరణము :

హిరణ్యకశిపుడు ప్రహ్లాదునకు విషము పెట్టించినప్పటి పద్యము .

అమృతుననంతునచ్యుతుని నాత్మఁదిరంబుగన్చి, నిత్యబో
ధమునఁగరంగు నప్పరమధార్మికుఁడింపుగ నారగించున....

[ నృ. 4–88 ]

ఎఱ్ఱన సంస్కృత సమాసాల దైర్ఘ్యానికి ఉదాహరణ :

ఇంద్రునకు బృహస్పతి నారాయణమంత్రమును ఉపదేశించు సందర్భములో గ్రుక్కతిప్పుకో నీయని ఈ శబ్ద బంధురత చూడండి :

ఉ. శ్రీస్తనకుంకుమ ద్రవనిషిక్త భుజాంతరభాగవిస్ఫురత్........

[ నృ. 2–37 ]

ఆత్మీయత : ఎఱ్ఱనకవి బహుపురాణ రచనా శీలుడు, ధర్మ శాస్త్రజ్ఞుడు, కథా విస్తరణ ప్రవీణుడు, విజ్ఞానాత్మక వాఙ్మయ సృజనాధురీణుడు, ప్రౌఢ మనోజ్ఞ రసబంధ కవితా ప్రబంధేశ్వరుడు, ప్రబంధరచనా సమగ్ర సూత్ర ప్రణాళికా నిర్మాణ నిపుణుడు. ఈతడు నన్నయ తిక్కనాదుల కవితామాధురీ రీతుల నాపోశనము పట్టినవాడు. తన కవితద్వారా, పఠితృ చిత్తవృత్తుల ప్రసన్నము చేసికొన జాలినాడు.

ఎఱ్ఱన నృసింహపురాణాన్ని అహోబల నరసింహస్వామికి అంకితము చేసి తన భక్తిభావాన్ని ప్రపన్న మన స్థితిని చాటు కొన్నాడు. ఈతడు లోగడ నన్నయ కర్తృకతనే తాను రచించిన అరణ్యపర్వశేషమును రాజరాజనరేంద్రునకు అంకితము చేయుట ద్వారా తన విశాల హృదయాన్ని చాటు కొన్నాడు. ఈతడు శివకేశవాద్వైత భావము గల కవి. శంభుదాస లక్షణాభిధేయుడు. నృసింహపురాణమును రచించి, విష్ణుగాథా విష్కరణద్వారా, విష్ణుభక్తి తత్పరతను తెలుపుకొన్నాడు. ఈ విధంగా శివకేశవాద్వైత భావాన్ని పెంపొందించుకొని పరిణతినందిన భక్త కవిగా రూపొందాడు ఎఱ్ఱన.

## కొన్ని పదాలకు అర్థాలు

నిద్దము = నునుపైన
కులిశాయుధుడు = ఇంద్రుడు
పురందర కుంభి = ఐరావతము

శుక్తి = ముత్యపుచిప్ప
భోగి = పాము
వలి = ముడుత

## ఆధార గ్రంథాలు

1. నృసింహపురాణము – సాహిత్య అకాడమీ ప్రతి 1967
2. ఆంధ్ర కవితరంగిణి [ 4 వ సంపుటం ] – చాగంటి శేషయ్య
3. సమగ్రాంధ్ర సాహిత్యము [ 3 వ సంపుటం ] – ఆరుద్ర

# శృంగారనైషధము — శ్రీనాథుడు

**సమీక్ష : రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి, ఎం.ఎ.**

[జన్మస్థలం : గుడివాడ, పాలకొండ తాలూకా, శ్రీకాకుళం జిల్లా. జననం 20-12-1908. సాహిత్య విద్యాప్రవీణ, ఉభయభాషా ప్రవీణ, రాష్ట్రభాషా విశారద, ఎం.ఎ., పి.ఓ.ఎల్. ప్రధాన పండితుడు, సంస్కృత పాఠశాల, పార్వతీపురం; ప్రధాన తెలుగు పండితుడు, సాలూరు, పార్వతీపురం ఉన్నత పాఠశాలలు. తెలుగు పండితుడు, మిసెస్ ఏ.వి.ఎన్. కళాశాల, విశాఖపట్టణం : తెలుగు పండితుడు, తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు. బిరుదులు — బ్రాహ్మీభూషణ, గుంటూరులో (బూర్గుల) పండితరత్న, విశాఖపట్టణం (తెన్నేటి) విద్వత్కవిశేఖర, (గుంటూరు) (సాహితీసభ) సమ్మానాలు : కవి గండపెండేర స్వర్ణకంకణాదులు పొందారు. ముద్రితకృతులు— రఘువంశ రత్నాలు, అభిజ్ఞాన శాకుంతలము, శతకద్వయము, శంకర విజయము, ప్రతీకారము (సంస్కృతము) మొ.]

సంస్కృతభాషలో పాషాణపాకమైన శ్రీహర్షుని నైషధీయ చరితమునకు ఆంధ్రీకరణము శృంగారనైషధము. విద్వాంసులకు గూడ ఔషధప్రాయమైన ఆ సంస్కృత నైషధీయ చరితమును ఆంధ్రీకరించిన మహాకవి శ్రీనాథుడు. ఇతడు సుమారు క్రీ॥ శ॥ 1350–1450 సం॥ల మధ్యకాలములో జీవించినట్లు తెలియుచున్నది. ఈతడు పాకనాటి నియోగి. భారద్వాజ గోత్రుడు. అపస్తంబ సూత్రుడు. కమలనాభామాత్యుని పౌత్త్రుడు. మారయామాత్యుని కుమారుడు. ఇతని తల్లి భీమాంబ.

శ్రీనాథమహాకవి బ్రాహ్మీదత్త వరప్రసాదుడు. సంస్కృత భాషా సముద్రమును దరియంగనీదిన మహామనీషి. షడ్భాషా పండితుడు. శ్రుతులు - స్మృతులు మహాభాష్యము – షడ్దర్శనములు ఈతనికి కరతలామలకములు. ఇతడు ఈశ్వరార్చన కళాశీలుడు. క్రీ॥శ॥ 1402–1420 సం॥ల మధ్యకాలమున కొండవీటిని పాలించిన పెదకోమటి వేమారెడ్డి ఆస్థానమునందు విద్యాధికారిగా ఇతడుండెను. క్రీ॥ శ॥ 1423–1445 సం॥ల మధ్యకాలమున రాజమహేంద్రవరమును పాలించిన అల్లాడ వీరభద్రారెడ్డి యాస్థానమున ఆస్థానకవిగా ఉండెను. తన శేముషీ వైభవముతో నానారాజసందర్శనములనుచేసి సాటిలేని మేటి కవిగ పేరుగాంచెను. కర్ణాటక్షితిపాలుని ఆస్థానమున కనకాభిషేకాది గౌరవములను అందిన కవిసార్వభౌముడు ఇతడు.

ఇతడు కేవల పండితుడేకాడు. మహా ప్రతిభావంతుడైన మహాకవి. చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాటినుండి కవితావ్యాసంగము చేసినవాడు. ఇతడు బహు గ్రంథకర్త. మరుత్తరాట్చరిత్రము – శాలివాహన సప్తశతి – పండితారాధ్యచరితము – శృంగార నైషధము – హరవిలాసము – భీమఖండము – కాశీఖండము – శివరాత్రి మాహాత్మ్యము – అనునవి ఇతని కృతులు. ఇందు మొదటి మూఁడు గ్రంథములును ఇప్పుడు లభింపలేదు. ఇవిగాక పల్నాటి వీరచరిత్రమను ద్విపద కావ్యమును ఇతడే రచించెనని ఆధునికులు భావించుచున్నారు. వల్లభరాయకృత ముగా ఉన్న క్రీడాభిరామముకూడ శ్రీనాథముద్రా ముద్రితమై ఉన్నది. ఇంతే గాక, ధనంజయ విజయము - నంద నందనచరిత్రము - పల్లాభ్యుదయము – అనెడు అలభ్య గ్రంథములు గూడ శ్రీనాథ కర్తృకములుగానే వినవచ్చుచున్నవి. పోగా లభ్యమాన కృతులలో మొదటిది శృంగార నైషధము. దీనిని ఇతడు పెద కోమటి వేమారెడ్డికి ప్రధాన సచివుడైన మామిడి సింగనామాత్యునకు అంకిత మొసంగెను.

సంస్కృత వాఙ్మయమునందు కాళిదాస భారవి మాఘకవుల కావ్యపంచక ముతో పాటు పండిత శిరఃకంపన యోగ్యమై శ్లాఘాపాత్రమైనది నైషధీయ చరితము. దానికర్త, కవిశిరోమణి, చింతామణీ మంత్రోపాసకుడు – సకలశాస్త్ర పారం గతుడు – ప్రాజ్ఞ చక్రవర్తి – భాషకపరమేష్ఠి – అయిన శ్రీహర్షుడు. ఇతడు క్రీ॥శ॥ 1169 – 1195 సం॥ల నడుమ కన్యాకుబ్జమును పాలించిన జయంత చంద్ర భూపాలునకు సమకాలికుడు. ఇతని తండ్రి శ్రీహీరుడు. తల్లి మామల్ల దేవి. ఈకవివతంసుడు, స్థైర్యవిచార ప్రకరణము – స్త్రీవిజయప్రశస్తి – నవ సాహసాంకచరితము – ఖండనఖండఖాద్యము – మున్నగు పెక్కు కృతులు రచించెను. కాని యాగ్రంథములు నైషధమువలె ప్రశస్తినందలేదు. నూత్నానల్ప కల్పనలతో నారికేళ పాకమున రచింపబడిన ప్రౌఢతమగ్రంథము నైషధము ఇది కేవల కావ్యమాత్రమేగాక, విజ్ఞాన సర్వస్వమనదగియున్నది. ఇందు బహుధా విస్తృతమైన శ్రీహర్షుని శాస్త్రపరిజ్ఞానము, అపూర్వ కల్పనాచాతుర్యము, సమగ్ర భాషాధికారము, ఈతని ప్రౌఢత్వమును చాటుచున్నవి.

మహాభారతమున అరణ్యపర్వాంతర్గతమగు నలోపాఖ్యానమునందు ఏక దేశమైన నలదమయంతుల వివాహ పర్యంత ఘట్టమును గ్రహించి యీ కవి ఇంచుమించు 2800 శ్లోకములుగలిగి 22 సర్గలతో బృహద్గ్రంథముగా తీర్చిదిద్దినాడు. ఇందులో పెక్కు శ్లోకాలు అనుష్టుప్పు వంటివే. అంటె చాలచిన్న శ్లోకాలు. వృత్తాల సంఖ్యయు తావన్మాత్రమే. ఈ నైషధీయ చరితమున శ్రీనాథుడు 1280 గద్యపద్యములతో 8 ఆశ్వాసములలో రచించి శృంగారనైషధమని నామకరణము చేసినాడు.

నాయికా నాయకుల యనురాగముతో అరంభమై వివాహముతో పరిసమాప్త మైన ఈ కథాభాగమునకు శ్రీనాథుడే శృంగార నైషధమని పేరుపెట్టినాడు. విప్ర లంభ – సంభోగ – శృంగారములు రెండును మొదటినుండి తుదివఱకు చక్కగ పోషింపబడి రచింపబడినందున దీనికీపేరు సార్థకమని చెప్పవచ్చును.

బహుప్రతాపశాలి – తేజస్వి – రాజలక్షణ లక్షితుడు అయిన నలుడు నిషధ దేశమును పాలించుచుండెడివాడు. ఇతని సౌందర్యమునకు ముగ్ధలుకాని స్త్రీలు ముల్లోకములలో లేరనుట అతిశయోక్తి కాదు. ఇతని పరిపాలనములో ధర్మము నాలుగుపాదాల నడుచుచుండెను. ఇతడు వీరసేన భూపతికుమారుడు.

ఆ సమయములోనే కుండిన పురమును రాజధానిగా చేసికొని భీమభూపతి విదర్భ దేశమును పాలించుచుండెను. ఈతని కూతురు దమయంతి. ఈమె త్రిలోకసుందరి. సకలసద్గుణఖని. ఇటు దమయంతియు అటు నలుడును ఒకరిని గుఱించి ఒకరు విని పరస్పరము ప్రేమించుకొని ఉండిరి.

ఒకదినమున నలుడు ఉద్యానవనములో విహరించుచుండగా ఒక బంగారు హంస ఆతనికంట పడినది. దాని చక్కదనమునకు ముగ్ధుడైనలుడు మెల్లగా దానిని పట్టుకొనెను. అప్పుడాహంస ఆతని చేతులనుండి తప్పుకొనలేక పలువిధ ముల దుఃఖించి తన్ను విడువుమని ప్రార్థించెను. కరుణాళువైన నలుడు దానిని విడిచెను. అంత ఆ హంస నలదమయంతుల మధ్య రాయబారము నడుపును.

నలుడు విడిచిన హంస దమయంతినిచేరి తన వాక్చాతుర్యముతో నలుని యందు గాఢానురాగము గలదానినిగా గావించెను. మరల నలుని కడకువచ్చి ఆమె యనురాగమును నలునకు చెప్పి వారిరువురకు ప్రేమబంధమును గట్టిగ ముడివేసెను. తన కూతురు కుతూహలమును గుర్తించి భీమభూపతి దమయంతీ స్వయంవరమును చాటించును.

పర్వత నారదులను మునులు స్వర్గలోకమునకు వెళ్లి, ఇంద్రుని సభలో ప్రసంగవశమున దమయంతీ స్వయంవర వృత్తాంతమును చెప్పిరి. ఆ వార్తను విని ఇంద్రుడు – అగ్ని – యముడు – వరుణుడు – అను నలుగురు దిక్పాలకులు దమయంతి పైనాశచే స్వయంవరమునకు భూలోకమునకు వచ్చుచుందురు. త్రోవలో వారికి నలుడు కంటబడును. వానిని చూడగానే ఆ దేవతలు, తమ కార్య మును నెరవేర్చుకొనుటకు పన్నాగమును పన్ని నలునే దమయంతి దగ్గరకు రాయబారిగా పంపుదురు. దేవతలిచ్చిన తిరస్కరిణీవిద్య ప్రభావము వలన నలుడు దమయంతిని సమీపించి, ఇంద్రాదుల ప్రేమ సందేశమును వినిపించును. వారిలో నెవ్వరినయిన వరియింపుమని చెప్పును. దమయంతి నలుని తప్ప

ఇతరుల నెవ్వరిని నేను వరింపనని స్పష్టముగా చెప్పి, నీవెవ్వడవో చెప్పుమని నిర్బంధించును. అప్పుడు నలుడు, తనపేరుచెప్పి, తొందరపడినందులకు మిక్కిలి విచారించి, దేవకార్యమును పాడుచేసితినే అని మిక్కిలి బాధపడెను. అప్పుడు బంగారు హంస మరల ప్రత్యక్షమై ఆ నలదమయంతుల విచారమును పోగొట్టును. అదృశ్య రూపములతో దీనినంతను గమనించుచున్న ఇంద్రాదులు నలుని మనశ్శుద్ధికి మిక్కిలి మెచ్చుకొనిరి.

స్వయంవరమునకు ముల్లోకములనుండి నానాదేశాధీశ్వరులు వత్తురు. ఇంద్రాదులుకూడ దమయంతిపై ఆశను వదలుకొనలేక నలుడున్న సింహాసనమునకు సమీపమున నలుని రూపములతో నుందురు. త్రిలోకవాసులను దమయంతికి పరిచయము చేయుటకు భీమరాజు సరస్వతిని ప్రార్థించును. ఆమె ప్రత్యక్షమై దమయంతితో కలిసి స్వయంవర మంటపమునకు వచ్చి, తన వాక్చమత్కృతితో అందరిని దమయంతికి పరిచయము చేయుచుండును. అందరిని విడిచి దమయంతి యింకను ముందునకు పోవుచుండెను. అచ్చట పంచనళీయము కలదు. ఇంద్రాదులు నలువురు నలునితో కలిసి యొకేతీరున నుందురు. సరస్వతి కూడ వారిని వర్ణించుపట్ల, నిరుపక్షములకు సరిపోవునట్లు వాక్చమత్కృతిని చూపుచుండెను. సందిగ్ధావస్థలో పడిన దమయంతి చివరకు, దేవతలకు మానవులకు గల భేదమును గుర్తించి నలుని మెడలో పుష్పహారమును వేయును. దేవతలు ఆమె భక్తికి యోగ్యతకు మెచ్చుకొని ఆ దంపతుల నాశీర్వదింతురు. నలునకు నల్వురు నాలుగు వరముల నిచ్చెదరు. సరస్వతియు నలునకు చింతామణీ మంత్రము నుపదేశించును.

నలదమయంతుల వివాహము వైభవోపేతముగ జరుగును. కొన్ని నాళ్లయిన తరువాత నలుడు దమయంతిని తోడ్కొని తన నగరమునకు పోవును.

ఇంద్రాది దేవతలు స్వర్గమునకు పోవుచుండగా త్రోవలో కాముడు – క్రోధుడు – మోహుడు – లోభుడు మున్నగువారు కనబడి స్వయంవర వృత్తాంతమును విని వెడలిరి. కలిపురుషుడు మాత్రము ద్వాపర పురుషునితో కలిసి వారికెదురై, స్వయంవరము జరిగినదని వారినోటవిని, కోపమును తెచ్చుకొని, ఆ దంపతులను విడదీయుటకు దగిన ఉపాయమును ఆలోచించుచు, ఆ నిషధదేశపు పొలిమేరలో మకామువేసి తగిన సమయమునకు వేచియుండును. ఆ నలదమయంతులు మాత్రము హాయిగా రసప్రపంచములో విహరించుచు సుఖముగా కాలము గడుపుచుందురు.

ఆంధ్రసాహిత్యలోకమునకు సంస్కృత కావ్యమాధుర్యమును, మర్యాదను చవిచూపించిన మొట్టమొదటి కవి శ్రీనాథుఁడు. శృంగార నైషధము శృంగార రస ప్రధానమైన కావ్యమని వేరే చెప్పనక్కరలేదు. ఇందులో ఉన్న భావసంపద

యంతయు మువ్వాతిక మువ్వీనము శ్రీహర్షునిదే. భాషయు, భావ వ్యక్తీకరణము మాత్రము శ్రీనాథునివి, సంస్కృత నైషధము బాల ప్రౌఢతమమైన కావ్యము. తెలుగు లోనికి దాని ననువదించినపుడు శ్రీనాథుడు ఆ ప్రౌఢత్వానికి లోపము ఏమాత్రము రాకుండ మిక్కిలి సమర్థతతో అనువదించెనని చెప్పవచ్చును. కవి సార్వభౌముడయిన శ్రీనాథునికే యిది చెల్లినది కాని యితర కవులకీవని యసాధ్య మనుట అత్యుక్తి కానేరదు. మూలకథలో పెద్ద మార్పులు లేవు. వర్ణనలో కొంత స్వాతంత్ర్యము కనబడును. శ్రీనాథుడు పద్యరచనలో సిద్ధహస్తుడు. ప్రౌఢశబ్ద సంయోజనము శ్రీనాథుని సొత్తు. అతని సీసపద్య రచనా విన్యాసము ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది.

అనువాదము చేయుపట్ల ఆతడవలంబించిన మార్గమును తానే విశదీకరించు కొనెను.

"భట్టహర్ష మహాకవీశ్వరుండు కవికులాదృష్టాధ్వ పాంథుండు ఒనర్చిన నైషధ శృంగారకావ్య ప్రబంధ విశేషంబున, అశేష మనీషి హృదయంగమముగా, శబ్దంబనుసరించియు, అభిప్రాయంబు గుఱించియు, భావంబుపలక్షించియు, రసంబు పోషించియు, అలంకారంబు భూషించియు, ఔచిత్యం బాదరించియు, అనౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబున చెప్పబడిన యీ భాషా నైషధ కావ్యంబు" [8-202] అని అనువాద పద్ధతిని వివరించెను. కాన దీనిని గూర్చి వివరింపపనిలేదు.

నైషధమున చెప్పుకొనదగిన కథాఘట్టములలో మొదటిది హంస దౌత్యము. దీనిని పోషించుటలో శ్రీనాథుడు మూలమునకు వన్నెదిద్దెననవచ్చును.

రెండవది నలదౌత్యము. ఇది మృదుమధురముగ భావసంపదతో నిండి యున్నది. ఇందున్న యుక్తి ప్రత్యుక్తులతిమనోహరములు.

దమయంతి సౌందర్య వర్ణనము మరపురానిఘట్టము. పంచనళీయమున చూపిన పాండిత్య ప్రతిభ అనుపమానము. అటనట వర్ణనలన్నియును నూతన కల్పనాచ్ఛాయల నందుకొన్నవే.

మూలమున పలుచోట్ల గ్రంథగ్రంథులు గలవు. అవి ఆ సంస్కృత కావ్య మునకే చెల్లినవి.

అనువాదమున వానిని చూపుట దుర్ఘటము. పంచనళీయ ఘట్టమున ఇంద్రాది దేవచతుష్టయమునకు నలునకును సరిపోవునట్లు అయిదర్థములతో ఒక శ్లోకమున్నది. దాని ననువదించుట యెంతటి వానికయినను సాధ్యముకాదు.

"దేవః పతిః విదుషి నైషధరాజగత్యా
నిర్ణీయతే న కిము న వ్రియతే భవత్యా,
నాయం నలఃఖలు తవాతి మహానలాభో
యద్యేన ముఞ్చసి వరః కతరఃపరస్తే"

[ 13 సర్గ-34 శ్లో॥ ]

ఇట్టివానిని విడిచెనని యనువాదయితను దూషించుట ధర్మముకాదు. లక్ష్యమును తప్పక బాణము వేయుట యెట్టిదో మూలమును విడువక యనువదించుట అంతకష్టము. అట్లయ్యును శ్రీనాథుడు మధురాతిమధురముగ ననువదించి యభిజ్ఞుల మన్ననలకు పాత్రుడగుట మిక్కిలి ప్రశంసార్హము.

"డు-ము-వు-లు చేర్చుట తప్ప శ్రీనాథుని యనువాదమున గల ప్రత్యేకత యేమున్నది. గమికర్మీ కృతనైక నీవృతుడు – అస్తినాస్తి విచికిత్సాహేతు శాతోదరిలో సదసత్సంశయగోచరోదరి" – అని మూలమును మూలముగానే వ్రాసెనని కొందఱందురు. నిజమే, అనవచ్చును. వంటలోని రుచి బాగులేదని చెప్పవచ్చును. కాని రుచిగా వండుట మాత్రము చేతగాదుగదా! ఆ పదముల కంతకంటె మధురముగ నెవ్వరైన అనువదింపగలరా?

"తపనీయ దండైక ధవళాతపత్రితోద్దండతేజః కీర్తిమండలుండు."
"నిర్మల నిజకథానిమిష కల్లోలినీక్షాళితాఖిల జగత్కల్మషుండు" [1-46]

ఇట్టి రచనాపాటవము అందరకును లభించునా? ఆయాక్షేపణలకేమి? ఎవ్వరికి తోచినట్లు వారనుచుందురు. ఆ మహానుభావునకు సాటిమేటి మఱియొకడు లేఁడని నేనందును.

ఇక అతని యనువాదమున మచ్చునకు ముద్దుగ మూడు పద్యములను ఉదాహరింతును.

1. "సరళకల్పన - (మూలము):
నాక్షరాణి పఠతా కి మపాఠి
ప్రస్మృతః కి మథవా పఠితోపి
ఇత్థమర్థిజన సంశయడోలా
ఖేలనం ఖలు చకార నకారః"

[5వ సర్గ - 121 శ్లో॥]

"ఈ నలుడు అక్షరాభ్యాస సమయమున నకారమును నేర్చుకొనలేదా? లేక, నేర్చుకొని దానిని మరచెనా? అని నలుని యాచించుట కేగిన యర్థిజనులను

కొందురట ? అనగా లేదను నిషేధార్థక నకారమాతని నోట నెప్పుడును రాలేదని తాత్పర్యము.

అనువాదము :

ఉ॥ 'అక్షరముల్పఠించు సమయంబునఁ బాఠము సేయఁడయ్యెనో ?
శిక్షిత వర్ణమధ్యమునఁ జెందెనొ విస్మృతి?' నంచు నర్థులు
ౘ్రేక్షయొనర్తురీక్రియ నభీష్టఫల ప్రతిపాదన క్రియా
దక్షుని నిన్నుఁగూర్చిన యధర్మనికారమున న్నకారమున్.

[3 ఆ॥ 70 ప॥]

2. "శ్లేష కల్పనము :

"అస్యాం మునీనా మపి మోహమూహే
భృగుర్మహాన్ యత్కుచశైల శీలీ,
నానారదాహ్లాది ముఖం శ్రితోరుః
వ్యాసో మహాభారత సర్గయోగ్యః"

[7వ సర్గ - 96 శ్లో॥]

మునులకు కూడ దమయంతి యందు మోహము కలుగుచున్నదట ? ఏమనగా భృగుమహర్షి ఆమె కుచ సౌష్ఠవమును పరిశీలించుచుండెనట. ఆమె ముఖము నారద మహర్షికాహ్లాదకారి యయ్యెనట ? మహాభారతమును రచించిన వ్యాస మహర్షి ఆమె తొడల నాశ్రయించెనట ? ఇందలి చమత్కారమును జూడుడు.

భృగువనగా కొండశిఖరమని యర్థము. ఆమె కుచములు శైలశిఖర సమములని భావము. ఆమె ముఖము నానా-రద-ఆహ్లాది. అనగా అందమయిన ముప్పది రెండు దంతములతో నొప్పుచున్నదని భావము. వ్యాసమనగా విస్తీర్ణమయిన అని యర్థము. "విస్తారో విగ్రహో వ్యాసః" అని నిఘంటువు. అట్టి విశాలమయిన ఆమె తొడ, మహా + భా + రత + సర్గ + యోగ్య అట. అనగా సంభోగ సౌఖ్యము నిచ్చుటలో ననువుగ నున్నదని తాత్పర్యము, ఇట్లు పైశ్లోకము శ్లేష గర్భితమై యున్నది. అనువాదమును చూడుడు.

"వనిత నానారదాహ్లాది వదనకమల
నీలకుంతల కుచశైలశీలి భృగువు
చామ శ్రీ మహాభారత సర్గయోగ్య
కారణవ్యాస కవితోరు గౌరమహిమ॥

[3 ఆ॥ 200 ప॥]

మూలమున కేమాత్రము తీసిపోని అనువాదము. కల్పనాచాతుర్యమును గనుడు.

3. "లావణ్యేన తవాస్యమేవ బహునా తత్పాత్రమాత్రస్పృశా
చంద్రః ప్రోంఛనలబ్ధతార్ధమిలనే నారంభి శేషేణ తు,
నిర్మాయ ద్వయమేతదప్సు విధినా పాణీఖలుక్షాళితౌ
తల్లేశైరధునాపి నీరనిలయై రంభోజ మారభ్యతే॥"
[22 సర్గ - 144 శ్లో॥]

బ్రహ్మలోకమందున్న లావణ్యమునంతను ఒక పళ్లెరమందున పోసి, ముందుగా నున్న లావణ్యముతో దమయంతి ముఖమును నిర్మించెనట. ఆ మిగిలిన అడుగున ఉన్నదానితో చంద్రబింబమును నిర్మించెనట. అందుచేతనే ఆ చంద్రబింబమున గల మచ్చ యీ పళ్లెరమందున్న బిలుముతో నేర్పడినది. తరువాత ఆ బ్రహ్మ తన రెండు చేతులను నీళ్లలో కడుగుకొనెనట. ఆ చేతికంటిన లావణ్యరసముచే తామరపువ్వులు నీటినుండి పుట్టినవట ? ఇదియెట్టి యుత్ప్రేక్షయో యూహింపుడు, తామరలను, చంద్రునిమించి ఆ దమయంతి ముఖమండలమున్నదనిగదా భావము. అనువాదమును చూడుడు.

"నవలావణ్యరసంబు పళ్లెరములోనంబోసి, యగ్రంబునన్
భవదీయాస్యమొనర్చి, యార్చి, పిదపం బ్రాలేయరుఙ్మండలం
బు వినిర్మించె విరించి యచ్చిలుమువో పూఁబోఁడి ! యావిహ్నామం
బువులందాతఁడుచేఁ దొలంచు మిసిమిన్ బుట్టెన్ సరోజాతముల్."
[ఆశ్వా 8, ప॥ 193]

ఉదాహరించుట కిట్టి వెన్నియైననుగలవు. కాని ఒక్కమాట. శ్రీనాథుని నైషధపద్యములు స్వతంత్ర రచనగా గోచరించునుగాని అనువాదములుగా కనఁబడవు, అదియే ఆ కవిసార్వభౌముని రచనాశిల్పము.

# హరవిలాసము – శ్రీనాథుడు

## సమీక్ష : శ్రీమతి కందాళ కనకమహాలక్ష్మి

[జన్మస్థలం : విశాఖపట్టణం. జననం : 22–6–1952. ఎం.ఏ., జూనియర్ రిసెర్చి అసిస్టెంటు – తెలుగు వ్యుత్పత్తికోశ పథకం – తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు. 'తత్సమ పదాల్లో అర్థపరిణామము' అన్న అంశంపైన పిహెచ్.డి. పట్టమునకు పరిశోధన చేస్తున్నారు. ప్రచురణలు 'తత్సమ పదాల్లో అర్థవిపరిణామము' మొదలగు వ్యాసాలు పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. రేడియో ప్రసంగాలు – ఎఱ్ఱాప్రెగడ సాహిత్య వ్యక్తిత్వం మొదలగునవి.]

కవి జీవితాదులు : విలాస కావ్యాల్లో ప్రసిద్ధి చెందింది హరవిలాస కావ్యం. హరవిలాస కావ్యకర్త శ్రీనాథుడు. శ్రీనాథుడు 1360 ప్రాంతంలో పాకనాడులో జన్మించాడు. విద్యారాజీవభవుడు మారయ, పుణ్యాచార శీల భీమాంబల అనుంగు పుత్రుడు. ఆరువేల నియోగి. కవిసార్వభౌమ బిరుదాంకితుడు. గౌడడింఢిమభట్టు కంచుఢక్క పగలగొట్టించి కనకాభిషేక గౌరవం పొందిన మహా కవి. అఖండ ప్రజ్ఞావంతుడు. తన తాత కమలనాభామాత్యుడినే శ్రీనాథుడు తన గురువుగా భావించినట్లు కనిపిస్తుంది.

శ్రీనాథుడి కృతులలో మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్ర, నందనందన చరితం, మానసోల్లాసం, ధనంజయ విజయం, మొదలగునవి అలభ్యాలు. శృంగార నైషధం, భీమేశ్వర పురాణం, హరవిలాసం, శివరాత్రి మాహాత్మ్యం, కాశీఖండం, పల్నాటి వీర చరిత్ర, వీథినాటకం మొదలగునవి లభ్యాలు.

హరవిలాస కావ్యాన్ని శ్రీనాథుడు తన బాల్యమిత్రుడు అవచితిప్పయ సెట్టికి అంకితం ఇచ్చాడు. హరవిలాసం ప్రథమాశ్వాసంలో వర్ణించబడ్డ చిరుతొండనంబి కథలో చిరుతొండనంబి అవచితిప్పయ వంశానికి మూల పురుషుడు.

కథా సంగ్రహం : హరవిలాసంలో ఏడాశ్వాసాలు ఉన్నాయి. మొదటి రెండాశ్వాసాల్లో చిరుతొండనంబి కథ, 3, 4 ఆశ్వాసాల్లో గౌరీకల్యాణం, అయిదో ఆశ్వాసంలో శివపార్వతుల దారుకావన విహారం, ఆరో ఆశ్వాసంలో హాలాహల భక్షణం, ఏడో ఆశ్వాసంలో కిరాతార్జునీయం వర్ణించబడ్డాయి.

1, 2 ఆశ్వాసాల్లో కథ : దుర్వాసుడి శాపం చేత తుంబురుడు, అతని భార్య, కాంచీపురంలో ఒక గొప్ప వైశ్యకులంలో భార్యాభర్తలుగా పుట్టారు.

వాళ్ల కొడుకు సిరియాళుడు. చిరుతొండనంబి గొప్ప శివభక్తుడు, ధనవంతుడు. జంగం వాళ్ళేది అడిగినా లేదనను అనే వ్రతం పట్టాడు. పార్వతి కోరికపై శివపార్వతులు వృద్ధ జంగాల వేషంతో భూలోకానికి వస్తారు. చిరుతొండనంబి వ్రత దీక్షాపరుడు. రోజు కొక జంగం వాడికైనా అతిథ్యం ఇవ్వనిదే భోంచేయడు. ఇది తెల్సిన శివుడు ఆ రోజు జంగం వాళ్ళెవరు లేకుండా చేస్తాడు. జంగాల కోసం గాలిస్తూ చిరుతొండనంబి వృద్ధుల దగ్గరకి వచ్చి తమ ఆతిధ్యం స్వీకరించ మని కోర్తాడు. అందుకా వృద్ధుడు తనకొక వ్రతం ఉందనీ తాను నరమాంసం తప్ప తిననని, ఆ ఇంటి యజమాని, పుత్రుడు తన పంక్తినే భోంచేయాలని చెప్తాడు. చిరుతొండనంబి సంతోషంగా అంగీకరించి తన వెంట ఆ వృద్ధులను తీసికెళ్ళి తన కొడుకు సిరియాళుడ్ని చంపి ఆ మాంసంతో అనేక రకాల పిండి వంటలు వండించి విందు చేస్తాడు. సరిగ్గా తినే వేళకి శివుడు వెంగమాంబ చేత సిరియాళుడ్ని పిలిపిస్తాడు. సిరియాళుడు బతికివస్తాడు. శివపార్వతులు ప్రత్యక్షమై వారందరికి మోక్షం ఇస్తారు.

3, 4 ఆశ్వాసాల్లో కథ : తారాకాసురుడు బ్రహ్మ వల్ల వరాలు పొంది, దేవతలను బాధిస్తూ ఉంటాడు. దేవతలంతా వెళ్ళి బ్రహ్మతో మొరపెట్టు కుంటారు. శివాంశతో పార్వతికి పుట్టే కుమారుడే తారకాసురుణ్ణి చంపగలడని అంచేత శివపార్వతులకి పెళ్ళి జరిగేటట్టు చూడమని చెప్తాడు. పార్వతి హిమవంతుడి కూతురిగా పుడ్తుంది. శివుడు ఆ ప్రాంతాల్లోనే తపస్సు చేస్తుంటాడు. నారదుడి వలన శివుడు తన అల్లుడు కాగలడని తెలుసుకొని శివుణ్ణి తన అతిధిగాఎంచి పార్వతిని అతని సేవకి నియమిస్తాడు. ఆ సమయంలో ఇంద్రుడి ఆజ్ఞ చేత మన్మథుడు తన చెలికాడు వసంతుడి సహాయంతో శివుడికి మన్మథ వికారాన్ని కలిగిస్తాడు. శివుడి కోపానికి మన్మథుడు మసైపోతాడు. పార్వతి తన సౌందర్యాన్ని నిందించుకొని తపసు చేయడం మొదలెడ్తుంది. శివుడు మాయావటువు వేషంలో వచ్చి పార్వతిని పరీక్షించి తృప్తిచెంది దేవాది ఋషుల సహాయంతో ఆమెను పెళ్ళాడ్తాడు.

5 వ ఆశ్వాసంలో కథ : శివుడు హిమవంతుడి ఇంట్లో ఇల్లరికం అల్లుడిగా ఉండడంతో శివగణాలు విచ్చలవిడిగా విహరిస్తుంటాయి. దీన్ని గమనించి హిమవంతుడు అల్లుడి ప్రవర్తనను గూర్చి కూతురితో చెప్పి మందలించ మంటాడు. ఇది తెలిసి శివుడు అలిగి దారుకావనానికి వెళ్ళి అక్కడ మునిపత్ను లతో యథేచ్ఛగా విహరిస్తుంటాడు.

6 వ ఆశ్వాసంలో కథ : పార్వతిశివుడి కంఠం నీలంగా ఉండడానికి గల కారణం అడుగుతుంది జవాబుగా శివుడు సముద్ర మథన వత్తాంతాన్ని హాలాహల భక్షణాన్ని వివరిస్తాడు.

7 వ ఆశ్వాసంలో కథ : అర్జునుడు ఇంద్రకీలాద్రిపై తపసు చేస్తుంటాడు. ఇంద్రుడు ముసలిబ్రాహ్మణ వేషంలో వచ్చి శివుడి కోసం తపసు చేయమంటాడు. ఆ తర్వాత అర్జునుడు ఈశ్వరుడి కోసం తపసు చేస్తాడు. శివుడు మాయాభిల్లుడి వేషంలో వచ్చి పరీక్షించి, తృప్తిచెంది పాశుపతాస్త్రాన్ని అర్జునుడికి ఇస్తాడు. అది తీసికొని అమరపురికి వెళ్తాడు. ఊర్వశి అతన్ని కోరుతుంది, ఆమెను కాదని శాపాన్ని పొందుతాడు. దీంతో ఈ కథ ముగుస్తుంది.

వస్తుతత్త్వం : శ్రీనాథుడు శివభక్తుడు, కాని వైష్ణవమత ద్వేషికాడు. ఇతడి రచనలలో ఎక్కువభాగం శివపరమైనవి. శివకావ్యం అవడంచేత శివ కవుల రచనా రీతులకు దగ్గరగా దీన్ని నడిపించాలని శ్రీనాథుడు భావించినట్లుగా తోస్తుంది.

రచనాశ్రయమైన సమగతిచే కాకపోయినా వస్తునాయకాశ్రితమైన గౌరవం చేత హరవిలాసాన్ని ఉదాత్త కావ్యశ్రేణిలో చేర్చవచ్చు. హరవిలాసంలోని వస్తువు లోకోత్తరమైంది. ఇందులో అన్నీ శివసంబంధమైన కథలే అయినా ఒక దానితో ఒక దానికి సంబంధం లేదు. ఒక విధంగా దీన్ని ఖండకావ్యం అనొచ్చు. 3, 4, 5, 6 ఆశ్వాసాల్లో శివుడే నాయకుడు. 1, 2, 7 ఆశ్వాసాల్లో శివభక్తులైన చిరుతొండనంబి, అర్జునుడు నాయకులు. ప్రథమాశ్వాసంలో చిరుతొండనంబి కథకు మూలం బసవపురాణంలో ఉంది. ప్రాచీన గాథగా స్త్రీల పాటల రూపంగా కూడా ఈ కథ ప్రసిద్ధిచెందినదే.

పాత్ర చిత్రణ : ఇందులో పాత్రలు చిరుతొండనంబి, తిరువెంగనాంబి, సిరియాళుడు, శివుడు, పార్వతి, మన్మథుడు, రతి, హిమవంతుడు, మేనక, అర్జునుడు, ఇంద్రుడు, ఊర్వశి, బ్రహ్మ మొదలగునవి.

మూడు, నాలుగు, అయిదు, ఆరు ఆశ్వాసాల్లో శివుడే నాయకుడు. ఒకటి, రెండు ఏడు ఆశ్వాసాల్లో శివభక్తులైన చిరుతొండనంబి, అర్జునుడు నాయకులు. శివుడి ఆధిక్యతను మునులద్వారా చక్కగా చెప్పించాడు కవి. ప్రతి పాత్రను చక్కగా తీర్చి దిద్దాడు. చిరుతొండనంబిని గొప్ప శివభక్తుడిగా చిత్రించాడు. ఇతని భక్తి తత్పరత ఒడలు పులకింప జేస్తుంది. ఇక సిరియాళుడు భక్తి విషయంలో తండ్రిని మించిన తనయుడు. తనను తండ్రి చంపించి జంగం వారికి విందు చేస్తాడని తెలిసినా చలించని దృఢ చిత్తుడు.

పార్వతి సౌందర్యాన్నిలా వర్ణించాడు కవి :

చ. చనుగవ వ్రేగునన్ మిగుల సన్నపుఁ గౌనసియాడఁగెంపు మీ
టిన నునుఁబట్టు జేలఁగటి టింగులువాఱఁగ గట్టి భూమి భృ
త్తన యప్రసూన గుచ్ఛములు దాలిచి లేఁజిగురుల్ ధరించి వ
చ్చిన నడదీవవోలె నిలిచెందరుణేందుకిరీటి సన్నిధిన్. [3–69]

అర్జునుడి తపోదీక్షనిలా వర్ణించాడు :

మ. ధనురస్త్రంబులు కేలఁదాల్చి శరధిద్వంద్వంబునే పార వీ
పున బంధించి కిరీటియై కవచియై పూనెందపశ్చర్య య
ర్జునుఁడత్యంత గరిష్ఠ నిష్ఠనమరేంద్రుం గూర్చి యయ్యింద్ర కీ
లనగాగ్రంబున ప్రత్యనీక విజయశ్లాఘాభి లాషంబునన్. [7-5]

ఇలా కావ్యంలోనే ప్రతీ పాత్రను అత్యద్భుతంగా చిత్రించాడు శ్రీనాథుడు.

వర్ణనలు : ఈ కథలో కైలాసంలో అప్సరసల నాట్యం చూస్తున్న శివుడికి చెమట పడుతుంది, అది చూసి పార్వతి ఈర్ష్యతో శివుణ్ణి తామరపువ్వు పెట్టి కొడ్తుంది. అప్పుడు శివుడిలా అంటాడు:

సీ. కమలాక్షి ! యిది యేమిగాఁదలంచితి విప్పు
డర్ధదేహంబు నీయదియ కాదె ?
హృదయంబు పొరువున హృదయ ముండుటలేదె
యేకీభవించిన యిరువురకును ?
నే భావమైన నీ హృదయంబునకు దాఁప
నేభంగి వచ్చు నా హృదయమునకు ?
నపరాధశంక యావంతయైనను లేదు
నీ చిత్తమునకెక్క నిక్కపంబు

తే. తప్పులేకుండ నేల నెత్తమ్మి మొగడ
విసరివక్షః ప్రదేశంబు వ్రేటు కొంటి ?
కేసరంబుల రజముఁ బుష్పాసవంబు
నెఱసెనిది చూడు కన్నుల నీరుగ్రమ్మె. [1-37]

ఈ పద్యంలో కవి అర్ధనారీశ్వరత్వాన్ని, దాంపత్యతత్త్వాన్ని శివుడు చేతే చమత్కారంగా చెప్పించేడు. ఇందులోనే సృష్టి రహస్యం ఇమిడి ఉంది. "హృదయంబు పొరువున హృదయ ముండుటలేదె.," అనడం ఎంతో చక్కగా ఉంది.

ఇదే కథలో శివుడు వృద్ధుడి వేషంలోవచ్చి ఊరవతల ఉంటాడు. చిరుతొండనంబి జంగాల కోసం వెతుకుతూ ఈ వృద్ధుడి దగ్గరకి వస్తాడు. ఆ శతవృద్ధుడు ఎలాచూసేడో, ఎలా దీవించేడో కవి చక్కగా రెండు పద్యాల్లో వర్ణించేడు :

తే. నరసిరవాలిన బొమలెత్తి పరమ వృద్ధు
తలవడంకఁగ నొయ్య నీ రెలుఁగు పడుచు

నంబినెమ్మోముఁ దేరకొనంగ జూచి
శివుని కారుణ్యమనుచు నాశీర్వదించె. [హర. 2-49]

క. దీవించి యతని యతని వదనముఁ
జేవెలుఁగిడి చూచి యేమి చెప్పెదు చెపుమా
యే వీనుల వినఁగావున
మనీవొత్తుచుఁజెప్పు చెప్పెదేని మహాత్మా. [హర.2-50]

కనుబొమల మీద అరచెయ్యి పెట్టుకొని ఆ చేవెలుగులో చూడ్డం ఎంతో సహజంగా ఉంది.

చిరుతొండనంబి కథను కవి స్వతంత్రంగా రాసేడు కాని చివర్లో సిరియాళణ్ణి తల్లిపిలిచే సన్నివేశంలో రాసిన పద్యానికి సరిపోయే ద్విపద పాల్కురికి సోమనాథుడి బసవ పురాణంలో ఉంది.

అంగనయును నెట్టి సాష్టాంగ మెరగ........ [బసవ. 4-795-802]

బసవపురాణంలో సోమనాథుడు ముప్పైరెండు ద్విపద పాదాలో తల్లి చేత పిలిపించేడు. ఇదే కథ "చిరుతొండ రాజు చరిత్ర" అనే స్త్రీల పాటగా కూడ ప్రచారంలో ఉంది. కాని స్త్రీల పాటలో వారు వెలమలు శ్రీనాథుడి కథలో వైశ్యులు.

మన దేశంలో శ్రీనాథుడి కాలంలో కాని అంతకు ముందు, ఆ తర్వాత గాని నరమాంస భక్షణ లేదనే చెప్పొచ్చు కాని వీరశైవులు మాత్రం జంగాలను తృప్తిపరచడానికి ఏం చేయడానికైనా వెనకాడేవారు కారని కచ్చితంగా చెప్పొచ్చు. పరిశీలించి చూస్తే శ్రీనాథుడు వీరశైవాన్ని విమర్శించినట్లు తోస్తుంది. 'అవ గింజంత భూతిమైనలది కొనిన వెలఁది గుమ్మడికాయంత నెట్టివుట్టు' అంటాడొక చోట (హర. 2-100). శ్రీనాథుడు భిక్షావృత్తి జంగాన్ని హరవిలాసంలో పేర్కొన్నాడు. చిరుతొండనంబిని తూమెడు చెరుకురసం తెమ్మన్న జంగాన్ని భిక్షావృత్తి జంగంగా వర్ణించడం వల్ల శ్రీనాథుడికి ముందునుంచి శ్రీశైల పరిచయం ఉందనే విషయం తెలుస్తుంది.

కాళిదాసు కుమారసంభవానికి శ్రీనాథుని హరవిలాసంలోని గౌరికల్యాణం స్వతంత్రమైన, సంగ్రహమైన ఆంధ్రీకరణ. శ్రీనాథుడిది ఇక్కడ కథాను వాదమే కాని కావ్యాను వాదం కాదు. కుమారసంభవం మొత్తం గ్రంథంలో చెప్పిన కథను ఇతడు రెండాశ్వాసాల్లో చెప్పేడు. ఆ కారణం చేత కొన్ని మనోజ్ఞమైన వర్ణనలు విడిచిపెట్టడం జరిగింది. అలాకాక కొన్ని వర్ణనల్లో మార్పు చేశాడు. ఉదాహరణకి మన్మథుడు మసైపోయిన తర్వాత రతి విలపిస్తూ వసంతుడితో

ఇలా అంటుంది. 'సహకారమంజరీ పరుపిండకబళంబు పెట్టుండుమాకు నైపికము ముట్ట' మావిడి చిగుళ్ళను కబళంగా పికం (కోయిల) ముట్టేట్టుగా పెట్టమంటుంది. ఇదొక చక్కటి భావం. సముచితమైన వర్ణన, సన్నివేశానికి తగినట్లుగా చక్కగా వర్ణించేడు కవి.

ఈశ్వరుడి దారుకావన విహారం ఒక రసవత్తర ఘట్టం. ఇందులో లౌకిక శృంగారచ్ఛాయలు కనిపిస్తున్నా, ఇది దివ్య శృంగార విలసితంగానే భాసిస్తుంది. ఇక్కడ భాగవతంలోని కృష్ణగోపికా వాత్సల్యం లాంటి దానినే అనుసంధించు కోవాలి. సర్వ జీవులు పశువులు మహాదేవుడు పశుపతి జీవేశ్వరుల సంబంధాన్ని అటంకపరచేవి అజ్ఞానం, అహంకారం, మాయ మొదలగునవి బంధలక్షణాలు. గోపికావస్త్రాపహరణ ఘట్టం ఆత్మార్పణకి ప్రతీక. అలాగే పరమ పతివ్రతలైన మునిపత్నులను శివుడు ప్రలోభ పెట్టడం ధూర్త చరిత్రగా అజ్ఞానులకు తోచినా తత్త్వ విదులు దీనిని పశు-పశుపతి అభేదసాధనలో ఉన్నత ప్రతీకగా భావిస్తారు. దేవదారు వనంలో మహా ఋషులు శివుణ్ని నిందించడం వారి మనసులింకా పరిపక్వం కాలేదనడానికి నిదర్శనం.

మృదుహాస్య స్ఫూర్తి, సముచితమైన సంభాషణ శైలి రచనలో శ్రీనాథుడికి గల నైపుణ్యం ఈ కావ్యంలో వెల్లడవుతుంది. ఇంద్రార్జునుల సంభాషణ, కిరాతార్జునుల వివాదం ఎంతో సహజంగా, చక్కగా ఉంటాయి. భారవి కిరాతార్జునీయంలో కూడ ఇదే ఇతివృత్తం. ఈ ఘట్టంలో శ్రీనాథుడు అరణ్యపర్వంలో నన్నయ కథ నడిపించినట్టుగానే కథను సంగ్రహంగా, అవాంతర వ్యాప్తిలేకుండా చక్కగా, చిక్కగా రచించేడు. అర్జునుడు శివుణ్ణి ఒక దండకంలో స్తుతించినట్లు నన్నయ రచన, శ్రీనాథుడు దీన్ని ఐదు పద్యాలలో రచించేడు. శివుడు షట్కాల పూజాప్రియుడని అనడం చేత ఈ విధంగా రచించి ఉంటాడు.

భారవి కిరాతార్జునీయంలో పాశుపతాస్త్రాన్ని గ్రహించటంతో కథ ముగిసి పోతుంది. అర్జునుడు స్వర్గానికి వెళ్ళడం, ఊర్వశి కోరడం, అర్జునుడు కాదనడం, శాపం పొందడం ఇవన్నీ శ్రీనాథుడు రసోత్పత్తి కోసం పెంచి రాసినట్లుగా అన్పిస్తుంది.

శైలి: శ్రీనాథ యుగం నన్నయ మొదలగు ప్రాచీన కవులను, పెద్దన మొదలగు మధ్య యుగం కవులను సన్నిహితంగా సంధించింది. శైలీ సంపద యందీ కావ్యం మార్గ, దేశీ విధానాలకు వేదికగా నిలిచింది. ఇతివృత్తాలలో ప్రఖ్యాతమైన పురాణ కథలు, దేశీయమైన చిరుతొండనంబి కథ పడుగు పేకల వలె కలిసిపోయేయి. ఇందులో శైలి మృదువైన సమ సంస్కృతాంధ్ర పదమై తెలుగు నుడికారాలతో ఇంపుగా ఉంది:

శా. అక్షయ్యంబుగ దివ్యమాధుకర భిక్షాన్నంబు వడ్డించెఁదా
గోక్షీరంబులతోడ శర్కరలతోఁ గ్రొన్నేతితోఁ దేనెతో
ద్రాక్షాదాడిమ చూత పాకములతో దాక్షాయణీ భర్తకున్
చక్షూరాగ మెలర్పఁగా హరిణి విశ్వాసంబు తో ముంగిటన్. (5-46)

శ్రీనాథుడీ కావ్యంలో దేశీయములైన అనేక పలుకు బళ్ళను, సామెతలను వాడేడు. 'తేవయ్యాతూ మెడిక్షురసం' (2-7) 'ఆలుమగఁడును నొకకుత్తుఁకై ఁగాక' (2-61) 'పాడయినట్టి చిత్తము' (2-64) అనాదరార్థంలో శ్రీనాథుడికి పాడయినా అనే ప్రయోగం ఇష్టం. 'కుట్టి యా చూడగ దోసకాయలే' (2-64) 'చంకదుడ్డును శరణార్థి' ఇలాంటివి అనేకం. ఇందులో కొన్ని దేశ్య పదాలకి అర్థాలు రూపాలు స్పష్టంగా లేవు. 'బసువర' (2-6) 'బసవేశ్వర' శబ్దం కావచ్చు. చల్లజంపులు (2-52) కాలక్షేపం మాటలు కావచ్చు. శివయోగి రాజుకున్ (2-68) నగాగమ రహితంగా ప్రయోగించేడు. మాలెతవలె జోలెత అని వాడేడు. 'కృపీటయోని' (3-82) అనే శబ్దాన్ని చక్కగా సందర్భానుసారంగా వాడేడు. నీటిలో పుట్టేది నిప్పు, ఆ నీరే మళ్ళీ నిప్పును ఆర్పుతుంది. అలాగే ఇక్కడ పార్వతి యెడల శివుడికి కలిగిన ప్రేమ వలనే కోపంపుడ్తుంది మన్మథుడు మసైపోతాడు, మళ్ళా ఆ ప్రేమే మన్మథుణ్ణి బతికిస్తుంది. ఇంత అర్థం ఇమిడి ఉందీ పదంలో.

శ్రీనాథుడు ఒక్కొక్క చోట ఒకే అర్థాన్ని ప్రకటించడానికి అన్నీ క్రియలే వాడేడు. "అనుపు దప్పిరి, నొచ్చిర లసిరి" (3-10) ఇదో శిల్పం. అలాగే ఒకే భావాన్ని అనేక పదాలతో చెప్పడం. ఓషధి ప్రస్తపురంలో శివుడి బంట్లు చేసే ఆగడాల్ని శ్రీనాథుడు చమత్కారంగా వర్ణించేడు. దుడుకువారు అనడానికి ఒక పదమాలను సంధానించేడు.

శ్రీనాథుడికి ఇష్టమైన వర్ణనలు కొన్ని ఉన్నాయి. అరిటాకులో భోజన మంటే కవికి చాల ఇష్టం. 'అనంతరంబ చిగురు ముదురునుంగాని నిడుపు వెడల్పుం గల కదళీపలాశంపు నడిమి యానియఁ బుచ్చిపఱచి' (2-126) అని అరిటాకుని వర్ణిస్తాడు. శ్రీనాథుడికి ఇష్టమైన రాగం హిందోళ అలాగే 'వికట పాటల జటామకుటికా' అనే సమాసం అంటే ఎక్కువ మక్కువ. ఇదే సమాసం 'శివరాత్రి మహాత్మ్యంలో కాశీఖండం'లో కూడా ఉంది. శివుణ్ణి 'మంచుకొండ యనుంగు పెండ్లికొడుకు' అని వర్ణించేడు. పెండ్లికొడుకు అనే పదాన్ని అల్లుడు అనే అర్థంలో వాడేడు. కాబట్టి అనే అర్థంలో 'అగు పట్టి' (3-26) అనే పదం వాడేడు. ఇదొక విచిత్రమైన ప్రయోగం.

రసం : శృంగార వీర రసస్వరూపాలను సాక్షాత్కరింపజేసికొని కావ్యాన్ని రచించిన మహాకవులలో శ్రీనాథుడు ఒకడు. చిరుతొండనంబి కథలో

భక్తివీరం, సముద్రమథనవృత్తాంతంలో శివుని దయా వీరం, కిరాతార్జు నీయంలో అర్జునాశ్రిత తపోయుద్ధ వీరం, గౌరీకల్యాణ ఘట్టంలో శృంగారం కనిపిస్తాయి. ఒకటి, రెండాశ్వాసాల్లో చిరుతొండనంబి కథ ఉంది. భక్తిరస ప్రధానమైన ఈ కథలో కూడా శ్రీనాథుడు రవంత శృంగారాన్ని చవి చూపించాడు. దారుకా వనంలోది శృంగారాభాస.

ఆత్మీయత : శ్రీనాథుడి కాలంలోని ఆచార వ్యవహారాలు కొన్ని హర విలాసంలో ప్రతిబింబిస్తాయి. రాజులు భోగపరాయణులు. ప్రభువులతో పాటు ప్రజలు కూడా ఉత్సవాల్లో పాల్గొనే వాళ్ళనడానికి వసంతోత్సవ వర్ణనలే నిదర్శనం. శైవమతం రెడ్డిరాజ్యంలో విస్తారంగా ఆదరం పొందినట్లు తెలుస్తుంది. బౌద్ధ, జైన, పాషండ, లోకాయతిక, చార్వాక, కాపాలిక, హితుండిక, వానప్రస్థ, పాశుపత, జంగమ, యోగి ప్రముఖులు (2–28). జంగం ప్రభువులకే ఎక్కువ ఆదరం, గౌరవం లభించేవి. వీరిలో సన్మార్గులు, ఉత్పాదవర్తులు ఉన్నట్లు మాయవేషధారిణియైన పార్వతి మాటల వల్ల తెలుస్తుంది.

జోగులుకపటోపాయ
ప్రాగల్భ్యంబున నిధాన పనసిద్ధులకై. (హర. 2–98)

ఆ కాలంలో వర్తకం సాధారణంగా వైశ్య ప్రముఖుల చేతిలో ఉండేది. వడ్డీ ఒక రూక. ఆనాడు పండే కొన్ని రకాల ధాన్యాల్ని శ్రీనాథుడు పేర్కొన్నాడు. "కంపాతరంగణీ ప్రవాహ నదీ మాతృకాయమాన విశ్వంభరాభరితకలమశాలి పిరాముఖ షాష్టిక పతంగహాయన ప్రముఖ బహువిధ వ్రీహిభేద సంపత్సం పన్నంబును" (1–10). ద్రవమానంగా 'గట్టు తూము' అనే మానం వాడుకలో ఉండేది.

సాంఘికాచారాల్లో వివాహాన్ని గూర్చి వివరాలు గౌరీకల్యాణంలో ఉన్నాయి. ప్రాచీన కాలంలో వరుడివైపు వాళ్ళు వధువువైపు వాళ్ళతో సంప్రదించడం సదాచారం. శివుడు అడక్కుండా పార్వతి పెళ్ళి చేయడానికి హిమవంతుడు వెనకాడతాడు. పెళ్ళి విషయంలో పురుషులకంటే స్త్రీలకే ఎక్కువ ప్రమేయం ఉండేదని శ్రీనాథుడి అభిప్రాయం.

కన్యకాదానవేళలఁగలదు చనవు
క్షితి గృహస్థుల కంటె సద్గేహినులకు (4–68)

తలంటే వేళ ఉపయోగించే పదార్థాలను విరివిగా పేర్కొన్నాడు కవి. శివుడు కూడా కొంత కాలం ఇల్లరికపుటల్లుడుగా ఉంటాడు. సామాన్యంగా లోకంలో ఇల్లరికపుటల్లుళ్ళకి జరిగే మర్యాదే శివుడికి కూడా జరిగింది. ఇందులో శ్రీనాథుడి లోకానుభవం, హాస్యకౌశలం ప్రస్ఫుట మౌతున్నాయి.

ఈ విధంగా హరవిలాస కావ్యం ఆనాటి ఆచార వ్యవహారాదుల్ని కథాను గుణంగా తెలియజేస్తూ, నవరసభరితమై, ఆధునిక ఖండకావ్య లక్షణోపేతమై కవితా శ్రీనాథుడైన శ్రీనాథుని రచనా విలాసమై, విలసిల్లుతూ ఉంది.

### కొన్ని పదాలకి అర్థాలు

అక్షయంబుగా = సమృద్ధిగా, అధికంగా
ఆవంత = కొంచెం, ఇసుమంత
కారుణ్యము = కటాక్షము
చిత్తము = మనసు
దాక్షాయణీ = పార్వతి
దాడిమ = దానిమ్మ
నిక్కువముగా = నిశ్చయముగా
నెత్తమ్మి = తామరపువ్వు
పికము = కోయిల
పుష్పాసవంబు = పువ్వులో ఉండే తేనె
పొరువున = పక్కన
భంగి = విధము
మాధుకరము = మధుకరవృత్తి
వ్రేటుకొను = కొట్టు
శంక = సందేహము
శర్కర = చక్కెర
హరిణి = స్త్రీ.

### ఆధార గ్రంథాలు


1. హరవిలాసము — వావిళ్ళవారి ప్రతి
2. హరవిలాసము — ఎమెస్కోవారి ప్రతి
3. హరవిలాసము — అకాడమీవారి ప్రతి
4. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (4వ సంపుటం) — ఆరుద్ర
5. ఆంధ్రకవి తరంగిణి (5వ సంపుటం) — చాగంటి శేషయ్యగారు
6. శ్రీనాథుడు — డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు
7. వీర రసము — డా॥ జి. వి. సుబ్రమణ్యంగారు
8. కావ్యపరిమళము — విశ్వనాథ సత్యనారాయణగారు.

# భీమఖండము — శ్రీనాథుడు

సమీక్ష : కాసారపు తాతారావు

[ జన్మస్థలం - విశాఖపట్టణం, జననం - 20-6-1938 ఎం.ఏ. ఆంధ్రోపన్యాసకుడు. 1966 లో కొంతకాలం ప్రభుత్వ కళాశాల, శ్రీకాకుళం. 1966 జూలై నుండి మిసెస్ ఏ.వి.ఎన్. కళాశాల, విశాఖపట్టణం. ప్రస్తుతం - "కళింగాంధ్ర సాహిత్యచరిత్ర - నాటి కవుల పరిశీలన (క్రీ.శ. 1850 వరకు)" అన్న అంశంపైని పరిశోధన - తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వవిద్యాలయం, వాల్తేరు. ప్రచురిత వ్యాసాలు - శుభోదయం, శ్రీ జయంతి [illegible], త్రివేణి, కొన్ని వ్యాసాలు, [illegible] పత్రికలలో ప్రచురింపబడ్డాయి. రేడియో ప్రసంగాలు చేశారు. శ్రీ రామకృష్ణుల సంఘ సేవ చేస్తున్నారు. ]

కవి జీవితాదులు :

అనంతకోటి తారల్లో తారానాథునిలా ఆంధ్ర వాఙ్మయాకాశంలో వెలుగులు విరజిమ్మే కవితాసనాథుడు శ్రీనాథుడు. ఈతడు నియోగి శాఖీయుడు. ఈతని తల్లి భీమాంబ, తండ్రి మారయ, తాత కమలనాభామాత్యుడు. చంద్రశేఖర క్రియాశక్తి రాయల సన్నిధిని కవిసార్వభౌమ బిరుదమందిన ఈ విద్వత్కవి క్రీ.శ. 1365లో జన్మించెనని శ్రీ కందుకూరి వీరేశలింగంగారును, క్రీ.శ. 1385 అయిఉంటుందని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారును అభిప్రాయపడ్డారు. ఈ వివాదాలు చర్చించిన "శ్రీనాథ" సిద్ధాంత గ్రంథంలో డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు శ్రీనాథుని జననకాలం విదు సంవత్సరాలటునిటుగా క్రీ.శ. 1360 అయిఉంటుందని నిర్ణయించేరు. ఇక జన్మస్థలం పాకనాడని ఒకరంటే కాల్పట్టణమని మరొకరు. శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు నెల్లూరన్నారు. నెల్లూరినే సుందర గ్రామార్థంగల పాకనాటిలోని "నెల్లూరు"గా, దానినే శ్రీనాథుడు కాల్పట్టణంగా వర్ణించేడేమోనని శ్రీ వాసింటి వారభిప్రాయపడ్డారు. ఆనాటి నెల్లూరానాటి సముద్ర తీరమేమోననియు "ఆంధ్రకవితరంగిణి" (5 భా॥ 7, 8 పుటలు) లో సూచించేరు. "పాకినాటింటి వాడ"నని అభ్యర్థిస్తూ, భీమఖండం అంకితం పొందిన బెండపూడి అన్నయమంత్రి ఈతని బంధుకోటిలోనివాడే !

శ్రీనాథుడు "ప్రౌఢ నిర్భరవయః పరిపాకం"లో ఔబ్బదేండ్ల ప్రాయంలో, అంటే క్రీ.శ. 1430లో భీమఖండం వ్రాసి ఉంటాడని శ్రీ కొర్లపాటివారే నిర్ధరించేరు. క్రీ.శ. 1402 - 20 మధ్య కొండవీటిరాజ్యమేలిన పెదకోమటి వేమారెడ్డి ఆస్థానకవిగా, విద్యాధికారిగా ఉండేవాడు. శ్రీనాథుడు రాజమహేంద్రవరంలో

ఉన్నప్పుడు వీరభద్రారెడ్డితోకలిసి, భీమేశ్వరనామక గురుస్వామిని సేవించినాడని కాశీఖండమంటున్నా, అతని విద్యాగురువు మాత్రం తాత కమలనాభామాత్యుడై ఉంటాడు.

శ్రీనాథుడామరణాంతం గ్రంథ రచన గావించేడు. శృంగారనైషధం, భీమేశ్వరపురాణం, కాశీఖండం, హరవిలాసం, శివరాత్రి మాహాత్మ్యం—ఉపలబ్ధ ప్రసిద్ధ కృతులు. మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్ర రచించినట్లు శ్రీనాథకంఠోక్తియేగాని, అతని నందనందన చరిత్ర, ధనంజయ విజయం మున్నగునవి అనుపలబ్ధాలు. పల్నాటి చరిత్రాదులు మినహాయిస్తే పై కృతుల్లో తక్కినవి భాషాంతరీకరణాలే.

శ్లో॥ నిరాశ్రయానశోభన్తే । కవితావనితాలతాః ॥

అని విషయజ్ఞుల చాటరానిమాట. శ్రీకృష్ణదేవరాయల్లా రెడ్డి ప్రభువులును, సాటిలేని మేటి ఆంధ్రభాషా సేవకులు. వీరి పాలనలో, వీరి ఆశ్రయంలో కవి జగన్నాథుడు, కావ్యరస జగన్నాథుడు శ్రీనాథుడు పరిఢవిల్లేడు.

కథా సంగ్రహం :

భీమఖండకథ దక్షారామ భీమేశ్వర ప్రతిష్ఠకు చెందింది. దక్షారామక్షేత్ర వృత్తాంతం, మాహాత్మ్యం—అగస్త్యుడు కాశివాసివచ్చిన వ్యాసునికి స్పష్టపరుస్తాడు. పూర్వం నిర్జరుల ప్రార్థనపై వింధ్యపర్వత విజృంభణ నిరోధార్థం కాశీ పుణ్య క్షేత్రం ఎంతో కష్టంతో వీడి దక్షిణాపథం విచ్చేసిన మహర్షి అగస్త్యుడు. శిష్యులతో పెల్లాకట కుంది కాశిని :

శ్లో॥ "మాభూత్ త్రైపూరుషీ విద్యా మాభూత్ త్రైపూరుషం ధనం ।
మాభూత్ త్రైపూరుషీభక్తిః కాశ్యాం నివసతాంసదా ॥ "

అని శపింపబోయి, కాశీవిశ్వనాథుని కోపానికి గురై, మందలింపబడి, కాశి నుండి బహిష్కృతుడయినట్లు వ్యాసుడే అగస్త్యునితో వాపోతాడు. అన్నపూర్ణా దేవి ఆజ్ఞమేరకు దక్షిణకాశినామాంతరంగల దక్షారామం విచ్చేస్తూ, మార్గ మధ్యంలో దక్షవాటిక నుండి పిఠాపురం పోవు అగస్త్యుణ్ణి కలుస్తాడు. కుశల ప్రశ్నల అనంతరం తమకాశిబాయు కరుణామయ వృత్తాంతానుభవాలు ముచ్చటించుకుంటారు. ఇటనుండియే కథా ప్రారంభం. దక్షారామ పీఠికాపుర వర్ణనలు, పంచతీర్థ వివరణ, తుల్యభాగ సముద్భవం, సూర్యప్రతిష్ఠిత దక్షారామ పరమేశ్వర ప్రసక్తి, భీమనాయకునియందుమాపతియైక్యం, సప్తముని స్తోత్రం—మున్నగునవిందుగలవు. వీటితోబాటు క్షీరసాగర మథనకథ, హాలాహలభక్షణ, త్రిపురాసుర సంహార ఘట్టాలును ఉన్నాయి. స్థూలంగా, భీమేశ్వరపురాణస్థ కథా విశేషాలివి.

వస్తుతత్త్వం :

భీమఖండ నామాంతరంగల యీ భీమేశ్వర పురాణానికి పెక్కు స్థలపురాణాలకు మల్లే సంస్కృత స్కాందపురాణమే మూలమని కొందరంటారు. శ్రీనాథుని వలనో, మరింకెవరివలనో ఆంధ్ర భీమఖండం సంస్కృతీకరింపబడి స్కాంద పురాణంలో చోటుచేసుకొంది అని మరికొందరంటారు. ఉత్తర హిందూ దేశంలో కాశీక్షేత్ర మెంత ప్రసిద్ధమో ! దక్షిణ హిందూదేశంలో దక్షారామం అంత ప్రసిద్ధం. ఆ దక్షారామ భీమేశ్వరుని గూర్చినదీ భీమేశ్వర పురాణం.

శ్రీనాథుడు భీమఖండంగూర్చి ఆశ్వాసాంత గద్యల్లో "భీమేశ్వర పురాణం"గా సూచించినా, "ప్రబంధం"గానే పేర్కొన్నాడు. శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు భీమఖండం గూర్చి పరామర్శిస్తూ : "ప్రబంధమున నుండదగిన అష్టాదశవర్ణనలలో కొన్నింటికి ఇందు అవకాశం కల్పింబి, ఈ ఉప పురాణమును ప్రబంధ ప్రాయముగా శ్రీనాథుడు సంతరించెనని తోచును" (ఆంధ్ర సాహిత్య చరిత్ర-386 పుట) అని కృతి రచనా తత్త్వం ఉటంకించేరు.

శ్రీనాథుని కావ్యాల్లో నైషధం మాత్రం ప్రస్వైక్యం గల అనువాదకావ్యం. హరవిలాసం కథైక్యతలేంది. బహుళ కథా సమన్విత ఖండకావ్యసంపుటి వంటిది. కాశీఖండ, భీమఖండాలు శివక్షేత్ర మహత్త్వ ప్రతిపాదకాలు. భీమఖండం, పురాణ నామాంకిత ప్రబంధం.

శ్రీనాథునిగూర్చి, అతనికాలంగూర్చి డా॥ శ్రీ జంధ్యాల జయకృష్ణబాపూజీ ఉల్లేఖిస్తూ "క్షేత్ర మాహాత్మ్య రచనలీకాలమునుండియే రూపొందినవి. భీమేశ్వర పురాణ, కాశీఖండములు క్షేత్రమాహాత్మ్య శాఖకు పురుడుపోసిన" (శ్రీనాథుని సాహిత్య ప్రస్థానం-12 పుట) వనిరి. అంచే "శైలి, రసము, పాండిత్యము ఈ విషయములందే గాక కావ్యానువాద విధానమునగూడ శ్రీనాథుడు తరువాతి వారికి మార్గదర్శియైనా"డని వక్కాణించేరు.

విజయనగరం వెళ్ళినపుడు శ్రీనాథుడు తన కవితగూర్చి ముమ్మకవితో "పంపావిరూపాక్ష బహుజటా జూటికా" అను చాటుపుతో చెప్పుచుంటాడు. అట్లే "ప్రౌఢిఁబరికింప" (భీమ-1.15), "వచియింతు వేములవాడ భీమనభంగి" (కాశీ-1.13) పద్యాల్లో ముఖ్యంగా

మ॥ "హరచూడా హరిణాంక వక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢ పయోధరస్ఫుటతటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించెనసఁగా సత్కావ్యముల్ దిక్కులన్
జిరకాలంబు నటించుచుండుఁ గవి రాజీగేహరంగంబులన్"

[ భీమ-1.11 ప॥ ]

అను భీమఖండ పద్యంలో శ్రీనాథుడు తన కవితలో వక్రత, కఠినత, సరసతల—గూర్చి సూచించేడు. ఇందలి వక్రత—అలంకారికుల మతంలోని ధ్వని, వ్యంగ్యం—అను వాటికి పర్యాయపద మనుకోవచ్చు. శ్లేష, లేక, కాకుస్వరంతో అర్థాంతరం కల్పితమైతే అదే వక్రోక్తి అని విన్నకోట పెద్దన, భట్టుమూర్తులమాట. "కవి వ్యాపార వక్రత"యే వక్రోక్తి అన్న కుంతకుడు వర్ణవక్రత, ప్రబంధ వక్రతల గూర్చి ప్రస్తావించేడు. ఒకటిగాని, రెండుగాని, అంతకంటె అధికవర్ణాలు గాని, స్వల్ప వ్యవధానంతో పునరుక్తమైతే "వృత్త్యనుప్రాస" మంటాము. అదే "వర్ణవిన్యాసవక్రత." భీమఖండంలోని —

సీ॥ "భవు భవానీ భర్త భావసంభవ వైరి
భవరోగ భంజను ఫాలనయను" [ భీమ-3.83 ]

వంటి పద్యాలట్టివి. బండారు తమ్మయ్యగారు వ్రాస్తూ శ్రీనాథుని "శబ్ద సమ్మేళనములో బాఠకుల దన్మయుల గావించు సమ్మోహన శక్తియున్నది. ప్రత్యేకముగా శబ్దాలంకార, అర్థాలంకార సమృద్ధి లేకున్నను కేవలము శబ్దసమ్మేళన మాధుర్యము, శయ్యాసౌభాగ్యము, సమత్వ సౌష్ఠవము మున్నగు గుణములచేతనే యాతని గద్యపద్యములు చదువరుల మదులఁ జూఱగొనుచుండును. కావున సరసత్వ సంపద ఆతని కృతులలో సర్వత్ర వెల్లివిరియుచుండు" (వావిళ్ళ-భీమ-పీఠి-26 పుట) నని శ్రీ ఈశ్వరదత్తుగారి అభిప్రాయ ప్రతిధ్వనిగా పేర్కొన్నారు. శ్రీనాథుని "హరచూడా" పద్యస్థ సరసత్వఘటన మెట్లగునది ఇందు సూచితం. ఇక కాఠిన్యం —

శా॥ "అడెందాండవ మార్భటీ పటహాలీలాటోప విస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడా ఘాటకఠోర కోటరకుటీ కోటీలు రచ్చిందువీ
చీడోలా పటలీ పరిస్ఫుట తరస్ఫీతధ్వని ప్రౌఢిమన్"

[ భీమ-4.148 ]

వంటి భీమఖండ పద్యాల్లో చూస్తాం. సప్తర్షులు గోదావరీ ప్రభావం స్తుతించే వేళ కవి—

కం॥ "గౌతమ కన్యాతటినిన్
బ్రీతిఁ బయఃపాన మాచరించిన మనుజ
వ్రాత మొనర్పదు మరలన్
మాతృ పయోధర పయః కణాస్వాదనమున్"

[ భీమ-4.163 ]

అను పద్యం లిఖించేరు. ఇందలంకార ధ్వని ఉంది. పద్యస్థ "పయశ్శబ్దా" నికి నీరు, పాలని రెండర్థాలు. గోదావరి నీరు త్రాగేవారు మరల తల్లిపాలు త్రాగరు. అనగా మరల తల్లి కడుపున పుట్టరని పరమార్థం. పునర్జన్మలేదను విషయం తిరిగి తల్లిపాలు త్రాగరంటూ తెల్పుటచే పర్యాయోక్తాలంకృతి. వాచ్య వ్యంగ్యార్థ క్రమం దీనిలో స్ఫుటంగా తోచుటచే ఇది "వాక్యగత సంలక్ష్య క్రమాలంకార ధ్వని." ఇట్టివెన్నో కావ్యంలో ఉన్నాయి.

రసము : కావ్యాంగాల్లో వ్యంగ్య, రసాలు ప్రాణభూతాలు. భీమఖండంలో శృంగారాది రసస్ఫూర్తి అధికంగా లేకినా, ఈ కృతి పలురసాల కలిమితో రసవంతంగా, ప్రౌఢంగా సాగిన ప్రబంధమనిపిస్తుంది. "రసోవైసః" "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" "భగవంతుఁడు రసస్వరూపుఁడు" "ఆనందము పరబ్రహ్మ స్వరూపము"- అని శ్రుతి. కావ్యానందం బ్రహ్మానంద సహోదరమన్నారు పూర్వులు. అట్టి రసానంద జనకాలైన రచనలుగా శ్రీనాథుని కృతులు నిలుస్తవి.

తే॥గీ॥ "అచ్యుతుని మీఁదఁ జల్లెడుగ్గాఢి కన్య
భారతీదేవి పద్మజుపైనిఁ జల్లె
శచి మహేంద్రునిఁ జల్లె వసంత కేలి
గంధ కర్పూర కస్తూరికా జలంబు"

[ భీమ-5.121 ]

అను పద్యం శృంగార రసబంధురం. కావ్యంలో కరుణ, బీభత్స, భయానకాది రసాలతో పెక్కు ఘట్టాలు మనకు దర్శనమిస్తాయి.

శైలి : శ్రీనాథుని గూర్చి ఖండవల్లి లక్ష్మీరంజనంగారు "సంస్కృతాంధ్రము లందాతని ప్రజ్ఞ నిరంకుశము. ప్రౌఢ కవిత్వముతోపాటు శ్రీనాథుడు రమ్యమైన మృదుశైలిగల పద్యములనుగూడ వ్రాయుచుండును" (ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహం-75పుట) అని సత్యం పలింకేరు. ఈశానివేషంలో నృత్యం చేసే వేశ్యాంగనను వర్ణిస్తూ శ్రీనాథుఁడు

సీ॥ "విరుల దండలతోడి వేణికాభారంబు
పొంకంబు పిఱుఁదులఁ బొరలియాడ,
మణితులాకోటి కోమల ఝుణత్కారంబు
రవల మట్టెల మ్రోఁత యుపఘళింపఁ,
గుదురు నిండిన చిన్ని గుబ్బ చన్నులమీఁద
ముత్యాల త్రిసరంబు మురువుఁ జూప,
వలమాన తాటంక వజ్రాంకురచ్ఛాయ
లేత వెన్నెలఁబుక్కిళింపి యమియ

తే॥గీ॥ సాని యీశానియై మహోత్సవమునందు
గేల నవచంద్రకాంతంపు గిన్నెఁ బూని
వీధి భిక్షాటన మొనర్చువేళఁజేయు
మరుల నృత్యంబు జగముల మరులుకొలుపు"

[ భీమ-1.105 ]

అని చెప్పిన పద్యాల్లాంటివి రమ్య మృదుశైలి కుదాహృతులు.

వర్ణనలు : కవిత్వం ఉత్తమకోటికి చెందిందనడానికి భావావేశంతోబాటు, భావనాశక్తియు ప్రముఖ స్థానం వహిస్తుంది. వీనినే "Poetry is the language of inauguration and emotions" 'భావనా, భావావేశముల శబ్దస్వరూపమే కవిత్వ' మని Hazlitt. భీమఖండ మనోజ్ఞ వర్ణనల్లోంచి మచ్చునకొక్కటి—

తే॥గీ॥ "సంజకెంపును దిమిరపుంజంపు నలుపు
గమిచి బ్రహ్మాండ భాండంబుగరము మెఱసె
పరమ పరిపాకదశవృంత బంధమెడలి
పతనమగు తాటిపండుతోఁ బ్రతిఘటించి"

[ భీమ-2.30 ]

అది సూర్యాస్తమయకాలం. సంధ్యారుణకాంతు లొకవైపు, చీకటి తెరలు మఱొకవైపు పరివ్యాప్తం కాగా, బ్రహ్మాండ భాండం బాగా ఆరముగ్గి పతనం కాబోయే తాటిపండులాఉన్నట్లు కవి ఉత్ప్రేక్ష.

అలంకారములు : 'అలంకారాలు కావ్యసౌందర్య కారకాలు'—అని కావ్యాదర్శంలో దండి ప్రవచించాడు, భీమేశ్వరస్వామి ఉత్సవంలో —

తే॥గీ॥ "మర్త్యభామలు విబుధ భామలును గలిసి
యుత్సవములందు వర్తించు చున్నయపుడు
దక్షవాటంబు వీటభేదంబు దెలియు
దృఙ్ని మేషా నిమేష ప్రదీప్తివలన"

[ భీమ-3.92 ]

అన్నాడు. ఇందు విశేషాలంకారముంది. భీమేశ్వరుని మహోత్సవాలు తిలకింప భూలోకం విచ్చేసి, దక్షవాటీ వీధుల్లో నరలోక సుందరులతో బాటు సురలోక సుందరులు విహరిస్తూ ఉండగా, నిమేషానిమేషదృష్టులు (ఱెప్పపాటుండుటకు, లేకుండుటకు చెందుచూపులు) బట్టి ఎవరెవరో తెలిసికో వీలవుతుందట. ఇటువంటి అలంకృతులెన్నో !

పాత్రచిత్రణ : భీమఖండంలో భీమేశ్వరుడు నాయకపాత్ర వహింపగా, అతని భక్తులు వ్యాసాగస్త్యులు ప్రముఖపాత్ర ధరించేరు. వీరితోబాటు బ్రహ్మ, విష్ణు, మహేంద్ర, సూర్యపాత్రలును గలవు. వీరందఱి విషయాలు భీమేశ్వరుని కేంద్ర బిందువుగా, చుట్టుఅల్లుకొని, అతని మహిమాతిశయాలు వర్ణించేవిగా ఉన్నాయి.

శ్లో॥ "శృంగారీచేత్కవిః కావ్యేజాతం రసమయంజగత్"

కవి శృంగారి ఐతే కావ్యంలో, లోకమే రసమయమౌతుందని ఆనందవర్ధనుడు. శ్రీనాథుడు భక్తిరక్తుల ప్రసిద్ధ సంగమ క్షేత్రం. అతడెంతటి ఈశ్వరార్చన కళాశీలుడో! అంతటి శృంగార కళానిధి. భీమనాయకుని గూర్చి శ్రీనాథుడు—

సీ॥ "గజచర్మ మెన్నడోకాని నిచ్చలుఁ గట్టు
పసిఁడికమ్ములపట్టు పచ్చడంబు"

అంటూ—

తే॥గీ॥ "కాటసడు చక్కనెన్నడో కానియుండు
దక్షవాటి సువర్ణసౌధముల మీఁద
నెన్నడో పిశాచులనుగాని యుందుముఖుల
నెల్లకాలంబుఁ దలఁచు భీమేశ్వరుండు"

[ భీమ-1.116 ]

అని పేర్కొంటాడు. భోగభాగ్యాలనుభవిస్తూ విలాసంగా జీవించే రసికావతంసుడైన ఒక ప్రభుని భీమనాయకునిలో చూస్తాము. త్రిపుర దహన ఘట్టంలో, శివప్రయుక్త నారాయణాస్త్ర వహ్నిజ్వాలల్లో కాముకక్రీడా ప్రసక్తి చేస్తాడు. శ్రీనాథుడొక పరిహాస రసిక కవీంద్రుడని అతని చాటువులును నిరూపిస్తాయి. అతని కవిత అతణ్ణి సౌందర్య దిదృక్షువుగ, కావ్యరస పిపాసువుగ చూపుతాయి. భీమఖండం పీఠికలో (అద్దేపల్లివారి ప్రచురణ) శ్రీ విలుకూరి పాపయ్య శాస్త్రిగారన్నట్లు శ్రీనాథుడు దక్షారామ క్షేత్రమాహాత్మ్యంబట్టి, కృతిభర్త అన్నయమంత్రి అభిరుచిని బట్టి కావ్యంలో విశేషంగా సానికూఁతుల సౌందర్యవర్ణన, శృంగార ప్రసక్తి చేసేడు. ఆకలిగొన్న వ్యాసుని కస్సుంపెట్టే అన్నపూర్ణ శ్రీనాథుని దృష్టిలో "వేదాంత వచో మహోపనిషదర్థమయి." కరుణార్ద్రచిత్తంగల ఉత్తమగృహిణి. వ్యాసాగస్త్యుల కాశి అనుభవాలు, రసజ్ఞ హృదయాల కదుపుతవి. పరమ మహేశ్వర భక్తులగస్త్య వ్యాసపాత్రల్లో శ్రీనాథుని ఆత్మీయతాముద్రతోస్తుంది. ఇట్లాత్మీయతా కవితామాధురిగల శ్రీనాథుని భీమఖండం వంటి కవితాఫలాలను "There is no forbidden fruit in the beautiful garden of Poetry" అన్న ఫ్రెంచికవి 'విక్టర్‌హ్యూగో' కవితోద్యాన ఫలాలకు నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

కవి వ్యక్తిత్వం: తెలుగు కవితాకన్యను తన మనోజ్ఞ భాషాడోలికల నుఱ్ఱూత లూచిన విద్వత్కవి శ్రీనాథుడు. భీమఖండ ప్రబంధరచన పేరిట, గోదావరీమండలాంధ్ర ప్రాంత విశేషాలు మనసార వర్ణించుకొని, తృప్తినంది, చదువరులకును అట్టి తృప్తి కల్గించిన ఆంధ్రాభిమానంగల తెనుగు జాతీయకవి శ్రీనాథ మహాకవి. స్వదేశం గూర్చి ఇంత చక్కగా, మక్కువతో వర్ణించికొన్న తెల్గుకవి మఱొకడులేడు. ఆంధ్రజాతి ఉన్నంతవఱకు, ఆంధ్ర భాషావాఙ్మయాలున్నంత వఱకు, కవిసార్వభౌముని, శ్రీనాథుని కావ్యాలతని పేరిట కీర్తిప్రతిష్ఠలను నలు దిక్కుల గుబాళిస్తూ, నిలుస్తూ ఆనందం పంచిపెడతవి. చిరకాలం సహృదయ రసిక జిహ్వా రంగస్థలాలపై నర్తిస్తవి.

## అనుబంధము

**కఠినపదాలకర్థాలు :**

విరూపాక్షుఁడు = శివుఁడు ; చూడ = జుట్టు; హరిణాంకుఁడు = చంద్రుఁడు; స్ఫురత్ = తోస్తున్న, ప్రకాశిస్తున్న ; చండిక = పార్వతి ; పరుషము = కఠినమైనది ; ఉద్గాఢము = అధికము ; స్ఫుటము = స్పష్టమైనది ; తటి = ప్రదేశం ; కవిరాజి = కవిసమూహం ; గేహరంగములు = నర్తన స్థలాలవంటి ఇండ్లు.

భవుఁడు = శివుఁడు ; భవాని=గౌరి ; భావసంభవుఁడు = మన్మథుఁడు ; భవరోగము = సంసారమనే రోగం ; ఫాలనయనుఁడు = శివుఁడు.

ఆర్భటి = మ్రోఁత ; పటహము = తప్పెట ; ఆటోపము = సంభ్రమము ; విస్ఫూర్జితము = మిక్కిలి ప్రకాశం పొందినది ; ఉల్లసిల్ల = ప్రకాశింపగా ; జూట + అటవి = (శివుని) జడముడి అనే అడవి ; క్రోడము = ఒడి ; ఆఘాటము = కొలఁది, మేర ; కోటరము = తొఱ్ఱ ; కుటి = గుడిసె ; వీచీపటలి = కెరటాల సమూహం ; స్ఫీతము = అధికమైనది.

తటిని = నది ; పయస్సు = నీరు, పాలు ; వ్రాతము = గుంపు ; అచ్యుతుఁడు = విష్ణువు ; దుగ్ధాబ్ధి = పాలసముద్రం ; భారతి = సరస్వతి ; పద్మజుఁడు = బ్రహ్మ.

వేణిక = సర్పాకారంగా అల్లిన జడ ; పొంకము = పొందిక, సౌందర్యం ; తులాకోటి = అందె ; అవఘళింప = మీఱఁగా ; వలమానము = చలిస్తున్న.

కెంపు = ఎఱుపు ; తిమిరపుంజము = చీఁకట్ల సమూహం ; కమిచి = వ్యాపించి : కరము = మిక్కిలి ; [illegible]

మర్త్యభామలు = మానవకాంతలు ; విబుధ భామలు = దేవతాస్త్రీలు ; దృక్ + నిమేషము = కంటి ఱెప్పపాటు.

నిచ్చలు = సదా ; పసిఁడి కమ్మి = బంగారులోనగు వాని కమ్మి ; పచ్చడము = అంగవస్త్రం, కట్టువస్త్రం ; చక్కి = స్థానం ; సువర్ణ సౌధములు = బంగారు మేడలు ; ఇందుముఖులు = స్త్రీలు.

## ఉదాహృత గ్రంథములు


1) శ్రీ భీమేశ్వర పురాణము (వావిళ్ళవారి ప్రచురణ)
2) భీమేశ్వర పురాణము (అద్దేపల్లివారి ప్రచురణ)
3) శ్రీనాథుఁడు (సిద్ధాంతగ్రంథం)
(డా॥ శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి, ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.)
4) శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము (సిద్ధాంత గ్రంథము)
(డా॥ శ్రీ జంధ్యాల జయకృష్ణ, బాపూజీ, ఎం.ఏ., పిహెచ్.డి.)
5) ఆంధ్ర కవితరంగిణి 5వ భా॥ (శ్రీ చాగంటి శేషయ్య)
6) ఆంధ్ర సాహిత్య చరిత్ర (ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతం, ఎం.ఏ.)
7) సాహిత్యశిల్ప సమీక్ష (ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతం, ఎం.ఏ.)
8) ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము (ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం.ఏ.)
9) శ్రీనాథ కృతిసమీక్ష (శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి)
10) కావ్యాదర్శః (శ్రీ దండి మహాకవి)
11) కాశీఖండము (శ్రీనాథుడు)
12) ధ్వన్యాలోకః (శ్రీ ఆనంద వర్ధనుఁడు)
13) భీమఖండము - (శ్రీనాథుఁడు - శ్రీ క్రొవ్విడి రామం)
(భారతి 1943 నవం. వ్యాసం) - మొదలగునవి.

# కాశీఖండము — శ్రీనాథుడు

## సమీక్ష : డాక్టర్ డి. లలితకుమారి

[ జన్మస్థలం : విశాఖపట్టణం, ఎమ్.ఏ., పిహెచ్.డి., పోస్టు-డాక్టరల్ రిసెర్చ్‌స్కాలర్, తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళా పరిషత్తు, వాల్తేరు. కొన్ని ఆంధ్రాంగ్ల వ్యాసాలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ముద్రితకృతులు – ఆధునికాంధ్ర కవితాతత్త్వము (పరిశోధన గ్రంథం). దాశరథి కవితా దర్శనము. అనేక రేడియో ప్రసంగాలు చేశారు. ]

కవిజీవితాదులు : ఆంధ్రభాషలో రసప్రధాన కావ్యాలు రచించిన మహాకవి శ్రీనాథుడు. ఇతడు బ్రాహ్మీదత్త వరప్రసాదుడు; ఈశ్వరార్చన కళాశీలుడు; నియోగి అధ్వర్యు వేదశాఖాధీతి నిష్ణాతుడు. ఇతనిది విద్వద్వంశం: పద్మపురాణాది గ్రంథకర్త అయిన కమలనాభామాత్యుని పౌత్రు డితడు; భీమాంబా మారయామాత్యుల పుత్రుడు. నాసికేతోపాఖ్యాన కావ్యకర్త దగ్గుపల్లి దుగ్గన ఈతని బావమఱది. ఇతని జన్మస్థానం కాల్పట్టణం. శ్రీనాథుడు సంస్కృత శౌరసేన్యాది భాషాపరిజ్ఞానం గల విద్వాంసుడని, వ్యాకరణ న్యాయ మీమాంసాది శాస్త్ర పాండిత్యం గల ప్రజ్ఞావంతుడని, శ్రుతి స్మృతి పురాణాగమ విజ్ఞాన సంపన్నుడని, పూర్వాంధ్ర కవుల కావ్యకళా రీతుల్ని అవగాహన చేసికొన్న జ్ఞానవంతుడని వ్యక్తమౌతోంది. ఈతని కాలం సుమారు క్రీ.శ. 1360 నుండి 1445 కావచ్చును. "కాశీఖండం" కృత్యాదిలో చిన్ననాటి నుండి రచించిన కావ్యాల్ని పేర్కొని, 'ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ గాశికాఖండ మను మహాగ్రంథ మేను దెనుఁగు జేసెద' అని తాను నిశ్చయించుకొన్నాడు. ఈ కావ్యం వీరభద్రారెడ్డికి అంకితం చేయబడింది. "శృంగారనైషధము," "భీమఖండము," "హరవిలాసము," "పలనాటి వీరచరిత్రము," "శివరాత్రి మాహాత్మ్యము," ఇతని ఇతర ఉపలబ్ధ కృతులు.

శ్రీనాథుడు రాజభోగం, దేశాటనం, లోకానుభవం పొందిన భాగ్యశాలి. ఇతడు కొండవీటిరెడ్ల ఆస్థానంలో విద్యాధికారి; దేవరకొండ లింగమనేని మెప్పించి, నందికంత పోతరాజు కటారిని పొందేడు. 1424 లో కొండవీటి రాజ్యం పతనమైంది. ఇతడు దేశాటన చేస్తూ పంటమైలారురెడ్డి దినవెచ్చాన్ని, విస్సనమంత్రి హేమపాత్రాన్ని, తెలుగురాయని కస్తూరికా దానాన్ని స్వీకరించేడు; 1428 లో రాజమహేంద్రవర రెడ్ల ఆస్థానం ఆశ్రయించేడు.

కర్ణాటరాజ్యం చేరి అరుణగిరినాథ డిండిమభట్టు నోడించి, కంచుఢక్క పగుల గొట్టించి, కవిసార్వభౌముడై ప్రౌఢదేవరాయల కనకాభిషేక సత్కారం ఇతడు పొందేడు ; రాచకొండ పద్మనాయక ప్రభువు సర్వజ్ఞ సింగభూపాలుని మెప్పించి, సత్కరింపబడ్డాడు. 1445 లో రాజమహేంద్రవర రాజ్య పతనంతో శ్రీనాథుడు కష్టాలకు గురయ్యేడు.

కథాసంగ్రహం : సూతుడు శౌనకాదులకు "కాశీఖండం" కథ వివరిస్తాడు : వింధ్యపర్వతం మేరువుకు తనకు గల తారతమ్యం వివరింపమని నారదుని కోరింది. నారదుడు మేరువుకూడా ఇలాగే పలికిందని తప్పుకున్నాడు. వింధ్య పర్వత విజృంభణ వల్ల త్రిలోకాలకు ఆపద వాటిల్లింది. దీని నివారణకు దేవతలు మునులు బ్రహ్మ ఉపదేశంతో కాశీనివాసియైన అగస్త్యుని ప్రార్థిస్తారు. అగస్త్యుడు కాశీవియోగానికి చింతించి, దక్షిణదిశకు పోతూ వింధ్య గర్వాప హరణం చేస్తాడు ; దక్షారామం దర్శించి, కొల్లాపురం శ్రీమహాలక్ష్మి ఆజ్ఞ పాటిస్తాడు. అగస్త్యుడు లోపాముద్రకు కాశీయే ముక్తిస్థానమని శివశర్మో పాఖ్యానాన్ని వివరిస్తాడు. విశ్వేశ్వరుడు పార్వతీదేవికి వివరించిన ప్రకారం కుమారస్వామి అగస్త్యునికి కాశీక్షేత్ర మాహాత్మ్యాన్ని వివరిస్తాడు : వారణాసి నామ నిర్వచనం, ప్రకృతి పురుషులైన అర్థనారీశ్వరులు కాశీ చేరడం, కాశీలోని తీర్థ వాపికా కుండికా నదీ మాహాత్మ్యాలు, లింగ ప్రాదుర్భావ మాహాత్మ్యాలు, అర్కుల మాహాత్మ్యాలు వర్ణిస్తాడు. శివతీర్థ మాహాత్మ్య వివరణకు సుశీలకథ కళావత్యుపాఖ్యానంలో వివరింపబడింది. బ్రహ్మ అనావృష్టి నివారణకు దివోదాసుకు భూరాజ్య పట్టాభిషేకం చెయ్యడం, ధరావియోగం వల్ల వేల్పులు దివోదాసుని పదవీభ్రష్టుని చెయ్యడానికి నిశ్చయించి పూనుకోడం, దివోదాసు బొందితో నిర్యాణం పొందడం, దివోదాస వర్ణనంలో వివరింపబడింది. విశ్వేశ్వరుని పరీక్షకు తట్టుకోలేని వ్యాసుడు కాశీని శపింపబూనడం, శివాజ్ఞచే కాశీవియోగం పొందడం, విశ్వేశ్వరుడు అంతర్గేహం ప్రవేశించడం, దేవతా యాత్రా విధాన వివరణ చెయ్యడం వర్ణింపబడ్డాయి.

వస్తుతత్త్వం : "కాశీఖండం" శైవతత్త్వ ప్రతిపాదకమైన వస్తువుతో కూడిన కావ్యం. శైవమతాధిక్యం కోసం బౌద్ధ వైష్ణవ మతాలు ఇందులో ఉపయోగింప బడ్డాయి. ఇందులో పురాణ ప్రశంస, గోబ్రాహ్మణ ప్రభావం, పతివ్రతా ధర్మాలు, స్త్రీ లక్షణాలు, కాలజ్ఞానం, యోగశాస్త్రం, బాహ్యాభ్యంతర తీర్థాలు, తీర్థవాపికా మాహాత్మ్యాలు, దేవతాస్తవాలు, శైవమంత్రాలు, విభూతి రుద్రాక్ష ధారణ, వారణాసి నామ నిర్వచనాలు, శైవభక్తుల కథలు, వర్ణింపబడ్డాయి. కనుక వస్త్వైక్యం సమకూడింది. "స్కాందపురాణం"లోని యేబది ఖండాలలో గల "కాశీఖండం" దీనికి మూలం. సంస్కృత "కాశీఖండం" ద్వాదశ సహస్ర

గ్రంథ పరిమితి గలది; ఆంధ్రంలో ఏడాశ్వాసాలు, 1777 గద్యపద్యాలు గల గ్రంథం. మూలం కథా ప్రధానం: ఆంధ్రీకరణ రసప్రధానం. మూలం పురాణ పద్ధతి: ఆంధ్రీకరణ కావ్య పద్ధతి. శ్రీనాథుడు స్వతంత్రాస్వతంత్ర పద్ధతిలో ఆంధ్రీకరించేడు; కథానుగుణంగానూ, పాత్రౌచిత్య ప్రధానంగానూ, స్వతంత్ర కల్పనలు చేసేడు. వింధ్య నారద సంవాదం, అగస్త్యుని కాశీవిరహం, శివశర్మో పాఖ్యానం, కుబేరవృత్తాంతం, కళావత్యుపాఖ్యానం, దక్షాధ్వరధ్వసం, వ్యాస నిష్కాసం, ఇందులో రసవద్ఘట్టాలు; ముఖ్య ఘట్టాలు.

పాత్రచిత్రణ: "కాశీఖండం"లో పాత్ర వైవిధ్య ముంది. ఇందులో వింధ్యాచలం, సూర్యుడు, చంద్రుడు, ధ్రువుడు, ప్రకృతి పాత్రలు; పారావతాలు, కాకులు, శ్యేనం, చిట్టెలుక, పక్షి జంతుపాత్రలు; గజాసురుడు, దుందుభి నిర్హ్రాదుడు, దుర్గాసురుడు, విద్యున్మాలి రాక్షస పాత్రలు; విశ్వేశ్వరుడు, బ్రహ్మ, విష్ణువు, వినాయకుడు, కుమారస్వామి, నందికేశ్వరుడు, పార్వతీదేవి, లక్ష్మీదేవి, నారదుడు, దేవతలు దివ్యాలు; పురాణ ప్రసిద్ధ పాత్రలు; శివశర్మ, గృహపతి, గుణనిధి, దివోదాసు, సోమిదమ్మ, సుశీల, సులక్షణ కావ్య పాత్రలు. ఈ కావ్యంలో విశ్వేశ్వరుడు నాయకుడు. అగస్త్యుని శివభక్త్యావేశం, నిరహం కారం, విశ్వేశ్వరుని ప్రాధాన్యం, ఇలా వర్ణింపబడ్డాయి:

> పంచాక్షరీమంత్ర పారాయణమునకు
> నెవ్వానిమానసం బేడుగడయు
> దర్పోద్ధతులగు వాతాపి కిల్వలునకు
> వధశిలాస్థాన మెవ్వానికుక్షి
> యాది నెవ్వాని దివ్యావతారమునకుఁ
> బూర్ణాంబు కుంభంబు పురిటియిల్లు
> మెఱసి లోపాముద్ర మెఱుఁగుఁ బాలిండ్లపైఁ
> బవళించు నెవ్వాని భవ్యమూర్తి
> కసరి యెవ్వాని కంఠహుంకారరవము
> కొండపాముల కులములోఁ గూర్చె నహుషు
> నట్టి పరమమహాశైవు నలఘుతేజు
> వెదకి రానందవనములో విబుధమునులు. [ద్వి. ఆ. ప. 40]

వర్ణనలు: దేశకాలప్రజా ప్రకృతి శాస్త్ర విజ్ఞానంతో, నవీనగుణ చిత్రకవితా చమత్కారంతో, భావావేశంతో, "కాశీఖండం"లో వర్ణనలు చేయబడ్డాయి. శ్రీనాథుడు ప్రకృతిని చిత్రకారునిలా చిత్రించేడు. వింధ్యపర్వతం విజృంభింపగా, సూర్యోదయమైంది. ప్రాగ్దిశలో అనూరుని సారథిగా చేసికొని, సూర్యుడు

'నక్షత్ర కుముద కాననము గిల్లెడు హొంటె ప్రాచి యెత్తిన హస్తపల్లవాగ్ర మరసి' ఉదయించేడు ; తలపి వెన్నెలలోని ధావళ్యం, చీకటిచాయ మషీరసం, నెత్తమ్మి పువ్వుల పుప్పొడి హరిదశాలు, తొలిసంజ ధాతురాగం, కొదమ యెండకి వన్నె కూర్చేయి. లంకాద్రిపై సాగిన సూర్య రథం ఇలా వర్ణింపబడింది :

ఒకదీవి కొకకొండ యుదయాద్రి యై యుండు
నది యొండుదీవికి నస్తశిఖరి
యొకదీవిఁ దొలుసంజ యున్మేషమునఁ బొందు
నుదయించు మఱుసంజ యొండుదీవి
నొక దీవినిండు చంద్రికలు మిన్నులు ప్రాఁకు
నొక దీవిఁచే రెండయుబ్బి కాయు
నొకదీవి తవణిల్లు నొకఋతు ప్రారంభ
మొకదీవి నిగురొత్తు నొండుఋతువు

దక్షిణాయన మొకదీవి దశకుఁ జూపు
నుత్తరాయణ మొకదీవి నుప్పతిల్లు
నిన్నిటికి యత్ప్రభావంబు హేతుభూత
మట్టి రవితేరు సాఁగె లంకాద్రి మీఁద. [ప్ర.ఆ.ప. 129]

ఇందులో తూర్పుపడమరలు, తొలిమలిసంధ్యలు, రేబగళ్లు, వెన్నెల యెండ, వివిధ ఋతువులు, దక్షిణోత్తరాయణాలు, వెలుగునీడలు భూగోళాన్ని చలద్రూపంలో సాక్షాత్కరింప చేస్తున్నాయి. విశ్వానరుడు తపస్సమాధిలో నుండగా ప్రాతఃకాల వర్ణన చేయబడింది :

ప్రథమ సంధ్యాకాల బలిశంఖ నినదంబు
ప్రభవించె శ్రీవిశ్వవిభుని నగరఁ
గదిసె నంగుళి యుగ్మకం బంతరముగాఁగ
గగన గంగారథాంగ ద్వయంబు
నెఱయంగఁ గైసేసి నిలువుటద్దము చూచె
నవిముక్తమున విశాలాక్షి గౌరి
కొక్కొరొకోయని కుక్కుటంబులు మ్రోసెఁ
గడగి చతుష్కటకంబు నడుమఁ

బ్రహరిఁ దిరుగుట చాలించి భైరవుండు
గవని మొగసాల యరుఁగుపైఁ గన్నుమొగిచె
డుంఠి విఘ్నేశుఁ డొనర గండూష సేసి
యుమిసె వినువీధిఁ జంద్రకుండోదకములు. [తృ.ఆ.ప. 237]

పూరించటతోనూ, ఉపమానం ప్రయోగించి రద్దుచేస్తూ ఉపమేయాన్ని ప్రయోగించుటతోనూ, ఉపమాభాగంతో ప్రారంభించి ఉపమావాచకం ఉపయోగించుటతోనూ, ధాతుజ విశేషణంతో పాదాన్ని త్రుంచివేసి దానితోనే పెంచుట తోనూ, ప్రశ్నజవాబు రూపంతోనూ, మార్గదర్శిలా పాత్రధారి వర్తించుటతోనూ, రచన సాగింది. పద్యం యచ్ఛబ్దంతో 'ఏ పట్టణమునకు నెలదోఁట నందనా రామంబుఁ జైత్రరథవనంబు' అని ప్రారంభమై, తచ్ఛబ్దంతో 'యట్టి యలకా పురము నిధానాధివరము' అని పూరింపబడింది. అనన్వయ, ఉల్లేఖ, రూపక, స్వభావోక్తి మొదలగు అలంకారాలు, వైదర్భి, పాంచాలి, గౌడీయ, మాగధి మొదలగు రీతులు, ఈ కావ్యంలో ఉపయోగింపబడ్డాయి. యజ్ఞదత్తుడు సోమిదమ్మను కోపించిన ఘట్టం ధ్వనితోనూ, అగస్త్యాన్వేషణ ఘట్టం ఉక్తి వైచిత్రితోనూ రచింపబడ్డాయి. అల్లోనేరేడుదీవి, పంచబంగాళం మొదలైన జానుతెనుగు శబ్దాలూ; కన్నతల్లి, వెక్కివెక్కియేడ్చు మొదలైన జాతీయాలూ; అడుసు లోపల తాటిపండదిమినట్టు, ఉన్నవూరు కన్నతల్లియు నొక్కరూపు మొదలైన లోకోక్తులూ; ఇందులో ప్రయోగింపబడ్డాయి. ఇవన్నీ సంస్కృతాంధ్ర భాషా ప్రౌఢితో సమ్మేళనం పొంది శ్రీనాథునికి సర్వ స్వతంత్రమైన శైలిని కూర్చేయి.

కవివ్యక్తిత్వం : శ్రీనాథుడు "కాశీఖండాన్ని" ఇష్టదేవతా ప్రార్థనతో ప్రారంభించి, సంస్కృతాంధ్ర కవుల్ని స్తుతించి, కృతిపతి వంశాన్ని వర్ణించి, కథా ప్రారంభం చేసేడు. ఈ కావ్యం కొంత రాజమహేంద్రవర చరిత్రను, ఆనాటి రాజకీయ సాంఘిక పరిస్థితుల్ని విశదం చేస్తుంది. మయూరుడు, విశాఖదత్తుడు, భట్టమురారి మొదలగు పూర్వకవుల కవితాచర్వణ మిందులో వుంది. శ్రీనాథుడు, ఈశ్వరార్చన కళాశీలుడు; లింగప్రతిష్ఠలు, విభూతి రుద్రాక్షధారణ, శైవ మంత్రాలు, ఇందులో వివరించేడు. శివశర్మోపాఖ్యానంలో శివుడు విష్ణువుకి పట్టాభిషేకం చేసి, 'విష్ణుండ యే ననియును, నేన విష్ణుం డనియును, నాకు విష్ణునకు భేదంబు లేదనియును' పలకడం శ్రీనాథుని హరిహరాభేద తత్త్వాన్ని సూచిస్తుంది. అగస్త్యుని కాశీవియోగం, శ్రీనాథుని కొండవీడు వియోగానికి నిదర్శనం. అగస్త్యుడు దక్షిణాదికి వచ్చి వీరభద్రేశ్వరుని దర్శనంతో ప్రారంభించి శ్రీశైలం వరకు చేసిన చుట్టుతిరుగు తీర్థయాత్రాక్రమం, అగస్త్యుడు పలివెలలో కొప్పులింగేశ్వర ప్రతిష్ఠ చేసిన ఐతిహ్యం, శ్రీనాథుని ఆత్మీయతకు నిదర్శనాలు. వ్యాస నిష్కాసనంలో విశాలాక్షి వ్యాసునికి వడ్డించిన చతుర్విధాహారాలు శ్రీనాథుని భోజన ప్రియత్వాన్ని సూచిస్తాయి. అగస్త్యుడు గోదావరి తీరం వెంట ఆంధ్ర దేశానికి విచ్చేయడం శ్రీనాథుని ఆంధ్రదేశాభిమానానికి నిదర్శనం. శ్రీనాథుడు భారతీయ సంస్కృతి ప్రతిఫలించేటట్లు కావ్య పాత్రల్ని తెలుగుతనంతో

చిత్రించేడు. వింధ్యపర్వతం స్థావర జంగమ రూపాలు పొందడం, ధూతపాప ప్రస్తర నదీ రూపాలు పొందడం, ప్రకృతికి మానవప్రకృతికి అభేదాన్ని సూచించడానికి నిదర్శనాలు.

కాలస్వరూపుడైన పరమేశ్వరుని సంకల్ప రహస్యం "కాశీఖండం"లో విదిత మౌతోంది. ఇందులో గుణనిధికథ "పాండురంగ మాహాత్మ్యము" లోని నిగమశర్మ కథకు పురిటిల్లు వంటిది. ఇది శివపరమైంది : అది విష్ణుపరమైంది. శ్రీనాథుడు ప్రయోగాత్మకంగా చేసిన సీసపద్య రచన, ఆంగ్లంలో షేక్స్పియర్ ప్రయోగాత్మకంగా రచించిన 'సోనెట్స్'ను గుర్తుకి తెస్తుంది. అగస్త్యుని తీర్థయాత్రా క్రమం పరిశీలిస్తే జాన్ బనియన్ రచించిన "పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్" నవలలో కథానాయకుడు క్రిస్టియన్ చేసిన యాత్ర గుర్తుకొస్తుంది. శ్రీనాథుడు "కాశీఖండం" కావ్య నిర్మాణంలో ఖగోళ శాస్త్రాన్ని అత్యద్భుతంగా ఉపయోగించి రచించడం గమనిస్తే, ఆంగ్లంలో జాన్ మిల్టన్ ఖగోళ శాస్త్రాన్ని అత్యద్భుతంగా ఉపయోగించి రచించిన "పేరడైజ్ లాస్ట్" కావ్యం స్ఫురణకొస్తుంది. "కాశీఖండం"లో కాశీ క్షేత్రానికి, శైవమత తత్త్వానికి, ఎక్కువ ప్రాధాన్యం వుంది. ఆంగ్లంలో స్పర్జియన్ వచించిన 'రెలిజియస్ ఎండ్ డివోషనల్ మిస్టిసిజమ్' ఇందులో ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

"కాశీఖండం" శ్రీనాథుని కృతుల్లోనే కాదు ఆంధ్ర సాహిత్యంలోనే ఒక మహాగ్రంథ మని చెప్పవచ్చు. సంస్కృత కృతిలో కంటె ఆంధ్ర కృతిలో కవిత్వపు పాలు హెచ్చుగా వుంది. 'కాశీఖండ మయఃపిండం, నైషధం విద్వదౌషధమ్' అని నానుడి వుంది. అనగా "కాశీఖండం" ఇనుప గుగ్గిళ్ల వంటిది; "నైషధం" పండితులకు మందు వంటిది; అని అర్థం. ఈ విధంగా ప్రఖ్యాతి పొందిన రెండు కృతుల్ని మూలానికి మలాం వేసినట్లు అనువదించిన శ్రీనాథ మహాకవి ప్రజ్ఞ అసాధారణమైంది; ప్రశంసాపాత్రమైంది.

## కొన్ని పదాలకు అర్థాలు

అర్కుడు = సూర్యుడు
అవిముక్తము = కాశీక్షేత్రము
అస్తశిఖరి = సూర్యుడస్తమించు కొండ
ఆనందవనము = కాశీక్షేత్రము
ఇగురొత్తు = చిగురించు
ఉదయాద్రి = ఉదయపర్వతము
ఉన్మేషము = వికాసము

ఏడుగడ = రక్షకము
ఒనరిక = పొందిక
కుక్కుటాలు = కోళ్లు
కెంజేయి = ఎఱ్ఱటి చెయ్యి
గండూషము = పుక్కిలింత
గభస్తిబింబము = సూర్యబింబము
గవని = సింహద్వారం
గిరికూటము = కొండశిఖరము
గుణరత్నము = ప్రశస్తమైన రత్నము
ఘూర్ణిత = తిరుగుడుపడిన
జఠరము = కడుపు
జలౌఘము = నీటిసమూహము
తవణిల్లు = ప్రవర్తించు
తీర్ణము = దాటబడినది
తొలుసంజ = ప్రాతస్సంధ్య
దర్పోద్ధతులు = గర్వంతో అతిశయించిన వాళ్లు
దీవి = నీటినడిమి దిబ్బ
దుగ్ధాంబురాశి = పాలసముద్రము
ధురీణ = భారం వహించు
నినదము = ధ్వని
నిర్భరము = అధికమైన
నెఱయంగ = మిక్కిలిగ
పవళించుట = శయనించుట
పొడతేరగ = ఉదయించగ
ప్రకటము = ప్రసిద్ధము
ప్రతిశ్రుతము = అంగీకరించబడినది
ప్రాలేయము = హిమము
భవ్యమూర్తి = శుభమూర్తి
మండూకము = కప్ప
మందారము = మేఘావరణము
మధురసము = ద్రాక్షరసము
మఱుసంజ = సాయం సంధ్య
మిన్నులు = తళతళకాంతి
మొగసాల = నగరి తలవాకిట చావడి

మొగుచు = ముకుళించు
యుగ్మము = జత
రథాంగము = రథచక్రము
రవము = ధ్వని
వడపిందెలు = తాపం పోగొట్టునట్టి ఊరవేసిన మామిడిపిందెలు
వధశిల = చంపుట కుపయోగించు బాయి
విఘ్నాంధకారము = అంతరాయమను చీకటి
వినువీధి = ఆకాశవీధి
హుంకారము = హుమ్మని ధ్వనించు
హేతుభూతము = కారణమైనది.

## ఆధార గ్రంథాలు


1. "కాశీఖండము"—శ్రీనాధుడు (వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి, 1962)
2. "శృంగార శ్రీనాథము"—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు
3. "శ్రీనాథమహాకవి"—బండారు తమ్మయ్యగారు
4. "శ్రీనాథుని కవిత్వతత్త్వము"—కుందూరి ఈశ్వరదత్తుగారు
5. "శ్రీనాథకవితాసమీక్ష"—చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
6. "శ్రీనాథుని కవితా సామ్రాజ్యము"—గడియారం వేంకటశేషశాస్త్రి గారు
7. "శ్రీనాథకవి (జీవితము)"—చిలుకూరి వీరభద్రరావుగారు
8. "కావ్యపరీమళము"—విశ్వనాథ సత్యనారాయణగారు
9. "శ్రీనాథుడు"—డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారు
10. "ఈశ్వరార్చనకళాశీలుడు"—డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారు
11. "శ్రీనాథుని కవిత్వవైభవము"—జి.వి. సుబ్రహ్మణ్యంగారు
12. "సమగ్ర ఆంధ్రసాహిత్యము" (రెడ్డిరాజుల యుగం-4)—ఆరుద్ర గారు
13. "శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము"—డా. జంధ్యాల జయకృష్ణ బాపూజీగారు
14 "విజ్ఞాన సర్వస్వము" (సంపుటి 4)—మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు, et al
15. వివిధ పత్రికలలోని వ్యాసాలు.

# విక్రమార్క చరిత్రము—జక్కన

## సమీక్ష : కనమలూరు వెంకటశివయ్య

[ జన్మస్థలం : తిరుపతి, చిత్తూరుజిల్లా. జననం 1933. ఎం.ఏ. (మేథమెటిక్స్) మద్రాను యూనివర్సిటీ ; ఎల్.ఎల్.బి. (ఉస్మానియా యూనివర్సిటీ) ; ఎం.ఏ. (తెలుగు) యస్.వి. యూనివర్సిటీ, తిరుపతి. 'తెలుగు కవుల సంగీత వైదుష్యము' అనే విషయంపై, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి. పట్టమునకు పరిశోధన చేస్తున్నారు. ప్రకాశం జిల్లా డి.డి.ఓ. గా పనిచేస్తున్నారు. బిరుదము 'సాహితీవల్లభ' — ముద్రిత వ్యాసాలు — రాయలవారి వ్యవసాయాభిజ్ఞత, రాయలవారి సంగీత వైదుష్యము.) భట్టుమూర్తి వ్యవసాయాభిజ్ఞత, భట్టుమూర్తి సంగీత వైదుష్యము మొ. ]

### కవిజీవితాదులు :

"విక్రమార్క చరిత్రం" అను ఎనిమిది ఆశ్వాసాల కథా కావ్యాన్ని వ్రాసిన కవి జక్కన. ఇతడు నియోగి. ఇతని తల్లిదండ్రులు అక్కమాంబా అన్నయామాత్యులు ; తాత పెద్దయామాత్యుడు. ఇతనిది విద్వద్వంశం : ఇతని తాత పెద్దయామాత్యుడు సంస్కృత ప్రాకృత శౌర సేన్యాది భాషా కోవిదుడు ; శతకాలు, ప్రహసనాలు, గర్భకావ్యాలు, ప్రబంధాలు రచింపగల ప్రజ్ఞావంతుడు. జక్కన నెల్లూరు పరిసరాలలో క్రీ.శ. 1345 ప్రాంతంలో జన్మించాడట ! ఈ కావ్యాన్ని జక్కన పదిహేనవ శతాబ్ది ప్రథమ పాదాంతంలో రచించినట్లు తెలుస్తోంది. జక్కన శ్రీనాథునికి సమకాలికుడు. విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన రెండవ ప్రౌఢదేవరాయల కాలంలో మంత్రిగానూ, దండనాయకునిగానూ, ప్రఖ్యాతి పొందిన వెన్నెలకంటి సిద్ధనమంత్రి ఈ కావ్యానికి కృతిభర్త.

### కథాసంగ్రహం :

చంద్రగుప్తుడు అను పేరుగల బ్రాహ్మణ యువకుడు మధురానగర రాజపురోహితుని కుమార్తె శీలవతిని, రాజుగారి కుమార్తె రాగమంజరిని, కోశాధికారి కుమార్తె సుమతిని, దండనాథుని చెల్లెలు మదనరేఖను, శాస్త్రరీత్యా వివాహం చేసికొంటాడు. వారి ద్వారా క్రమంగా వరరుచి, విక్రమార్కుడు, భట్టి, భర్తృహరి అను పుత్రుల్ని పొందుతాడు. చంద్రగుప్తుడు మామగారి రాజ్యాన్ని పాలించి, క్షత్రియకాంతకు జన్మించిన విక్రమార్కునికి రాజ్య పట్టాభిషేకం చేస్తాడు.

విక్రమార్కుడు ఒకమారు వింధ్యపర్వత ప్రాంతాలకి వెళ్ళి, ఇరువురు రాక్షసుల కలహానికి కారణాలైన కంథని, మంత్రదండాన్ని, పావుకోళ్లని, రత్నపాత్రని చతురోపాయంతో పొందుతాడు. ఇవి మహిమలు గలవి : కంథని బోర్లిస్తే కనక రాసులు కురుస్తాయి ; మంత్రదండం త్రిప్పితే నగరాలు ఉద్భవిస్తాయి ; పావుకోళ్ళు కోరిన స్థలానికి గొనిపోతాయి ; రత్నపాత్ర పంచభక్ష్య పరమాన్నాలూ ప్రసాదిస్తుంది. చంద్రగుప్తుడు పావుకోళ్ళ సాహాయ్యంతో మేరు పర్వతం దక్షిణ దిక్కుకి ప్రయాణం చేసి, అక్కడ మంత్రదండం సాహాయ్యంతో చంద్రపురమనే నగరాన్ని నిర్మించి, పరిపాలిస్తాడు. విక్రమార్కుడు తనని దర్శిస్తే వేయి, వానితో సంభాషిస్తే పదివేలు, వానితో విందు భోజనం చేస్తే లక్ష, వానిని మెప్పిస్తే కోటి, ధనాన్ని దానం చేస్తుంటాడు.

ఒకమారు విక్రమార్కుడు బ్రహ్మలోకానికి వెళ్ళి నిజఫాలాగ్ర చర్మాన్ని కత్తితో చీల్చి, మంచివ్రాత వ్రాయమని, బ్రహ్మదేవుని అర్థిస్తాడు, బ్రహ్మ మెచ్చి బ్రహ్మాస్త్రాన్ని వరంగా ప్రసాదిస్తాడు. ఉజ్జయినికి వెళ్లి, విక్రమార్కుడు కాళికాలయంలో కొలనుపై వ్రేలాడుతున్న ఉట్టితాళ్ళు ఒక్క వ్రేటుతో తెగగొట్టి, దేవిని మెప్పించి వేయి సంవత్సరాల రాజ్య పదవిని, సాహసాంకుడు అనే బిరుదాన్ని పొందుతాడు. భట్టి చెప్పిన ఉపాయంతో వేయి సంవత్సరాలకి బదులు రెండు వేల సంవత్సరాలు విక్రమార్కుడు రాజ్యపాలన చేస్తాడు. ఇంద్రుని ఆహ్వానంపై ఇంద్రలోకానికి వెళ్లి, రంభాఊర్వశుల నృత్యాన్ని దర్శించి తరతమ భేదాలు తెల్పి, న్యాయ నిర్ణయం చేస్తాడు. దేవేంద్రుడు మెచ్చి ముప్పైరెండు బొమ్మలున్న దివ్య సింహాసనాన్ని విక్రమార్కునికి బహూకరిస్తాడు. ఒక బంగారు కమలం సాహాయ్యంతో విక్రమార్కుడు సూర్యలోకానికి వెళ్లి, సూర్యుని అనుగ్రహానికి పాత్రుడై, సువర్ణాన్ని ప్రసాదించే కుండలాల్ని పొందుతాడు. విక్రమార్కుడు పాతాళలోకానికి వెళ్లి, బలి చక్రవర్తిని మెప్పించి, రస రసాయనాలు అనబడే అమూల్య రత్నాల్ని పొందుతాడు. విక్రమార్కుడు మధురాపురం ప్రాంతంలోని బిల్వవాటిక చేరి, రాక్షసుల్ని జయించి, రాక్షసులచే పీడింపబడుచున్న దేవకాంతకు శాప విమోచనం చేస్తాడు.

విక్రమార్కుని సోదరుడు భర్తృహరి రాజు ఎల్లప్పుడూ మంత్రి ఆజ్ఞనే పాటించాలని, విక్రమార్కునికి బహుశ్రుతుడను మంత్రి కథను వివరిస్తాడు. విదర్భ రాజపుత్రి అనంగవతిని వివాహ మాడదలచి, శకవల్లభుడు విదర్భపై దండెత్తుతాడు. నారదుని ఉపదేశంతో విక్రమార్కుడు విదర్భ రాజుకు సాహాయ్యంచేసి, శకవల్లభుని ఓడించి, అనంగవతిని భార్యగా పొందుతాడు. విక్రమార్కుడు చిత్రకూటం వెళ్లి, ఒక మునీశ్వరుని కోరిక తీర్చడానికి, శిరస్సును దేవికి బలిచెయ్య బోతాడు. దేవి ప్రత్యక్షమై మునీశ్వరునికి వరాలిస్తుంది. తనకు అడవిలో సేవ

చేసిన బ్రాహ్మణుని విక్రమార్కుడు పురోహితునిగా గ్రహిస్తాడు. ఆ బ్రాహ్మణుడు తన కుమారుని చంపబోయినా విడిచిపెడతాడు. కంచిలో రాక్షసుని సంహరించి విక్రమార్కుడు నరమోహిని అనే వారకాంతను రక్షిస్తాడు ; నరభక్షణ చేసే రాక్షసునికి జ్ఞానోదయం కలిగిస్తాడు. ఒక సిద్ధుని ఉపదేశంతో, స్రష్టపురం రాజకుమార్తె కళావతి షరతుల ప్రకారం దీపస్తంభానికి, కర్పూర భరణికి, సువర్ణ కలశానికి, ప్రాణంపోసి కథలు చెప్పించి, ఆమెను మాట్లాడించి, విక్రమార్కుడు ఆమెను వివాహమాడతాడు.

వస్తుతత్త్వం :

"విక్రమార్కచరిత్రం" ప్రాచీనాంధ్ర కథాకావ్యం. ఇందులో ఎనిమిది ఆశ్వాసాలూ, 1519 గద్యపద్యాలూ ఉన్నాయి. సంస్కృతంలోని "విక్రమార్క చరిత్రం," "కథాసరిత్సాగరం" కావ్యాలలో కొన్ని కథలు దీనికి స్వల్పంగా మూలాలు కావచ్చును. కాని కవి తన కాలంలో, ఆంధ్రదేశంలో ప్రచారంలో గల విక్రమార్కుని కథల్ని కొన్నిటిని గ్రహించి, ఈ కావ్యాన్ని చాలమట్టుకు స్వతంత్ర కావ్యంగానే తీర్చిదిద్దేడు. ఈ కావ్య నామంలో 'చరిత్ర' అనే పదం విక్రమార్క మహారాజు జీవిత చరిత్రను సూచిస్తూంది. జక్కన చారిత్రక పురుషుడైన విక్రమార్కుని కథానాయకునిగా గ్రహించి ఈ కావ్యాన్ని కల్పించేడు. విక్రమార్కుని వల్లనే విక్రమార్క శకం ఏర్పడింది. ఇందులో విక్రమార్కుని సాహసౌదార్య పరాక్రమాది గుణాల్ని విదితం చేసే కథలు సమకూర్చ బడ్డాయి. అందుచే దీనికి వస్త్వైక్యం సమకూడింది. ఇది కథా కావ్యమైనా, ఇందులో అష్టాదశ వర్ణనలు చోటుచేసుకోవడంవల్ల, ప్రబంధ రచనకు మార్గదర్శకమైంది.

పాత్రచిత్రణ :

ఈ కథాకావ్యంలో పాత్ర వైవిధ్యముంది. ఇందులో సూర్యుడు, సముద్రుడు ప్రకృతి పాత్రలు ; వాలిసుగ్రీవులు వానర పాత్రలు ; నారదుడు, బ్రహ్మ, ఇంద్రుడు, బలి, కాళికాదేవి పురాణ ప్రసిద్ధాలైన పాత్రలు. విక్రమార్కుడు, భట్టి, భర్తృహరి, అనంగవతి, కళావతి కావ్యపాత్రలు. గుణ సంపత్తిచే లోకోత్తరుడైన విక్రమార్కుని కవి ఇలా కీర్తించేడు :

కనఁ గొనిన వేయి, మాటా
డినఁ బదివే, ల్నుడువ లక్ష, డెందము బ్రమదం
బునఁ బొందినఁ గోటి ధనం
బనయము నర్థులకు విక్రమార్కుం డొసఁగున్.

(ఆ. 2.19)

వర్ణనలు :

"విక్రమార్కచరిత్రం"లో అష్టాదశ వర్ణనలే గాక, సందర్భానుసారంగా సాధారణ వర్ణనలు కూడా ఉన్నాయి. మధుర, ఉజ్జయిని, అవంతి, కాంచి, విక్రమ సింహం అనే నగరాల వర్ణనలున్నాయి. సముద్ర వర్ణన, శ్రీశైల మేరుశైల వర్ణన ఉన్నాయి. వర్షఋతువు, శరదృతువు, వసంతఋతువు వర్ణనలున్నాయి. చంద్రోదయం, చంద్రికోదయం, సూర్యోదయం, సూర్యాస్తమయం, అంధకారం వర్ణింపబడ్డాయి. ఉద్యానవిహారం, జలవిహారం, మధుపానం, రథోత్సం, విర హం, వివాహం, సుతోదయం, మంత్రాలోచనం, దౌత్యం, యుద్ధయాత్ర, యుద్ధం, నాయకాభ్యుదయం మొదలైన వర్ణనలున్నాయి. ఇంకా స్త్రీ, రాజ, వరాహ, నాట్య, అశ్వమేధయాగ, వాయు, కుక్కుటరవ, యోగినీ, శుక, భోజన, రోదన, పుణ్యతీర్థక్షేత్ర, దేవతా వర్ణనలున్నాయి. జక్కన వర్షఋతువులో ఏకాగ్రంగా పడిన వర్షాన్ని ఇలా వర్ణించేడు :

దళితానంత దిగంతమై ఘుమఘుమ ధ్వానంబు సంధిల్లగాఁ
గలయం బాములఁ్రవేలఁ గట్టినటు, లుగ్రవ్యగ్ర లీల న్నిర
ర్గళ ధారాళ కరాళమై కురిసె వర్షంబెందు నేయింటి వా
రలుఁ బొర్గింటికి నేఁగ కుండఁగ నహోరాత్రంబుఁ జిత్రంబుగన్.

(ఆ. 4.32)

జక్కన మేరుశైలాన్ని సంస్కృత పదాలతో వర్ణించేడు :

కనియె నతండు శంకరశిఖా శశి రంజిత చంద్రకాంత సం
జనిత జలార్ద్ర కల్పతరు జాలముఁ గిన్నెర కన్యకా ప్రమో
దన మణిశృంగ సంగత లతావన జాలము దివ్య వాహినీ
వనజ వనీతల ద్రుహిణ వాహ మరాళము మేరుశైలమున్.

(ఆ. 2.13)

ఇందులో మేరు పర్వతం గొప్పదనం, గంభీరత్వం విదితమౌతున్నాయి. జక్కన ఒక తపసిని చిత్రకారుడు చిత్రాన్ని చిత్రించినట్లుగా ఇలా వర్ణించేడు :

అచ్చవెన్నెల మించు నపహసించు విభూతి
యంగరాగంబుగా నలవరించి
యాగమోచితముగా నవయవంబుల యందు
లలిత రుద్రాక్ష భూషలు వహించి
హొంబట్టు పుట్టంబు పొట్ట నందంబుగా
ఘన జటాజూటంబు గలయఁ బొదివి
యడుఁగుఁ గెందమ్ముల బెడఁగు రెట్టింపఁగా
గాంచనమణి పాదుకములు దొడిగి

జమిలి మొలత్రాట నినుపకచ్చడ మమర్చి
కక్కపాలయుఁ గక్షభాగమునఁ బూని
తరుణ శశిమౌళి యపరావతార మనఁగ
ధరణిపతి పాలికేతెంచెఁ దపసి యొకఁడు.

(ఆ. 2.97)

శ్రీనాథునివలె జక్కన కూడ భోజన పదార్థాల్ని వర్ణించేడు :

మించు కన్నులు గోరగించు రాజాన్నంబు
నుపమింపరాని సద్యోఘృతంబు
నమృతోపమానంబులగు పిండివంటలు
నుజ్జ్వలంబై యొప్పు నౌలుపుఁ బప్పు
మదికింపుఁ బెంచు కమ్మని పదార్థంబులు
బహుపాక రుచులైన పాయసములుఁ
దగు వాసనా వాసితములైన పచ్చళ్ళు
వడియఁ గట్టిన యానవాల పెరుఁగు

సరస మధుర రసావళి సముదయములు
పంచసార సమంచిత పానకములుఁ
గమ్మకస్తురి నెత్తావిఁ గైపు చేసి
యూరుఁ గాయలుఁ జల్లని యుదకములును.

(ఆ. 4.188)

చతుర్విధాహారాలు ఇందులో వివరింపబడ్డాయి.

రసం :

"విక్రమార్క చరిత్రం" లో కథలన్నీ అద్భుతాన్ని కలిగిస్తాయి. అందుచే ఇందులో అంగిరసం అద్భుతరసం. కథానాయకుడైన విక్రమార్కుని సాహస కృత్యాలు వర్ణింపబడ్డంచే, వీర శృంగార రసాలు అంగరసా లయ్యేయి. విక్ర మార్కుడు రాక్షసులతోను, సిద్ధపుర రాజుతోను, యుద్ధంచేసిన ఘట్టాలు, వీర రస పోషణకు నిదర్శనాలు. విక్రమార్కుడు భార్యతో పుర ప్రవేశం చేసిన ఘట్టం, అనంగవతీ విక్రమార్కుల ప్రమదావన విహారం, లీలాశైలారోహణం, డోలా రోహణం, పుష్పాపచయం, జలకేళి మొదలైన ఘట్టాలు, శృంగార రసపోషణకు నిదర్శనాలు. విక్రమార్కుడు శకమహీకాంతునితో చేసిన యుద్ధాన్ని జక్కన ఇలా వర్ణించేడు :

మెఱుఁగులు గ్రమ్మెడు మేఘాస్త్ర మేసినఁ
బవన బాణంబునఁ బరిహరించె
విషము లుమియు కాద్రవేయాస్త్ర మేసిన
గరుడ బాణంబున గర్వ మణఁచె
సమధికోన్నతమైన శైలాస్త్ర మేసిన
నింద్ర బాణంబున నేపు మాపె
దృష్టినిరోధంబైన తిమిరాస్త్ర మేసిన
నరుణ బాణంబున విరియఁ జేసె

నిత్తెఱంగున శకధారణీశ దివ్య
శర పరంపరఁ బ్రతిబాణ సమితి నణఁచి
యడరి పుంఖానుపుంఖ నానాస్త్ర శస్త్ర
వితతి నందంద యతనిపై వెల్లిగొలిపె.

(ఆ. 4. 117)

ఇందులో ఇరుతెగల యుద్ధ తంత్రాలూ, వివిధాస్త్రాలూ, వాటి పరిహారాలూ వ్యక్త మౌతున్నాయి.

శైలి :

జక్కన సంస్కృతాంధ్ర భాషలలో వైదుష్యం గలవాడు. ఇతడు వచించిన 'భజత భవ భుజఙ్గం, పాణిహేలా కురఙ్గం' అనే విరూపాక్షస్తుతి సంస్కృత భాషా పాండిత్యానికి తార్కాణం. ఇతని సీసపద్య రచన నూతనత్వంతో సాగింది. మొదటి పాదం ఏ విధంగా నడిస్తే తక్కిన సీసపద్య పాదాలు అదే విధంగా నడుస్తాయి. ఒకక్త్వార్థకం, దానిపై అనంతర్యార్థకం, దానిపై సమాపక క్రియతో రచించడం, ఆరు ఇంద్రగణాల వరకు ఒకసమాసం, దానిపై రెండు సూర్యగణాలకు రెండు తెలుగు పదాలు కూర్చి రచించడం జక్కన ప్రత్యేకతలు. జక్కన సీసపద్యంలో, మొదటి పాదం సంస్కృత భూయిష్ఠంగా నడిస్తే, తక్కినవి కూడా అలాగే ఉంటాయి :

ఉల్లోల సురధునీ కల్లోల మాలికా
ప్రతిభట ధ్వజపట ప్రాభవంబు
నానా మహాసౌధ నవసుధా చంద్రికా
ధగధగాయిత నభోదర్పణంబు
ఖేచర దంపతి లోచనానందన
వందన మాలికా వైభవంబు
ప్రాకార కీలిత బహురత్న దీపికా
విహిత విక్రమ దిశా విలసనంబు

వివిధ శృంగార వన మహీ విహరమాణ
మంద పవమాన వలమాన మానితంబు
రమణ రమణీ సమాకీర్ణ రాజమాన
భరిత విభవంబు పంచకపుర వరంబు

(ఆ. 7.7)

జక్కన కంద పద్యాలలో ద్విప్రాస, త్రిప్రాస, చతుప్ప్రాస ఉపయోగించేడు. శబ్దార్థాలంకారాలు ఇతని కవిత్వంలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. అనుప్రాస, అంత్యానుప్రాసలే గాక శ్లేష, యమకాలు సహజంగా ఇతని కవితలో చోటుచేసుకున్నాయి. ఎంతటి భావాన్నైనా ఒక చిన్నపద్యంలో కూర్పగల ప్రతిభాశాలి జక్కన. వాలాయించి, గాదము, కంచులి, మజా, కోడిగీలు మొదలైన ప్రత్యేక పదజాలం; కరతలామలకంగా, పగలుబాటు, కాలుద్రవ్వు మొదలైన పలుకుబళ్లు; ముందట నుయ్యి వెన్క లోతగు గొయ్యి, జడ విడిచి వదురు పట్టుట, తెడ్డునాకి యుపవాసము మాన్పికొనంగ మొదలైన తెలుగు సామెతలు; అహింసా పరమో ధర్మయనంగ, ధర్మస్య త్వరితాగతి, సర్వం విష్ణుమయం జగత్ మొదలైన సంస్కృతం సామెతలు; జక్కనకు ప్రత్యేకమైన శైలిని చేకూర్చేయి.

వ్యక్తిత్వం :

ఇష్టదేవతా ప్రార్థన, సంస్కృత కవిస్తుతి, కవిత్రయ ప్రశంస, కుకవి నిరసన, కృతికర్త సభావర్ణన, కవివంశ ప్రశంస, జక్కన కవితాప్రశస్తి, కావ్యకరణ హేతువు, కృతిపతి వంశ శంసనం మొదలైన అంశాలతో ఈ కావ్యం ప్రారంభింపబడింది. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నన్నెచోడుడు, నాచన సోమన, హుళక్కి భాస్కరుడు మొదలగువారి పోకడలు జక్కన కవిత్వంలో గోచరిస్తాయి. శ్రీనాథుడు, పెద్దన, చేమకూర వేంకటకవి, జక్కన ప్రభావానికి లోనయ్యేరు. జ్యోతిశ్శాస్త్రం, యోగశాస్త్రం, గణితశాస్త్రం ఈ కావ్యంలో వివరింపబడ్డాయి. విక్రమార్కుడు జన్మింపగా 'దిన కృద్వాసర చైత్రశుద్ధ నవమిం దిష్యం దృతీయాంశ సంజననం' బొందెనని వర్ణించడం, జక్కన జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానానికి నిదర్శనం. అశ్వమేధయాగ వర్ణన జక్కన యాగ విధాన పరిజ్ఞానానికి నిదర్శనం. జక్కన రాజనీతిని ప్రతిపాదిస్తూ 'జనపతులకు పాపాత్ముల ధన మెమ్మెయినైన గొనుట ధర్మంబు' అన్నాడు. రాజ్య నిర్వహణకు మంత్రి అవసరమని జక్కన లోకజ్ఞతని ప్రకటిస్తాడు. రాజు సప్తాంగాల్ని రక్షించాలని, సప్తోపాయాల్ని ప్రయోగించాలని, సప్త వ్యసనాలకి లోను కాకూడదని జక్కన వివరిస్తాడు. శ్రీశైలం, మధుర, కాశి, అహోబిలం, సిద్ధవట్టణం, కాళహస్తి, తిరుపతి, కంచి, శ్రీరంగం,

కుంభకోణం, రామేశ్వరం మొదలైన పుణ్యక్షేత్రాల వర్ణన జక్కన ఆత్మీయతకు నిదర్శనం.

సరస కథలకూ, పలురకాల చమత్కారాలకూ, ప్రౌఢ ప్రయోగాలకూ, గడుసు పోకడలకూ, నికరమైన నీతులకూ, రుచిరమైన రచనకూ, సంగమక్షేత్రం; తెలుగు కథానక కావ్యాల్లో మణిపూస; జక్కన "విక్రమార్క చరిత్రం."

## కొన్ని పదాలకు అర్థాలు

అంగరాగము = చందనాదులపూత
అర్థులు = కోరుకొన్నవారు
అహోరాత్రము = రేపగలు
ఉపమించుట = పోల్చుట
ఉల్లోలము = పెద్దఅల
కక్కపాల = సన్యాసులజోలె
కచ్చడము = కౌపీనము
కరాళము = వెరపు పుట్టించునది
కల్పతరువు = కోరిన విచ్చెడు దేవవృక్షం
కెందమ్మి = ఎఱ్ఱదామర
ఖేచరులు = ఆకాశంలో సంచరించువారు
చంద్రకాంతము = చలువరాయి
దళితము = ఖండింపబడినది
దిగంతము = దిక్కులు అంతమందు గలది (భూమి)
ద్రుహిణుడు = బ్రహ్మ
ధ్వానము = ధ్వని
నిరర్గళము = అడ్డులేనిది
పవమానుడు = వాయువు
పొదివి = క్రమ్మి
ప్రతిభటుడు = శత్రువు
మరాళము = హంస
మానితము = మన్నింపబడినది
రంజితము = రంజింపబడినది
వనజము = నీటిలోపుట్టినది
వలమానము = చలించుచున్నది
వాహము = గుఱ్ఱం, ఎద్దు

విలసనము = ప్రకాశము
విహితము = విధింపబడినది
శృంగము = కొండకొమ్ము
సంగతము = చేరిక
సమాకీర్ణ = సమంగా కప్పబడింది
సురధుని = గంగానది.

## ఆధారగ్రంథాలు


1. విక్రమార్క చరిత్రము — జక్కనకవి, ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు – 4, జనవరి, 1968.
2. సమగ్ర ఆంధ్ర సాహిత్యం — (గజపతులయుగం) ఆరుద్ర
3. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర — దివాకర్ల వేంకటావధాని
4. విజ్ఞాన సర్వస్వము (4వ సంపుటం).

# భోజరాజీయము — అనంతామాత్యుడు

సమీక్ష : డాక్టర్ బి. అరుణ కుమారి

[ జన్మస్థలం : పర్లాకిమిడి, ఉత్కళదేశం. జననం 4–1–1945. ఎం.ఏ., పిహెచ్.డి. ఉద్యోగం – తెలుగు వ్యుత్పత్తికోశ పథకం, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు. ముద్రిత కృతులు – ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు (17 వ శతాబ్దము వరకు) ; ఒరియా కథా మాల (ఒరియా నుండి తెలుగులోనికి అనువాదం) ఉదయనోదయ కావ్య సంపాదకత్వం. 'అరుణబాల' అన్న కలం పేరుతో కొన్ని పత్రికలలో పరిశోధనా వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. రేడియో ప్రసంగాలు చేశారు. డి.లిట్. కోసం పరిశోధన సాగిస్తున్నారు. ]

కవిజీవిత విశేషాలు :

కృష్ణామండల నివాసి అయిన అనంతామాత్యుడు క్రీ.శ. 15 వ శతాబ్దపు మొదటి భాగంలో నివసించాడు. ఇతనికి అనంతుడు, అనంతామాత్యుడు అనే రెండు పేర్లు వ్యవహారంలో ఉన్నాయి. ఇతనితండ్రి తిక్కనామాత్యుడు, తల్లి మల్లాంబిక. తోబుట్టువులారుగురు. గురుదేవతా భక్తి తత్పరుడైన అనంతామాత్యుడు అహోబల నరసింహ భక్తుడు. ఇతడు భోజరాజీయము, రసాభరణము, ఛందోదర్పణము అనే గ్రంథాలు భగవదర్పితాలుగా రచించాడు.

భోజరాజీయము రెండువేలతొంభైరెండు పద్యాలతో ఉన్న ఏడాశ్వాసాల పద్యప్రబంధం. ఇందులో ముఖ్యమైన మూడు పెద్ద కథలు, ఆ కథల్లో చిన్న కథలు, ఆ కథలకి ఉపకథలు దారానికి కూర్చిన రకరకాలైన పుష్పాల్లాగ సూత్ర కథ చుట్టూ అల్లుకొని కావ్య రూపంలో శోభిల్లుతున్నాయి.

కథోపకథాత్మకమైన ఈ భోజరాజీయం వింతవింత కథలతో విరాజిల్లుతున్న మంచి కథా కావ్యం. పైశాచీ ప్రాకృతంలోని బృహత్కథ మన దేశభాషల్లోని మొదటి కథాకావ్యం. దీనిని ఆధారంగా చేసికొని తదితర భాషల్లో చాలా కథా కావ్యాలు ఉద్భవించాయి. తెలుగులో కూడ దశకుమార, కేయూరబాహు, విక్రమార్క చరిత్రాది కథా కావ్యాలున్నప్పటికీ స్వతంత్ర కల్పనతో విరాజిల్లిన మొట్ట మొదటి స్వతంత్ర కావ్యం భోజరాజీయం అనటం అతిశయోక్తి కాదు.

కథా సంగ్రహం :

ఈ కావ్యం లాటదేశాధీశుడైన మహునికి దత్తాత్రేయుడు ప్రయాగాది క్షేత్రమాహాత్మ్యాలను చెప్తూ భోజవృత్తాంతం వివరించటంతో ప్రారంభమై, భోజ సర్పటుల నడుమ అనేక కథలతో నడచి, భోజునకు అభినవ భోజుడుదయించి, తన వంశాన్ని విస్తరింప చేయటంతో అంతమౌతోంది. నిరాహారి సదాబ్రహ్మచారుల మహిమ, చెప్పుగూడతో పాయసంతోడి ఆతిధ్య మిచ్చిన ఫలితం, ఇంద్రుడు చెప్పిన మంటిముద్ద యోగికి పెట్టడం వలన కలిగే ఫలితం కథ, తినగా మిగిలిన అన్నం పెట్టిన ఫలితంగా చండాల దంపతులుగా పుట్టిన వైనం, పుష్పగంధి చరిత్ర, ఎలుక కథ, విప్రప్రభావం, రత్నమండనుడు బ్రహ్మరాక్షసునికి చెప్పిన గోవ్యాఘ్ర సంవాదం, పులి ఆవుకు చెప్పిన చాకిత చెరచగా తపోమహిమ తగ్గి పందిగా పుట్టిన యోగివివరం, ఆవు చెప్పిన మదనరేఖ పావకలోముల వృత్తాంతం, తండ్రి చెల్లెలి కొడుకును, తల్లి అన్న కొడుకును కాక పిచ్చుకుంటును పెండ్లాడిన రాజకుమార్తె కథ, అన్నదానం చేసే మరదిని వదినలు వేరింట కాపురం పెట్టించిన వైనం, అల్పాశనం పెడితే వచ్చే అనర్థం, విష్ణువు పరీక్షిస్తే ఇసుకను చెరిగి వండిపెట్టిన స్త్రీ వైనం, అన్నదాన ఫలితం, వంజరోపాఖ్యానం ఈ గ్రంథంలో చోటు చేసుకున్నాయి. 'ధర్మో రక్షతి రక్షితః' అనే ఆర్యోక్తి ప్రకారం ఈ కథలన్నింటిలో ధర్మపరిపాలన మహిమ ప్రతి కథకి మకుటంగానో ఫలశ్రుతిగానో నిబంధింపబడి ఉంది. ఈ కథలన్నీ మానవ జీవన ధర్మ ప్రబోధకాలు.

> సూత్ర కథ భోజరాజ చ
> రిత్రమ యానడుమ ధర్మరీతులు నీతుల్
> చిత్ర కథలైతలిర్పఁగ
> శ్రోత్ర సుఖముగా నొనర్పఁ జొప్పడి యుండున్.

(భో.రా. 1–86)

అని అనంతయ తన కథా ప్రణాళికను వివరించాడు.

ఈ సూత్ర కథానాయకుడైన భోజరాజు చారిత్రక పురుషుడు. క్రీ.శ. 1000–1055 సంవత్సరాల నడుమ మాళవదేశాన్ని పరిపాలించాడు. ఇతడు మహాకవి, కవి పండిత పోషకుడుగా, భోజకాళిదాస కథలు, భోజుని ముఖం చూడగానే కవిత్వమబ్బుతుందనే గాథలు అనేకం మనదేశంలో ప్రచారంలో ఉన్నాయి. సరస్వతీ కంఠాభరణం (అలంకార శాస్త్రం) యుక్తి కల్పతరువు (న్యాయ శాస్త్రం) నామమాలిక (సంకలన గ్రంథం) మొదలైన ఇరవైమూడు గ్రంథాలు రచించిన గొప్ప కవి. భోజుడు విశ్వవిద్యాలయాలు స్థాపించాడు. పారమార శిల్పం పరమావధికి చేరిన సరస్వతీ మందిరం నిర్మింప చేసి అందులో

వాగ్దేవతా విగ్రహాన్ని ప్రతిష్ఠింపచేసాడు.[1] సారస్వత సామ్రాజ్య స్థాపకుడై యశశ్శాలి అయి, అమరత్వాన్ని పొందిన భోజుని గూర్చిన వివరాలు ఈ గ్రంథంలో అత్యల్పాలు. కథానాయకునిగా ఆయన జన్మ వృత్తాంతము, కొన్ని గుణగణాలు, దినచర్య మొదలైన కొద్ది అంశాలు మాత్రమే ఉన్నాయి.

ప్రస్తావనగా లాట దేశాధీశుడైన మహునితో ప్రారంభమైన ఈ గ్రంథం లోని కథలన్నీ చెప్పుకోవడానికి వీలులేదు కాబట్టి ముఖ్యమైన మహుని కథ, భోజుని చరిత్ర, పుష్పగంధి వృత్తాంతం, ఆవు కథ, మదన రేఖాసుశీల ఉదంతాలు ముచ్చటగా తెలుసుకుందాం.

పురాకృత పాపంతో మహుడనే రాజు కుష్ఠరోగ పీడితుడై గౌతమిలో పడి శరీర త్యాగం చేయాలని పోగా, ఆ నది అది భరించ లేక స్త్రీ రూపంలో వచ్చి దత్తాత్రేయ మహర్షిని సేవించి రోగనివారణ పొంద మంటుంది. మహుడా విధంగా చేసి ఆరోగ్యవంతు డౌతాడు. మహుని కోరికపై దత్తాత్రేయుడు భోజ వృత్తాంతం వివరించాడు.

భోజుడు తన పూర్వ జన్మలో దరిద్ర బ్రాహ్మణుడు. ఆ దారిద్ర్య బాధ కోర్వలేక తీర్థయాత్రలు చేస్తూ ప్రయాగ చేరుకున్నాడు. అక్కడ నలుగురు స్త్రీలు రాబోయే జన్మలో సిద్ధింప వలసిన తమ మగల లక్షణాలను వర్ణించి, సంకల్పం చేసి ప్రాణ త్యాగం చేసారు. అది చూసిన బ్రాహ్మణుడు తానా స్త్రీలకు మగనిగా జన్మించాలని సంకల్పం చేసి ప్రాణ త్యాగం చేసి మరు జన్మలో భోజుడై పుట్టి, సుగంధి, పద్మగంధి, కనకవతి, చంద్రప్రభ అనే పేర్లతో రాజ కన్యలుగా పుట్టిన ఆ నలుగురు స్త్రీలను వివాహం చేసుకొని లాటదేశంలో ధారానగరాధి పతి అయ్యాడు. అతడు రాజ్యం చేస్తూ ఒకరోజు వేటకి వెళ్ళి అక్కడ సర్పటి అనే సిద్ధుని చూచి అతనిని అతిధిగా తన రాజ్యానికి తీసుక వస్తాడు. ఒకనాడు సర్పటి భోజుని కొలువుచవికను స్వర్ణమయంగా మార్చి వెళ్ళిపోయాడు. భోజుడు సర్పటికి ధూమ వేదివిద్య తెలుసని గ్రహించి కపటోపాయంతో సర్పటిని మరల తన రాజ్యానికి రప్పించి ధూమవేది విద్యను గ్రహించాడు. మోసం తెలిసి శపించిన సర్పటి చివరకు రాజును క్షమించాడు. వారిద్దరి ప్రసంగంలో వచ్చిన కథలే భోజరాజీయంలోని కథా సముచ్చయం.

కళింగ దేశంలో పుండరీక పురాధిపతికి దుష్టగ్రహ కూటంలో పుష్పగంధి జన్మించింది. ఆమెను పరిణయమాడిన వ్యక్తి బ్రహ్మరాక్షసుని పాలపడతాడని పండితులు చెప్తారు. మాళవ రాజకుమారుడు రత్నమండనుడు ఈ విషయం

1. Struggle for Empire, pp. 312, 317, 658 Bharateeya Vidya Bhavan

తెలిసి ఆమెనే కోరి వివాహం చేసుకుని ఒకనాడు బ్రహ్మరాక్షసుని వాత పడతాడు. రత్నమండనుడు మరణించే ముందు ఒకమారు ఇంటికి వెళ్ళివస్తానని అర్థించి, బ్రహ్మరాక్షసుని నమ్మించడానికి సత్యవాక్య పరిపాలనవల్ల కలిగే ఫలితాలను తెలిపే కథలను వినిపించి, రాక్షసుని మెప్పించి ఇంటికి వెళ్ళిమరలి వస్తాడు. అతని భార్య పుష్పగంధి బుద్ధి కుశలతతో భర్తను రక్షించు కుంటుంది.

ఒక ఊళ్లో ఒక బ్రాహ్మణుడున్నాడు. అతనికో ఆవుంది. అది మేతకు వెళ్లి పులికంట పడుతుంది, ఆవు, తనకు చిన్నదూడ ఉందని, చివరిసారి దానికి పాలు కుడిపి వస్తానని పులిని అర్థించి, పులిని నమ్మించ డానికి కొన్ని కథలు చెప్పి, ఇంటికి వచ్చి పిల్లకు పాలిచ్చి, బుద్ధులు గరపి మరలివస్తుంది. పులి ఆవు సత్యవాక్య పరిపాలనకు మెచ్చి విడిచిపెడుతుంది. అప్పుడు విష్ణువు ప్రత్యక్షమై రెండింటికి దివ్యలోకాన్ని ప్రసాదిస్తాడు.

మదనరేఖ మగధరాజు కూతురు. ఆమెను గురుపుత్రుడు కామించాడు. ఆమె తన వివాహం కాగానే మొదటి రాత్రి తన దగ్గరకు వస్తానని గురుపుత్రునికి మాట ఇస్తుంది. ఆమెకు తంత్రి అనే రాజుతో వివాహ మౌతుంది. భర్తతో జరిగిన విషయాలు వివరించి గురుపుత్రుని వద్దకు బయలుదేరి త్రోవలో బ్రహ్మ రాక్షసుని పాల పడుతుంది. మదనరేఖ రాక్షసునితో తను వెళ్లబోయే విషయాన్ని వివరించి, మరలివస్తానని మాట ఇచ్చి గురుపుత్రుని వద్దకు వెళ్తుంది. తన తప్పు తెలుసుకుని గురుపుత్రుడామెను ఆశీర్వదించి పంపుతాడు. బ్రహ్మరాక్షసుడు కూడ ఆమె సత్యనిష్ఠకు మెచ్చి ఆమె పాదాలపై పడతాడు. విష్ణుమూర్తి వారందరికీ వరాలిస్తాడు.

తలిదండ్రులు అనుకున్న విధంగా కాక పిచ్చుకుంటును వివాహం చేసు కుంటుంది సౌవీరాధిపతి కుమార్తె సుశీల. ఈ కథ విధి కృతాన్ని తప్పించ లేము అన్న అంశాన్ని ఋజువు పరుస్తోంది. ఇలాంటి కథలే కావ్యంలో ఇరవై ఉన్నాయి.

పాత్రచిత్రణ :

ఉత్తమ కావ్యానికి ఔచిత్య ప్రదర్శన, వర్ణనా సౌలభ్యం, సంభాషణా చాతురి, సంవిధానసరళి, ఉదాత్త పాత్ర చిత్రణ తగు పాళ్లలో ఉండాలి. కథకు తగిన విధంగా ఆ ఆ అంశాలను చొప్పించి కావ్యాన్ని సుంద రంగా మలచటం కష్టం. ముఖ్యంగా పాత్రచిత్రణ అందరూ చేయలేరు. ఆకార చేష్టా స్వభావాదుల్ని కళ్లముందు కదలాడినట్లు పాత్రలకు ప్రాణ ప్రతిష్ఠ చేసి పాఠకులను మెప్పించే నేర్పు తిక్కనది. కావ్యశిల్ప నిర్మాణంలో అనంతునకు పరోక్ష గురువైన తిక్కన వేర్పే పాత్రపోషణ కూడ అనంతునకు అలవడింది.

బోఁడి, యనఁగ నత్యంత సౌకుమార్యమునఁ జేర్చి, చిత్తమున కింపునింపు నచ్చెలువఁ జూచి, నయిన కర సంజ్ఞ నానరనాథ తనయు...." [ 4-256 ] డాహ్వానించే టట్టు చేసిందట.

వర్ణనలు : అనంతుడు రసభంగంకాకుండా తగిన విధంగా అష్టాదశ వర్ణనలు చేసి కృతార్థత పొందాడు. ఎలాంటి వర్ణనైనా స్వాభావికంగా, సహజ సుందరంగా, కావ్యానికి అందాన్ని చేకూర్చే విధంగా చేయటం అనంతుని వైశిష్ట్యం. ఈతని వర్ణనలు సంక్షిప్తాలై అప్రయత్నంగా హృదయాన్ని ఆకర్షించి ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. ప్రకృతిని వర్ణించి నప్పుడు, బాహ్య ప్రపంచాన్ని దర్శించినప్పుడు, అనంతుని చక్షువు సూక్ష్మాతి సూక్ష్మ వివరాలను కూడ తన మనోనయనాలతో దర్శించి యథాతథంగా పునఃసృష్టి చేయ గలదు. గంగా యమునల సంగమ వర్ణన, ధారానగర, వటవృక్ష వర్ణనలు, భోజరాజాది పాత్రల వర్ణన, బ్రహ్మరాక్షసుని వర్ణన, ప్రకృతి వర్ణన అది ఇది అని ఏమి అనంతుని ప్రతి వర్ణన, ఈతని నిశిత పరిశీలనకు, భావనా పటిమకు వర్ణనా కౌశలానికి దృష్టాంతాలు.

> 'జక్కవలలరఁ జకోరము
> లుక్కఱఁ గమలములు విరియ నొగిఁగై రవముల్
> స్రుక్క సమస్త జనంబులు
> మ్రొక్క దిశలు వెలుఁగ భాస్కరుఁడు పొడతెంచెన్.' [1–132]

అంటూ సూర్యోదయ వర్ణన ఎంత రామణీయకంగా వర్ణించగలిగాడో, అత్యల్ప విషయాలను కూడా అంతందంగాను, లలితంగాను చెప్పగలగడం అనంతుని ప్రత్యేకత. మూషిక వనిత వృత్తాంతంలోని చిన్ని ఎలుక వర్ణన గోవత్స సంభాషణ ఇతని ప్రతిభకు సాక్షీభూతాలు. ఈతని ప్రతి వర్ణనలోను కవి యొక్క క్రాంత దర్శిత్వం వ్యక్తమౌతుంది. కాళిదాసాదులలాగ స్వభావోక్తి సుందరంగా, అందమైన ఉపమానాలతో నిండి ఉంటాయి అనంతుని వర్ణనలు. నీతి వర్ణన కావ్యమంతటా అద్భుతంగా విరాజిల్లింది.

> "ఆడకుమసత్య భాషలు
> కూడకు గొఱగాని వానిఁగొంకక యొరు లె
> గ్గాడిన నెదురుత్తర మీఁ
> జూడకువిని వినవివాని బొప్పున జనుమీ." [6–31]

అని అలతి అలతిపదాలతో లలితంగా చెప్పగలగడం అనంతునికే అలవడిందనటం అతిశయోక్తికాదు.

రసపోషణ : భోజరాజీయ మంతటా అనంతుడు తగు విధంగా రసపోషణ చేసాడు. ఈ కావ్యంలోని ప్రధాన రసం అద్భుతం. కథలన్నీ అభూత కల్పనలతో నిండి చదువుతున్నంతసేపు ఉత్కంఠను కలుగచేస్తాయి. అద్భుత రసానికి అంగాలుగా తక్కిన రసాలను అభివర్ణించి కృతకృత్యుడయ్యాడు అనంతుడు. పుష్పగంధి రత్నమండనుల సమాగమ సన్నివేశంలో శృంగారం, బ్రహ్మరాక్షసుని ప్రవేశపెట్టినప్పుడు బీభత్స భయానకాలు, గోవు వత్సాన్ని విడచివచ్చినపుడు కరుణ, పావకలోమ రాక్షసుల యుద్ధ సందర్భంలో రౌద్రం తగిన విధంగా పోషింపబడ్డాయి.

శైలి : ఉత్తమ శైలీ లక్షణాలైన అర్థ సౌలభ్యం, గాన మాధుర్యం, నవరసోచిత పదప్రయోగం, సహజగాంభీర్యం, మార్దవం, ఔపదేశిక సంపద భోజరాజీయ కావ్యమంతటా వెల్లి విరుస్తూ కావ్యానికి వైశిష్ట్యాన్ని చేకూర్చాయి. సునిశితగాన మాధుర్యానికి "ఆలోల మందానిలాధూత లత మాడ్కి నినుగాంచి హర్షకంపనముతోడ, రతిపుఁబుష్పోప హారమునఁ బ్రీతునిఁజేయు గతిఁ గల్గి చూపులు గడలు కొనఁగ" (7–110) అనే పద్యం చిన్న ఉదాహరణ కాగా,

"జెప్పఁగఁ జూచి సిగ్గువడుఁ
జెప్పఁగఁజెప్పక యున్నఁదీరదేఁ
జెప్పెఁదగాక ; యంచుఁదెగి
చెప్పఁ దలంచు..............."  [4–259]

అనే పద్యం అర్థ సౌలభ్యానికి ఉచితమైన తార్కాణం. ఇక నవరసోచిత పద ప్రయోగానికి సహజగాంభీర్యానికి, మార్దవానికి, ఔపదేశిక సంపన్నతకు భోజ రాజీయ కావ్యం నుండి కోకొల్లలుగా ఉదాహరణలను ఉదహరించవచ్చు. అవి ఎవరికి వారు చదివి ముగ్ధులు కావటం సముచితం.

చిత్రవిచిత్రాలైన కథలతో రచనావైదుష్యంలోను, వర్ణనా వైచిత్రిలోను, కథా కథనంలోను ఎవరికీ తీసిపోని అనంతామాత్యుడు తన కావ్యాన్ని కాంతా సమ్మితంగా, ద్రాక్షాపాక నిర్దుష్టంగా, మనోహరంగా, నైతిక దీక్షా సమ్మిశ్రితంగా వెలార్చిన కవి శిల్పి. ఎడ తెగక వీచే మందమారుతంలాగ అతిమనోహరమైన రచనతో, సందర్భాను సారంగా చేర్చబడ్డ సామెతలు జాతీయాల మేళనంతో సజీవమైన భాషలో, ముగ్ధాంగనలాగ మదికి ఆనందాన్ని చేకూర్చి పాఠకులను అలరిస్తుంది భోజరాజీయం.

"గాఢనీహారంబు గప్పినదప్పునే మార్తాండ బింబ
విస్ఫూర్తిపెంపు, నీఱుపైఁ గవిసిన నాఱంగ
నేర్చునే ప్రకటిత దావ పావకునివేఁడి..........."  [7–207]

అన్నట్లు భోజరాజీయ కావ్యమందంతటా అనంతుని సహజ కవితాధార, కల్పనా ప్రతిభ ప్రకాశిస్తూనే ఉంది. ఇంతటి ప్రతిభ ఉండి కూడ పూర్వ కవుల కవిత లాగ తన కవిత్వం అందరికీ రుచిస్తుందో లేదో అంటూ (1–70) కనీసం చిన్న పిల్లల ముద్దు పల్కుల్లాగానైనా ఉంటుంది కదా అనుకునే ఈతని సౌజన్యం ప్రశంసనీయం.

కవివ్యక్తిత్వం : అనంతామాత్యుడు తన గ్రంథంలోని కథలన్నింటిలో మానవులు అవశ్యం ఆచరించాల్సిన ధర్మాలను ప్రతిపాదింప చేసాడు. ముఖ్యంగా సత్యవ్రతనిష్ఠే జీవిత పరమావధి అని తెలియ చేసే కథలే ఎక్కువ. మహా ధర్మ ప్రతిపాదకాలైన కథలతో పాఠకుల్ని ముగ్ధుల్ని చేయటమే అనంతుని కావ్య రచనా పరమార్థ దృక్పథంగా వ్యక్తమౌతుంది. అనంతుని కథలన్నీ ఏ కథ కా కథే సంపూర్ణమైనప్పటికీ, దేనికది విడివిడిగా కాకుండా ఒక కథ నుండి మరొక కథ ఆయాకథల్లో ప్రతిపాదింపబడిన ధర్మసమర్థన కోసం ఉత్పన్నమై అవినాభావ సంబంధాన్ని సంతరించుకున్నాయి. అంతేకాకుండా అన్ని కథల్లోను అంతర్వాహినిగా ప్రవహిస్తున్న నైతిక నిష్ఠ, ధర్మబలం, శారీర బలం కంటే సహస్రాధికమని, అవి క్రూరరాక్షసుల్ని సాధువులుగాను, క్రూర మృగాలను గంగిగోవులుగాను చేయగలవని నిరూపించాడు అనంతుడు. శిల్ప ప్రౌఢిమతో, చమత్కారస్ఫూర్తితో, వర్ణనా వైచిత్రితో విరాజిల్లుతున్న భోజ రాజీయంలోని కథలు నీతి, శిల్పం భిన్నం కావనే సిద్ధాంతానికి లక్ష్యాలు. ఎలాంటి పిట్ట కథనైనా సంపూర్ణ కావ్యంగా మలచి, ప్రసన్న గంభీరమైన శైలితో నీతిని, శిల్పాన్ని సమ్మేళన పరచి కావ్యంలో ఆ రెండు సమానంగా వెలుగొందే టట్లు చేయగలగటం ఈతని శిల్పం. ప్రతి కథలోని ప్రతి పాత్రను ఈ సిద్ధాంతానికి పరమ దృష్టాంతంగా మలచి, నాటకం లోని పాత్రల్లాగ మన మనః ఫలకం మీద ముద్రింప బడేటట్టు చేయటమే అనంతుని రచనా సముద్దేశమనటం అతిశయోక్తికాదు. ఛాయాచిత్రం లాగ మదిలో కలకాలం ముద్రింపబడి ఆంధ్ర సారస్వతాన్ని అలరించే చక్కని కావ్యం ఈ భోజరాజీయం.

"సకల విద్యల యందుఁ జర్చింపఁగవిత యు
 తత్కృష్ట మంత్రదది నిత్య కీర్తి కొఱకు
నర్థాప్తి కొఱకును వ్యవహారలక్షణం
 బెఱిఁగెడు కొఱకు ననేక విధము
లగు నమంగళముల హరియించు కొఱకును, సు
 చిత నిత్య సౌఖ్య సంసిద్ధి కొఱకు

నొనరఁ గాంతా సమ్మితోపదేశంబునఁ
ప్రీతియై హితమాచరించు కొఱకు
నమ్యోగాన బెద్దలాదరించెదరంచు
నేర్పు కొలఁది................ [1-60]

ఆచంద్ర తారార్కంగా నిలవదగ్గ కావ్యాన్ని అందిచ్చి కీర్తి భాజనుడైన అనంతుని రచనా వైదుష్యాన్ని గురించి ప్రతి అంశాన్ని వివరించడానికి కాలస్థల పరిమితులు చాలవు. అపురూపమైన, మధురకథానికరమై ఉత్తమోత్తమంగా విరాజిల్లుతున్న భోజరాజీయం, పోతన, శ్రీకృష్ణదేవరాయ, నంది తిమ్మన, సూరనార్యుల వంటి విద్వత్కవులకు అనుకరణ యోగ్యమైన దంటే అది ఎంతటి ఉత్కృష్ట కావ్యమో స్పష్టమౌతోంది. కాబట్టి భోజరాజీయం ఆంధ్ర సారస్వత నందనవనంలో అసదృశ కావ్యం అనటం అతిశయోక్తి కాదు. పునరుక్తిలేకుండా కథా రూపంలో నీతులను బోధించి వినోదం కల్పించిన అనంతుని కావ్యం ఎవరికి వారు చదివి ఆనందించ దగ్గ చక్కని కావ్యం.

## కొన్నిపదాలకు అర్థాలు

తలిర్పగ = అతిశయించగా
చొప్పడి యుండున్ = సరిపడ ఉండును
తుష్టి = సంతృప్తి
ఉఱ్ఱు = పాలుపితికేటప్పుడు ఆవుకాళ్లకు కట్టినకట్టు
తెవులు = జబ్బు, రోగం
కురు మట్టము = పొట్టి
స్మర చాపము = మన్మథుని బాణము
సాయకము = బాణము
అంబరము = ఆకాశము
స్రుక్క = ముకుళించు
పొడతెంచెన్ = ఉదయించెను
ఎగ్గాడిన = దూషించిన
తీరదు = చక్కబడదు
నీహారము = మంచు
మార్తాండ బింబము = సూర్య బింబము
విస్ఫూర్తి = ప్రకాశం
పావకుడు = అగ్ని

ఉత్కృష్టము = శ్రేష్ఠము
హరించు = అడగు
హితము = యోగ్యము, మేలు, మంచి.

## ఆధార గ్రంథాలు

1. భోజరాజీయము—వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి, 1952.
2. భోజరాజీయము—ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1969.
3. సమగ్రాంధ్ర సాహిత్యము—(5వ సంపుటము) ఆరుద్ర, యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు.
4. ఆంధ్ర సాహిత్య చరిత్ర—కీ. శే. డా॥ పింగళి లక్ష్మీకాంతం, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు 500 004.

# వీరభద్ర విజయము — బమ్మెర పోతన

## సమీక్ష : వట్టిపల్లి సీతామహాలక్ష్మి

[ జన్మస్థలం: కొవ్వూరు. ప.గో. జిల్లా. జననం—15-9-1951. ఎం.ఏ. ఉద్యోగం — తెలుగు వ్యుత్పత్తికోశ పథకం — తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు. 'ఆధునికాంధ్ర సాహిత్యంలో మార్మిక కవిత్వం' అన్న అంశంపై పిహెచ్.డి. పట్టానికి పరిశోధన చేస్తున్నారు. ప్రచురణలు — శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు — బాలగీతావళి, మాతృమందిరము — సంఘ సంస్కరణము మొ. నవభారతి మొ. పత్రికలలో ప్రచురింపబడ్డాయి. రేడియో ప్రసంగాలు— 'శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు — బాలగీతావళి' మొ. ఆరు. ]

### కవిజీవితాదులు :

శివకథా ప్రధానమైన 'వీరభద్ర విజయము' అనే ప్రబంధాన్ని రచించిన పోతన క్రీ.శ. 1380 ప్రాంతంలో జన్మించి సుమారు 1440 వరకు జీవించాడు. పోతన నియోగి. ఇతని తండ్రి సాధుగుణాఢ్యుడు, బహుకళానిధియైన కేసయ. లక్ష్మీ కన్య (ఈమెనే భాగవతంలో లక్కమాంబగా పేర్కొన్నాడు) ఈతని తల్లి. గురువు సోమనాథుడు. ఇతని ఇంటిపేరు బమ్మెర. ఇతని జన్మస్థలం నిజాం రాష్ట్రంలోని వరంగల్లుకి సమీప గ్రామం అయిన బమ్మెర. ఈ కృతి రచనాకాలంనాటికి పోతన శైవమతాభిమాని. శైవమత స్వీకారం తండ్రి దగ్గరనుండే ప్రారంభం అయినట్టు మనకు తన తండ్రినిగూర్చి చెప్పిన 'శైవశాస్త్రమతము గనియె' అనే విషయాన్ని బట్టి తెలుస్తోంది. వీరభద్ర విజయరచన చెయ్యాలనుకునే నాటికి పోతన చిన్న వాడు. అప్పటికే కవిత్వం రాయడం నేర్చాడు. ఆరోజుల్లోనే ఇహపరాల్లో కీర్తిని గడించే ఒక పుణ్యకథను రాయాలనే ఉద్దేశం కలిగింది. ఆ సమయంలో పోతన గురువు, సకల శైవశాస్త్ర రహస్యాన్ని తెలిసిన ఇవ్వటూరి ఆరాధ్య చంద్రుడైన సోమనాథుడీతణ్ణి పిలిచి, 'వింతపండువు బోలెను వీరభద్ర విజయమెల్లను వినఁ గడుపేడ్కయయ్యె, నది తెలుంగున రచియింపు మభిమతముగ' అని కోరాడు. 'పిన్నవాఁడననియుఁ, బెక్కు సంస్కృతులను, వినని వాఁడననియు వెఱపుమాను' మని ప్రోత్సహించాడు. గురుప్రసాద దివ్యమహిమ చేతను, వీరభద్రేశ్వర ప్రసాదం వల్లను, వాయుపురాణసారమైన వీరభద్ర విజయ కథను తెలుగున రచించాడు. 'జనశిక్షిత విహితాక్షరాభ్యాసుండనై' అని మొదట విద్యాభ్యాసం తండ్రి దగ్గర చేసాడని తెలుస్తోంది.

భాగవత కర్తయైన పోతన వీరభద్ర విజయం కాక భోగినీ దండకం, నారాయణ శతకం కూడా రాసినట్లు ఆంధ్ర వాఙ్మయకారుల అభిప్రాయమై ఉంది.

కథాసంగ్రహం : వీరభద్ర విజయం నాలుగాశ్వాసాల ప్రబంధం. ఇందులోని కథావృత్తాంతం వాయుపురాణం నుండి గ్రహింప బడింది. వాయుదేవుడు మునులకు ఈ కథను సవిస్తారంగా వినిపించినట్లు రచింపబడింది. రజత ధరణీధర శిఖరంపైన పరమేశ్వరుడు పర్వత రాజపుత్రితో కొలువై ఉన్న సమయంలో, దేవాసురముని గంధర్వులేతెంచి శివుని స్తుతిస్తుండగా దక్షుడక్కడికి వస్తాడు. శివుడు వారినందర్నీ గౌరవించి, అనంతరం దక్షుణ్ణి గౌరవించాడు. అందుకు దక్షుడు శివుడు తనని వారందరి ముందూ అవమానించినట్లు భావించి, కోపగించి, ప్రతీకారంగా ఒక యాగాన్ని చెయ్యడానికి నిశ్చయించుకొంటాడు. దేవతలు మునుల్నందర్నీ ఆహ్వానించి శివరహితంగా యజ్ఞాన్ని ప్రారంభించాడు. ఆ యజ్ఞ వార్త నారదుడివల్ల తెలుసుకొన్న దాక్షాయణి శివుడికా వార్త తెలిపింది. శివుని ఆజ్ఞ గైకొని యజ్ఞాన్ని చూడటానికి బయలుదేరింది. దక్షుడామెను పిలవని పేరంటానికి వచ్చినందుకు తిరస్కరించడమే కాకుండా శివుణ్ణి నిందిస్తాడు. శివ నిందను భరించలేని దాక్షాయణి శివయోగాగ్నిని సృష్టించుకొని దేహత్యాగం చేసింది. జరిగిన వృత్తాంతాన్ని తెలుసుకొన్న శివుడు వైవస్వతమనువు నాడు దక్షుణ్ణి కడతేరుస్తానని శపిస్తాడు. ఆ తరువాత దాక్షాయణి హిమవంతుడికి కూతురుగా జన్మించి, శివుణ్ణే భర్తగా ధ్యానించింది. యవ్వనవతి కాగానే హిమవంతుడు పార్వతిని శివుడి శుశ్రూషకై నియమించాడు. ఇది ప్రథమాశ్వాసంలోని కథ.

ద్వితీయాశ్వాసంలో తారకాసురుడు దేవతల్ని పెడుతున్న బాధల్ని బృహస్పతి బ్రహ్మకు చెప్పడంతో కథ ప్రారంభం అవుతుంది. శివపార్వతులకు జన్మించే కుమారుడివల్ల తారకాసుర సంహారం జరుగుతుందని బ్రహ్మ దేవతలకు తెలియ జేశాడు. శివుడి తపోభంగానికి ఇంద్రుడు మన్మథుణ్ణి నియమించాడు. ఈ విషయం తెలిసిన రతీదేవి మన్మథుణ్ణి వారిస్తుంది. రతీదేవి వారించినా వినకుండా మన్మథుడు శివుడికి తపోభంగం కలిగించి ముక్కంటి కంటి మంటకు గురౌతాడు. హిమవంతుడు పార్వతిని ఇంటికి తీసుకొని పోగా, శివుడు ఎఱుకత వేషం వేసుకొని పార్వతి వద్దకువచ్చి, పరమేశ్వరుని కొఱకు తపస్సు చెయ్యమని చెపుతాడు. తల్లి తండ్రుల అంగీకారంతో పార్వతి వనానికి వెళ్ళి తపస్సు చేయగా, పరమేశ్వరుడు మెచ్చి మాయా వటువు వేషంలో వచ్చి ఆమెను పరీక్షించి, ప్రత్యక్షమై, తన మనోరథాన్నామెకు తెలియజేస్తాడు.

పరమేశ్వరుడు సప్తమహర్షుల్ని పిలిచి వారిని తన తరఫున పెళ్ళి పెద్దలుగా హిమవంతుడి వద్దకు పంపించగా, హిమవంతుడు వారిని పూజించి గౌరవిస్తాడు.

పార్వతీ పరిణయానికి బ్రహ్మాది దేవతలందరూ వస్తారు. శివుడు గణాధిపతిని కూడా వివాహానికి తీసుకొనివస్తాడు. వివాహానంతరం పార్వతి శివుడి కంఠం నీలంగా ఉండటానికి కారణం అడుగగా క్షీరసాగర మథన వృత్తాంతాన్ని శివుడు వివరించాడు. ఇది తృతీయాశ్వాసంలోని కథ.

వైవస్వత మన్వంతర మవడంచేత దక్షుడు ద్వితీయ యజ్ఞం ప్రారంభించి శివుణ్ణి తప్ప మిగిలిన వారందర్నీ ఆహ్వానించాడు. అందుకు దధీచి దక్షుణ్ణి మందలించినా లెక్కచేయక, దక్షుడు దధీచినే అవమానించాడు. దధీచి కైలాసానికి పోయి శివపార్వతులకీ వృత్తాంతం తెలియజేయగానే, వారు కోపించగా, శివుడి కోపంనుండి వీరభద్రుడు, పార్వతి కోపంనుండి భద్రేశ్వరి పుట్టి దక్ష యజ్ఞాన్ని ధ్వంసం చేశారు. విజయంతో దేవతలఖండితాంగాల్ని తీసుకొని ఇరువురు కైలాసం రాగా, శివుడు బ్రహ్మాది దేవతల్ని అనుగ్రహించి వీరభద్రుడికి పట్టం కట్టడంతో నాల్గో ఆశ్వాసం ముగుస్తుంది. ఇది స్థూలంగా వీరభద్ర విజయంలోని కథ.

వీరభద్ర విజయ కర్తృత్వం, రచనాకాలం అనే విషయాలు పలుచర్చలకు లోనయ్యాయి. ఇందులో మొదటిది వీరభద్ర విజయం పోతన రాయలేదని కొందరు పండితుల వాదన. ఈ గ్రంథరచన్ని భాగవతంతో పోల్చి పరిశీలిస్తే పోతన రచనలా అనిపించదని, కాబట్టి పోతన రచన కాదని ప్రధానంగా వీరి వాదం. కానీ అలా పరిశీలించి చూచినప్పుడే ఇది ఒక మహాకవి ప్రాథమిక రచన అనిపిస్తుంది. అంతేకాక భాగవతం, వీరభద్ర విజయగ్రంథ పీఠికల్లో ఇచ్చిన వంశవృక్షాల్ని, వంశ నామధేయాల్ని పరిశీలిస్తే సమానంగానే ఉన్నాయి. ఇక రచనాకాలం విషయం—ఇది భాగవత అనంతర రచన అనేది. భాగవతంలో చేసిన శివనిందా దోషం పోగొట్టుకోటానికై వీరభద్ర విజయం రాశాడని కొందరి వాదన. అయితే ఈ సంగతిని తెలిపే పద్యం కొన్ని ప్రతుల్లో మాత్రమేఉంది. అది ప్రక్షిప్తం కావచ్చు. అటువంటి శివనింద వీరభద్ర విజయంలో కూడా విశేషంగానే ఉంది. రచనా విధానం, శైలిని పరిశీలించినప్పుడు వీరభద్ర విజయం పోతన రచనే అనిపిస్తుంది. భాగవత రచనాకాలంనాటికి వీరభద్ర విజయం రచన కాలంనాటికి కాలంలోను, కవి వయస్సులోను వ్యత్యాసం ఉంది కాబట్టి ఈ రచన కొంత పేలవంగా ఉంది అనిపిస్తుంది.

వస్తువు : 'వాయుపురాణ సారంబగు నీ కథా వృత్తాంతం బంతయు దెలుంగున రచియింపుము' అని తనగురువు ఆనతి అని కవి పీఠికలో చెప్పుకున్నాడు. కాబట్టి ఈ కథకు మూలం వాయుపురాణం. ఈ కథావస్తువు బ్రహ్మాండ లింగ పురాణాల్లోనూ, కాశీఖండ భాగవతాదుల్లో కూడా ఉంది. అయితే వీటిల దేనిలోనూ దక్షుడు రెండుసార్లు యజ్ఞం చేసినట్టులేదు. ఇది ఒక వాయుపురాణ

లోనే ఉంది. వాయుపురాణంలో చెప్పబడిన యజ్ఞద్వయాన్ని గ్రహించి ఆ రెండు యజ్ఞాలకీ మధ్య మన్మథ దహనం, రతీవిలాపం, శివపార్వతుల కల్యాణ ఘట్టాన్ని చొప్పించి, వర్ణనలతో ఒక ప్రబంధంగా సంతరించాడు కవి. 'తెనుంగున' రచించేటప్పుడు కొన్ని తావుల్లో సందర్భానుసారంగా మార్పుల్ని చేశాడు. వాయు పురాణంలో దక్షయజ్ఞానికి సతీదేవి వెళ్ళేటప్పుడు సతీపరమేశ్వరుల మధ్య ఎటు వంటి వాదంలేదు. అనువాదంలోకూడా మూలంలోలాగే 'పిలువని పేరంటా నికి' వెళ్ళినట్టు చెప్పాడు. అంతేకాక 'పిలవకున్నను కన్యలకుఁ బుట్టిన యిండ్లకుఁ బోవలోకమున్మెచ్చును' అని యాగాన్ని చూచి రమ్మంటాడు శివుడు. అయినప్ప టికీ సతీదేవి తండ్రిదగ్గరకు పోవ నిరాకరిస్తుంది. కానీ శివుడే అనునయించి పంపిస్తాడు.

రచనలో స్వతంత్రించడమే కాకుండా కొందరు ప్రాచీన కవుల్ని అనుకరిం చాడు. పీఠికలో వాల్మీకి, బాణ, కాళిదాస, మాఘ, భోజ, భారవ్యాది సంస్కృత కవుల్ని, నన్నయ, తిక్కన, రంగనాథ, వేములవాడ భీమకవి మొదలైన తెలుగు కవుల్ని అధిక భక్తితో ప్రస్తుతించాడు. వీరశైవుల్నందర్నీ స్తుతించాడు.

'ఉన్నతగుణధుర్యు నన్నపార్యు'ని పోతన తన గ్రంథారంభంలోనే అనుక రించాడు. ఇతని రచన ఆదికవి అనుకరణంతో ప్రారంభమైంది. 'శ్రీ వాణీ గిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాఙ్గేషు....' అనే నన్నయగారి ఆదిపర్వ ప్రారంభ శ్లోకాన్ని అనుకరిస్తూ 'సిరియును వాణి గౌరియను జెన్నగు కన్యకు మేనువాక్కు....' అనే పద్యంతో గ్రంథారంభం చేశాడు. వీరభద్రుణ్ణి స్తుతించటంలో దండ రచించాడు. రతీమన్మథుల సంభాషణల సందర్భంలో నన్నెచోడుని కుమార కాన్ని సంభవాన్ని ఆధారంగా తీసుకొన్నాడు. రతీదేవి 'నేర్పు మెఱసి పలుమరు' మన్మథుడికి బుద్ధిచెబుతుంది. శివమన్మథులకు గల వ్యత్యాసాన్ని గుర్తుచేస్తుంది. 'అతని శరాసనంబు కనకాచలము....' అనే కుమారసంభవంలోని వృత్తపద్య భావాన్ని 'భూకాంత తేరును బూవుల తేరును....' అనే సీసపద్యంలో వివరిం చాడు. కానీ ఈ ఘట్టంలో నన్నెచోడుడు చూపిన నేర్పు, రచనానైపుణ్యం పోతన రచనలో కనిపించదు. రతీ విలాప ఘట్టంలో కాళిదాసు కుమార సంభ వానుకరణ కనిపిస్తుంది. శివుడు తపస్సు చేస్తున్న వనంలోకి ప్రవేశించి శివుడిపై పుష్ప బాణ ప్రయోగానికి సన్నద్ధుడై వింటిని సవరిస్తూన్న మన్మథుణ్ణి 'విలు చూచున్ వెలిజూచి....' (2-101) అని వర్ణించటం నాచనసోమన రాసిన 'అరి జూచున్ హరిజూచున్....' అనే దాని అనుకరణ. ఇదేరకమైన భావంతో కూడిన రచన పరిపక్వ స్థితిలో భాగవతంలో నరకాసురుడితో యుద్ధంచేసే సత్యభామను వర్ణించటంలో ('పరు జూచున్ వరుజూచు....') కనిపిస్తుంది. వీరభద్రుడు దక్షుని యజ్ఞం ధ్వంసంచేసి దేవతల వివిధాంగాల్ని కోసి శివుని వద్దకు తెచ్చి చూపినట్లు

చేసిన వర్ణన పండితారాధ్యుని శివతత్త్వ సారంలో దక్షాధ్వర ధ్వంసంలో ఉంది. దానినే ఈ కవి గ్రహించాడు.

పాత్రచిత్రణ : పోతన స్త్రీలమనస్తత్త్వాన్ని నిశితంగా పరిశీలించి ఆ పాత్రల్ని చిత్రించేటప్పుడు ప్రత్యేకతను ప్రదర్శించాడు. తండ్రియజ్ఞాన్ని గురించి శివుడికి తెలియజేయాలనుకున్న సందర్భంలో —

ఉ. చెప్పినఁ దప్పువచ్చునొకొ చెప్పకయున్నను దప్పువచ్చునో
తప్పు దొలంగరాని యది దారుణ మెమ్మెయి నాథుచేతనే
యొప్పననైన నుండెదను యొప్పమినైనను నిర్వహించెదన్
దప్పినఁ బిన్న బుద్ధియగుఁ దాననుచున్ మదినిశ్చయంబుతోన్
[1-106]

అని పరిపరి విధాల సంశయిస్తుంది. వడవడ వణకుతుంది. బిడిముడిపాటును పొందుతుంది. చింతాకులయై వెడగుదనంతో 'కడువాడిన పువ్వు'లా ఉండి, పెద వులు తడుపుకుంటూ, భయపడుతూ మెల్లమెల్లగా నడుస్తూ, తొట్రుపడుతూ శివుని ఎదురుగా నిలిచి అసలు సంగతి చెబుతుంది. మన్మథుడు రతీదేవి కౌగిట్లో ఉండగా ఇంద్రుడతణ్ణి కార్యార్థమై తలుచుకుంటాడు. ఇంద్రుడు తలచుకోగానే మన్మ థుడిలో మార్పు వస్తుంది. ఆ మార్పును గమనించిన రతీదేవి 'పెరగన్నియలకు న్వలచి' తన్ను మరచాడేమోనని అనుమానిస్తుంది. ఆసంగతి తెలిసే రాజసభకు వస్తానంటుంది. 'ఇల్లాండ్రైన కులాంగనల్ మగలతో నేతెంతురా' అని రాజసభ లకు స్త్రీలు వెళ్ళే అచారంలేదని (2-26) ఆమెని వారిస్తాడు. ముగ్ధలకు రాచ పనులు తెలియచేయ తగనివనే (2-23) ఆలోచన ఆ కాలంవారికి ఉండేది.

రజతగిరినుండి తిరిగి వచ్చిన దక్షుణ్ణి భార్య 'మనయల్లుని మనబిడ్డను గనుగొంటిరె' అని ప్రశ్నించి వారి విశేషాల్ని తెలుసుకోవటానికి చూపే ఔత్సు క్యంలో, తనకుమార్తె అల్లుళ్ళ క్షేమసమాచారాలు తెలుసుకోగోరే తల్లి మనస్త త్వం గోచరిస్తుంది. పార్వతీదేవి బాల్య చేష్టల్నిచూసి ఆమెను మేనక ముద్దుచేయ టాన్ని వర్ణించటంలో (1-191, 193) ఒకతల్లి తన కూతుర్నిచూసి ఎంతగా పొంగి పోతుందో కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది.

వర్ణనలు : పోతన సందర్భానుగుణంగా వర్ణనలనేకం చేశాడు. ప్రబంధానికి కావలసిన వర్ణనలన్నీ ఇందులో ఉన్నాయి. అమరావతీ పట్టణవర్ణన (2-31), ప్రకృతి వర్ణన (3-121), చంద్రోదయ వర్ణన (3-122, 123), తారక వర్ణన (3-118), కథాప్రారంభంలో నైమిశారణ్య వర్ణన ; చీకటి వర్ణన (3-119), వన వర్ణన, పార్వతి తపస్సుచేసే తపోవన వర్ణన (2-239), మూడుకాలాల వర్ణన,

వీరభద్రుడు వీరవిహారం చేసేటప్పుడు యుద్ధవర్ణన, బాలాసందర్భాల్లో నాయికా నాయకుల వర్ణన, నాయిక విరహవర్ణన (2-212, 213), ఎఱుకత వర్ణన మొద లైన అనేక వర్ణనలతో వీరభద్ర విజయ ప్రబంధాన్ని తీర్చిదిద్దాడు. ఈ వర్ణనలన్నీ సందర్భోచితంగా ఉన్నప్పటికీ, పాత్రపోషణలో కొన్ని సందర్భాల్లో ఔచిత్యం చెడిందనే చెప్పాలి. పార్వతిని చూసివచ్చిన మునులు శివుడి ఎదుట ఆమెను ప్రత్యంగ వర్ణన చేయటం పాత్రౌచిత్యానికి తగినట్లుగాలేదు. ఇక్కడ ప్రబంధంలోని అష్టాదశ వర్ణనలోని ఒకటైన నాయికా వర్ణనమాత్రమే కనిపిస్తుంది. అలాగే శివ నింద చేసిన దక్షుణ్ణి, సతీదేవి నిందించేటప్పుడు ఆ పాత్రలో ఉదాత్తత కని పించదు (1.146). అక్కడ మనకు కనిపించేది శివదూషణ చేసిన వ్యక్తిపై ప్రతిగా వీరశైవుడు ప్రయోగించే తీవ్ర వాక్కూలాలు, శివనిందని సహించలేని స్వమతాభిమానం.

కానీ ఎన్నో సన్నివేశాల్ని పోతన సందర్భోచితంగా రూపొందించాడు. హిమ వంతుడు తనకుమార్తె వివాహానికి రావలసిందిగా బంధువులకు లేఖలు పంపి స్తాడు. అవి ఎవరెవరికంటె —

మత్త. వెండికొండకుఁ బైఁడి కొండకు వింధ్యయన్ బలుకొండకున్
చండభానుఁడు దోఁచు కొండకు సాగరాంతఁపు గొండకున్
మండనం బన నొప్పుకొండకు మందరంబను కొండకున్
కొండరాయఁడు పంపె లేఖలు కోటికాలరి పంక్తిచేన్. [3-110]

ఇలా వర్ణించటంలో ఔచిత్యం ఉంది. హిమవంతుడు పర్వతరాజు. అతని బంధువులు కూడా పర్వతాలే అయిఉండటం సహజం. ఇంతేగాక అనుప్రాసని పాటించి పద్యానికి, భావానికి ఒక వినూత్నరూపాన్ని కల్పించటం పోతన ప్రత్యేకత.

రసం: వీరభద్ర విజయంలో ప్రధానమైంది భక్తి. శైవకావ్యాల్లో సహజ మైన భక్తి వీరం పోషింపబడింది. దక్షుడు శివనింద చేసినప్పుడు సతీదేవి అవ మానం పొందిన సందర్భంలో రౌద్రరసం; పార్వతి శివుడికి సపర్యలు చేసే సమయంలోను, రతీమన్మథుల్ని వర్ణించటంలోను, వివాహానికి తరలివచ్చిన శివుణ్ణి చూసిన స్త్రీలను వర్ణించటంలో శృంగార రసం; మాయా వటువుని పట్టి దండిం చాలని పార్వతి చెలికత్తెలు ప్రయత్నించే సందర్భంలో అద్భుతరసం; వీర భద్రుడు భద్రేశ్వరి ఆవిర్భవించినప్పటి నుండి దక్షయజ్ఞ ధ్వంసం చేసేవరకూ రౌద్ర, వీర, బీభత్సాద్భుత భయానకాదిరసాలు; మన్మథుడు భస్మం అయిన అనంతరం రతీదేవి విలపించే సందర్భంలో కరుణరసం; శివుడు తిరిగి ఎవరి దేహ భాగాల్ని వారికి ఇచ్చాడని చెబుతూ 'భారతి ముక్కును భారతి కిప్పించి, ముక్కున

కొన మంచి ముత్తెమిచ్చె' అని వర్ణించటంలో సున్నితమైన హాస్యం ; ఈవిధంగా నవరసాల్లో పెక్కురసాల్ని సందర్భోచితంగా పరిపోషించి కావ్యానికి వన్నె కూర్చాడు కవి.

ఆత్మీయత : ఏ కావ్యమైనా ఆ కాలంనాటి పరిస్థితులకు ప్రాతినిధ్యం వహిస్తుంది. వీరభద్ర విజయంలో కూడా కవి ఆనాటి సాంఘిక ఆచారాలు, కట్టుబాట్లు, వివాహపద్ధతులు నేర్పుగా వివరించాడు. పార్వతిని వివాహం చేసుకోవడానికి నిశ్చయించుకొన్న శివుడికి, హిమవంతుడివద్దకు పెద్దల్ని పంపి పార్వతిని అడగవలసిందిగా, ఆమె చెలికత్తెలు తెలియజేస్తారు. వరుడు తరఫు వారే వధువు ఇంటికివచ్చి అడగటం ఆచారంగా ఉండేది. దానికి మాట్లాడే పెద్దలు—

క. బలముగలవారు నిపుణత
గలవారును బుద్ధి నీతిగలవారును ని
ర్మలత గలవారు సంపద
గలవారు వివాహతతికిఁ గావలయుధరన్. [3-23]

అందుకే శివుడు సప్త మహర్షుల్ని పంపిస్తాడు. వివాహ విషయాలు మాట్లాడేటప్పుడు వరుడు కన్య తండ్రికి కొంత కన్యాశుల్కం చెల్లించి నిశ్చయం చేసుకోవడం ఆచారంగాకనిపిస్తోంది (2-307). ఋషుల్ని పంపిస్తూ చెప్పిన మాటలు—

సీ. శీతాచలేంద్రుని కూఁతుఁ బార్వతికన్య
నతిమోదమున మాకు నడిగిరండు
ఉడురాజవదనకు నుంకువేమడిగిన
నెంతైన మైకొని యిచ్చిరండు
మదిరాక్షి నాతండు మనకిచ్చునట్లుగాఁ
బెంపారనుంగ్రముఁ బెట్టిరండు
పాలకూళ్ళుగుడిచి బాలనుమనసొమ్ము
చేసిరండను వొందఁ జేసిరండు
ఇదియె మాకు మెచ్చు నెల్లభంగులనైన
దీనిఁ జేయవలయుఁ దెఱఁగు మెఱసి
కదలిపోవ నిదియె కడుమంచి లగ్నంబు
భూధరేంద్రపురికిఁ బోయిరండు. [3-27]

దీన్నిబట్టి పెళ్ళికి మాట్లాడటానికి వెళ్ళిన పెద్దలు ఉంకువఇచ్చి, ఉంగరం పెట్టి, పాలకూళ్ళను భుజించి వచ్చేవారని తెలుస్తోంది. కూతుళ్ళ పెళ్ళిళ్ళకు వివాహ సంబంధి విషయాల్ని మాట్లాడే పెద్దలు తల్లులే (3-29). అందుకే మేన

కతో మాట్లాడటానికై శివుడు మునులతోపాటు అరుంధతిని పంపిస్తాడు. పెళ్ళి కుమార్తెను శుభముహూర్తంలో సువర్ణ పీఠంపై కూర్చోపెట్టి పుణ్యాహజలాల్ని శిరస్సుపై జల్లి కల్యాణ వాద్యాలు మోగుతుండగా ముద్రారోహణం చేసి, ఉంకువ ఇచ్చే పద్ధతి ఉంది. వివాహం నిశ్చయమైన తర్వాత బంధువులందరికీ శుభలేఖలు పంపే ఆచారంకూడా ఉంది (3-97, 3-108, 3-109). పెళ్ళిలగ్నాన్ని నిర్ణయించడానికి తమ పెద్దింటి అరుగుమీద ఘడియారం కట్టించేవారు.

శుభముహూర్తానికి ముందు వధూవరుల చేత మంగళస్నానాలు చేయించేవారు. విడిదిని కస్తూరితో అలికించి ముత్యాలతో ముగ్గులు పెట్టేవారు. పెళ్ళి కుమార్తెను తల్లి తీసుకొనివచ్చి రత్నపీఠంపై కూర్చోపెట్టి పసుపుటక్షింతలతో దీవించి మంగళ వాద్యాలు మోగుతుండగా తలంటుతుంది (3-165, 166). పుణ్యస్త్రీలు అనేకరకాల వస్తువుల్ని పళ్ళెంలోపెట్టి పాటలు పాడుతూ ఎదురు వస్తారు (3-170). వివాహం జరిగే సందర్భంలో వధూవరులమధ్య తెరపెట్టడం, మధుపర్కాల్ని ఇవ్వటం, తెరతీసిన వెంటనే వరుని చూడమని చెప్పటం (3-179), తరవాత తలంబ్రాలు పోసుకోవడం మొదలైన ఆచారాలున్నాయి (3-183). పెద్దింటిలోనుండి పెళ్ళిఅరుగుమీదకి వచ్చి అక్కడ హోమం చేస్తారు (3-184). పోతన పార్వతీపరమేశ్వరుల నాలుగురోజుల పెళ్లిని మనోహరంగా వర్ణించాడు. వివాహంలో తలంబ్రాలదే ప్రాధాన్యతగా కనిపిస్తుంది. మంగళసూత్రధారణని గూర్చిన ప్రస్తావనలేదు. కానీ రతీ విలాప ఘట్టంలో 'మంగళ సూత్ర బంధం' గురించిన (2-126) ప్రసక్తి ఉంది.

ఈవిధంగా ఆనాటి దేశకాల పరిస్థితుల నన్నింటిని సందర్భోచితంగా కథలో చొప్పించి శివకథాప్రధానమైన కావ్యంగా ఈ గ్రంథాన్ని మలచాడు కవి.

సీ. కరమొప్ప నీనీల కంఠ స్తవంబులో
　　　నబల యేక శ్లోక మైనఁ జాలుఁ
గరమొప్ప నీనీల కంఠ స్తవంబులో
　　　నబలయర్ధ శ్లోకమైనఁ జాలుఁ
గరమొప్ప నీనీల కంఠ స్తవంబులో
　　　నబల పాదశ్లోకమైనఁ జాలుఁ
గరమొప్ప నీనీల కంఠ స్తవంబులో
　　　నబల కించిన్మాత్రమైనఁ జాలుఁ
విమలభక్తితోడ వినినఁ బఠించిన
సజ్జనుండు సకల సంపదలును
గలిగి భవములేక కైలాసవాసుఁడై
నన్నుఁ జేరియుండు నలిననేత్ర. [3-263]

అని నోరు నొవ్వంగ హరుని కీర్తించిన గ్రంథం ఇది. సహజ పాండిత్యుని తొలిరచన అయిన వీరభద్ర విజయంలో కోరక దశలో పొడచూపిన కవితా రీతులే భాగవతంలో సహస్ర వికసితాలై కావ్యసౌరభాన్ని వెదజల్లాయి.

## కొన్ని పదాలకు అర్థాలు

అనువు = ఉపాయం, విధం, అవకాశం
అబల = స్త్రీ
ఉంకువ = కన్యాశుల్కం
ఉడురాజవదన = చంద్రుడివంటి ముఖం కలది, పార్వతి
ఎమ్మెయి = ఏవిధం
ఒప్పమి = కీడు, తప్పు
ఒప్పు = సమ్మతి
కరము = మిక్కిలి
కాలరి = దూత
కించిత్ = అల్పం, కొంచెం
కుడుచు = భుజించు
కైలాసవాసుడు = కైలాసంలో నివసించేవాడు, శివుడు
కొండరాయడు = కొండలకు అధిపతి, హిమవంతుడు
చండభానుఁడు = సూర్యుడు
తతి = సమూహం
ధర = భూమి (కొండ)
నలిన నేత్ర = తామరపువ్వులాంటి కన్నులు కలది, పార్వతి
నీలకంఠుడు = కంఠం నీలంగా ఉన్నవాడు, శివుడు
పాలకూళ్ళు = పాలతో తయారుచేసే పిండివంటలు
పెంపార = గొప్పగా, అతిశయించగా
పైడికొండ = బంగారపుకొండ, మేరుపర్వతం
భంగుల = విధాల
భవము = పుట్టుక, సంసారం
భూ ధరేంద్రపురి = హిమవంతుడి పట్టణం
మండనము = అలంకారం
మదిరాక్షి = మత్తెక్కిన కన్నులుకలది, పార్వతి
మందరము = కవ్వంకొండ
మెఱసి = ప్రకాశించి

మైకొను = సమ్మతించు
మోదము = సంతోషం
లగ్నము = శుభముహూర్తం
లేఖలు = శుభలేఖలు
విమలభక్తి = నిర్మలమైనభక్తి
వెండికొండ = కైలాసం
శీతాచలేంద్రుడు = హిమవంతుడు
సాగరాంతపు కొండ = పడమరన గల కొండ.

## ఆధార గ్రంథాలు


1. వీరభద్రవిజయము — వావిళ్ళవారి ప్రతి - 1952
2. పోతన — శ్రీ నిడుదవోలు వేంకటరావు
3. పోతన - ఇతరకృతులు — డా. వేదుల రాజేశ్వరి
4. సమగ్ర ఆంధ్ర సాహిత్యం — శ్రీ ఆరుద్ర (5 వ సంపుటం)
5. ఆంధ్ర కవితరంగిణి — శ్రీ చాగంటి శేషయ్య (6వ సంపుటం)

# శృంగార శాకుంతలము – పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు

సమీక్ష : డా॥ ఎల్. చక్రధరరావు

[ జన్మస్థలం : తణుకు పశ్చిమ గోదావరి జిల్లా. జననం 3–7–1939 ఎమ్.ఏ., పిహెచ్.డి.; డిప్లొమా (హిందీ), సీనియర్ డిప్లొమా (సంస్కృతం), ఉపన్యాసకులు ; తెలుగు వ్యుత్పత్తికోశ పథక ప్రధాన సంపాదకులు – తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు. ముద్రిత కృతులు – కేశవశతకము, భాషాశాస్త్ర వ్యాసములు, దేశికవిత ; కవితా సంకలనం (నన్నయ – వీరేశలింగం), శ్రీ యం. ఆర్. అప్పారావు సన్మాన సాహిత్య సంచికాసంపాదకులు, అనేక పరిశోధక వ్యాసాలు ముద్రించబడ్డాయి. 11 రేడియో ప్రసంగాలు చేశారు.]

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు క్రీ.శ. 15వ శతాబ్దికి చెందిన మహాకవి. 'విద్యాభారతీజాని' అని పేరు బడ్డ గాదిరాజుకు నాగమాంబకు పలునోముల ఫలితంగా పినవీరభద్రుడు జన్మించాడు. వీరి ఇంటిపేరు 'పిల్లలమఱ్ఱి.' ఈ కారణంగా కొందరు ఈ కవి జన్మస్థానాన్ని తెలంగాణాలో నల్గొండజిల్లాలో ఉన్న పిల్లలమర్రిగా భావించారు. పినవీరన తన 'శకుంతలాపరిణయము'లో నెల్లూరు జిల్లాలోని 'సోమరాజుపల్లి'ని విపులంగా వర్ణించటంచేత ఈ కవి జన్మస్థానం ఇదే అని కొందరి ఊహ. పినవీరభద్రుని జన్మస్థానం పిల్లలమర్రి కాగా రాజాశ్రయాన్ని కోరి నెల్లూరుకు తదనంతరం కర్ణాటరాజ్యానికి ఈ కవి వెళ్ళి ఉంటాడని మనం భావించవచ్చు. ఈ కవి నియోగి. ఈ మహాకవి 'రమణీయ వాగ్రీతి'తో 'అవతారదర్పణము' అనే గ్రంథాన్ని, తేటపడేటట్లుగా సత్కవిశ్రేణి ఆదరించేటట్లుగా 'నారదీయము' అనే ఆంధ్రీకృత పురాణాన్ని అశేష శేముషీ విశేషంతో 'మాఘమాహాత్మ్యము'ను, 'ఘనబుద్ధి'తో 'సముల్లసిత శయ్య'తో 'మానసోల్లాససారము'ను రచించినట్లుగా శృంగార శాకుంతలావ తారికను బట్టి మనకు తెలుస్తోంది. ఈ గ్రంథా లేవీ మనకు ఇప్పుడు లభ్యాలు కావు. శృంగార శాకుంతలము, శకుంతలాపరిణయము అనే నామాంతరాలు కల 'శాకుంతలకావ్యము'ను రచించి పంటరెడ్డి ప్రభువుల పరిపాలన కింద ఉన్న నెల్లూరు మండలంలోని సోమరాజు పల్లిలో విపుల వైభవంతో వెలుగొందిన చిల్లర వెన్నయామాత్యునికి పినవీరభద్రుడు అంకితమిచ్చాడు. క్రీ.శ. 1485–90 సంవత్సరాలలో విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన శ్రీసాళువ నరసింహ రాయలకు ఇతడు తన జైమిని భారతాన్ని అంకిత మివ్వటమే కాకుండా

రాయలపై నవరత్నాల్ని రచించాడు. భారతీమంత్రోపాసకుడైన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు 'వాణి నారాణి' అన్నాడట. ఈ జనశ్రుతిని బట్టి ఈ కవి సర్వతంత్ర స్వతంత్రుడని వశ్యవాక్కు అని నిర్ధరించవచ్చు.

సంస్కృతాంధ్ర మహాభారతాల్లోను కాళిదాసమహాకవి రచించిన 'అభిజ్ఞాన శాకుంతలమ్' గ్రంథంలోను ప్రఖ్యాతంగా ఉన్న శకుంతలాదుష్యంతుల ఇతి వృత్తాన్ని తీసుకొని కొన్ని మార్పులతో పినవీరభద్ర కవి నాలుగు ఆశ్వాసాలలో 772 హృద్యగద్య పద్యాల్లో, శృంగార శాకుంతలాన్ని రచించాడు. హస్తినాపుర విపులవర్ణనతో 'శాకుంతల కావ్య కథ' ప్రథమాశ్వాసం ప్రారంభ మౌతుంది. ఆ నగరాధిపతి ఐన దుష్యంత మహారాజు గుణకీర్తనానంతరం పుళిందులు రాజుకు కానుకలు అర్పించి క్రూరమృగబాధనుంచి తమను కాపాడవలసిందిగా అభ్యర్థిస్తారు. భృత్య సామంత మాండవ్య సహితుడై వేటకు వెళ్ళి దుష్యంతుడు గొల్లపల్లెలో విశ్రమిస్తాడు.

ఇక ద్వితీయాశ్వాసంలోని కథ: మర్నాడు మరల వేట కొనసాగించి దారితప్పి ఆశ్రమ హరిణాన్ని అనుసరించి కణ్వాశ్రమ ప్రాంతాన్ని దుష్యంతుడు సమీపిస్తాడు. అక్కడ శకుంతలాదుష్యంతులు పరస్పరం ఆకర్షితులౌతారు. కణ్వమహర్షి శిష్యుని వలన మేనకా విశ్వామిత్రుల పుత్రియే శకుంతల అనే సత్యాన్ని దుష్యంతుడు తెలుసుకొని సంతోషిస్తాడు. శకుంతలా దుష్యంతుల విరహ వర్ణన చేయబడింది.

తృతీయాశ్వాసంలో కణ్వశిష్యులు తాముచేసే అతిరాత్రం అనే యజ్ఞాన్ని రాక్షసులబారినుంచి రక్షించాలి అని కోరగా వారి వినతిని మన్నించి దుష్యంతుడు ఆశ్రమానికి వస్తాడు. శకుంతలకు దుష్యంతునికి జన్మించే పుత్రుడు యౌవరాజ్య పదపీఠంలో ఉండే షరతుపై అనసూయా ప్రియంవదల సమక్షంలో విశ్వంభరాభర్తకు విశ్వామిత్రపుత్రికి గాంధర్వ వివాహం జరుగుతుంది. ఆ సమయంలో సవనధ్వంసానికి వచ్చిన మాకంద, శరభ, రవిజిహ్వ, పాటలవర్ణ, కాళికాముఖుల్ని సమరంలో సమూలంగా సర్వంసహాస్వామి ఐన దుష్యంతుడు నాశనం చేసి మునీంద్రబృందానికి ఆనందాన్ని కల్గిస్తాడు. నిశావర్ణన శకుంతలా దుష్యంతుల విరహవేదన సూర్యోదయవర్ణన చమత్కారంగా కవిచే కావించ బడ్డాయి. పిదప శకుంతలా దుష్యంతుల సమాగమం కవిచే ఔచిత్య విలసితంగా వెల్లడించ బడింది. చిత్తం శకుంతలాయత్తం కావించి పృథివీపతి హస్తినా పురానికి సామ్రాజ్య ప్రతిష్ఠకై వెళ్తాడు.

చతుర్థాశ్వాసంలో కణ్వమహర్షి సోమతీర్థం నుంచి నిజాశ్రమ భూమికి వచ్చి శకుంతల వల్ల యావద్వృత్తాంతాన్ని విని హర్షిస్తాడు. తన్ను సమీపించిన

ముని వర్యులతో కణ్వుడు దుష్యంతవంశాభిజాత్యాన్ని కొనియాడి మాధ్యాహ్ని కానుష్ఠానానికి నదికి వెళ్తాడు. ఆ సమయంలో దుర్వాసుడు కణ్వముని ఆశ్రమానికి వచ్చి శకుంతల తన ఉనికిని గమనించ లేదనే కోపంతో 'క్ష్మాపతి యీ సతిన్మఱచుఁగాక' అని శపిస్తాడు. ఆ శాపాన్ని ఉపసంహరించ వలసిందిగా అనసూయ ప్రార్థించగా కృపాళుడైనముని 'ప్రియుండు ముద్రికా దర్శనంబు సేయునప్పుడే విద్రుమాధరిఁ గలిసి మెలఁగంగఁగల వాఁడు' అని శాపావధిని అనుగ్రహిస్తాడు. దుర్వాసశ్శాపప్రభావాన నృపతి శకుంతలను పూర్తిగా మరచి పోతాడు. గర్భంధరించిన శకుంతల నవమాసాలు పరిపూర్ణం కాగానే కుమారుణ్ణి ప్రసవించగా ఆ దౌష్యంతికి కణ్వమహర్షి భరతుడనే పేరు పెడతాడు. ఎంత కాలమైన దుష్యంతుడు శకుంతలను రాజప్రాసాదానికి తీసుకుపోవటానికి ప్రయత్నించక పోగా సంశయగ్రస్తుడైన కణ్వమహర్షి కుల కన్యకా ధర్మాల్ని తెలిపి అనసూయా ప్రియంవదల్ని వృద్ధతపస్వినీజనాన్ని ఇద్దరు శిష్యులతోడిచ్చి రాజుపాలికి పంపుతాడు. నగరిలో కణ్వశిష్యులు భూపాలుణ్ణి దర్శించి పూర్వ వృత్తాంతాన్ని పరామర్శించి శకుంతలను భరతుణ్ణి పరిగ్రహించ వలసిందిగా కోరగా మునిశాపప్రభావంచే దుష్యంతుడు విస్మృతి నంది విస్మయం పొంది సంయమీంద్రుల కోరికను తిరస్కరించి పేరోలగానికి వెళ్తాడు. నిండు కొలువుకు వెళ్ళిన కణ్వపరివారంలోని అనసూయా ప్రియంవదలు దైవశక్తిని సత్యప్రకట నార్థం ప్రార్థించి దుష్యంతునిచే ఇవ్వబడిన అంగుళీయకాన్ని చూపుతారు. ఆకాశవాణి సత్యాన్ని వెళ్ళడించడంవల్ల అంగుళీయకదర్శనంవల్ల రాజుకు జ్ఞానోదయమై విచారిస్తుండగా నారదుడు వచ్చి శాపవృత్తాంతాన్ని అందరికి ఎరుకపరచి దుష్యంతుని నిర్దోషిత్వాన్ని నిరూపిస్తాడు. దుష్యంతుడు శకుంతలను అగ్రమహిషిగా స్వీకరించి భరతుణ్ణి యువరాజ్య రమాధ్యక్షుణ్ణిగా చేసి చిరకాలం రాజ్యసౌఖ్యాల్ని అనుభవిస్తాడు.

మహాభారతంలో శకుంతల కథ ఒక ఉపాఖ్యానం మాత్రమే కాగా 'అభిజ్ఞాన శాకుంతలమ్' ఒక 'నాటకం. ఈ గ్రంథాల్లో పురవర్ణనకు నాయక వైభవవర్ణనకు అవకాశంలేదు. శృంగారశాకుంతల కావ్య కథా లతాలవాల మైన హస్తినాపురీ లలామ సౌందర్య వర్ణనలు దుష్యంతగుణ సంపత్కీర్తనలు సుదీర్ఘంగా సహృదయ హృదయ రంజకంగా ఈ కావ్యంలో ఉన్నాయి. దుష్యంత మహీపాలుని పేరోలగపు వైభవము కన్నులకు కట్టినట్లుగా ఇందు వర్ణించ బడింది. పుళిందుల కోరికమేరకు వేటకై వెడలినరాజు ప్రయాణసన్నాహాలు వేటాడే విధా నాలు సాంగోపాంగంగా పేర్కొనబడ్డాయి. భారతంలో లేని అభిజ్ఞాన శాకుంత లంలో ఉన్న అనసూయా ప్రియంవదల పాత్రలు పినవీరభద్రుని శృంగార శాకుంతలంలో ప్రముఖంగా ఉన్నాయి. వీరిరువురు శకుంతలతో పాటు రాజ

ప్రాసాదానికి కొలువుకూటానికి వెళ్ళి దుష్యంతుడు తమ చెలిని నిరాకరించగా కోపవిహితేక్షణలై దేవతలను సత్యప్రకటనార్థం వేడుకొని ధర్మ సంస్థాపనకు దోహదం చేస్తారు. మహాభారతంలో వలె శకుంతల తన జన్మవృత్తాంతాన్ని దుష్యంతునితో చెప్పటంకాని, కాళిదాసు శాకుంతలంలో వలె మునికన్య అవివాహిత ఐన అనసూయా ముఖంగా శకుంతలా జన్మక్రమాన్ని రాజుకు ప్రకటించటం కాని చేయకుండా ఔచిత్యపరిపోషణ దృష్టితో ఏతద్వృత్తాంతాన్ని కణ్వశిష్యుడు మహీపాలునికి తెలిపినట్లుగా పినవీరభద్రుడు పరికల్పించాడు. పినవీరన మహాభారతాన్ని అనుసరించి భరతుడు కణ్వాశ్రమంలో జన్మించినట్లు కాళిదాసుని బట్టి అంగుళీయక వృత్తాంతాన్ని కల్పించాడు. మహారాజు కొలువు కూటంలో ఆకాశవాణితో పాటు అంగుళీయక దర్శనాన్ని కూడా చూపి 'ద్విర్బద్ధం సుబద్ధం భవతి' అన్నట్లు లోకాపవాదాన్ని రాజు విస్మృతిని తొలగించి కవి శకుంతలా దుష్యంతుల ప్రణయాన్ని ప్రతిష్ఠించాడు.

'శృంగారము ముఖ్యంబగు నంగియు నంగములుఁ దలఁప నన్య రసములున్' (శృం.శాకుం. 1–25) అని కవియే కంఠోక్తిగా చెప్పినదాన్ని బట్టి ఈ గ్రంథంలో శృంగారం అంగి రసంగాను హాస్య కరుణ రౌద్ర వీర భయానక బీభత్సాద్భుత శాంతరసాలు అంగరసాలుగాను పరిపోషించ బడ్డాయని నిర్ధరించవచ్చు. శకుంతలా దుష్యంతులు ఆలంబన విభావాలుగా తద్గతాను రాగ రూపరతి స్థాయి భావంగా చంద్రికామలయమారుతాదులు ఉద్దీపన విభావాలుగా అశ్రుపాతాదులు అనుభావాలుగా పరస్పర చింతాదులు సహ కారులుగా ఉండి రసరాజమైన శృంగారం ఈ కావ్యంలో పరిపుష్టినంది పాఠకులకు పరమానందాన్ని కల్గిస్తోంది. మేనకా విశ్వామిత్రుల ఘట్టంలోకూడా శృంగార రసం జాల్వారింది. విదూషకుడైన మాండవ్య పాత్ర ద్వారా హాస్యరసం అంగరసంగా పోషించబడింది. శకుంతల అత్తవారింటికి వెళ్ళే సందర్భంలో కణ్వుని స్థితిని కరుణరసస్ఫోరకంగా కవి వర్ణించాడు. మాకందశరభ రవి జిహ్వాది రాక్షసులతో దుష్యంత మహారాజు రణ మొనర్చే సందర్భంలో రౌద్రవీర భయానక బీభత్సరసాలు సమయోచితంగా పోషితాలయ్యాయి. పేరోలగంలోని ఆకాశ భాషణం ద్వారా అద్భుత రసం అత్యద్భుతంగా స్ఫూర్తిని పొందింది. నవరస భరితమైన శృంగార శాకుంతల కృతి అమృతపు గుళిక.

నన్నయార్యుని 'ప్రబంధవాసన,' తిక్కన సోమయాజి 'వాక్ఫక్కికా మోదము,' నాచనసోముని 'వాచా మహత్త్వ సౌరభము,' శ్రీనాథుని 'భాషా నిగుంభము' పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని కవితా కల్పవల్లిలా గుబాళిస్తున్నాయి. రసానుగుణమైన శైలి ఇతని కవితలో అడుగడుగున కన్పిస్తుంది.

> "ఆతన్వంగి పయిం బ్రియంబొదవ విశ్వామిత్రుఁ డీక్షించుచున్
> చేతః పద్మమునందు నున్న శివునింజేమోడ్చి ప్రార్థించి తా
> నాతారాద్రికిఁ బంపి యచ్చట లతాంతావాససీ మన్మనో
> జాతుం బ్రీతుని జేసె దేవగణికా సంభోగ సౌఖ్యంబులన్."
>
> [శృం.శాకుం. 2–141]

అనే పద్యంలో శృంగార రసం చమత్కారంగా పోషించ బడింది. కరుణ రసానుగుణంగా

> "పొమ్మనఁ జూచుఁ జూచి మదిఁ బుట్టిన ప్రేమము పేర్మిబాష్పముల్
> గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడ మొగంబయి కన్నుల నీరు ప్రింగుచుం
> గ్రమ్మఱఁ దాశకుంతల మొగంబునన్రశులు నించుఁ గొంత సే
> పమ్మని జాలిఁ బొంది ధృతి యంతయు నిల్వక విచ్చి పాఱఁగన్."
>
> [శృం.శాకుం. 4–84]

అనే పద్యం కవిచే రచించ బడింది.

అష్టాదశ వర్ణనలలోని పలు వర్ణనలు శృంగార శాకుంతలంలో ఉన్నాయి. పుర (1–69), రాజ (1-87), మృగయా (2–8), ఋతు (2–121), ఉద్యానవన (2–133), రతి (2–141), పర్వత (2–103), యుద్ధ (3–120), చంద్ర (3–173), సూర్య (3–201), విరహ (3–212), నీతి (4–174), పుత్త్రోదయ (4–60) వర్ణనలు ఈ కావ్యంలో సహృదయ హృదయంగమంగా ఉన్నాయి. పుళిందుల్ని (1–97) కణ్వమహర్షి ఆశ్రమాన్ని (2–48) విశ్వామిత్రుని తపస్సును (2–117) పినవీరభద్రుడు మనోహరంగా వర్ణించాడు.

వ్యాస కాళిదాస వాగనుశాసన శ్రీనాథుల ప్రభావం పినవీరభద్రునిపై అధికంగా ఉంది. 'యా సృష్టి స్స్రష్టురాద్యా........' (అభి.శాకుం. 1–1) అనే శ్లోకానికి 'పూనిచరా చరంబు భరించు నొక మూర్తి........' (శృం.శాకుం. 1–2) అనే పద్యం అనువాదం. 'గ్రీవాభంగాభి రామం ముహురనుపతతి........' (అభి.శాకుం. 1–7) అనే శ్లోకాన్ని 'విలుగొని వెంట వెంటఁ బృథివీపతిరా........' (శృం.శాకుం. 2–19) అనే పద్యంగా కవి అనువదించాడు. 'చలా పాంగాం దృష్టిం స్పృశసి బహు శోవేపథుమతీమ్' (అభి.శాకుం. 1–19) అనే శ్లోకానికి 'వనితం జంచదపాంగఁజేసి కనుఁగ్రేవన్ ముట్టుచున్' (శృం.శాకుం. 2–72) అనే పద్యం చక్కటి అనువాదం.

> "కొనకొని తావి మూర్కొనని క్రొవ్విరి యెయ్యెడ వజ్ర సూచిడా
> యని రతనంబు జిహ్వ చవియానని తేనియ గోరు మోపి గి
> ల్లని చిగురాకు లాలిత విలాసనికేతన మాలతాంగి తా
> ననుభవకర్త యేఘనుఁడొ యావిధి యత్నమెఱుంగ నియ్యేడన్."
>
> [శృం.శాకుం. 2–158]

అనే పద్యం 'అనాఘ్రాతంపుష్పం కిసలయ మలూనం కరరుహైః....'(అభి.శాకుం. 2-10) అనే కాళిదాస శ్లోకానికి తేట తెలుగు అనువాదం. అభిజ్ఞాన శాకుంతలంలోని మనోహర భావాలను తెలుగు పద్యాల ద్వారా ఆంధ్రులకు అందించాడు మహాకవి.

'శ్రవణ సుఖంబుగా సామగానంబులు చదివెడు శుకముల చదువు తగిలి కదలక వినుచున్న కరులయు....' (ఆది ప. 4-23) అనే నన్నయ పద్యానికి

'వృద్ధసింహమునకు విహరింపఁ దొండంబు కైదండగా నిచ్చు గంధగజము
పులిక్రొత్తయీనిన పొదరింటిలోనికిఁ బురిటాలి తగవుఁ గొంపోవు హరిణి
శరభంబు కొనగోళ్ల శిరముదువ్వఁగఁ జొక్కి కనుమోడ్చు సుఖనిద్ర గండకంబు
సింహకిశోరంబు చేరవచ్చిన వింత లేక చన్నిచ్చు బాలెంత కరిణి

యెలుక తోడుతఁ జెరలాడు నెనసిపిల్లి
నెమ్మిఁబురివిచ్చి నిలిచి పింఛమ్ము నీడ
భుజగకన్యక నాడించుఁ బూనినమలి
యనఘ కణ్వమునీంద్రు పుణ్యాశ్రమమున'

[శృం.శాకుం. 2-45]

అని రచించి పినవీరభద్రుడు వన్నె పెట్టాడు. కొన్ని ఘట్టాల్లో కాళిదాసు శాకుంతలాన్ని నన్నయ భారతాన్ని కూడా మించి శృంగార శాకుంతలం ఉంది అని పండిత ప్రశంసల్నీ ఈ గ్రంథం పొందింది.

వాల్మీకి వ్యాసుల యెడల కాళిదాస హర్షభట్ట బాణ మయూర భవభూతి మాఘభారవ్యాది సంస్కృత కవీంద్రుల ఎడల భామహ దండి వామనా ద్యాలంకారికుల ఎడల నన్నయ తిక్కనాది తెనుగు మహాకవుల ఎడల పిల్లలమర్రి పినవీరభద్రునికి అపార భక్తి ప్రపత్తులు ఉన్నాయి (శృం.శాకుం. 1-10, 11, 12). చిల్లర వెన్నయ మంత్రితో తద్ద్వారా రాజులతో ఈ కవికి ఉన్న పరిచయం ఈ కావ్యనిర్మాణంలో మిక్కిలి ఉపకరించింది. ఆకారణంగానే రాజ ప్రాసాద వర్ణనలను మృగయా వినోదాన్ని రాచరికపు అలవాట్లను సభా మర్యాదలను ఈ కవి చక్కగా నిర్వహించ గలిగాడు. పినవీరభద్రునికి ఆహవరంగంతో ప్రత్యక్షానుబంధం లేకపోయినట్లైతే దుష్యంత రాక్షస రణరంగాన్ని అంతవిపులంగా కళ్ళకు కట్టినట్లు వర్ణించ గలిగి ఉండేవాడు కాడు. ఈ కవికి శకునాల మీద విపరీతమైన నమ్మకం ఉంది. కలలో పాయసాన్ని భోజనం చేసేవారికి శ్రేయస్సు కలుగుతుందని స్వప్నాధ్యాయంలో చెప్పబడిందట (శృం.శాకుం. 1-128).

"హర్మ్యంబు వెడల వాయసము చేరువఁ దీర్చె వృషభంబెదుర అంకెవేసి నిలిచె
వాడలో శునకంబువచ్చెను దక్షిణంబుఁగ పూర్ణకుంభంబు లెదురు పడియె
గవని వెల్పల బెరికయుఁ బోతువలగొనె వలతెక్కఁజూపెఁ జేవలఁతిఁ జెమరు
పరువునేలను వచ్చెఁబాల పయ్యెరవంక కుడి నుండి యెడమకు నడచె నక్క

నీవు వేఁటకు విచ్చేయు నెడ నృపాల!
పంబి పెండ్లికి నగుశకునంబులయ్యె
నేఁడు గొల్లలమాట మన్నించి నిలిచి
మృగయ కరుగుట మిక్కిలి మేలు తేపు"

[శృం.శాకుం. 1-132]

మేడ నుంచి దుష్యంతుడు వేటకు వచ్చేటప్పుడు కాకి దగ్గరకు వచ్చింది, ఎద్దు ఎదురుగా వచ్చి రంకెవేసి నిలిచింది, కుడిగా కుక్క వచ్చింది, నీటితో నిండిన కుండలు ఎదురుపడ్డాయి, ద్వారంబైట బెరిక ప్రదక్షిణం చేసింది, చెమరుకాకి సమీపంలో కుడిరెక్కను చూపింది, పాలపిట్ట మందమారుతం వైపు కోసుదూరం వచ్చింది, నక్క కుడినుంచి ఎడమకు వచ్చింది, ఇవన్నీ పెళ్ళికి వెళ్ళేటప్పటి శకునాల వలె రాజుకు ఉన్నట్లు చెప్పబడ్డాయి. మగవారికి కుడిభుజం అదరటం (శృం.శాకుం. 2-50), వామలోచనలకు వామలోచన మదరటం (శృం.శాకుం. 3-102) శుభ సూచనలుగా పేర్కొనబడ్డాయి.

ఔచిత్యదృష్టి కవికి మిక్కుటంగా ఉంది. మేనకా విశ్వామిత్రుల శకుంతలా దుష్యంతుల రతివర్ణన సూచనమాత్రంగానే ఉందికాని అతివేలంగా లేదు. 'సభా స్థలంబుల స్త్రీ జనులంబొడసూపించుకొనుట యనర్థంబని యందఱవీడు కొలిపి నగరిలోనికిం జని యంతఃపురాంతికంబున నేకాంత సౌధంబున నాసీనుండై మాన్యులగు వృద్ధకాంతలంబనిచి వారల రప్పించుకొని.... '(4-100) అని వ్రాయటం వల్ల స్త్రీలపట్ల రాజుల గౌరవం తెలుస్తుంది. ఇట్టి ఔచిత్య పరిపోషణ పూర్వ కావ్యాలలో మృగ్యం. మద్యపాన ద్యూతాదుల గూర్చి వ్రాయక పోవటం వల్ల కవికి వాటి పట్ల ఉన్న ఏహ్యాభావం తెలుస్తోంది. కణ్వమహర్షి శకుంతలకు 'కేవల పతి భక్తియ చాలు నిహముఁ బరము ఘటింపన్' (శృం.శాకుం. 4-80) మొదలైన నీతుల్ని చెప్పి అనేక కుల కన్యకా ధర్మాల్ని (శృం.శాకుం. 4-81, 82) విశదం చేస్తాడు. కణ్వమహర్షి దుష్యంత సుతునికి చేసిన ఉపదేశాల సారాన్ని మనం పరిశీలిస్తే పినవీరభద్రునికి కల రాజకీయపరిజ్ఞానం (శృం.శాకుం, 4-162) నుంచి 178 వరకు) మనకు విశదమౌతుంది.

ఏ కవి ఐనా కాలానికి ప్రతినిధి. సమకాలీన సాంఘిక పరిస్థితులు కవిత్వంలో ప్రతిబింబిస్తాయి. శృంగార శాకుంతలాన్ని బట్టి పినవీరన నాటి

ఆచారవ్యవహారరాలు ఇంకా అనేక విశేషాలు మనకు తెలుస్తాయి. ఆకాలంలో వేటకుక్కలకు పులి మల్లడు, అడవి పోతులరాజు, గరుడుడు, గాలివేగం, పందేల పసిడి, విష్ణుప్రసాదం, వేడిగుండు, పచ్చిమిర్యము, వెఱ్రిపుచ్చకాయ, వేట మాణిక్యం, విరవాది, మెడబల్మి పెట్టుగాడు, ఉపకారి, పిడుగు తునుక, జిగురుడు, చిత్రాంగి, శ్రీరామబాణం, పులియడు, కస్తూరి, బొడ్డుమల్లె (శృం.శాకుం. 1-108) అనే పేర్లు ఉండేవని తెలుస్తోంది. వేటకు వెళ్ళేటప్పుడు ఆటవికులు తీసుకొని వెళ్ళే ఉరులు, జిగురుగండె తెరలు, బోనులు, వారు వారెనలు, వసులు, గసులు, మిళ్ళు, వలలు, పేట్లు, గోళ్ళు, దీమాలు (శృం.శాకుం. 1-116) మొదలైన సాధనాలు ఉండేవని తెలుస్తోంది. నాడు భోజనానికి ఆహ్వానించి నప్పుడు అంగీకరించకపోవటం, తాంబూలగంధ పుష్పాలు ఇచ్చి నప్పుడు వద్దనటం మర్యాదకాదు (శృం.శాకుం. 1-130) అని తెలుస్తోంది. బాలెంతరాండ్రకు కానుకలు ఇవ్వటం (పురిటాలి తగవు) ఆనాటి ఆచారం (శృం.శాకుం. 2-45; 4-62), దిష్టి తీసే ఆచారం ఆనాడుండేది. ఆకాలంలోనే తెరబొమ్మలున్నట్లు వాటిని ఆటకాడు ఆడించే వాడని మనకు అర్థమౌతుంది (శృం.శాకుం. 3-125). జాతరలో గొర్రెల్ని బలిఇచ్చే ఆచారం ఆనాడు ఉన్నట్లు తెలుస్తోంది (శృం. శాకుం. 3-130). 'అహహ యభ్యాస వేళ బాల్యంబునందు వ్రాసి చదివిన యాఅక్షరముల చేత వశ్యముగఁ జేయవచ్చు భావజ విరోధి' (శృం.శాకుం. 4-5) అని పినవీరన పేర్కోటం బట్టి నాటి విద్యాభ్యాసం 'ఓం నమశ్శివాయ'తో ప్రారంభ మయ్యేదని తెలుస్తోంది. అల్లుళ్ళు అత్తవారిపై నేరాలెన్నటం అప్పుడు కూడా ఉంది (శృం.శాకుం. 4-73) పాపిటసిందూరం పటీర తిలకం పెట్టు కోటం, చెవాకు, గాజులు ధరించటం తాంబూలం వేసుకోటం, కొప్పులో పువ్వులు పెట్టుకోటం, సంతతభర్తృ ఫలాభి వృద్ధికి దోహదకారులుగా భావించ బడ్డాయి (శృం.శాకుం. 4-78).

అపూర్వ 'శృంగార శాకుంతల' కావ్యనిర్వహణ జనిత యశోరాజి విరాజిమైన పినవీరభద్ర కల్పతరువు ఆంధ్ర సారస్వత లోకంలో ఆచంద్రార్కం తన కవితామోదాన్ని వెదజల్లుతుంది.

## కొన్ని పదాలకు అర్థాలు

అంతికము = సమీపం
ఉదపూర్ణ కుంభము = నీటి నిండుకుండ
ఎనయు = కలియు
కరిణి = ఆడఏనుగు
కైదండ = చేయూత

కొనకొను = పూను
క్రమ్మఱ = మఱల
క్రొవ్విరి = కొత్తపువ్వు
గండకము = ఖడ్గమృగం
గంధగజము = మదపుటేనుగు
గవను = పురద్వారం
చెమరు = చెమరుకాకి
చేతః పద్మము = మనః పద్మం
చేవలఁతి = సమీపం
చొక్కు = పరవశించు
డాయు = సమీపించు
తన్వంగి = సన్నని శరీరం కలది, స్త్రీ
తారాద్రి = ప్రకాశించే పర్వతం, కైలాసం
తావి = వాసన
తీర్చు = (శుభాశుభసూచకంగా పిట్టలు మొదలైనవి) ఒక పక్కనుంచి మరొక పక్కకి పోవు
దక్షిణము = కుడి
దేవగణిక = దేవవేశ్య (మేనక)
ధృతి = ధైర్యం
నగరు = అంతఃపురం
నెమ్మి = ప్రేమ
పనుచు = పంపు
పంబు = అతిశయించు
పయ్యెర = మందమారుతం
పరువునేల = కోసునేల
పాల = పాలపిట్ట
పురిటాలి తగవు = బాలింతరాలికి ఇచ్చే బహుమానం
పేర్మి = పెంపు
పోతు = పురుష శ్రేష్ఠుడు
బెరిక = పక్షివిశేషం
భావజ విరోధి = మన్మథుని శత్రువు, శివుడు
మనోజాతుఁడు = మనస్సులో పుట్టిన వాడు (మన్మథుడు)
మృగయ = వేట
లతాంతావాస సీమ = పొదరిండ్ల ప్రదేశం

వంక = వైపు
వజ్రసూచి = రత్నాలకు రంధ్రాలు చేసే వజ్రపు సూది
వలగొను = ప్రదక్షిణం చేయు
వలరెక్క = కుడిరెక్క
విధి = బ్రహ్మ
శరభము = సింహంకంటె బలమైన ఎనిమిదికాళ్ళ జంతువు
హరిణి = ఆడలేడి
హర్మ్యము = మేడ.

## ఆధార గ్రంథాలు


1. శృంగారశాకుంతలము – వావిళ్లవారిప్రతి – 1970
2. ఆంధ్రకవి తరంగిణి (6 వ సంపుటం) – చాగంటి శేషయ్య
3. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (6 వ సంపుటం) – ఆరుద్ర
4. శారదామంజీరము – 1971.

# మొల్లరామాయణము — మొల్ల

## సమీక్ష : డా॥ కోలవెన్ను మలయవాసిని

[జన్మస్థలం — ముక్కామల, తణుకు తాలూకా. జననం — 8-1-1944 ఎం.ఏ.,పిహెచ్.డి. లెక్చరర్, తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు. ముద్రితకృతులు — పువ్వులు. (Awarded Prize in sixteenth Prize Competition of Books for Neo-literature; (By govt. of India) (Ministry of Education). తెలుగు కవయిత్రులు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు స్వర్ణోత్సవ ప్రచురణ. రామాయణము – పశుపక్ష్యాదులు మొ. 9 వ్యాసాలు సాహిత్య పత్రికలలో ప్రచురింపబడ్డాయి. 10 అంశాలపైని రేడియో ప్రసంగాలుచేశారు.]

కవి జీవితాదులు :

ఆంధ్ర వాఙ్మయరంగంలో నన్నయ ఆదికవి. మొల్ల తొలి కవయిత్రి. నన్నయ రచన భారతం. మొల్ల రచన రామాయణం. ఆంధ్ర వాఙ్మయం ఆవిర్భవించిన నాలుగు వందల సంవత్సరాల వరకు ఎక్కడా కవయిత్రి నామం వినబడదు. 15 వ శతాబ్దిలో మొల్ల ఎట్టి రాజాశ్రయమూ లేకుండా స్వయంగా రామాయణాన్ని కావ్యంగా వ్రాసి రామచంద్రునికే అంకితమిచ్చింది. ఆ రచనతో ఆంధ్ర సారస్వత లోకంలో ప్రౌఢ రచన చేయగల కవయిత్రులున్నారని స్పష్టమయింది.

మొల్ల అంటే మల్లెలజాతిలో సన్నగా ఉండే పువ్వు. ఆవిడ పేరులాగే ఆమె కవితకూడా సరస సౌరభాన్ని విరజిమ్ముతూ ఉంటుంది. 'వాసించు కవిత చెప్పిన' అనే విధంగా ఆమె కవిత గుబాళిస్తూ ఉంటుంది.

మొల్ల పూర్వ కవిస్తుతిలో 'రసికుడైనట్టి శ్రీనాథు' అని శ్రీనాథుడు వరకుగల తెలుగు కవులను పేర్కొని—తొల్లిటి యిప్పటి సత్కవి వల్లభులను భక్తిగ దలతునన్నది. అలా చెప్పడం వల్ల తొల్లిటి కవులు నన్నయాదులు. ఇప్పటి కవి శ్రీనాథుడు కావలసి ఉంది. శ్రీనాథుఁడు వృద్ధుడై ఉండగా మొల్ల ఈ రచన చేసి ఉండవచ్చునని భావించుకోవచ్చు.

గురులింగజంగమార్చనపరుడు, శివభక్తిరతుడు, బాంధవహితుడు అయిన ఆతుకూరి కేసయసెట్టి వరపుత్రిక మొల్ల. కేసనసెట్టి సూరిజన వినుత కవితా చమత్కారికూడా. అట్టి కవితా చమత్కారి పెంపకంలో మొల్ల కవితామతల్లి అయింది. గోపవరపు శ్రీకంఠమల్లేశుని వరముచేత నెఱి కవిత్వంబు చెప్పగా నేర్చుకొంటినని

మొల్ల వచనం. కాగా ఆమె నెల్లూరు మండలంలో గోపవర గ్రామ నివాసిని అన్నమాట.

కథ :

ఇక ఈమెకృతి రామాయణం. కరుణ రసాత్మకమయిన కమనీయగాథ రామకథ. ఇంచలి ఇతివృత్తము జగత్ప్రసిద్ధము. ఆదికవి వాల్మీకి రచనమైన సంస్కృత రామాయణాన్ని తెలుగులో సంక్షిప్తంగా, సమగ్రంగా, సుందరంగా చెప్పింది మొల్ల. అయితే ఆమె మొదటి ఆరుకాండలలో కథనే గ్రహించింది. ఉత్తరకాండలోని కథను మొల్ల ఎత్తుకోలేదు. మొల్లకంటె ముందు ఆంధ్ర వాఙ్మయంలో తిక్కన, గోన బుద్ధారెడ్డి, ఎఱ్ఱన, భాస్కరాదులు రామాయణం వ్రాసారు. అయితే వారి రచనలు విస్తృతాలు. తిక్కనది—ఉత్తరకాండ ఒక్కటే. రంగనాథ, భాస్కర రామాయణాలు అసలు కథకు మరిన్ని పుక్కిటి పురాణాల్ని జత చేసాయి. ఎఱ్ఱన రామాయణం అలభ్యం. ఇక దొరికిన వాటిలో సంక్షిప్తమూ సులభసుందరమూ అయిన రామాయణం మొల్లదే అని చెప్పవచ్చు. ఒకతరం వెనుకటి వరకు అసలు మొల్లరామాయణాన్ని వీధిబడుల్లో విద్యార్థులకు పాఠంగా చెప్పేవారు.

వస్తుతత్త్వము :

ఉత్తమ లక్షణాలన్నీ తన కావ్యంలో యథోచితంగా ప్రయోగించి రామాయణ రచన చేసింది మొల్ల. బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందరకాండలు ఒకొక్క ఆశ్వాసంలో ముగించి కథను మహావేగంతో నడిపించిందామె. యుద్ధకాండ ఒక్కటే మొల్ల మూడాశ్వాసాలుగా వ్రాసింది. కథాకథనంలో మొల్ల ఆదికవి వాల్మీకి రచనకు భిన్నంగా కొంత తీర్చింది. అయితే ఆ ఘట్టాలు కొన్ని అధ్యాత్మ రామాయణంలోను, కొన్ని ఆనందరామాయణంలోనూ ఉన్నవే. పుత్రకామేష్టిలో యజ్ఞపురుషుడిచ్చిన పాయసాన్ని దశరథుడే స్వయంగా ముగ్గురు భార్యలకు పెట్టినట్లు వాల్మీకి వ్రాయగా—మొల్ల—దశరథుడు కౌసల్యకు, కైకకు పాయసం చెరిసగం పెట్టాడనీ—వాళ్లిద్దరూ తమతమ భాగాల్లో సగం సగం సుమిత్రకు ఇచ్చారనీ వ్రాసింది. ఈ విధమైన పంపకం అధ్యాత్మరామాయణంలో ఉంది. అలాగే గుహుడు రాముని కాళ్లు కడగడం అనే ఘట్టాన్ని మొల్ల అధ్యాత్మ రామాయణం నుండి గ్రహించింది. శ్రీరాముని పాద స్పర్శవల్ల రాయి అహల్యగా మారిన విషయం ఆనాడు దేశమంతటా వింతగా వ్యాపించింది. ఆ వార్త పడవ నడుపుకునే గుహుడి చెవినికూడా పడింది. దాంతో రాముడు నావనెక్కుతాడన గానే, గుహుడికి భయం పట్టుకుంది. రామపాదరజం సోకితే కఱ్ఱతో చేసిన తన నావ ఏమయిపోతుందో అనే భయంతో రాముని కాళ్లు కడిగి మరీ నావ నెక్కించాడు. గుహుడి పాత్రమాటుగా రాముని శ్రీపాదములు కడిగిన మహా

భక్తురాలు మొల్ల. రామపాదాల ప్రశంస వచ్చినప్పుడల్లా మొల్ల శ్రీపాదములనే భక్తితో పేర్కొంటుంది. ఇవికాక కాలనేమి వృత్తాంతం—విభీషణుడు రావణుని నాభీమూలంలో అమృతభాండ మున్నదని రామునితో చెప్పడంవంటి విషయాలు మరికొన్ని వాల్మీకానికి భిన్నంగా సాగిన ఘట్టాలు.

అవాల్మీక ఘట్టాలు ఉన్నా ఆమె రచన సంక్షిప్తంగా సమగ్రంగా ఉంది. ఉదాహరణకు—సుందరకాండలో సీత హనుమంతుణ్ణి రామలక్ష్మణుల రూపురేఖా విలాసాలెట్టిలో వివరించమంటుంది. ఆ సందర్భంలో మొల్ల ఒక సీసపద్యం వ్రాసింది. అది—

"నీలమేఘచ్ఛాయఁ బోలుదేహమువాఁడు
ధవళాబ్జపత్ర నేత్రములవాఁడు
కంబు సన్నిభమైన కంఠంబు గలవాఁడు
బాగైనయట్టి గుల్ఫములవాఁడు
తిన్ననై కనుపట్టు దీర్ఘబాహులవాఁడు
ఘనమైన దుందుభి స్వనమువాఁడు
పద్మరేఖలుగల్గు పదయుగంబులవాఁడు
చక్కని పీనవక్షంబు వాఁడు

తే. కపటమెఱుఁగని సత్యవాక్యములవాఁడు
రమణి! రాముండు శుభలక్షణములవాఁడు
ఇన్నిగుణముల రూపింప నెసఁగువాఁడు
వరుస సౌమిత్రి బంగారు వన్నెవాఁడు."

[సుందర-102]

ఇలా శ్రీరాముని రూప గుణాదికాలన్నీ చెప్పి చివరగా ఈ లక్షణాలన్నీ సౌమిత్రికికూడా సరిపోతాయి. కాకపోతే అతని రంగుమాత్రం బంగారు రంగు అంది. మరేకవి అయినా ఈ సందర్భంలో లక్ష్మణుని వర్ణనకు మరో సీస పద్యమయినా వ్రాసేవారు. లక్ష్మణుని గురించి చెప్పేటప్పుడు సాధారణంగా మొల్ల సౌమిత్రి అనే వ్యవహరిస్తుంది. రామసౌమిత్రులు, సౌమిత్రి భూపుత్రులు అనే సమాసాలు ఈమె రచనలో అధికంగా కనిపిస్తాయి.

పాత్రచిత్రణ: రామాయణంలోని ప్రసిద్ధ పాత్రలన్నీ ఈ కవయిత్రి చేతిలో ఉదాత్తంగానే తీర్చబడ్డాయి. స్త్రీ రచన కావడంతో అందరికంటే సీత పాత్ర మరింత మహోన్నతంగా తీర్చబడింది. సీతారావణుల సంభాషణ, సీతాహనుమంతుల సంభాషణ పరిశీలించినట్లయితే సీతపాత్రను మొల్ల ఎంతనేర్పుతో తీర్చిందో స్పష్టమవుతుంది.

అశోకవనంలోఉన్న సీతచెంతకు రావణుడువచ్చి — రామాదులను గూర్చి—'జడలు ధరించి తపసుల చందమున, కూరగాయలు కూడుగా కుడుచు రాముడేరీతి లంకకు రాగలండు' అంటాడు. అంతేకాదు — 'ఇంక చేయలేరు ఈదంగ నోపరు, వారధి కట్టలేరు, చుట్టిరాలేరు జలధిదాటగ నరులకు లావు చాలదు' అంటూ రామలక్ష్మణులు లంకకు రావడం అసంభవం అని బెదిరిస్తాడు. అప్పట్టున సీత బేల అయిపోక—తొణకక బెణకక ధైర్యంగా రావణుడికి సమాధానం చెప్తుంది. రాముని శౌర్య సాహసిక కృత్యాలన్నిటినీ వివరిస్తూ రాముడంటే సామాన్యుడు కాడు. బాల్యంనుండీ రాక్షస సంహారం చేసిన మహా వీరుడతడు. అట్టి రామునకు నీవనగ ఎంత నీలావు చేవఎంత చెప్పనేటికి నీవ చూచెదవుగాక! అని అతిధైర్యంగా సమాధానం చెప్తుంది. హనుమంతుడు సీత అవస్థ చూడలేక, అమ్మా! నా భుజాలమీద ఎక్కించుకుని మిమ్మల్ని రాముల వారి వద్దకు చేరుస్తానంటాడు. లంకనుండి, రావణుని బారినుండి ఎంత శీఘ్రంగా తప్పకుందామని ఉన్నా సీత లోకధర్మాన్ని గుర్తించి రాముడు వచ్చి రావణునితో యుద్ధంచేసి గెలిచి బాహాటంగా తీసుకుపోకుండా ఇలా దొంగతనంగా నన్ను తీసుకువెళ్లినట్లయితే రావణుడికంటె రాముడే పెద్ద దొంగ అంటుంది లోకం. కాబట్టి అది మంచిపద్ధతి కాదంటుంది సీత. ఈ ఘట్టంలో సీత భావన ఎంత ఉదాత్తంగా తీర్చిందో చూడండి మొల్ల. మా జానకి చెట్టపట్టగ మహరాజు వైతివి అంటూ సీతవల్లనే రామునకు కీర్తి అంటాడు త్యాగరాజు. అది అక్షరాలా నిజమనిపించింది మొల్లతీర్చిన సీత.

రాముణ్ణిగూర్చి విభీషణుఁడు చెప్పిన ఒకపద్యంలో మొల్ల రాముని స్వరూప స్వభావాలకు అద్దంపట్టింది.

ఆ. చంపవచ్చినట్టి శత్రువునైనను
శరణుచొచ్చునంత సదయుఁ డగుచు
నభయమిచ్చి కాచుటాతని బిరుదంట
సీతనిచ్చి రాముఁజేరి బ్రతుకు.

[యుద్ధ. ప్రథమా. 18 ప.]

అంటూ రావణునకు హితవుచెప్తూ విభీషణుడు రాముడెంతటి క్షమాశీలో వివరిస్తాడు.

పద్యరచనలో క్రియాపదాలతో పద్యాన్ని ప్రారంభించి సందర్భోచితంగా ఆయాపాత్రలకు మహదానందాన్ని కలిగింపచేయడం మొల్ల ప్రత్యేకత.

అశోకవనంలో సశోకంతో దీనురాలై ఉన్న సీత రావణుడువచ్చి బెదిరించి వెళ్లిన తరువాత తనకు దిక్కెవ్వరు లేరని దుఃఖిస్తుండగా అక్కడే చెట్టుమీద ఉన్న హనుమంతుడు :

క. ఉన్నాడు లెస్సరాఘవుఁ
డున్నాఁడిదెకపులగూడి యురుగతిరానై
యున్నాడు నిన్నుఁ గొనిపో
నున్నాఁడిది నిజము నమ్ము మూర్వీతనయా !

[సుందర. ప. 91]

అంటూ వినీవినగానే సీతమ్మ ప్రాణాలు కుదుటపడేలా హనుమంతుడిచేత పల్కించింది మొల్ల. సీతమ్మతల్లినేకాదు, సీతజాడ తెలియక వగచే రామయతండ్రి చెంతకు, లంకనుండి వస్తూ హనుమంతుడు బిగ్గరగా "కంటిన్ జానకిఁ బూర్ణచంద్ర వదనన్" (సుందర. ప. 245) అంటూ రాముడికీ ఆనందాన్ని కలుగచేస్తాడు.

వర్ణనలు : వర్ణనల విషయంలో మొల్ల ప్రబంధకవుల పంక్తిలో నిలువ గలట్టిది. అయోధ్యానగర వర్ణనలో శ్లేష, విరోధాభాసాలంకారాలను విరివిగా ప్రయోగించి మొల్ల తన పాండిత్య ప్రకర్షను ప్రదర్శించింది. చలద్రూప వర్ణనకు ఉదాహరణగా కుప్పించి ఎగసిన హనుమంతుణ్ణి చూడవచ్చు.

"పదములూనఁ ద్రొక్కి వదనంబుదిగఁ జూచి
చేతులూని నడుము చిక్కఁబట్టి
క్రుంగి నిక్కియెగసి కుప్పించి వడిదాఁటి
చనియె గగనవీథి ననిల సుతుడు."

[యుద్ధ. ద్వితీ. 64 ప.]

అంటూ హనుమంతుని చేష్టలన్నిటినీ వివరించింది మొల్ల.

స్త్రీ అయినా మొల్ల యుద్ధవర్ణన చాలా చక్కగా చేసింది. చిన్నచిన్న కంద పద్యాలో రామరావణ యుద్ధాన్ని నడిపిందామె. ఆ కందాలు ఆమె కవితకొక క్రొత్త అందాన్ని యిచ్చాయనవచ్చు. ఉదాహరణకు నాలుగు కందాలు కందాము :

"గిరిగిరి నభము నభంబున
ధరధరయును జలధిజలధిఁ దార్కొను రీతిన్
సురరిపుఁడు నసురరిపుఁడును
దురమున నెదురించి రధిక దోర్బల యుక్తిన్."

[యుద్ధ. తృ. ఆ. 53 ప.]

"జాఱకుమా బీరము చెడి
పాఱకుమా రిపులు నవ్వ భయపడి వనమున్
దూఱకుమా పేర్కొంచును
జీఱకుమా కపుల దోడు చేకొని పోరన్."

[యుద్ధ. తృ. ఆ. 45 ప.]

"నీ లావును నా లావును
వాలాయము సురలు సూచి వర్ణింపఁగనేఁ
డాలము లోపలఁ జూపు ద
మేలాగర్వోక్తు లిప్పుడినకులతిలకా !"

[యుద్ధ. తృ. ఆ. 81 ప.]

"ఒత్తిలి రాముడు దైత్యుని
కుత్తుక నొక కోలఁ ద్రుంచి కూల్చుట దొడ్డో
నెత్తురు గ్రమ్మక మున్నె
మొత్తములుగఁ దలలు మరల మొలచుట దొడ్డో !"

[యుద్ధ. తృ. ఆ. 94 ప.]

యుద్ధభూమిని చూచినవారో, స్వయంగా యుద్ధం చేసినవారో, యుద్ధవర్ణన చేయడం దొడ్డో, యుద్ధరంగంతో పరిచయం లేని మొల్ల ఈ వర్ణన చేయడం దొడ్డో సహృదయ పాఠకులే నిర్ణయించాలి.

మొల్ల వర్ణనలలో ప్రత్యేకంగా చెప్పుకోవలసింది మరొక్కటి ఉంది. అది వర్ణోన్మీలనం. అంటే రంగులనుగూర్చి ఆమె చెప్పే తీరన్నమాట. ఆమె గంటం నుండి ఆ రంగుల విషయం వివిధ భంగుల్లో జాలువారింది. ఉదాహరణకు మొల్ల వర్ణించిన చీకటిని – వెన్నెలని చూద్దాం—

"అవని అంతటా వ్యాపించిన చీకటి—
కారు మొగులు రీతిఁ గాటుక చందాన
నీటిభాతి నింద్రనీలమహిమ
మాషరాశిపోల్కి మఱిమఱి యపుడంధ
కార మవనియెల్లఁ గలయఁ బర్వె."

[అయోధ్య. 9 ప.]

నల్లని మేఘాలవలె, కాటుకవలె, నీరువలె, ఇంద్రనీలాలవలె మినుగులు రాశిపోసి నట్లుగా జగత్తంతా నల్లగా ఉందంటుంది. ఇక్కడ అన్నీ నల్లటి వస్తువులనుగూర్చి చెప్పింది. వెన్నెల వర్ణన మరో పద్ధతిలో చేసింది. వెన్నెల ప్రకాశిస్తోంది. ఆ వెన్నెలలో జగత్తంతా శ్వేతమయంగా ఉంది. ప్రతి వస్తువూ తెల్లగా మారిపోయింది అని చెప్పడానికి—

"నారదులైరి సన్మునులు, నాకమహీజములయ్యె భూజముల్
శారదలైరి భామినులు, శంకరశైలములయ్యె గోత్రముల్
పారదమయ్యె నీరధులు, పన్నగ నాయకులయ్యె నాగముల్
వారిద వర్గమెల్ల సితవర్ణములయ్యెను బండువెన్నెలన్."

[అయోధ్య. 15 ప.]

అంటుంది. అంటే — నారదుడు తెల్లనివాడు కదా! అందువల్ల మునులందరూ నారదులయ్యారంటుంది. చెట్లన్నీ కల్పవృక్షాలయ్యాయట. కల్పవృక్షం తెలుపు కదా! శారద తెలుపు. కాగా స్త్రీలందరూ శారదలయ్యారట. పర్వతాలన్నీ తెల్లగా కైలాసపర్వతాలయ్యాయట. సముద్రాలన్నీ పాదరసంలా తెల్లగా మెరిసిపోతున్నాయట. పాములన్నీ శేషుడులా తెల్లగా అయ్యాయట. నల్లటి మేఘాలన్నీ తెల్లగా అయిపోయాయట. ఇదీ ఆమె వర్ణనా చమత్కృతి.

ఆత్మీయత :

తాను రామాయణం రచించడానికి కారణం శ్రీరాముడే అంటుంది మొల్ల.

"చెప్పుమని రామచంద్రుడు
చెప్పించిన పల్కుమీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపర సాధన
మిప్పుణ్య చరిత్ర తప్పులెంచకుఁడు కవుల్."

(పీఠిక 13 ప.)

రాముడు చెప్పమంటే చెప్తున్నాను. ఇహపర సాధనకై వ్రాస్తున్నాను. ఈ నా కవితలో తప్పులెంచకండని కవులకు వినయంతో విన్నవించింది. రాజితకీర్తియైన రఘురాముని చరిత్రమున్ కవీశ్వరులు తేజ మెలర్ప జెప్పిరని తెల్పియు–భూజన కల్పకంబగుచు భుక్తికి ముక్తికి మూలమైన–ఆ రాజు–దైవము–అయిన రఘురాము నుతించిన దప్పు కల్గునా అని పాఠకుల్ని ప్రశ్నిస్తుందామె.

లోకంలో రాజులను స్తుతిస్తే వారు భుక్తికి లోటు లేకుండా చేయగలరు. ముక్తి విషయం వారేం చేయలేరు. కాని, ఈ రాజు అంటే రాముడు భుక్తికి ముక్తికి మూలమైనవాడు. కాబట్టే ఇతనికి అంకితంగా ఈ కావ్యం వ్రాస్తున్నానంటుంది మొల్ల.

ఈ కవయిత్రి తాను శాస్త్ర వ్యాకరణ కావ్య నాటకాదులేవీ చదువుకోలేదనీ గోపవరపు శ్రీకంఠ మల్లేశుని వరముచేత కవిత్వం చెప్పడం అలవడిందనీ చెప్పుకుంది. ఎక్కడా ఏమీ చదువుకోలేదని చెప్పినా ఈమెకు కవిత్వం గురించి కొన్ని చక్కటి అభిప్రాయాలున్నాయి. ఆంధ్రీకరించేటప్పుడు కవి తన పాండిత్యం ప్రకటితమయ్యేలా మళ్లీ సంస్కృత శబ్దాలే తెలుగులో చెప్తే ఏమి రుచిగా ఉంటుంది చెప్పండి అని ప్రశ్నించి "తేనె సోక నోరు తియ్యనయేలా, శబ్దం వినీవినగానే అర్థం తెలియాలి. అలా కాకుండా ఆ రచన గూఢార్థ శబ్దాలతో నిండి ఉంటే మూగవాళ్లూ చెవిటివాళ్లూ ముచ్చటించుకున్నట్లుంటుంది అంటుంది." అంతేకాదు – తెనుగులో

కవిత్వం వ్రాసేవారు – కందువ మాటలు, సామెతలు అందంగా కూర్చినట్లయితే ఆ తెనుగుకవిత రుచియై వీనుల విందై అలరారుతుందంటుంది.

మొల్లకు రఘురాముని చరిత్ర విన్నకొలదీ క్రొత్త చవులూరిస్తూ పుణ్యస్థితిని కలిగిస్తూ వేదమై తోచబట్టి ఈ రామకథ కావ్యంగా వ్రాస్తున్నాను. కేవలం వెట్టినై మాత్రం కాదు అంటుంది. రామ నామ సుధారస పాన మంటే ఆమెకు అత్యంత ప్రియమైన విషయం. రామ నామ మాహాత్మ్యం వివరించడానికి—ఒక వారకాంత చిలుకను పెంచి ఆ చిలుకకు 'శ్రీరామ' అని పేరు పెట్టుకుని రామారామా అంటూ చిలుకను పిలిస్తేనే మోక్షం ఇచ్చాడు. ఇక భక్తితో రామా! అంటే కలిగే ఆనందం పొందే వైభోగం ఎంత గొప్పవి అని మొల్ల ప్రశ్న.

కవిత్వంలో కందువ మాటలు, సామెతలు ఉంటేగానీ తెనుగునకు పొందు కాదన్న మొల్ల తన రచనలో ఎన్నో సామెతలను ఆమెతలుగా పెట్టింది. సీతా కల్యాణానికి ఎందరో వచ్చారనడానికి బుజంబు, బుజంబు త్రోపులాడగ వచ్చా రంటుంది. శివధనస్సును చూచి బెదరిపోయా రనడానికి 'విల్లా ఇది కొండా' అనుకొన్నారంటుంది. మరణం ఆసన్నమైన దనడానికి 'కాలుడు కన్ను గీటె'—నంటుంది.

వెన్నతోబెట్టిన విద్య, ఒక తలకు తెచ్చెనేని, కంటిలో నెలుసు, చెవినిల్లుకట్టి, విన్నపము చేయ, నే డెల్లి శాంతింపుమా, కుయ్యోమొఱ్ఱో అను, కాలుబ్రేలు చెయ్యి కదపనోపక, మొదలైన ప్రయోగాలు అడుగడుగున కనిపిస్తాయి మొల్ల రచనలో.

భాగ్యవిస్తారుడైన రామభూపాలశౌరి పట్టాభిషిక్తుడై అశ్వమేధయాగము చేసి పదునొకొండువేల సంవత్సరములు రాజ్యమేలాడని చెప్తూ తన రచనను మంగళాంతకంగా పఠితకు శుభప్రదము సుఖప్రదమూ అయ్యేటట్లు ముగించింది మొల్ల.

కావ్య రచనా విన్యాసంలో మహాకవుల సరసన నిలుపగలిగిన కవయిత్రి మొల్ల.

"మొల్ల పలికె జాజిమల్లె రీతి"

## కొన్ని పదాలకు అర్థాలు

ధవళాబ్జము = తెల్లతామర
కంబు = శంఖము
సన్నిభము = సరియగు

గుల్ఫము = చీలమండ
దుందుభి = వాద్యవిశేషము
పీనవక్షంబు = విశాలమైన, బలిసిన వక్షస్థలము
సదయుడు = దయతోకూడినవాడు
ఉరుగతి = గొప్ప విధముగా
ఉర్వీతనయ = భూపుత్రిక సీత
అనిలసుతుడు = వాయుదేవుని పుత్రుడు, ఆంజనేయుడు
నభము = ఆకాశము
సురరిపుడు = దేవతల శత్రువు, రావణుడు
అసురరిపుడు = రాక్షసుల శత్రువు
దురము = యుద్ధము
బీరము = పరాక్రమము
వాలాయము = తప్పకుండ
దైత్యుడు = రాక్షసుడు
కుత్తుక = గొంతు
కోల = బాణము
కారు మొగులు = నల్లని మేఘము
మాషరాశి = మినుగుల గుంపు
నాకమహీజము = కల్పవృక్షము
భామిని = స్త్రీ
శంకరశైలము = కైలాసము
పారదము = పాదరసము
పన్నగ నాయకుడు = శేషుడు
వారిద వర్గము = మేఘ సమూహము
నాగము = పాము
సితవర్ణము = తెల్లని రంగు.

## ఆధార గ్రంథాలు


1. మొల్ల రామాయణము- పీఠిక—ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ.
2. మొల్ల రామాయణము—ఎమెస్కో ప్రచురణ.
3. తెలుగు కవయిత్రులు—ఆంధ్ర విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవ సందర్భమున శారదదరహాసములలో ప్రచురింపబడినది.

# మనుచరిత్రము — అల్లసాని పెద్దన

## సమీక్ష : డాక్టరు అత్తలూరి నరసింహారావు

[ జన్మస్థలం: చిక్కాసానివారిపాలెం, తెనాలితాలూకా, గుంటూరు జిల్లా. జననం 1-6-1946. ఎం.ఏ., పిహెచ్.డి. లెక్చరర్, తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు. ప్రచురణము — కవితలు, కథలు, రావిశాస్త్రీయం (రా.వి. శాస్త్రి నిఘంటువు). 'తిలక్ కవితా తత్వం' పైని థీసిస్ వ్రాశారు. ]

కవిజీవితాదులు :

ఆంధ్ర సాహిత్యంలో స్వర్ణయుగమైన ప్రబంధ యుగం అల్లసాని పెద్దనతో ఆరంభమైంది. ప్రబంధ కవిత్వోద్యమానికి పెద్దన ప్రవక్త. మార్కండేయ పురాణంలో మసక మసకగా, 'స్వారోచిష మను సంభవ' కథను యుగ జీవనాన్ని, సమకాలిక భావ సంచలనాన్ని వ్యాఖ్యానించే శిరీష కుసుమ పేశల సుధామయ కావ్యంగా తీర్చిదిద్దాడు. పెద్దన వయసులో అద్వైత మతావలంభి. పరిసర సమాజంలోని వైష్ణవ మత ప్రాబల్యం, రాయల వ్యక్తిత్వం, శఠగోపయతి ప్రభావం పెద్దనను వైష్ణవుని గావించాయి. ప్రతిభావంతులు మత విషయంలో స్తంభీ భూత స్వభావులు కారు. ఆలోచనకు, అన్వేషణకు, సత్య దర్శనానికి వైష్ణవమతం పెద్దనకు ఆధారమైంది. మత పునరుద్ధరణ దృష్టితో కాక సమకాలిక భావాలకు ప్రాతినిధ్యం వహిస్తూ యుగానికి స్వభావాన్నిచ్చిన మహాకవులలో పెద్దన ప్రథమగణ్యుడు. శిల్పంలో, వస్తువులో, రచనా పరమార్థంలో, వ్యక్తిత్వంలో పెద్దన ఆంధ్రకవి పరంపరకు గురుపీఠం.

అల్లసాని పెద్దన జన్మస్థలం బళ్ళారి జిల్లాలోని దొరాలయ లేక దోరాల అని కొందరు; కడప జిల్లాలోని కోకట గ్రామంగాని, సమీపంలోనే వున్న పెద్దనపాడు గ్రామంగాని అని మరికొందరు విమర్శకుల అభిప్రాయం. అల్లసాని పెద్దన నందవరీక స్మార్తనియోగి. తండ్రి పేరు చొక్కనామాత్యుడు. పెద్దన తాత్విక గురువు పేరు శఠగోపయతి. రాజగురువు. శ్రీకృష్ణదేవరాయలు ఆస్థాన కవిగా పెద్దన రాయలచేత స్వయంగా గండపెండేరం తొడిగించుకున్నవాడు. మనుచరిత్ర మహాకావ్యానికి ముందు 'హరికథాసారం' అనే పద్యకావ్యం పెద్దన రచించాడు. దీనిని తన గురువైన శఠగోపయతికి అంకితం చేశాడు. ఇప్పుడా గ్రంథం అలభ్యం. రంగరాట్ఛందంలో ఉదాహరించిన అయిదారు పద్యాలు

మాత్రమే పెద్దన హరికథాసారం రచించాడని చెప్పటానికి సాక్ష్యాధారాలుగా మిగిలాయి. అల్లసాని పెద్దన 1470–1533 మధ్యకాలం వాడని విమర్శకుల అభిప్రాయం.

కథాసంగ్రహం :

ఆ ఊరి పేరు అరుణాస్పదపురం. ఆ ఊళ్ళో వున్న ప్రవరుడు అందగాడు, నిష్ఠాగరిష్ఠుడు. అతిథులకి నిరతాన్నదానం చేసేవాడు. పుణ్యక్షేత్రాల్ని దర్శించాలనే కోరిక గలవాడు. ఒకనాడు ప్రవరుని ఇంటికి సిద్ధుడు అతిథిగా వచ్చాడు. ప్రవరుడు ఆతిధ్యమిచ్చి వివరాలు అడిగాడు. సిద్ధుడు తను తిరిగిన ప్రదేశాలన్నీ పాదలేపనంతో సంచరించగలుగు తున్నానని సమాధానం చెప్పాడు. దాంతో ప్రవరుని మనసులో మెరుపు మెరిసింది. పాదలేపనం ప్రసాదించి తీర్థయాత్ర ఫలం కలిగించమని ప్రవరుడు కోరాడు. సిద్ధుడు ప్రవరుని పాదాలకి పాదలేపనం రాశాడు. ప్రవరుడు కోరుకున్నాడు. హిమాలయాల్లో ప్రత్యక్షమయ్యాడు.

ప్రవరునికి హిమవత్పర్వత పరిసరాలు కనులవిందు కలిగించాయి, మంచు నీళ్ళు అంటి పాదలేపనం కరిగిపోయింది. ఇల్లు, ఇల్లాలు మనసులో మెదిలాయి. వికలిత మనస్కుడై ఆశతో ముందుకు నడిచాడు. అక్కడ రాశీభూతమైన అందం స్త్రీ రూపంలో కనిపించింది. ప్రవరుడ్ని చూసి ఆ స్త్రీ కదిలిపోయింది, కరిగిపోయింది. కోరికల గూళ్ళు కట్టుకుంది. ప్రవరుడు తన విషాద పరిస్థితి చెప్పి దోవచూపించ మని వేడుకున్నాడు. తను వరూధినినని పరిచయం చేసు కుంది. తనువు నీకే అంకితం చేశానని చెప్పుకుంది. ప్రవరుడిలో అంగీకారం కనిపించలేదు. వరూధినిలో కోరికల ప్రవాహం విజృంభించింది. ప్రవరుడ్ని అమాంతం ముంచేసింది. ప్రవరుడు ఆ ప్రవాహన్ని వెనక్కి నెట్టివేశాడు. వరూధిని కళ్ళలో కన్నీళ్ళు. మాటల్లో నిష్ఠూరాలు. ప్రవరుడు అగ్నిహోత్రుడ్ని ప్రార్థించాడు. అరుణాస్పదపురంలో అడుగు పెట్టాడు.

ఇదంతా మొదటనుండీ గమనిస్తున్న గంధర్వుని మనసులో విషపు కెరటం విచ్చుకుంది. శాంబరీ మహిమతో ప్రవరుని రూపాన్ని పొంది వేచివున్నాడు. నిజ ప్రవరుడే అనుకుని వరూధిని మళ్ళీ వేడుకుంది. మాయా ప్రవరుడంగీక రించాడు. ఫలితం గర్భం. కొన్నాళ్ళకి మాయాప్రవరుడు మాయమాటలు చెప్పి నిష్క్రమిస్తాడు.

వరూధిని బాలవీరకుమారుడ్ని కన్నది. మునులు స్వరోచి అని పేరు పెట్టారు. స్వరోచి పెరిగి పెద్ద వీరుడయ్యాడు. విశ్వకర్మ మంధర పర్వతం దగ్గర పట్టణాన్ని నిర్మించి ఇచ్చాడు. ఒకనాడు స్వరోచి వేటకి వెళ్ళినపుడు ఒక స్త్రీ ఆర్తనాదం చేసి రక్షింప మని కోరింది. ఆమె ఇందీవరాక్షుడనే గంధర్వుని కూతురు మనోరమ. తన శాప వృత్తాంతం మనోరమ స్వరోచికి వివరించి, తన

దగ్గరున్న అస్త్ర హృదయ విద్యను గ్రహించి రాక్షసుని సంహరించమని కోరింది. స్వరోచి ఆ విద్యను గ్రహించి రాక్షసుడ్ని సంహరించాడు. అంతట రాక్షసుడు దేవతా రూపాన్ని ధరించాడు. అతడు గంధర్వుడు.

ఇందీవరాక్షుడు వరూధినికి తమ్ముడు. స్వరోచికి మేనమామ. తన శాప వృత్తాంతం స్వరోచికి వివరించి నా శాపం ఫలించింది, నా కూతుర్ని స్వీకరించి, ఆయుర్వేద విద్యని గ్రహించమని కోరాడు. స్వరోచి, మనోరమల వివాహం వైభవంగా జరిగింది.

స్వరోచి మనోరమ చెలికత్తెలైన విభావసిని, కళావతిని కూడా వివాహం చేసుకున్నాడు. తన దాంపత్యం గురించి హేళనగా ఒకనాడు చక్రవాకి, హంస సంభాషణ మరొకనాడు మగలేడి మాటలు వింటాడు. ఇంకొకనాడు స్వరోచి వేటకు వెళ్ళాడు. ఒక అడవి పందిని చంపబోతుండగా ఆడలేడి వచ్చి అడ్డుపడి తన వృత్తాంతం చెప్పి వరించమని కోరుతుంది. స్వరోచి కౌగలించుకుంటాడు. ఆడలేడి వనదేవత రూపం ధరించింది. పలు స్త్రీలతో విహరించిన స్వరోచి విరక్తుడై వనదేవతతో సుఖంగా వున్నాడు. ఆమె గర్భవతి అయి కుమారుడ్ని ప్రసవించింది. అతడే స్వారోచిషుడు. ద్వితీయ మనువై వుండమని స్వారోచికి విష్ణువు పట్టం కట్టాడు. స్వారోచి ప్రజల్ని కన్నబిడ్డల్లా కాపాడాడు. దేశం సుభిక్షమై ప్రజలు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో సుఖించారు.

వస్తుతత్త్వం :

ప్రబంధోద్యానంలో తొలిఫలం మనుచరిత్రమని ఆంధ్ర కవిత్వ విశారదుల సిద్ధాంతం. కాని ప్రబంధాని కుండవలసిన ఏకనాయకాశ్రయం, వస్త్వైక్యత మనుచరిత్రలో కొరవడిందని ఆరోపణ. సహృదయునిలో అఖండానుభూతిని వస్త్వైక్యతే ప్రసాదిస్తుంది. వస్తుతత్వ వివేచనం పాశ్చాత్యం. గ్రీకు అలంకార శాస్త్ర సార్వభౌముడైన అరిస్టాటిల్ మహాశయుడు వస్త్వైక్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. "A play must begin at some definite point and at some definite point it must end." నాటక మొక స్పష్టమైన ఘటనతో ఆరంభమై ఒక స్పష్టమైన ఘటనతో అంతమొంది తీరాలి. వస్తుతత్వ మనేది కథను మాత్రమే ఆశ్రయించి వుండదు. వస్తువనగా భావం. కావ్యంలో ఒక ప్రధాన ఆధికారిక భావం ఆద్యంతంలో పోషింపబడాలి. దీనినే వస్త్వైక్యత అంటారు. కథా భాగాలలో అనేక కారణాలతో కొన్ని భాగాలకి దీప్తి రావచ్చు. అంత మాత్రాన వస్త్వైక్యతకు భంగం వాటిల్లిందని అనరాదు. మనుచరిత్రలో యుగధర్మ ప్రతిష్ఠాపకుడైన మనుసంభవం వస్తువు. సమకాలీనమైన భావ సంచలనాన్ని ఒక సమన్వయ దృక్పథంగా రూపొందించటానికి పెద్దనకు మను సంభవ కథ ఆధారమైంది. వరూధిని ప్రవరుల సన్నివేశం ప్రధాన కథకు బీజం.

గృహస్థాశ్రమ ధర్మం పతనం కాకుండానే ప్రవరుని మనసు వరూధినిపై ప్రభావం కావించింది. మాయాగంధర్వ సంపర్కంతో జాతి సాంకర్యం రక్షింపబడింది. వరూధినిలోని ప్రవాహశీలమైన స్త్రీ సౌందర్యం, గాఢప్రేమ, ఆశయ సాధనకు నిర్భీకత ; ప్రవరునిలోని నిష్ఠాగరిష్ఠత్వం ధార్మికత ; మాయాప్రవరునిలోని భోగలాలసత, ఇహలోక రక్తి, కళాకుశలత స్వరోచిగ అవతరించినవి. స్వరోచి జీవితం పరిపూర్ణమైన పురుషోత్తమ జీవితం. ఈ స్వరోచికి యుగధర్మ నిర్ణేత మనువు ఆవిర్భవించాడు. కనక కావ్యంలోని అన్ని విషయాలకి ఏక వాక్యత వుంది. విశృంఖల వర్తనం, ధర్మవ్యతిరేకత, రక్తిముక్తుల ఘర్షణ మొదలైన సమకాలీన భావ సంచలనం భిన్న పాత్రల్ని ఆశ్రయించి విభిన్న సన్నివేశాలలో వ్యక్తీకరించి చివరికి మను సంభవమనే కావ్య లక్ష్యాలతో దృక్పథ ప్రకటన గావించాడు. కనక మనుచరిత్రలో వస్త్వైక్యత లేదనటం అవిచార రమణీయం.

మనుచరిత్రలో స్వారోచిషమను సంభవమనే పరిపూర్ణ భావమే నాయకుడు. ఉత్తమ కావ్యంలో కవి దృక్పథమే (dominating idea) నాయకత్వం వహిస్తుంది. ఏకనాయకాశ్రయమనే ప్రబంధ లక్షణం ఈ విధంగా మనుచరిత్రలో సిద్ధించింది. మానవాంతరంగంలో ధర్మాధర్మాలకి, ధర్మానికి ధర్మానికి సంఘర్షణ, పరస్పర సమన్వయాలే మనుచరిత్రలో వస్తువు. వరూధినిది గంధర్వ జాతి ధర్మం. ప్రవరునిది వైదికాచార బద్ధమైన ధర్మం. ఇక్కడ ఘర్షణ ధర్మానికీ ధర్మానికే.

పాత్రచిత్రణ :

మహాకవి ప్రతిభకి గల ముఖ్య లక్షణాలలో పాత్ర చిత్రణ ఒకటి. ఆంధ్ర దేశంలో భారత, రామాయణ పాత్రల తర్వాత వరూధినీ ప్రవరులే ప్రసిద్ధ పాత్రలు. ఈ రెండు పాత్రలూ రెండు విరుద్ధ రసాలకి ప్రతినిధులుగా వున్నాయి. మిగతా పాత్రల కన్నా ఈ రెండు పాత్రల చిత్రణలోనే పెద్దనలోని మహా శిల్ప నైపుణ్యం కనిపిస్తుంది. సౌందర్యానికి, సాంప్రదాయానికి నిలయం ప్రవరుడు. ఉదయానే నిద్రలేచి భగవన్నామస్మరణ చేసి వరణానదిలో స్నానం చేస్తాడు. నిత్యాగ్ని హోత్రం, నిరతాన్న దానం అతని నిత్య కృత్యం. అతను అప్రతిగ్రహీత. ఇక వరూధిని అక్రమ కామ విజృంభణకు ప్రతినిధి. ప్రవరుడ్ని ప్రథమ వీక్షణలోనే కామించింది. ప్రవరుడు వరూధినిని సమీపించి ఆమె గురించి ప్రశ్నించి తన గురించి పరిచయం చేసుకున్న సందర్భంలోను, వరూధిని తన ఇంటికి ఆహ్వానించినపుడు చెప్పిన ప్రత్యుత్తరంలోను అతని చిత్తవృత్తి, నిష్కల్మషమైన మాటల ధోరణి, అమాయకత్వం, ఆతురత వెల్లడవుతుంది. తనని తాను నిందించుకోవటంలో శుద్ధ శ్రోత్రియ లక్షణం కనబడుతుంది. వరూధిని ముందు మర్యాదగా ప్రవరుడ్ని ఇంటికి ఆహ్వానిస్తుంది. ప్రవరుడు

సొంత ఇంటికి వెళ్ళాలనే తపనలోవుండి దోవ చూపెట్ట మంటాడు. అప్పుడు వరూధిని తమ వైభవం గురించి వివరంగా చెప్పి చివరికి నీ మీద మనసు పడిందని స్పష్టంగా చెబుతుంది. అప్పుడు దానికి ప్రవరుడు తన కులం గురించి, తల్లిదండ్రుల గురించి, ఇంటికి వెళ్ళకపోతే జరిగే నష్టం గురించి అమాయకంగా చెబుతాడు. వరూధిని నిష్ఠూరాలతో భోగం విషయమై, దానికి ప్రతిగా ప్రవరుడు పరమ అమాయకంగా ధర్మం విషయమై వాదించుకున్నారు. చివరికి ఇక లాభం లేదని ఆలింగనం ఆఖరి ఆయుధంగా వరూధిని ప్రయోగించింది. పాషాణమైన ప్రవరుడి మీద ఈ ప్రయోగం ఫలించలేదు. ఈ ఇద్దరు రెండు భిన్న వ్యక్తిత్వాలకి, సంస్కారాలకి, సంప్రదాయాలకి ప్రతినిధులు. ఈ రెండు పాత్రలూ తెలుగు సాహిత్యంలో వెలుగు దీపాలు. వరూధినీ ప్రవరులు రక్తమాంసాలతో సజీవ పాత్రలుగా కదలాడినట్టు మనుచరిత్రలో మరే ఇతర పాత్రలూ వుండవు. మనుచరిత్రలో ప్రతి స్త్రీ పాత్రా పురుషుని ప్రేమకోసం అంకిత మైనవిగా పెద్దన చిత్రించాడు. మనుచరిత్ర అనగానే పెద్దన కన్నా ముందు వరూధినీ ప్రవరులే స్మరణకు రావటం పెద్దన పాత్రచిత్రణ ప్రతిభకు ప్రబల నిదర్శనం.

వర్ణనలు :

కవి వ్యాపారమే వర్ణన. దర్శనానికి అక్షర రూపం వర్ణన. వేద సంహితల నుండి, కథా సరిత్సాగరం నుండి జనసాగరం నుండి వివిధ కథల్ని స్వీకరించి ఉపాఖ్యాన సహితంగా మత ప్రాధాన్యం ఉగ్గడించటం చేత పురాణ కవులది కథా దృష్టేగాని వర్ణనా దృష్టికాదు. ప్రకృతి వర్ణనలు కథని ఉజ్వలం చేసి అనుభూతి గమ్యాలు కావాలి కథలో అంతర్భాగాలు కాని వర్ణనలు కావ్య కళలకు భంజకాలు. ప్రబంధాలు వర్ణనలకి మణిమంజూషలు. తిరస్కృతయైన వరూధిని మానసిక స్థితిని స్పష్టం చేయటానికి పెద్దన సూర్యాస్తమయ, చంద్రాస్త మయ, చక్రవాకాల్ని వర్ణించాడు.

వర్ణనాత్మకత, ఊహ ప్రబంధ ప్రక్రియకు లక్షణం. వస్తువు, శిల్పం అనే కళాధర్మాల్లో ప్రబంధం శిల్పానికి ప్రాధాన్యం వహిస్తుంది. ఒక్కొక్క ప్రబంధం ఒక్కొక్క శిల్ప సామ్రాజ్యం. సిద్దుడు మలయ పర్వత శైత్యాన్ని వర్ణిస్తూ "అంధకరిపు కంధరా వాస వాసుకి వియోగభవ దుర్వ్యథాభోగ భోగినీ భోగ భాగ పరివేష్టిత పటీర విటపి వాటికావేల దేలాలతా వలయంబగు మలయంబునం గల చలువకు విలువ యెయ్యది?" శివుని కంఠంలో వాసుకి స్థిరనివాసం ఏర్పరచు కొనటంతో వాసుకి ప్రియురాండ్రు విరహాగ్నితో పగిలిన గుండెలను చలువదనంతో నింపుకొనటానికి ఏలకీ తీగలతో చుట్టుకొనిన మలయ పర్వతమున కల చందన వృక్షాల్ని కౌగలించుకున్నాయి. ఆ చలువకు విలువేమి ? ఇది ప్రబంధ కవి ఊహా శక్తికి నిదర్శనం.

సూర్యాస్తమయ, చంద్రాస్తమయ వర్ణనలు వరూధిని అవస్థతో తన్మయీ భావాన్ని పొందేటట్లు చమత్కారావహంగా వర్ణనల్ని పెద్దన కథా స్రవంతిలో ఉజ్జ్వల తరంగాలుగా మలిచాడు. వరూధిని ప్రవరుడు నిరాకరించి వెళ్ళి పోయినప్పుడు ఆమె మనస్సులో వేదనల చీకటి ఆవరించింది. ఆ సమయానికి సూర్యాస్తమయం అయింది. ప్రవరుని పట్ల కోపంతో సూర్యుడు ఎర్రబారినట్లు పెద్దన వర్ణించాడు.

"తరుణి ననన్యకాంత నతి దారుణ పుష్ప శిలీ ముఖ వ్యథా
భర వివశాంగి సంగభవు బారికి నగ్గము సేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁడ హంకృతితోనని రోష భీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁగ షాయ దీధితిన్."

[ 3–10 ప.

సాయంత్రం పూట నీడలు దీర్ఘంగా వుంటాయి. సూర్యుడు వెళ్ళిపోయాడు, నీవు నిర్భయంగా రావచ్చునని చంద్రుడికి కబురు పంపడానికిగాను రాత్రి అనే స్త్రీ పంపిన దూతికలా అన్నట్టు నీడలు దీర్ఘంగా తూర్పు దిక్కుకి నడుస్తున్నాయని వర్ణన.

"తరణి యిదె క్రుంకుచున్నాఁ
డరుదెమ్మని చంద్రుఁబిల్వ నరిగెడు రజనీ
తరుణీమణి దూతిక లన
నరిగెం దూర్పునకు నీడ లతిదీర్ఘములై"

[ 3-13 ప. ]

తూర్పు దిక్కనెడి స్త్రీ రాత్రికి భర్త అయిన చంద్రుడు సమీపిస్తున్నాడని విని ముఖాన్ని ముసురుకున్న చీకట్లనే ముంగురుల్ని దువ్వుకొనటానికి తీసుకున్న దంతపు దువ్వెన అనేటట్లు తూర్పు దిక్కున తెలుపు కనిపించిందని వర్ణన.

"అంతటఁ బ్రాచి నిశాపతి
యంతికగతుఁడౌట విని ముఖాలంబి తమః
కుంతలములు దీర్పఁగఁ గొను
దంతపు దువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్"

[ 3–30 ప.

ఆర్యావర్త మనబడే వింధ్య హిమాద్రుల నడుమ పుణ్య దేశంలో వరణ అనే నది ఒడ్డున ఆకాశాన్ని తాకే కోటలు, చంద్రమండలంలోని లేడిని కూడ తెల్లనిదానిగా చేసే సున్నపు కాంతులతో ఒప్పే మేడలు కలిగి భూదేవి కంఠాన్ని దాల్చిన ముత్యాలహారంలోని నాయకమణిలా అరుణాస్పదపురం వుందని పుర వర్ణన పెద్దన ప్రతిభావంతంగా చేశాడు.

"వరణాద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీ చుంబితాం
బరమై, సౌధసుధా ప్రభా ధవళిత ప్రాలేయరుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నార్యావర్త దేశంబునన్
బుర మొప్పున్ మహి కంఠహార తరళస్ఫూర్తిన్ విడంబింపుచున్."
[1-49 ప.]

వనదేవత ఆడలేడి ఆకారంలో వచ్చింది. స్వరోచి ఆలింగనంలో సుందరి రూపం దాల్చింది. లతల లావణ్యమే దేహంగాను, పువ్వు గుత్తులే స్తనాలుగాను, చిగురాకులు చేతులుగాను, పువ్వు మొగ్గలు గోళ్ళుగాను మారాయి. కాని అంతకు ముందు తాల్చిన లేడికన్నులు మాత్రం అలాగే వుండగా హరిణాక్షియైన స్త్రీ రూపం పొందిందని వనదేవతా సౌందర్య వర్ణన పెద్దన చేశాడు.

"వల్లీమతల్లి లావణ్య సర్వస్వంబు
విమలాంగ రేఖ నావిర్భవింప
మంజుల మంజరీ మహిత సౌభాగ్యంబు
పరివృత్త కుచవృత్తిఁ బరిణమింపఁ
బల్లవచ్ఛద చారు భావాను భావంబు
మృదు హస్తలీల మూర్తిభవింపఁ
రమణీయ ముకుళ విభ్రమ భాగధేయంబు
కరరుహ స్ఫూర్తి సాక్షాత్కరింపఁ
జేసి మృగియై వహించు నక్షిద్వయంబు
భాసురంబుగఁ దన యంకపాళిలోన
మించు క్రొమ్మించు నుపమించు మెలఁత యగుచు
నిలుచు నవ్వనదేవత నృపతి సూచి." [6-96 ప.]

ఇలా హిమవన్నగ సముద్ర శైల ఋతు కన్యాంగ సౌందర్య వర్ణనలు మను చరిత్ర కథ అనే పందిరిపై పాకాయి. ఈ విధంగా ప్రబంధ లక్షణమైన వర్ణనాత్మకత అనే లక్షణం మనుచరిత్రలో ఉంది. కథాగమనంలో కలిసిపోయే వర్ణనలకి మనుచరిత్రే మార్గదర్శి.

రసం :

ప్రబంధానికి శృంగార రసం జీవం. ఈ శృంగారాన్నికూడా సంస్కృత కావ్యాల్లోలాగ శాస్త్రీయమైన పద్ధతుల్లో రసంగా కాక మానవప్రవృత్తు లాధారంగా పోషించటం ప్రబంధ కవుల విశిష్ట లక్షణం. కామప్రవృత్తులనంతం. వ్యక్తివ్యక్తికి శృంగార రసభావ ప్రకటనలో వైరుధ్య ముంటుంది. ఇలాంటి వైవిధ్య వైరుధ్య దృష్టే ప్రబంధ కవుల శృంగార రస దర్శనం. ఆంధ్ర కవితా పితామహుని మనుచరిత్ర పూర్వభాగంలో శాంత, శృంగార ప్రవృత్తుల ఘర్షణ వుంది. కామానికి,

మోహ ఝంఝకి, కోరికల కోలాహలానికి, భోగ దృష్టికి వరూధిని ప్రతినిధి. గృహస్థాశ్రమ ధర్మానికి, ఏకపత్నీ వ్రతానికి, సంతానంకోసం శృంగారం అనే శాస్త్ర వాక్యానికి ప్రవరుడు ప్రతినిధి.

కవివ్యక్తిత్వం :

ప్రబంధాలలోని సౌందర్య ప్రవాహాల అట్టడుగున జీవం గాంభీర్య ప్రదాయిని. అయిన ధర్మపథ నిర్దేశముంది. సమకాలిక సమాజంలోని సర్వ భావ సంచలనాలు కవి దృక్పథం నుండి తాత్విక దృక్కోణంగా వ్యక్తమయ్యాయి. ప్రబంధ ఉద్యమ నాయకుడు కృష్ణదేవరాయలు. రాయలే, రాయల తత్వమే విభిన్న కవుల ఆత్మాశ్రయ సంవేదనల నుండి విశిష్ట ధర్మపథ నిర్దేశమైంది. పెద్దన విశిష్టాద్వైత వైష్ణవుడు. వేద ప్రమాణాలంగీకరించి కర్మ, జ్ఞాన, భక్తి యోగాలకు కళారూపంగా మనుచరిత్రను మలచాడు. ఆంధ్ర మహా కవులలో పెద్దన విశిష్ట వ్యక్తిత్వం కలవాడు. మనకు రాజుల దాన శాసనాలే దర్శనమిస్తాయి గాని కవులవి కనిపించవు. కాని పెద్దన దాన శాసనాలు ఆయన విశిష్ట వ్యక్తిత్వానికి నిదర్శనాలుగా మానవలోకంలో నిలిచే వుంటాయి. ఒకానొక సందర్భంలో రాయల ఆస్థానంలో కవి పండిత సమక్షంలో పెద్దన ఆశువుగ చెప్పింది ఉత్పల మాలిక. ప్రబంధ కవిత్వోద్యమానికి మూల తత్వాలైన సౌందర్యారాధన, ప్రకృతి ప్రీతి, ఊహ, వర్ణనాత్మకత, శబ్ద లాలసత్వం, ఉత్పలమాలికలోనే వున్నాయి. ఇది విని ఆనందించిన రాయలు గండపెండేరం తొడిగాడు. భోగ త్యాగాల్లో, రాజసంలో, రసికతలో రాయలతోపాటు సమానంగా వెలిగిన వాడు పెద్దన.

మనుచరిత్ర ప్రతిష్ఠకు ప్రధాన కారణం నవ్యత అనే గుణం. కవిత్వానికి శబ్ద సౌందర్యం పెద్దన సాధించిన నవ్యతాగుణం భారతీయ సాహిత్యంలో శబ్ద సౌందర్యంతో ఉత్తమ కవిత్వ కాంతుల్ని వెదజల్లిన మహాకవులు కాళిదాసు, పెద్దన, రవీంద్రుడు, కృష్ణ శాస్త్రి. అందుకే "Poetry is made of words" అని సిద్ధాంతం. ఇన్ని విధాల పెద్దన ఆంధ్రకవితా పితామహుడు, మనుచరిత్ర మానవ జాతి మణిదీపం.

## కొన్ని పదాలకు అర్థాలు

అంగభవు బారికిన్ = మన్మథుని పీడకు
అంచలమునన్ = చేరువను
అంతికగతుడు = దగ్గరకు వచ్చినవాడు
అంధకరిపు = అంధకాసురునకు శత్రువైన శివుని యొక్క
అగ్గముచేసి = వశమొనర్చి
అనుభావంబు = ప్రభావం

ఆభోగ = అతిశయం కల
కంధరా = కంఠం
కుంతలములు = వెంట్రుకలను
తట = ఒడ్డు యొక్క
తరణి = సూర్యుడు
తరళ = నాయకమణి యొక్క
నభోమణి = సూర్యుడు
పటీర విటపి = మంచిగంధపు చెట్ల యొక్క
పుష్పశిలీ ముఖ = పువ్వులు బాణాలుగాగల మన్మథుని యొక్క
ప్రాలేయరుక్ = చంద్రుని యొక్క
భోగభాగ = శరీర భాగాల చేత
భోగినీ = సర్ప స్త్రీల యొక్క
మంజరీ = పువ్వుగుత్తుల యొక్క
ముకుళ = మొగ్గల యొక్క
రజనీ = రాత్రి యనెడి
వప్ర = కోట యొక్క
విడంబించుచున్ = అనుకరించుచు.

## ఆధార గ్రంథాలు


1. మనుచరిత్రము – సవ్యాఖ్యానము – వెంపరాల సూర్యనారాయణశాస్త్రి
2. మనుచరిత్ర – కావ్యపరిచయాలు – సంపాదకుడు – ఎం.వి.ఎల్. నరసింహారావు
3. సాహితీ సుధాలహరి – సముద్రాల నాగయ్య
4. సాహిత్యంలో దృక్పథాలు – ఆర్.ఎస్. సుదర్శనం
5. మనుచరిత్రము – అల్లసాని పెద్దన
6. ఆంధ్ర ప్రబంధము – అవతరణ వికాసములు – కె.వి.ఆర్. నరసింహం
7. సారస్వత వ్యాసములు – ప్రథమ సంపుటి – సంపాదకుడు – జి.వి. సుబ్రహ్మణ్యం
8. మనుచరిత్రము – సంపాదకుడు – తిమ్మావఝ్ఝల కోదండరామయ్య
9. కావ్యలహరి – దివాకర్ల వేంకటావధాని
10. అల్లసాని వాని అల్లిక జిగిబిగి – విశ్వనాథ సత్యనారాయణ
11. కావ్య పరిమళము – విశ్వనాథ సత్యనారాయణ
12. మందార మంజరి – సంకలన కర్త – ముదిగొండ శివప్రసాద్.

# ఆముక్తమాల్యద — శ్రీకృష్ణదేవరాయలు

సమీక్ష : శ్రీ కె.ఎ. కృష్ణమాచార్యులు, ఎం.ఏ.

[జన్మస్థలం : విజయరాయిగ్రామం. ప. గో. జిల్లా జననం 10 – 10 – 1932 ఎం.ఏ. [సంస్కృతం], విద్యాప్రవీణ, భాషాప్రవీణ, లెక్చరర్, సంస్కృతశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు. ముద్రితకృతులు సంస్కృతవ్యాకరణప్రకాశిక, బమ్మెరపోతన—భాగవతము]

కవి జీవితాదులు :

"ఆముక్తమాల్యద" ఆంధ్రభాషలో వెలసిన ఒక ప్రబంధరత్నం. దాన్ని రచించినది శ్రీకృష్ణదేవరాయలు. ఆయన పదిహేనవశతాబ్ది చివరిభాగంలో జన్మించి, పదహారవ శతాబ్ది మొదటిభాగంలో విజయనగరసామ్రాజ్యాన్ని పాలించిన రాజాధిరాజు. ఆ రోజుల్లో విజయనగరం అంగళ్లలో రత్నాలను రాసులుగా పోసి అమ్మేవారు. అంతటి వైభవంతో సామ్రాజ్యాన్ని తీర్చిదిద్దిన ఆ మహానుభావుని కన్న తల్లితండ్రులు తుళువ వంశీయులైన నాగాంబా నరసనాయకులు.

శ్రీకృష్ణదేవరాయలు బాల్యంలో రాజోచిత విద్యలతోబాటు సంగీతసాహిత్యాదులు గూడా బాగానేర్చుకొని వాటి మర్మాలను ఆకళింపు చేసుకొన్న మహామనీషి ; సహజంగా దైవభక్తి సంపన్నుడు.

ఆయన ఏనాడూ ఓడిపోవడం అనేది లేకుండా చాలాసార్లు దిగ్విజయ యాత్రలు చేసి దక్షిణ భారతదేశం అంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యం వహించి పాలించాడు. అలాగే దక్షిణ భారతదేశం అంతటా చాలా సార్లు పుణ్యక్షేత్ర తీర్థ యాత్రలు సాగించి అనేక దైవదర్శనాలు చేసుకొని చాలా దేవస్థానాలకు విశేషంగా దాన ధర్మాలు చేసాడు. అంతేకాక తన రాజ్యంలో కొత్తగా అనేక దేవాలయాలను నిర్మించి వాటికి స్థిర వసతులు ఏర్పాటు చేసాడు. అనేక కవి పండితులను పోషించి వారిచేత గ్రంథాలు రచింప చేసాడు. వారిలో 1. అల్లసాని పెద్దన, 2. ముక్కు (నంది) తిమ్మన, 3. మాదయగారి మల్లన, 4. ధూర్జటి, 5. తెనాలి రామకృష్ణుడు, 6. అయ్యలరాజు రామభద్రుడు, 7. భట్టుమూర్తి, 8. పింగళిసూరన అనే ఎనమండుగురూ అష్టదిగ్గజాలని ప్రసిద్ధి పొందారు. వీరిలో చివరి ముగ్గురూ రాయలకాలంవారు కారనీ, వారికి బదులు మరిముగ్గురు సంస్కృత కన్నడ కవులు అష్టదిగ్గజాలలో ఉండేవారనీ కొందరి అభిప్రాయం. రాయలు తాను స్వయంగా

పండితుడై, కవియై చాలా గ్రంథాలు రచించాడు. ఈ విధంగా ఆయన ఆనాటి భారతీయ సంస్కృతికి జీవగఱ్ఱగా కొనియాడ బడ్డాడు. ఆయన చేసిన ఘనకార్యాలన్నిటికీ నిదర్శనాలు నేటికీ మనకు స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నాయి. ఆయన తన రచనలుగా ఆముక్తమాల్యదలో పేర్కొన్న మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనం, సకల కథాసార సంగ్రహం, జ్ఞాన చింతామణి, రసమంజరి అనే సంస్కృత గ్రంథాలు ఇప్పుడు మనకు లభించడం లేదు. అది మన దురదృష్టమే. జాంబవతీ పరిణయం అనే సంస్కృత నాటకం ఒకటి ఈ మధ్య ఆయన రచనగా వెలుగులోకి వచ్చింది.

కథాసంగ్రహము :

పాండ్యదేశంలో శ్రీవిల్లిపుత్తూరు గ్రామంలో విష్ణుచిత్తుడనే వైష్ణవభక్తుడు ఉండేవాడు. ఆయనకు తమిళంలో 'పెరియాళ్వా'రని పేరు. ఆయన భగవంతుని కైంకర్యమే పరమపురుషార్థం అని భావించి ఆ ఊరి దేవాలయంలో ఉండే స్వామికి రోజూ పుష్పమాలా కైంకర్యం చేస్తూ రాత్రింబవళ్ళు యథాశక్తిగా అతిథులకు విందులుచేస్తూ ఉండేవాడు. ఆ కాలంలో పాండ్యదేశాన్ని మత్స్యధ్వజుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. ఒకనాడురాత్రి ఆ రాజు భోగిని యింటికి వెళ్తూ ఒక బాటసారి చదువుతున్న "వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్, నిశార్థ మర్థం దివసం యతేత. వార్ధక్య హేతోర్వయసానవేన పరత్ర హేతోరిహ జన్మనాచ" అనే శ్లోకాన్ని విన్నాడు. "వర్షాకాలసుఖంకోసం తక్కిన ఎనిమిది నెలలూ ప్రయత్నం చేయాలి. రాత్రి సుఖంకోసం పగలు కష్టపడాలి. ముసలితనంలో సుఖంకోసం యౌవన వయస్సులో పాటుపడాలి. పరలోకసుఖంకోసం ఈలోకంలోనే ప్రయత్నించాలి" అని దానిభావం. దాన్ని విని పరలోకసుఖంకోసం తానిప్పటివరకూ ఏమీచేయలేదని చింతించి, ఇంటికి తిరిగిపోయి, మర్నాడు పండితసభ కావించి మోక్షాన్నిచ్చే దేవుణ్ని గురించి తెలియజెప్పమని కోరాడు.

ఆనాడు దేవునికి పూలదండలను సమర్పిస్తున్న సమయంలో స్వామి విష్ణుచిత్తుణ్ని రాజసభకు వెళ్లి పండితసభలో వాదించి విష్ణువే పరదైవమనీ, మోక్షాన్నిచ్చే దేవుడనీ సిద్ధాంతం చేసి రాజుని వైష్ణవ భక్తునిగా చేయమని ఆదేశించాడు. విష్ణుచిత్తుడు స్వామిమహిమలో ఆయన ఆజ్ఞాపించిన విధంగా చేసి, విష్ణువుని చేరే యోగమార్గాన్ని చెప్పడానికి ఉదాహరణగా ఖాండిక్య కేశిధ్వజుల కథని రాజుకి చెప్పాడు.

"పూర్వం ఖాండిక్యుడు, కేశిధ్వజుడు అనే ఇద్దరు రాజులుండేవారు. వాళ్లిద్దరూ అన్నదమ్ముల బిడ్డలు. వాళ్లు రాజ్యం కోసం పోట్లాడు కున్నారు, ఖాండిక్యుడు యుద్ధంలో ఓడి కొంతమంది ఆప్తులతో అడవులకు పోయి అక్కడ

జీవించసాగాడు. తరువాత కొంతకాలానికి కేశిధ్వజుడు జ్ఞానయోగాన్ని పొంది ఒక యజ్ఞంచేయడానికి సిద్ధపడ్డాడు. దానికోసం సిద్ధంచేసిన యజ్ఞపశువుని పులి చంపి వేసింది. దానికి చేయవలసిన ప్రాయశ్చిత్తం ఖాండిక్యునికి తప్ప ఇంకెవ్వరికీ తెలియకపోవడంచేత, కేశిధ్వజుడు ఖాండిక్యుని దగ్గరికి వెళ్లి, ప్రార్థించి, అతడు చెప్పినట్లుగా ప్రాయశ్చిత్తం చేసుకొని యజ్ఞం పూర్తిచేసి అన్నకు కోరిన గురుదక్షిణ ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. అతడు తనకు జ్ఞానయోగాన్ని ఉపదేశించమని కోరి దాని సాధనతో మోక్షాన్ని పొందాడు."

ఈ కథను మత్స్యధ్వజుడికి చెప్పి, విష్ణుచిత్తుడు తన గ్రామానికి పోయి యథాప్రకారంగా భగవంతుని కైంకర్యంచేస్తూ ఉండేవాడు. అప్పుడు విష్ణుమూర్తి లక్ష్మీదేవితో, విష్ణుచిత్తునిలాగే రాజుని వైష్ణవభక్తునిగా చేసి ఉద్ధరించిన మరియొక భక్తుడు యామునాచార్యుడని చెప్పి ఆ కథను ఆమెకు చెప్పాడు.

"యామునాచార్యుడొక గొప్ప పండితుడు. ఆయన కాలంలోని పాండ్యరాజు వీరశైవమతస్థుడై, విష్ణుభక్తులైన ప్రజలను చులకనగా చూస్తూ ఉండేవాడు. యామునాచార్యుడు రాజుసభకు వెళ్లి, పండితులతో వాదించి, విష్ణువే పరదైవమని సిద్ధాంతంచేసాడు. అప్పుడు రాజు వైష్ణవభక్తుడుగా మారి, అప్పటికింకా పెళ్లికాని యామునాచార్యునికి తన చెల్లెల్ని ఇచ్చి, వివాహము చేసి అర్ధరాజ్యాన్ని కానుకగా ఇచ్చాడు. యామునాచార్యుడు రాజ్యభోగాల్లో పడియున్నప్పుడు శ్రీరామమిశ్రుడనే భక్తుడు ఆయనదగ్గిరికి వెళ్లి, పెద్దలు దాచిన నిధి కావేరీతీరంలో ఉందని చెప్పి, ఆయన్ని తీసికొని వెళ్లి శ్రీరంగనాథుని పాదాల్ని చూపించాడు. వెంటనే పూర్వజ్ఞానం కలిగి యామునాచార్యుడు రాజ్యాన్ని త్యజించి భక్తితో కాలంగడిపి మోక్షాన్ని పొందాడు అని విష్ణుమూర్తి లక్ష్మీదేవితోచెప్పాడు.

తరువాత విష్ణుచిత్తుడికి తులసివనంలో ఒకబాలిక దొరికింది. పిల్లలులేని ఆయన సంతోషంతో ఆ బాలికని చేరదీసి 'గోద' అని పేరుపెట్టి పెంచి పెద్దజేసాడు. ఆమె రోజూ స్వామికోసం తండ్రి తయారుచేసిన పూలదండను స్వామికి సమర్పించడానికిముందే రహస్యంగా ఒకసారి తానుధరించి తనఅందాన్ని చూసుకొంటూ ఉండేది. ఎప్పుడూ భగవంతునిగూర్చి ఏవోవ్రతాలు ఉపవాసాలు చేస్తూ గానంచేస్తూ ఉండేది. రోజురోజుకి కృశించిపోతూ విరహ బాధ ననుభవించసాగింది. దాన్ని గుర్తించలేక విష్ణుచిత్తుడు దేవుని సన్నిధిలో ఆమెస్థితిని గురించి మొరపెట్టుకొన్నాడు. అప్పుడు భగవంతుడు మహాభక్తులకు సాధ్యం కానిదేమీలేదని, గానమహిమ చాలాగొప్పదని ఉదాహరణగా మహాభక్తుడైన మాలదాసరి వృత్తాంతాన్ని చెప్పాడు.

"ఒక మాలదాసరి రోజూ తెల్లవారుజామునే లేచి తనఊరికి మూడామడల దూరంలో ఉన్న దేవాలయానికి నడచివెళ్లి దానిముందు నిలబడి భక్తితో మంగళ

క్తి శికీగీతాలు పాడేవాడు. ఒకనాడు అర్ధరాత్రి పిల్లినిజూచి భయపడినకోడి కూయగా కోడికూత వేళ అయిందని భ్రమపడి లేచి ఆ దాసరి దేవాలయం దగ్గరికి బయలు దేరాడు. చీకట్లో దారితప్పి ఒక చెట్టుదగ్గరికి వెళ్లాడు. ఆ చెట్టుమీద ఉన్న బ్రహ్మ రాక్షసుడు ఆతనిని తినబోగా గుడిముందు గానంచేసి వచ్చినతరువాత తినమని వేడుకొని, ఎలాగోఒప్పించి వెళ్లి, గానంచేసి అన్నమాటప్రకారం తిరిగివచ్చాడు. ఆతని సత్యప్రవర్తనకి ఆశ్చర్యపడిన రాక్షసుడు ఆతనిగానఫలంలో కొంత తనకిచ్చి తనరాక్షసత్వాన్ని పోగొట్టుమని ప్రార్థించగా ఆతడలాగే చేసాడు. ఆ గానమహిమను విన్న భూదేవి కూడా తనగానమహిమతో స్వామినిచేరాలనే కోరికతో గోదగా అవతరించి విరహతాపం పొందుతోంది'' అనిచెప్పి గోదాదేవిని శ్రీరంగంతీసుకువెళ్లమని ఆజ్ఞాపించి అక్కడ రంగనాథుని రూపంలో ఉన్న తానామెను వివాహం చేసుకొంటానని చెప్పాడు. విష్ణుచిత్తుడు ఆమెను శ్రీరంగం తీసుకువెళ్లాడు. తరువాత గోదాదేవికి శ్రీరంగనాథుడికీ వైభవంగా వివాహం జరిగింది. అందరి సమక్షంలో గోదాదేవి శ్రీరంగనాథుడి దగ్గరికి నడచివెళ్లి ఆతనిలో ఐక్యంపొందింది.

వస్తుతత్వం :

శ్రీకృష్ణదేవరాయలు కటకంమీదికి దండయాత్రకు వెళ్తూ బెజవాడ ప్రాంతంలో ఆగి అక్కడ ఏకాదశిఉపవాసం చేసియున్న ఒకనాడు రాత్రి శ్రీకాకుళాంధ్రవిష్ణువు కలలో కనిపించి "నీవిప్పటికి ఎన్నో గ్రంథాలు రాసావు. సంస్కృతంలో గూడా గ్రంథరచన సాగించి మెప్పులుపొందిన నీకు తెలుగుభాషలో రాయడం కష్టంకాదు కాబట్టి దేశభాషలలో లెస్స అయిన తెలుగులో గోదాదేవి వృత్తాంతాన్ని రాయుమ''ని ఆజ్ఞాపించాడట. ఆయన కన్నడరాయలైనా తెలుగులో రచించమని ఆదేశించడానికి కారణంగా ఆంధ్రవిష్ణువు చెప్పిన విషయాన్ని ఈ పద్యంలో పేర్కొన్నాడు —

> "తెలుగదేల యన్న దేశంబు తెలుగేను తెలుగు వల్లభుండ తెలుగొకండ,
> ఎల్ల నృపులు కొలువనెరుగవే బాసాడి దేశభాషలందు తెలుగులెస్స.''

భగవంతుని ఆదేశంతో భగవదంకితంగా రచించబడిన ఈ "ఆముక్త మాల్యద'' ఆంధ్రపంచకావ్యాలలో అత్యంత ప్రౌఢమైనది. ఆముక్త మాల్యద అనేది తమిళంలోని 'చూడికుడుత్త నాచ్చియార్'అనేదానికి సంస్కృతీకరణం. "తానుధరించి తీసిన పూలదండను ఇచ్చేది'' అని దానిఅర్థం. తండ్రి స్వామికోసం తయారుచేసిన పూలదండను ముందు తానొకసారి రహస్యంగా ధరించి, తరువాత స్వామికి సమర్పించడంచేత ఆమెకాపేరు వచ్చింది. ఆమెచరిత్రని వివరించే తనగ్రంథానికి కూడా శ్రీకృష్ణదేవరాయలు అదేపేరుపెట్టాడు. ఇది విష్ణుచిత్తుని కథతో ప్రారంభం కావడం చేత దీనికి 'విష్ణుచిత్తీయం' అనేపేరుకూడా ఉంది. ఈగ్రంథం విష్ణుచిత్తుని కథతో

ప్రారంభమయి గోదాదేవి కథతో పూర్తి అయింది. మధ్యమధ్య సందర్భానుసారంగా ఖాండిక్య కేశిధ్వజులకథ, యామునాచార్యుని కథ, మాలదాసరి కథ కూర్చబడ్డాయి. ఈవిధంగా ఇందులో మొత్తం ఐదు కథలున్నాయి. ఇందులోని ప్రధానవస్తువు గోదాశ్రీరంగనాథుల ప్రణయగాథ. అది శృంగార రసమయమైన గాథ అయినప్పటికీ భగవంతునికి సంబంధించినది కావడంచేత భక్తి భావంలో పర్యవసించింది. తక్కిన కథలన్నీ వైష్ణవభక్తి ప్రభావాన్ని చాటుతూ ఆభక్తి భావాన్ని పెంపొందింప జేస్తున్నాయి. రచయిత గొప్పరాజనీతివేత్త కావడంచేత సందర్భాన్ని కల్పించుకొని అనేక రాజనీతి రహస్యాలు ఈగ్రంథంలో ఉపదేశించాడు. ఇందులోని సన్నివేశాలన్నీ సహజ సుందరాలు. ప్రకృతి పరిశీలన అత్యద్భుతం. అలంకారాలు చక్రవర్తులు ధరించే అలంకారాలలాగ చాలా విశిష్టమైనవి.

శైలి :

ఈగ్రంథంలోని శైలి ఎక్కువభాగం నారికేళ పాకంలో ఉన్నా కష్టపడి చదివి బోధపరచుకొన్నతరువాత లేతకొబ్బరి నీళ్లలాగ, లేతకొబ్బరి గుజ్జులాగా చక్కని, మధురరసానుభవాన్నీ, సంతుష్టినీ కలిగిస్తాయి. ఉదాహరణకు బ్రహ్మ రాక్షసుడు నివసించిన మర్రిచెట్టును వర్ణించే ఈపద్యం చూడండి—

శా. "కాంచెన్ వైష్ణవు డర్ధయోజన జటాఘాటోర్ధ్వ శాఖోప శా
ఖాంచ ఝ్ఝాట చరన్మరుద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛ దో
దంచత్కోట కృతవ్రణచ్ఛలన లిప్యాపాదితాధ్వన్య ని
స్సంచారాత్త మహాఫలోపమఫల స్ఫాయద్వటక్ష్మాజమున్."

[ 6-15 ]

ఇందులో కాంచెన్ వైష్ణవుడు అనే రెండుపదాలే సులభమైన అర్థంకలవి. తక్కినదంతా అయోమయమైన కక్కుల కళ్లెం లాగా ఉంది. అయినా దాని అర్థం తెలిసిన తరువాత ఆ శైలీకాఠిన్యంవల్ల వ్యక్తమయే, వటవృక్షపు జటిలత్వం, దీర్ఘత్వం, వైశాల్యం మొదలయినవి చక్కగా బోధపడతాయి. ఈ గ్రంథంలో అక్కడక్కడ సులభంగా అర్థబోధ కలిగే రచన కూడా లేక పోలేదు. ముఖ్యంగా సంవాద సందర్భాలలోని రచన సులభార్థ బోధకంగా ఉంటుంది. విష్ణుచిత్తుడు భగవంతునితో మాట్లాడేటప్పుడు చెప్పిన ఈ పద్యం చూడండి :

ఉదా. : "గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకి కా
వహనంబో, వనమాలికా కరణమో, వాల్లభ్యల భ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్రధృతియో, ద్రాగ్దీపి కారోపమో,
నృహరీవాదము లేల ? లేరెయితరుల్ నీలీలకుం బాత్రముల్."

[ 2-91 ]

అయితే ఎక్కువభాగం కఠినపదాలతో దీర్ఘసమాసాలతో కూడియుండడంచేత ఇది నారికేళపాకంలో రచింపబడ్డ ప్రౌఢకావ్యంగా ప్రసిద్ధికెక్కింది.

రసపోషణ :

ఇందులో గోదా శ్రీరంగనాయకుల వివాహవృత్తాంతం ప్రధాన కథాభాగం. కాబట్టి ఆ కావ్యఫలాన్ని పొందిన గోదాదేవి నాయిక ; శ్రీరంగనాథుడు నాయకుడు. వారి వివాహ ప్రసక్తమయిన శృంగారం ప్రధాన రసం. కాని అది లౌకిక శృంగారం వంటిదికాదు. భక్తురాలికి భగవంతునికి సంబంధించినది కావడం చేత అలౌకిక శృంగారం. అది మధురభక్తియందు పర్యవసానం చెందేది. ఆ రసపోషణకు అనుగుణమైన ఇతరసామగ్రి కూడా అంటే నాయికా నాయకులకు పరస్పరానురాగం ఏర్పడడానికి వీలుగా వారి గుణగణాలు మొదలైనవన్నీ చక్కగా వర్ణించబడి ఆ ప్రధానరసం సముచితరీతిలో వ్యక్తంచేయబడింది. దానికి అంగంగా వీరరసం పోషింపబడింది. దయావీరం, ధర్మవీరం, దానవీరం, యుద్ధవీరం – అని వీరరసం నాలుగురకాలు. వీరరసానికి ఉత్సాహం మూలం. విష్ణుచిత్తుని కథలో దయావీరం, యామునాచార్యుని కథలో ధర్మవీరం, మాలదాసరి కథలో దానవీరం పోషింపబడ్డాయి.

పాత్ర చిత్రణ :

రాయలు ఈ గ్రంథంలో గ్రహించిన పాత్రలన్నీ—ఒక్కొక్క అంశంలో రాయలకంటే ఉచ్చస్థితిలో ఉండేవే. ఆయావిషయాల్లో వాళ్లను ఆదర్శ ప్రాయులుగా తీర్చిదిద్దాడు.

విష్ణుచిత్తుడు పరమసాత్త్వికుడైన మహాభక్తుడు. భక్తిమహిమచేత భగవత్సాక్షాత్కారం పొందగలిగినవాడు. విశేషంగా శాస్త్రాలు చదువకపోయినా చక్కని దేశభాషాజ్ఞానం సంస్కృత భాషాజ్ఞానం కలవాడు. యామునాచార్యుడు చిన్నతనం లోనే శాస్త్రాలన్నీ కూలంకషంగా చదివి భగవత్తత్వాన్ని తెలిసికొన్నా, శ్రీరామ మిశ్రుడనే భక్తునివలన భాగవతోత్తముడై భగవంతుని జేరినవాడు. మాలదాసరి కూడా పరమసాత్త్వికుడైన మహాభక్తుడే. వినయసంపదకలవాడు. సత్యనిష్ఠుడు. తనగానమహిమచేత భగవంతునికి ప్రీతిపాత్రు డయినవాడు.

విష్ణుచిత్తుని భార్య అమాయిక బ్రాహ్మణి. సత్యకాలపుమనిషి. ధర్మగేహిని. తనస్వరూపమంతా భర్తలోనే లీనంచేసుకొన్న పతివ్రత. గ్రంథంలో ఈపాత్ర యొక్క స్థానం అతిస్వల్పమైనా కవి దీనికొక గొప్పతనాన్ని కల్పించాడు. యామునాచార్యునికాలపు పాండ్యదేశపురాణి పరమసాధ్వి. వైష్ణవభక్తురాలు. భర్త అన్యమతనిష్ఠుడైనా నిత్యజీవితంలో భర్తతో ఎట్టి భేదభావం లేకుండా గడిపి చివరికి తన భక్తిమహిమచేత భర్తనుద్ధరించిన సతీమతల్లి.

కావ్యనాయిక అయిన గోదాదేవి తన పదిహేనవయేటనే "తిరుప్పావు" రచించి గానంచేసి తన గానమహిమచేత భగవంతుని వివాహం చేసికోగలిగిన భక్తురాలు. ఆమె వాక్కులు దివ్యవాక్కులుగా రూపొందాయి. కావ్యనాయకుడైన భగవంతుడు ఆర్తత్రాణపరాయణుడు, ధర్మస్థాపనోత్సాహంకలవాడు. దయాధర్మ మూర్తి అయిన సాత్త్వికచక్రవర్తి వలె సాక్షాత్కరిస్తున్నాడు.

వర్ణనలు :

కావ్యంలో వర్ణనలన్నీ రసపర్యవసానం పొందేటట్లు ఔచిత్యవంతంగా సందర్భశుద్ధినికలిగి ఉండాలి. అటువంటివర్ణనలు కవి ప్రతిభకు నిదర్శనాలవుతాయి. శ్రీకృష్ణదేవరాయల వర్ణనలన్నీ అలాగే ఉంటాయి. ఒకేపదార్థమయినా భిన్న భిన్న సందర్భాల్ని బట్టి వేర్వేరు విధాలుగా ఉంటాయి గదా! దానివర్ణనలు కూడా తదనుగుణంగానే ఉంటాయి. ఇందులో మధుర, శ్రీవిల్లిపుత్తూరు, శ్రీరంగం అనే మూడు నగరాలున్నాయి. సందర్భానుగుణంగా మూడూ మూడువిధాలుగా వర్ణింపబడ్డాయి. అలాగేతక్కిన వర్ణనలుకూడా సందర్భోచితంగా సహజ సుందరంగా ఉంటాయి. ఏవస్తువునైనా చదువరులకు కన్నులకట్టినట్లు వర్ణించడం రాయల ప్రత్యేకత. ఈక్రిందిపద్యాన్ని ఉదాహరణగా గమనించండి :

మ. "తల(బక్షచ్ఛట( గ్రుచ్చి బాతువులు కేదారంపుగుల్యాంతర
స్థలి నిద్రింప(గ( జూచి యారెకులుపస్నాతప్రయాత ద్విజా
వలి పిండీకృత శాటికల్పవి( దదావాసంబు( జేర్పంగ రే
వులడిగ్గన్వెస( బాఱు వాని( గని నవ్వున్ శాలి గోప్యోఘముల్."
[1–65]

ఇందులో శ్రీవిల్లి పుత్తూరు పరిసరాల పొలాలకు నీరుపారే కాలువలలోని బాతులు ఎంతో సహజ సుందరంగా వర్ణించబడ్డాయి.

ఆత్మీయత :

శ్రీకృష్ణదేవరాయలు కేవలం సమరాంగణ సార్వభౌముడే కాకుండా సాహితీ సమరాంగణ సార్వభౌముడు కూడా ; ఉదాత్త జీవితమును గడిపినవాడు ; ఉదాత్త కవిత్వమును చేసినవాడు. అనేక శాస్త్రములందు నిష్ణాతుడై తన గ్రంథంలో అనేక శాస్త్ర విషయాలను చొప్పించాడు. శ్రీవైష్ణవ మతావలంబియై శ్రీవైష్ణవభక్తులకథలను వస్తువుగ గ్రహించి తన ఆముక్తమాల్యదను రచించాడు. రాయలు చక్కనిరాజనీతి వేత్త; రాజనీతి వైశిష్ట్యమును తనగ్రంథములో బాగుగా పొందుపరిచాడు. అద్వితీయబాహుబల సంపన్నుడు ; అనన్యసామాన్యమైన మనోబలంకలవాడు ; కార్యశూరుడైనచక్రవర్తి ; చక్కని పాండిత్యము, సహజమైన కవితాధార కలవాడు ;

వాక్సార్వభౌమ ర్వాకమహాకవి; ఆతని కత్తికి ఎదురులేనట్లే ఆతని ఘంటానికికూడ తిరుగులేదు.

మొత్తం మీద శ్రీ కృష్ణదేవరాయల కవితకు ఆంధ్ర కవితోద్యానంలో ఒక ప్రత్యేకమైన విశిష్టత ఉందనడంలో సందేహంలేదు. రాయల వ్యక్తిత్వంలోగల వైశిష్ట్యమే ఆతని కవిత్వంలోగూడ ప్రస్ఫుటమవుతూ ఉంటుంది.

### కొన్ని పదాలకు అర్థాలు

జటాఘాటోత్థ = ఊడల పైభాగములనుండి మొలచిన
మరుద్రయ దవీయః ప్రేషిత = గాలివేగముచేత దూరమునకు పంపబడిన
ఉద్యచ్ఛదోదంచత్ = పోవుచున్న ఆకులయందు ఒప్పుచున్న
కీటకృత = పురుగులచే వేయబడిన
వ్రణచ్ఛలన లిప్యాపాదిత = కన్నములనెడి మిషగల లిపిచేత సమకూర్చ బడిన
అధ్వన్య నిస్సంచారాత్త = బాటసారులు తిరుగుటలేనందున పొందబడిన
మహాఫలోపమ = గొప్పఫలము (పుణ్యము) సాటిగాగల
ఫలస్ఫాయద్వటక్ష్మాజమున్ = పండ్లచే విస్తరిల్లుచున్న మర్రిచెట్టును
గృహసమ్మార్జనము = ఇంటిని (దేవాలయమును) తుడుచుట
జలాహరణము = నీటిని తెచ్చుట
శృంగార పల్యంకికావహనంబు = విలాసార్థమయిన పల్లకిని మోయుట
వనమాలికాకరణము = వనమాలలను కూర్చుట
వాల్లభ్యలభ్యధ్వజ గ్రహణంబు = అధికారి యగుటచే పొందబడిన జెండాను పట్టుకొనుట
వ్యజనాతపత్రధృతి = విసనకర్రను, గొడుగును పట్టుట
ద్రాక్ = తొందరగా
దీపికారోపము = దీపములను వెలిగించుట
నాకు = అనకుము
పక్షచ్ఛటన్ = రెక్కల సమూహమునందు
ఆరెకులు = కాపరులు
పిండీకృత శాటికలు = పిడిచి యుంచబడిన వస్త్రములు
వెసన్ = వెంటనే
శాలిగోప్యోఘముల్ = చేలకాపరులు

## ఈ వ్యాసరచనకు ఆధార గ్రంథాలు

1. ఆముక్తమాల్యదా సంజీవనీ వ్యాఖ్య – శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి
2. ఆంధ్రకవి తరంగిణి – శ్రీ చాగంటి శేషయ్య
3. సమగ్రాంధ్రసాహిత్యం – శ్రీ ఆరుద్ర
4. సారస్వతనీరాజనము – ఆచార్య శ్రీ యస్వీ. జోగారావు
5. ఆముక్తమాల్యదాసౌందర్యం – డాక్టర్ తుమ్మపూడి కోటేశ్వరరావు
6. ఆంధ్రకవిసప్తశతి – శ్రీ బులుసు వెంకట రమణయ్య.

# పారిజాతాపహరణము — నందితిమ్మన

సమీక్ష : శ్రీ చిప్పకుల రవిశర్మ, ఎం. ఏ.

[ జన్మస్థలం - నూజివీడు, కృష్ణాజిల్లా: ఎం. ఏ. (తెలుగు) 1960 నుండి ప్రభుత్వోద్యోగి. ప్రస్తుతం, ఆంధ్రా యూనివర్సిటీలోని ఆడిట్ ఆఫీసులో పనిచేస్తున్నారు. ప్రచురణలు – 20కి పైగా కథలు, 60కిపైగా వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. 'రాజనూయము' అనే నవల 'నావాణి' మాస పత్రికలో ప్రచురింపబడింది. 'ఆంధ్ర కావ్యపురాణేతిహాసాలలో నారద పాత్ర' అన్న విషయంపైని పిహెచ్.డి. పట్టానికి పరిశోధన – తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు. ]

**కవి జీవితాదులు :**

పారిజాతాపహరణ కావ్యం వ్రాసిన కవి నంది తిమ్మన. నంది సింగన్న – తిమ్మాంబల కుమారుడు. ఆర్వేల నియోగి. 16వ శతాబ్దిలో విజయనగర చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయల వారి ఆస్థానంలో ప్రసిద్ధికెక్కిన అష్టదిగ్గజ కవులలో ఒకడు. ఆయనవలన చతురంతయాన మహాగ్రహారములు పొందినవాడు. (5–108) 'శ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధ సారస్వతాభినంది' అయిన మహాశివ భక్తుడు. అఘోర శివగురువుల శిష్యుడు. 'సకల విద్యావివేక చతురు'డైనా 'సుజన విధేయుడు'. 'మలయ మారుత కవి' అనే బిరుదుగల ఘంట సింగన్నకు మేనల్లుడు. ఈ ఘంట సింగన్న నంది మల్లయ్య అనే మరో కవితో కలిసి 'వరాహపురాణం' అనే కావ్యాన్ని వ్రాసి, కృష్ణరాయల తండ్రి నరసా నాయకునకు అంకితమిచ్చాడు. విజయనగరాశ్రితుడు. కనుక తిమ్మన కూడా విజయనగర వాస్తవ్యుడే. కృష్ణరాయల భార్యతో అరణపు కవిగా వచ్చినవాడు మాత్రంకాదు. ఈ కావ్యరచనాకాలం క్రీ.శ. 1516–19 మధ్య. తిమ్మన 'వాణీ విలాసం' అనే మరో కావ్యాన్ని వ్రాశాడు కాని అది అలభ్యం.

**కథా సంగ్రహం :**

రుక్మిణీ సత్యభామలు శ్రీకృష్ణుని భార్యలలో ముఖ్యులు. వారిద్దరి మధ్యనా 'కులమును, రూపమున్, మగని కూరిమియున్ కలదాన'నని (1–42) స్పర్థ మొదలైంది. ఈ పరిస్థితిలో ఒకనాడు రుక్మిణీ కృష్ణులు ఏకాంత ద్యూతగోష్ఠిలో ఉండగా దేవర్షి నారదుడు ప్రవేశించి, స్వర్గలోకంనుంచి తెచ్చిన పారిజాత కుసుమాన్ని కానుకగా ఇచ్చాడు. ఆ పుష్పాన్ని కృష్ణుడు రుక్మిణికి బహూకరించాడు. నారదుడు పారిజాత మహిమను, రుక్మిణి సౌందర్య సౌభాగ్యాలను

కొనియాడుతూ, ఈనాటితో సత్యభామకు గర్వభంగం అవుతుందన్నాడు. చాటు నుంచి ఈ మాటలు విన్న చెలికత్తె సత్యభామకు చేరవేసి రెచ్చగొట్టింది. సత్యభామ అసూయావమానాలతో మండిపడింది. అలిగి ముసుగుపెట్టి పడుకుంది. కృష్ణుడు త్వరగా ఆమె వద్దకు చేరి ఆమెను అనునయించాడు. లాభంలేకపోగా తలవంచి ఆమె పాదాలకు మ్రొక్కాడు. ఆమె ఎడమకాలితో అతని తలను నెట్టింది. అయినా కృష్ణుడు ఆగ్రహించక ఆమె పాదాలకు ఉపచారం చేశాడు. ఆమె అతన్ని నిందించి, చివరకు ఏడ్చేసింది. ఆమెను ఓదార్చుతూ కృష్ణుడు, ఏకంగా పారిజాత వృక్షాన్నే ఆమె పెరటిచెట్టుగా నాటుతానని వాగ్దానం చేశాడు. ఆమె శాంతించింది. మరునాడుదయం సత్యాకృష్ణులు గరుత్మంతునిపై దేవలోకానికి చేరుకున్నారు. ఇంద్రుడు వారి నాహ్వానించాడు. కృష్ణుడు తాను నరకాసురుని నుండి స్వాధీనం చేసుకున్న కుండలాలను దేవమాత అదితికి అందజేశాడు. పారిజాత వృక్షాన్ని పెకలించి గరుత్మంతునిపై పెట్టుకుని తిరుగుముఖం పట్టారు సత్యాకృష్ణులు. అడ్డగించిన ఇంద్రునితో యుద్ధంచేసి జయించాడు కృష్ణుడు. సత్యభామ పెరటిచెట్టుగా పారిజాత వృక్షాన్ని ప్రతిష్ఠించాడు. నారదుని ఉపదేశంతో పుణ్యకవ్రతంచేసిన సత్యభామ, వ్రతంలో భాగంగా పారిజాతాన్ని, కృష్ణుని నారదునికి దానంచేసి, తిరిగి అతని అనుగ్రహంపలన పొందింది.

వస్తుతత్త్వము :

ఈ కావ్యంలో మొత్తం 512 గద్యపద్యాలున్నాయి. అయిదు ఆశ్వాసాల కావ్యం. ఈ కథా వస్తువుకు మూలం హరివంశంలోని అర్థవాద ప్రధానమైన కథ. ఒక సత్యాన్ని చెప్పడానికి అందులోని ధర్మాలను పాత్రలుగా సృష్టించి, ఒక కథగా చెప్పడం అరవాదం. సత్యభామ భూదేవి అవతారం. సమర్థుడైన పాలకుని చేతిలో భూమి కల్పవృక్షం అవుతుంది. కృష్ణుడు భూమిని సస్యశ్యామలం చేసి, భూలోక వాసులకు కల్పవృక్షాన్నే అందించాడని హరివంశ గాథలోని ధ్వని. ఈ కథను సూత్రప్రాయంగా మాత్రమే స్వీకరించి, తిమ్మన మధురమైన ప్రబంధం సృష్టించాడు. సత్యాదేవి గాఢప్రణయిని. గాఢమైనప్రేమ ఉచితానుచితాలు ఎరుగదు. ఆమె ప్రణయకలహం, కృష్ణుడు ఆమె అలుక తీర్చి, కోరిక నెరవేర్చి సంతోష పెట్టడం. ఇదీ ప్రధాన కథ.

రసము :

ఈకావ్యంలో శృంగారం అంగిరసం. సత్యాకృష్ణుల ప్రణయ జీవితంలోని ఒక మధురఘట్టం. సత్యాదేవి కోపగించడం, ఆమె విరహం, కృష్ణుని అనునయం మొదలైన ఘట్టాలలో విప్రలంభం మిళితమైన శృంగారం రససిద్ధిని పొందింది. వీరరసం ఇందులో అంగరసం. ఇంద్ర కృష్ణుల యుద్ధంలో వీరరసం పోషింప

బడింది. కథావస్తువుకు అనుగుణమైన మాధుర్య గుణం కావ్యమంతటా సెలయేటి గలగలలాగ వినిపిస్తుంది. ఆ గుణాని కనురూపమైన వైదర్భీరీతిలో కావ్యరచన ప్రధానంగా సాగింది.

వర్ణనలు :

వర్ణనల విషయంలో ఈ కావ్యంలో ఒక ప్రత్యేకత ఉన్నది. అన్ని ప్రబంధాలవలె మొదట్లో ఉండే పురవర్ణనాదులు లేవు. కథ సూటిగా మొదలై చకచకా సాగిపోతుంది. ప్రథమాశ్వాసంతో సత్యభామ అలుక తీరిపోతుంది. తరువాతి ఆశ్వాసాలలో చక్కని వర్ణన లున్నాయి. కృష్ణుని స్నానం, విందు భోజనం, సంధ్యాసమయం, అంధకారం, నక్షత్రాలు, చంద్రుడు, వెన్నెల మొదలైనవి మనోహరంగా వర్ణించబడినాయి.

"యామవతీ కళత్రు నుదయావసరంబుసకంటెఁ బాండిమ
శ్రీ మును దోఁచెఁ దూర్పుదెస ; సిద్ధము కృష్ణుడు పారిజాతమున్
భామినికై హరించునని పాయని నెవ్వగ నింద్ర రాజ్య ల
క్ష్మీముఖ మండలంబున వసించిన వెల్లఁదనంబు కైవడిన్" [2-38]

చంద్రోదయానికి ముందు తూర్పుదిక్కున తెల్లని కాంతులు వ్యాపించాయి. తూర్పుదిక్కుకు అధిపతి ఇంద్రుడు. కృష్ణుడు పారిజాతాన్ని అపహరించడం తథ్యం - అని ఇంద్రరాజ్యలక్ష్మి ముఖం తెలతెలబోయిందట! వర్ణనలలో కథా సూచన చేయడం తిమ్మన ప్రత్యేకత. గరుత్మంతునిపైనుండి చూచిన ప్రకృతి వర్ణన, కాళిదాసు మహాకవి మేఘసందేశం వరవడిలో నడిచింది. నందనోద్యాన వర్ణన మరీ మనోహరంగా ఉంటుంది. సత్యభామ ఏడ్పును వర్ణించే పద్యం ఎంతో అందంగా ఉంటుంది.

"ఈసునఁ బుట్టి డెందమున హెచ్చిన శోక దవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపయిఁ జేల చెఱంగిడి, బాలపల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూకల కాకలీ ధ్వనిన్"

[1-133]

ఇది ఎంతో ప్రసిద్ధమై, "ముక్కుతిమ్మన ముద్దు ముద్దుగా ఏడ్చాడు" అనే చతురోక్తి వ్యాప్తిలోనికి వచ్చింది.

పాత్రచిత్రణము :

ఇందులో ప్రధానపాత్రలు కృష్ణుడు, సత్యభామ, నారదుడు. కృష్ణుడు ధీర లలితుడైన నాయకుడు. బాహ్యంగా చూస్తే అమాయికుడైన ప్రేమికుడు. మరొక

వైపున దివ్యశక్తులు కలిగిన అవతారమూర్తి. ఆ వెనుక నేపథ్యంలో మాయా నాటకసూత్రధారియై, శిష్యుడైన నారదునిచేత కథ నడిపిస్తున్న కొంటెకృష్ణుడు దొంగ నవ్వులతో తొంగి చూస్తుంటాడు. మొదటనే నారదునితో "మహాత్మా ! తమరు నాపై ఎప్పుడూ దయచూపుతూనే ఉన్నారు. ఇప్పుడు మాత్రం ఊరకనే వచ్చారు గదా !" అంటూ, వచ్చిన పని ప్రారంభించమనే అనుజ్ఞ ధ్వనింప జేశాడు. ఇక నాటకం ప్రారంభమైంది. ఆ నాటకకర్త తానే. తానే ఒక పాత్రగా రంగంలో ప్రవేశించాడు. ఈ పాత్ర సత్యావిధేయుడైన కృష్ణుడు, నారదుని కనుసన్నను స్వీకరించి, 'కనుగవ పిన్న నవ్వు'లో పారిజాతాన్ని రుక్మిణి కిచ్చాడు. కృష్ణుడు కన్నులతో నవ్వాడంటే నాటకం ప్రారంభమైందన్నమాటే! ఈ పనివల్ల సత్యభామకు ఆగ్రహం వస్తుంది — అంటే గర్వభంగం జరుగుతుంది. మళ్ళీ తెగేవరకూ లాగకుండా తానే ఓదార్చాడు. కాలి తాపు తగిలినా పట్టించుకోలేదు.

> "నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁబూని తాఁ
> కిన యది నాకు మన్ననయ ; చెల్వగు నీ పదపల్లవంబు మ
> త్తను పులకాగ్ర కంటక వితానముఁ దాఁకిన నొచ్చునంచు నే
> ననియెద ; నల్కమానవు కదా యికనైన నరాళకుంతలా !"
>
> [1–123]

అని ఆమె పాదాలు పట్టుకున్నాడు. (ముందుజాగ్రత్త కోసం కూడా పట్టుకొని ఉండవచ్చు !) పారిజాతవృక్షాన్ని ఆమె పెరటిచెట్టుగా నాటుతానని వాగ్దానం చేశాడు. చెట్టు ఆమె ఇంట ఉంటుంది ; దాని పుష్ప గంధం అన్నిదిక్కులా అందరికీ లభిస్తుంది. కృష్ణుడు చేసే పనులలో స్వార్థమూ, పరమార్థమూ ఎప్పుడూ ఉంటాయి.

ఇంద్రుణ్ణి దేవసమూహాలతో సహా నిర్జించినప్పుడు కృష్ణుడు చతుర్దశ భువనాలనూ జయించగలిగిన వీరరసావతారుడుగా కనిపిస్తాడు, మళ్ళీ సత్యభామ తనను దానం చేసినప్పుడు కేవలం మానవుడే! ఇలా కావ్యం మొత్తంలో కృష్ణుడు దివ్య మానుషరూపాలలోనూ, మాయానాటక సూత్రధారిగా కొంటెనవ్వులతోనూ కనిపిస్తాడు.

తరువాతిపాత్ర స్వీయ అయిన నాయిక సత్యభామ. విప్రలబ్ధ, గాఢ ప్రణయిని. "చక్కనిదాన నంచు, ఎలజవ్వని నంచు, జగంబులోనఁ బేరెక్కిన దాన నంచుఁ, బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ దా నిక్కుచు" [1–66] విర్రవీగుతూ ఉంటుందని నారదుడు చక్కగా వర్ణించాడు. ఆమెది ఆవేశాత్మకమైన ప్రణయం. దానికి తోడుగా ఈర్ష్య ఎప్పుడూ ఉంటుంది. భర్తను తన కొంగున ముడువేసుకోగలిగానని ఆమె నమ్మకం. అది దెబ్బ తిన్నప్పుడల్లా అభిమానం గాయపడుతుంది. దేవలోక ప్రసిద్ధమైన పారిజాత పుష్పాన్ని తనప్రియుడు తనను కాదని తన సవతి రుక్మిణి కిచ్చాడు. అది చూచిన నారదుడు ఆమెను పొగడడమే కాకుండా తనను

దూషించాడు ! అది విని కృష్ణుడు ఊరుకున్నాడు ! అదీ తన సవతి యెదుట !! ఈ పరిస్థితిలో ఆమెకు ఎంత కోపం రావాలో అంత కోపమూ వచ్చింది.

> "అన విని వ్రేటువడ్డ యురగాంగనయుంబలె నేయి వోయ భ
> గ్గన దరికొన్న భీషణ హుతాశనకీల యనంగ లేచి, హె
> చ్చిన కనుదోయి కెంపు తన చెక్కులఁ గుంకుమ పత్రభంగ సం
> జనిత నవీన కాంతి వెదజల్లఁగ గద్గద ఖిన్న కంఠియై" [1-82]

విలపించింది. ఆ కోపంలో ఆమె ఆభరణాలు తీసివేసి మాసినచీర కట్టుకొంది. తల నొప్పికి వాడే కస్తూరి పట్టు దట్టంగా పట్టించి, తలకు గుడ్డ కట్టుకుంది. చీకటి ఇంట్లో మారుమూల మంచంపైన పడుకొన్నది. అంత చీకట్లోనూ ఆ అతిలోక సౌందర్యవతి రూపం మబ్బులమధ్య చంద్రునిలా ప్రకాశిస్తూనే ఉంది. కృష్ణుడు తనను అనునయించడానికి వచ్చాడు. అతనితోబాటు వచ్చిన పారిజాత వాసనలు గమనించి, తనను ఉడికించడానికి వచ్చాడనుకుని మరింత ఉడికి పోయింది. కృష్ణుడు ఎన్నో విధాలుగా అనునయించాడు.

> "పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబుఁ దీర్ప నె
> ప్పాటను పాటు గామి, మృదుపల్లవ కోమల తత్పద ద్వయీ
> పాటల కాంతి మౌళి మణిపంక్తికి వన్నియ వెట్ట నా జగ
> న్నాటక సూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె ; మ్రొక్కినన్"
> "జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
> ర్చుల తాంతాయుధు కన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునన్
> దొలఁగన్ ద్రోచె లతాంగి ; యట్ల యగు ; నాథుల్నేరముల్ సేయఁ బే
> రలుకం జెందిన యట్టికాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే ?"
> [1-120,121]

ఇక ఏవిధంగానూ ఆమె అలుక కరిగించలేక, ఆమె పాదాలకు శిరస్సు వంచి మ్రొక్కాడు — ఆ జగన్నాటక సూత్రధారి. మరో యిల్లాలు అయితే 'శివ – శివ అంటూ పాదాలు లాక్కునేది. కాని ఆమె సత్యభామ కదా ! కాలితో అతని తలను ప్రక్కకు త్రోసింది. "నీ కాలి తాపుకూడా నాకు శృంగార లీలా విశేషమే !" అన్నాడు కృష్ణుడు. అంతవరకూ ఆమె అది తాపు అనుకోలేదు. కాని కృష్ణుడు 'తాపు' అనగానే నిజంగానే గట్టిగా తగిలింది కాబోలు ననుకుంది. కోపం సడలి పోయి, ఉక్రోషంగా మారింది. కోపమంతా బయటికి పోయేటట్లు అనదలచుకున్న మాటలన్నీ అనేసి, చివరికి ఏడ్చేసింది. కృష్ణుడు బుజ్జగించగానే కోపం తీరి పోయింది. ఆమె కోపం తాటాకు మంటవంటిది. తనను అన్ని మాటలు అన్న నారదుడు, ఆ రోజే తనవద్దకు వచ్చినా ఆదరించింది. ఆయన ఉపదేశంతోనే పుణ్యకవ్రతం చేసింది. తాను వీరవనితను, వీరపత్నిని అనే ధిషణాహంకారం

ఆమెలో ఉన్నది. పారిజాతాన్ని అపహరించుకుని వస్తున్నప్పుడు అడ్డగించిన వన పాలకులకు జవాబు చెప్పినది సత్యభామే! "ఇదె నాదువిభునిచే నీ వదాన్య నగంబు నొడియించుకొని యేఁగుచున్నదానఁ; బలుకు లేటికిఁ? దా వీరపత్నియేని మా శచీదేవి తనదు ప్రాణేశుఁడైన మఘవు నిటఁబంపి, సత్యభామా విధేయువలన మరలఁగగొని పొ [4-59] మ్మని" చెప్పడంతో ఆమె స్వభావ చిత్రణ పూర్తిఅయింది. శచీదేవిని, ఆమెద్వారా ఇంద్రుని పౌరుషాన్ని రెచ్చగొట్టకపోతే ఇంద్రునికి అంత కోపం వచ్చేది కాదేమో!

మిగిలిన పాత్ర నారదుడు. అతని కలహభోజనత్వం ప్రసిద్ధం. అది యీ కావ్యంతో మరింత ప్రసిద్ధమైంది. అసలు పారిజాత కుసుమాన్ని పనికట్టుకుని తీసుకుని రావడమే అతని కలహభోజనత్వానికి నిదర్శనం. పైగా రుక్మిణీ కృష్ణులను లక్ష్మీనారాయణులుగా పొగడి, సత్యభామాదులను పరోక్షంగా చిన్నబుచ్చాడు. పారిజాతాన్ని రుక్మిణికి కనుసన్నచేసి యిప్పించి, కావాలనే సత్యభామకు అవమానంకలిగే విధంగా మాట్లాడాడు. తన గురువైన కృష్ణుడు సంకల్పించిన నాటకానికి తాను ప్రదర్శకుడు అయి సమర్థవంతంగా నడిపించాడు. ఇంతచేసినా ఆయన అజాతశత్రుడు! సత్యభామకు పుణ్యకవ్రతం ఉపదేశించి, వ్రతంలో భాగంగా కృష్ణుణ్ణి, పారిజాతాన్ని దానంగా స్వీకరించాడు. మళ్ళీ ఆ రెంటినీ ఆమెకే అనుగ్రహించాడు. మొదట పారిజాతం సత్యాదేవి స్వార్జితం. ఆమె తరాలకు అందే ప్రమాదం ఉంది. కనుక తాను దానిని స్వీకరించి, కృష్ణునితోబాటు ఆమెకు అనుగ్రహించాడు. అంటే కృష్ణుడు ఉన్నంతకాలమే పారిజాతము ఆమెవద్ద ఉండే విధంగా నిబద్ధం చేశాడు. అది కల్పవృక్షం. దాని సద్వినియోగం తెలియనివారి చేతిలోపడితే వినాశనకారి అవుతుంది. అలా జరగకుండా జాగ్రత్త పడ్డాడు నారదుడు. ఆయన చేష్టలలో ఇంత పరమార్థం ఎప్పుడూ ఉంటుంది.

శైలి :

తిమ్మనకు ఒక ప్రత్యేకమైన శైలి ఉంది. లలితలలితములైన పదముల కూర్పులో ఒక శ్రావ్యతను సాధించాడు. ఉపమ, ఉత్ప్రేక్ష అనే రెండు అలం కారాలు తిమ్మనకు చాలా ఇష్టం. స్వభావోక్తి తిమ్మన వాక్కులో మనోహర నృత్యం చేస్తుందంటే అది అతిశయోక్తి కాదు. ఛందస్సు గమనిస్తే వృత్తాలు, జాత్యుపజాతులు సర్వసాధారణమైనవే కథా గమనానికి వాడాడు. అతిది కృష్ణుని స్తుతించే ఘట్టంలో సమగణదండకం వ్రాశాడు [3-38].

కవి ఆత్మీయత :

తిమ్మన "నానాసూన వితాన వాసనల ...." అనే పద్యం వ్రాయడంవలన 'ముక్కు' అనే ఉపనామం వచ్చిందని కథ. కాని ఆ పద్యం భట్టుమూర్తిది. పెద్ద

ముక్కు ఉండడంవల్లనే ముక్కుతిమ్మన అనే పేరు వచ్చి ఉంటుంది. ఈ కావ్య రచన వెనుక ఒక కథ ఉన్నదని ప్రతీతి. రాయలవారు శృంగార గోష్ఠిలో ఉండగా పొరపాటున రాణీగారి కాలు తగిలింది. ఆయన అవమానంగా భావించి ఆగ్రహించాడు. ఆమె క్రుంగిపోయి, తనకు ఆప్తపూజ్యుడుగా ఉన్న తిమ్మనతో చెప్పుకుంది. రాయలవారికి కనువిప్పు కలిగించడానికే తిమ్మన ఈ కావ్యం వ్రాశాడట. వర్ణనలు వదలివేసి కథ సూటిగా చెప్పుకొనిపోవడం గమనిస్తే, ఈ కథ నిజమే ననిపిస్తుంది. కృష్ణుడంతటివాడే అలా ప్రవర్తిస్తే, తాను అలగడం భావ్యంకాదని రాయలవారు గ్రహించారు. కావ్య ప్రయోజనం నెరవేరింది. కనుక తర్వాత అంతా వర్ణనలే! ఒక సంసారం నిలబెట్టడానికి కావ్యరచన చేసిన తిమ్మన వాలా ఆర్ద్రహృదయుడు. ఆ మెత్తదనానికి తగినట్లే కావ్యమంతా మృదుమధురంగా నడుస్తుంది.

తిమ్మన వేదవేదాంగ పురాణేతిహాసాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసి పరిణతి పొందినవాడని కావ్యంలో నిదర్శనాలు ఉన్నాయి. కాకలి మొదలైన పేర్లు ఉపయోగించడం వలన సంగీత శాస్త్రాభ్యాసం కూడా చేసినవాడు. రాచ నగరు మర్యాదలు తెలిసినవాడని, కృష్ణుని అంతఃపుర వర్ణన వలన తెలుస్తుంది. రాయలవారితోబాటు కళింగదేశ విజయ యాత్రలో తిమ్మన కూడా పాల్గొన్నాడు. కనుకనే యుద్ధవర్ణనలు చక్కగా చేయగలిగాడు.

మహాశివ దీక్షాపరుడైకూడా కృష్ణతత్త్వాన్ని అర్థం చేసుకుని, మత సామరస్యానికి, సంస్కృతీ పరిరక్షణకు కారకుడైన తిమ్మన ధన్యుడు.

## కొన్ని పదాలకు అర్థాలు

యామవతీ కళత్రుఁడు = చంద్రుడు
ఉదయావసరంబు = ఉదయించు సమయం
పాండిమ శ్రీ = తెల్లని కాంతి
పాయని = విడువని
నెవ్వగన్ = దుఃఖముతో
ఇంద్రరాజ్యలక్ష్మీ ముఖమండలంబునన్ = ఇంద్రుని దిక్కు అయిన తూర్పు దిక్కున
వెల్లఁదనంబు = తెల తెలబోవుట
కైవడిన్ = వలె
అరాళకుంతలా = నొక్కుల జుట్టుగలదానా!
భవదీయ దాసునిన్ = నీదాసుని

నెయ్యపుఁగిన్కన్ = ప్రణయ కోపముతో
తాఁచినన్ = తన్నినను
మన్ననయ = రవమే
చెల్వు + అగు = అందమైన
పదపల్లవంబు = చిగురుటాకువంటి పాదము
మత్ + తను పులక + అగ్ర కంటక వితానమున్ = నా శరీరమున పుట్టిన పులకలనెడి ముళ్ళ వరుసను
అల్క = కోపము
ఉరగాంగన = ఆడత్రాచు
దరికొన్న = జ్వలించిన
హుతాశనకీల = అగ్నిజ్వాల
కనుదోయి = రెండుకన్నులు
కెంపు = ఎర్రదనము
కుంకుమపత్రభంగ = అలంకారములుగా తీర్చిన రేఖలనుండి
సంజనిత నవీనకాంతి = పుట్టిన క్రొత్త కాంతి
గద్గద భిన్న కంఠియై = డగ్గుత్తికపడిన కంఠస్వరముగలదియై
పాటల గంధి = పొగడపూవువంటి తావిగల సత్యభామ
పాటిలు = నిలచిన
కోపభరంబున్ = కోపమును
ఏ + పాటను = ఎట్లును
పాటుకామిన్ = సాధ్యముకాక
మృదుపల్లవకోమల = మెత్తనిచిగురువలె మెత్తనైన
పదద్వయీ పాటలకాంతి = పాదముల యెర్రనికాంతి
మౌళిమణిపంక్తికిన్ = శిరస్సు పైనున్న మణులకు
వన్నియ = మెరుగు
జగన్నాటక సూత్రధారి = జగత్తుఅనెడి నాటకమును నడిపించువాడు
యదునందనుఁడు = కృష్ణుడు
అర్మిలిన్ = ప్రేమతో
జలజాత + ఆసన = బ్రహ్మ
వాసవ + అది = ఇంద్రుడు మొదలగు
సురపూజాభాజనంబు = దేవతలచే పూజింపబడునది
లతాంతాయుధు కన్నతండ్రి = మన్మధుని తండ్రి యైన కృష్ణుడు
అచ్చోన్ = అక్కడ
వామ పాదంబునన్ = ఎడమకాలితో

లతాంగి = తీగవంటి దేహముగల సత్యభామ
పేరలుక = గొప్పకోపము
ఉచితవ్యాపారముల్ = సరియైనప్రవర్తనలు
నేర్తురే ? = తెలియగలరా ?
ఈసునన్ = ఈర్ష్యయందు
డెందమునన్ = హృదయమున
శోకదవానలంబు = దుఃఖమను నగ్ని
గాసిలి = కుమిలి
ప్రాణవిభు కట్టెదుటన్ = భర్త యగు కృష్ణునియెదుట
లలితాంగి = సున్నితమైన శరీరముగల సత్యభామ
పంకజశ్రీసఖమైన = కలువలవంటి కాంతులుగల
మోముపయి = ముఖముపై
చేలచెఱంగు+ఇడి = చీరకొంగు కప్పుకొని
బాలపల్లవగ్రాస = లేతచిగుళ్ళు మేయుటవలన
కషాయకంఠ = వగరెక్కిన కంఠముగల
కలకంఠ వధూ = ఆడుకోకిలవలె
కలకాకలీధ్వనిన్ = అతిమధురమైన స్వరముతో.

## ఆధార గ్రంథములు


1. పారిజాతాపహరణము – దూసి రామమూర్తిశాస్త్రిగారి సురభివ్యాఖ్యా సహితము
2. తాపీ ధర్మారావుగారి పీఠిక – సాహిత్య అకాడమీ ప్రచురణ
3. 'కావ్య పరీమళము' – కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు
4. సమగ్ర ఆంధ్ర సాహిత్యము – ఆరుద్ర [7 వ సంపుటము]
5. ఎమెస్కోవారి ప్రచురణకు పీఠిక – కవిసమ్రాట్ విశ్వనాథ సత్య నారాయణగారు
6. ఆంధ్ర కవి తరంగిణి – చాగంటి శేషయ్యగారు [7 వ సంపుటము]
7. విజయనగరాంధ్ర కవులు – శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారు.

# శ్రీకాళహస్తి మాహాత్మ్యము—ధూర్జటి

సమీక్ష : డా॥ మోపిదేవి కృష్ణస్వామి, ఎం.ఏ., పిహెచ్.డి.

[జన్మస్థలం : కోడూరు, దివితాలూకా, కృష్ణాజిల్లా. జననం : 7–7–1952. ఎం.ఏ. 'మహాభారతము-ధర్మాద్వైతము' అన్న అంశంపై ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు, తెలుగుశాఖలో పరిశోధనచేసి, పిహెచ్.డి. పట్టానికి సిద్ధాంతవ్యాసాన్ని సమర్పించారు. ముద్రితకృతులు – స్వామిగేయాలు ; సందేహాలు – సమాధానాలు ; దర్శనాలు – నిదర్శనాలు ; సంభాషణలు – సమన్వయాలు. కొన్ని వ్యాసాలు, సాహిత్య ఆధ్యాత్మిక పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. ఉచిత హోమియో వైద్యశాలలు నెలకొల్పి యువకులను వైద్య సాంస్కృతికరంగాల్లో సుశిక్షితుల్ని చేస్తున్నారు.]

కవి జీవితాదులు :

పుష్పంనుంచి పరిమళం వ్యక్తమైనట్లు అద్వైతస్థితిని పొందిన శివభక్తుని నుంచి వ్యక్తమైన అనుభూతి ప్రధానమైనకావ్యమే శ్రీకాళహస్తిమాహాత్మ్యం. దీన్ని రచించిన ధూర్జటి కేవలం కవిమాత్రుడుకాడు. కాలక్షేపంకోసం కవితలు అల్లినవాడు కాడు. కేవలం ఊహలకు రూపకల్పన చేసినవాడుకాడు. దైవం తనకు అనుగ్రహించిన అనుభూతిని, ఆ దైవంలో తనకు దర్శనమిచ్చిన విభూతిని అప్రయత్నంగా కావ్యరూపంలో వ్యక్తంచేసినవాడు. భవపరాఙ్ముఖుడై ఇందుగలడందులేడను సందేహములేక ఎల్లెడలా, ఎల్లవేళలా శివసాక్షాత్కారాన్ని అనుభవిస్తున్న దివ్య స్థితిలో కవినుండి దిగివచ్చిన భవ్యకావ్యమే శ్రీకాళహస్తిమాహాత్మ్యం.

ఈ కవి వెలనాటి ఆర్వేలనియోగి. ఇతని తల్లి సింగమ, తండ్రి జక్కయ నారాయణ. కాళహస్తిప్రాంత నివాసియని విమర్శకుల ఊహ. ఇతడు కృష్ణదేవ రాయల మలిదశలో తెనాలిరామకృష్ణునితో కలసి అష్టదిగ్గజాలలో ఒకడై వర్ధిల్లినాడు. కృష్ణదేవరాయల మరణానంతరమే ధూర్జటి, రామకృష్ణులు తమ బృహత్కావ్యాలను రచించినట్లు తెలుస్తోంది.

ధూర్జటి వయస్సులో ఉన్నప్పుడు సరసుడనీ, స్త్రీలోలుడనీ, తరువాత తరువాత సంసారంలోని సారమెరిగినవాడై భవపరాఙ్ముఖుడయ్యాడనీ జనశ్రుతిలో కథలు వినపడుతూ ఉంటాయి. ఈ అభిప్రాయాన్ని అతని శ్రీ కాళహస్తీశ్వర శతకంతోపాటుగా, మరో ఆధారంకూడా బలపరుస్తోంది. కృష్ణరాయలు ధూర్జటి కవిత్వానికి ముగ్ధుడై, ఒకనాడు—

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో
యతులిత మాధురీ మహిమ !"

అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చగా తెనాలిరామకృష్ణుడు అందుకొని,

"హా తెలిసెన్ భువనైకమోహనో
ద్ధత సుకుమార వారవనితా ఘనతాపహారి సం
తత మధురాధరోదిత సుధారసధారలు గ్రోలుటంజుమీ !"

అని జవాబిచ్చాడట. ఈ అంశాన్ని ధూర్జటిమనుమడైన కుమారధూర్జటి తన 'కృష్ణరాయ విజయం'లో పేర్కొన్నాడు.

కథాసంగ్రహం :

ఒకనాడు శివుడు జంగమవేషంలో పోతూఉండగా ఒక రాజపరిచారిక అతణ్ణిచూసి ముగ్ధురాలై, తన ఇంటికి ఆహ్వానిస్తుంది. శివుడు ఆమె కోరికను మన్నించి, ఆమె ఇంట బసచేసి, ఆమెను రతిక్రీడల్లోకూడా తేలుస్తాడు. ఆ పరిచారిక ముఖ్యవిధి రాజుగారిభోజనానికి పళ్లాన్ని అమర్చడం, భోజనానికి వచ్చిన రాజుగారు పళ్లెన్ని అమర్చేపరిచారిక రాకపోవడంచూసి, కోపించి, ఆమెను కొనిరమ్మని భటుల్ని పంపుతాడు. భటులు ఆమెను హాజరుపెడతారు. రాజుగారు ఆ పరిచారిక శిరోజాలను తీయించివేస్తారు. కేశాలు పోయాయన్న క్లేశంతో జంగందేవర పాదాలమీద వాలుతుంది పరిచారిక. జంగందేవర తనచేతితో ఆమె శిరస్సును స్పృశిస్తాడు. ఎప్పటిలాగా శిరోజాలు రూపుకట్టుకుంటాయి. మరునాడు ఆ పరిచారికను శిరోజాలతో చూసిన రాజు ఆశ్చర్యపోయి, అది జంగందేవర మహిమ అని ఆమెవల్ల తెలుసుకుంటాడు. ఆ మహిమాన్వితుణ్ణి చూడాలని దాసితోకలసి జంగంరూపంలో ఉన్న శివునిదర్శనం చేసుకుంటాడు. శివుని ఆశీస్సులు పొందుతాడు. ఆ పైన ఆ రాజుకోరికపై జంగంరూపంలోని శివుడు శ్రీకాళహస్తి మాహాత్మ్యాన్ని వివరిస్తాడు.

విశ్వామిత్రుడివల్ల బిడ్డల్నికోల్పోయిన వసిష్ఠుడు భూదేవినుంచి ఉపదేశాన్ని అందుకొని, తన మనోవ్యథను బాపుకొనేటందుకు శివుణ్ణిగూర్చి తపస్సు చేస్తాడు. శివుడు అతని తపస్సుకుమెచ్చి సాక్షాత్కరించి, ప్రశాంతిని అనుగ్రహిస్తాడు. లింగం రూపంలో సాక్షాత్కరించిన శివుణ్ణి యుగయుగాల జనులు తరించేందుకు వీలుగా అక్కడ అలాగే ఉండిపొమ్మని కోరుకుంటాడు వసిష్ఠుడు. శివుడు అందుకు అంగీకరిస్తాడు.

కొన్నాళ్లు గడిచిన తరువాత అగస్త్యుడు భార్యతోకలసి ఆ లింగందగ్గరకు చేరుతాడు. ఆ క్షేత్రంలో ఒకతీర్థంకూడా ప్రవహిస్తే బాగుంటుందని భావించి, ఆకాశ గంగను భూమిపైకి దింపేటందుకు శివునిగూర్చి తపస్సు ప్రారంభిస్తాడు. అతని తపస్సుకు మెచ్చిన శివుడు బ్రహ్మద్వారా అగస్త్యుడు కోరినచోట ఆకాశగంగ

ప్రవహించే వరాన్ని అనుగ్రహిస్తాడు. ఆ ఆకాశగంగ సువర్ణముఖరీనదిగా రూపు దిద్దుకొంది.

అటుపైన బ్రహ్మ తన పుత్రవ్యథను బాపుకునేటందుకు శివునిగూర్చి తపస్సు చేయాలని సంకల్పించి, ఆ క్షేత్రానికి చేరుకొన్నాడు. సరస్వతియెడల అమితమైన కోరిక కలిగి నూరు రూపాలు ధరించమని ఆమెను కోరాడు బ్రహ్మ. ఆమె అలాగే ధరించింది. బ్రహ్మ ఆ రూపాలతో విహరించాడు. నూర్గురు పుత్రులు కలిగారు, వాళ్లు అసురభావంతో రాక్షసులై లోకకంటకంగా ప్రవర్తించసాగారు. బ్రహ్మ ఉగ్రుడయ్యాడు. ఆ ఉగ్రత్వంనుంచి ఉగ్రుడనే కొడుకు రూపుకట్టుకొన్నాడు. బ్రహ్మ ఆజ్ఞప్రకారం ఆ నూర్గురినీ వధించి, తండ్రికి ఆ వార్త తెలియజేశాడు. పుత్రశోకంతో నిండిన బ్రహ్మచూపుకు ఉగ్రుడు భస్మమయ్యాడు. ఈ విధంగా పుత్రులందరినీ కోల్పోయానన్న బాధతో బ్రహ్మ సరస్వతితో కలిసి ఆ క్షేత్రానికి తపస్సుకై చేరుకున్నాడు. బ్రహ్మ తపస్సుకు మెచ్చి శివుడు సాక్షాత్కరించాడు. దక్షిణకైలాస పర్వతాన్ని చూసినంత మాత్రాన పుత్రహత్యాది దోషాలన్నీ పోయాయని అభయమిచ్చి, వారికి సుపుత్రుడు కలిగేటట్లుగా వరం ఇన్చాడు. ఆ వరంవల్ల జన్మించినవాడే ఋభువు.

ఆ పైన, ఒక సాలెపురుగు (శ్రీ), ఒక పాము (కాళము), ఒక ఏనుగు (హస్తి) ఆ శివలింగాన్ని పూజించి, చిత్రమైన తీరులో శివసాయుజ్యాన్ని పొందుతాయి. వాటి పేరుమీదుగా ఆ క్షేత్రం శ్రీకాళహస్తి అయింది.

శ్రీకాళహస్తిలోని శివుడు ఎరుకలరాజు కొడుకైన తిన్నడికి కలలో కనపడి, తనదగ్గరకు రప్పించుకుంటాడు. అతని గాఢమైన భక్తిని శివబ్రాహ్మణుడికి ఋజువుపరచి, ఆ ఇద్దర్నీ తనలో కలుపుకొంటాడు. అలాగే అహంకారియైన నత్కీరకవికి కళ్లుతెరిపించి, తన సాన్నిధ్యాన్ని అనుగ్రహిస్తాడు.

అలాగే, వారధర్మాన్ని అంగీకరించకుండా, తల్లి వారించినా వినిపించుకోకుండా శ్రీకాళహస్తికి ప్రయాణంకట్టిన వేశ్య కూతుళ్లను ఇద్దరిని దొంగలబారి నుంచి రక్షించి, తనదగ్గరకు చేర్చుకుంటాడు.

ఈ గాథల్ని విన్న యాదవరాజు ఆ భక్తుల పూర్వజన్మాలను గూర్చి కుతూహలంతో అడుగుతాడు. విశ్వకర్మ కొడుకైన ఊర్ణనాభుడే సాలెపురుగుగా, శివుని చేతి ఆభరణమైన నాగమే కాళముగా, ప్రమథగణాల్లో ఒకడైన హస్తే ఏనుగుగా అర్జునుడే తిన్నడుగా జన్మించారని వివరించి, అట్టి శివునకు గుడి కట్టించమని ఆనతిచ్చి, జంగంరూపంలోని శివుడు అంతర్ధానం చేస్తాడు. భక్తిశ్రద్ధలతో గుడి కట్టి యాదవరాజు తరిస్తాడు.

వస్తుతత్త్వం :

ఈ కాళహస్తి మాహాత్మ్యానికి మూలం షడధ్యాయి అని ధూర్జటికి ముని మనుమడైన లింగరాజకవి తాను వ్రాసిన కాళహస్తిమాహాత్మ్యంలో వివరించాడు. ధూర్జటి వంశం వారంతా కాళహస్తీశ్వరభక్తులే. కాళహస్తీశ్వరుని పైనగాని, అతనికి నమస్కరించిగాని కవిత చెప్పడం వారికి సంప్రదాయం.

స్కాందపురాణాంతర్గతమైన వైష్ణవఖండంలో వేంకటేశ్వరుని మాహాత్మ్యాన్ని ప్రతిపాదించే సందర్భంలో శ్రీకాళహస్తి వైశిష్ట్యాన్ని గూర్చి ఆరు అధ్యాయాల్లో తెలుపబడింది. విమర్శకులు ఈ ఆరు అధ్యాయాలే ధూర్జటి కృతికి మూలమని భావిసున్నారు. ఈ అధ్యాయాల్లో సువర్ణముఖరీ నది ప్రాశస్త్యం, శ్రీకాళహస్తీశ్వర నామ ప్రసక్తిమాత్రమే ఉన్నాయి. మిగిలిన భక్తుల కథలు లేవు. బహుశా ఈ కథల్ని శైవసంప్రదాయం నుంచి, జనశ్రుతినుంచి ధూర్జటి స్వీకరించి ఉంటాడని విమర్శకుల భావన.

ఈ ప్రబంధంలో నాలుగు ఆశ్వాసాలు ఉన్నాయి. క్షేత్రం రూపుకట్టుకోవడం, ఆ క్షేత్రంలో తీర్థం ప్రవహించడం మొదటి అధ్యాయంలో దివ్యంగా వర్ణించబడ్డాయి. బ్రహ్మదేవుడు సైతం తన పుత్రవధాపాతకాన్ని పోగొట్టుకోవడానికి ఈ క్షేత్రానికి తరలిరావడం, క్షేత్రానికి శ్రీకాళహస్తి అనే నామం సిద్ధించడం ద్వితీయాశ్వాసంలో వివరంగా వర్ణించబడ్డాయి. ఆ క్షేత్రంలో తరించిన తిన్నడు, శివబ్రాహ్మణుడు, నత్కీరుడు మొదలైన వారి కథలు తృతీయాశ్వాసంలో హృద్యంగా వర్ణించబడ్డాయి. సంస్కారవంతులైన వేశ్య పుత్రికలను శివుడే అడుగడుగునా ఆదుకొంటూ, తన క్షేత్రానికి చేర్చుకొని, తనలో ఐక్యం చేసుకోవడం చతుర్థాశ్వాసంలో రమ్యంగా చిత్రించ బడ్డది.

ఈ క్షేత్రంలో తరించిన వారిలో వసిష్ఠాది ఋషులేకాక బ్రహ్మదేవుడుకూడా ఉన్నాడు. మోటభక్తిని చూపే తిన్నడు, భక్తిఅంటే తాను అనుకొన్నట్లే ఉండాలని నిర్ణయించే శివబ్రాహ్మణుడు, శివుడు చెప్పినా తప్పు తప్పే అనే నత్కీరుడు ఈ క్షేత్రంలో ముక్తినిపొందారు. శివభక్తి తనువులెత్తినట్లు పుట్టుకు వచ్చిన వేశ్య కూతుళ్లు శివుణ్ణి చేరుకున్నారు. అంతేకాదు, ఒక సాలీడు, ఒక పాము, ఒక ఏనుగు కూడా వాటి వాటి స్వభావాలకు అనుగుణంగా ఆరాధించి శివునిలో కలిసిపోయాయి.

తరించడానికి భక్తి ముఖ్యంగాని, పుట్టుక, ప్రాభవం, పాండిత్యం, పరువు ప్రతిష్ఠలు మొదలైనవి ముఖ్యం కాదని, ఫలానావారే తరించడం అని ఉండదని ఈ కావ్యం చక్కగా నిరూపిస్తూ, అనుభవానికి తెస్తూ, చదువరికి సర్వ సమత్వ దృష్టిని అప్రయత్నంగా అలవరుస్తుంది.

పాత్ర చిత్రణ :

మానవలోకంలోని విభిన్న మనస్తత్వాలనీ, వివిధ చిత్తవృత్తుల్నీ కాచి వడబోసిన వాడు ధూర్జటి. మానవ స్వభావాన్ని దర్శించడంలో తృతీయనేత్రం విప్పారినవాడు ఇతడని ఇతని పాత్రచిత్రణలో మనకు స్పష్టమవుతుంది. కనుకనే ఇతని పాత్రలు నేటివరకూ సజీవాలు; ఇక ఎప్పటికీ చిరంజీవులు. తనకు కలలో కనబడిన శివుని లింగాన్ని వెదుక్కుంటూ, అరణ్యంలో ఒంటరిగా బోసిపోతూఉన్న శివలింగాన్ని చూస్తాడు తిన్నడు. చూసి,

> "ఓసామీ! యిటువంటి కొండదరిలో, నొంటింబులుల్ సింగముల్
> గాసింబెట్టెడు కుట్రనట్టడవిలోఁ గల్గువ్వి క్రీనీడ నే
> యాసంగట్టితి వేటిగడ్డ నిలు? నీవాఁకొన్నచో కూడు నీ
> ళ్ళేనుట్టంబులు దెచ్చిపెట్టెదరు? నీకిందేఁటికే లింగమా!" [3–65]

అని జాలిపడుతూ, తమ ఊరురమ్మని, వస్తే సకలసదుపాయాలూ అమరుస్తాననీ ప్రార్థిస్తాడు. ఎవరూ లేకుండా ఒక్కడివే ఎలా ఉంటావు? అంటూ

> "ఇల్లో, ముంగిలియో, యనుంగుఁజెలులో యీడైన చుట్టంబులో,
> యిల్లాలో, కొడుకో, ధరింప పశమే యేపోఁడుముల్లేక? మా
> పల్లెం గోరిన వెల్లనుం గలవు తెప్పల్గాఁగ, నీకిచ్చెదన్
> జెల్లంబో! యిటనొంటినుండ కటు విచ్చేయంగదే లింగమా!" [3–70]

అని, బ్రతిమాలి, నీవురానిదే నేను వెళ్లను అని పంతంపట్టి ఉండిపోతాడు. తనతో వచ్చినవారిని

> "నాకుంజుట్టము తల్లిదండ్రులు జెలుల్నాథుండు నీదైవమే,
> మీకిచ్చోఁ బనిలేదు కష్టిపడఁగా, మీపల్లెకుంబొండు; కా
> రాకారంబులు చేసినం గదల నేరా; నిచ్చటం బ్రాణముల్
> పోకార్తుం దుది నాదు వేలుపునకై! బొంకన్నిజంబింతయున్" [3–82]

అనిచెప్పి, సాగనంపుతాడు. శివుడికి తన పుక్కిటి నీళ్లతో స్నానం చేయించి, తాను తెచ్చిన మాంసపు కరకుట్లను తినమంటాడు. శివుడు అందుకోకపోతే

> "ఆఁకలి గాదో భక్తిం
> దేఁకునగలవాడఁగానొ, తినవేల? కృపన్
> సాఁకఁగదే సన్నిపు, డ
> ట్టాఁకలఁబెట్టక, పలాశనానసక్తుఁడవై" [3–89]

అని రకరకాలుగా ప్రశ్నించి తినకపోతే ప్రాణాలు విడుస్తానంటాడు. శివుడు అందుకొని తినడం ప్రారంభిస్తాడు. ఇంతలో క్షేత్రాన్ని అప్పుడప్పుడూ వచ్చి,

శుభ్రపరచి, పూజించి వెళ్లే శివబ్రాహ్మణుడు రంగంలో ప్రవేశిస్తాడు. శివుని చుట్టూ ఉన్న వాతావరణాన్ని చూసి, విలవిల్లాడిపోతాడు.

> "కులదైవంబని, యర్చి, పూసి, పవిత్రమ్ముగఁబెట్టి, త్రైసేయు, లో
> పలి కిట్లెంగిలి మంగలంబులగు దొప్పల్ రాఁ గతంబేమి? ని
> ర్మల తోయస్నపనం బొనర్చిన శరీరం బేఁటికి న్నీరువ
> ట్టులు గట్టెం భవదాత్మ శుద్ధికిది గూఢంగా మహాహేయముల్"
>
> [3-96]

అని తాను తీర్చిదిద్ది వెళ్లిన పూర్వపుస్థితితో ప్రస్తుత స్థితిని పోల్చుకుని, శుచీశుభ్రం లేకుండా ఇలా చెడగొట్టిందెవ్వరని శివుణ్ణి ప్రశ్నిస్తాడు. అలాంటి అవకాశం యిచ్చి నందుకు ఆ దేవుణ్ణి తప్పుపడతాడు. ఏది ఏమైనాసరే చేసిందెవ్వరో చెప్పమంటూ,

> "నీ కిష్టం బిది గానీ,
> నాకా పాపాత్ముఁ జెప్పినం బది లక్షల్
> లేకున్న విడుతుఁ బ్రాణము
> ఏకై, కూడుగ్గఁబట్టిఁ నీలగ్రీవా!" [3-101]

అని ప్రతిన పడతాడు. శివుడు వానికి తిన్నని విషయం వివరిస్తాడు. ఆ తిన్నని భక్తిని చాటుగా ఉండి చూడమంటాడు. శివబ్రాహ్మణుడు సరేనంటాడు. ఎప్పటిలాగా తిన్నడు వచ్చి, తన పుక్కిటినీళ్లతో లింగాన్ని అభిషేకించి, దొప్పలతో తెచ్చిన మాంసాన్ని తినమంటాడు. శివుడు కదలకుండా మెదలకుండా కన్నువెంట బాష్పాలు కార్చడంతో మొదలుపెట్టి, తిన్నడు వేసిన మందులను పట్టించుకోకుండా రక్తాన్ని సహితం చిందిస్తాడు ఎన్నో రకాల మందులతో ప్రయత్నించి, ప్రయత్నించి చివరకు కన్నుకు కన్నే మందని నిర్ణయిస్తాడు తిన్నడు. తన కన్ను నొకదానిని పెకలించి శివుడికి అమరుస్తాడు. అంతటితో ఊరుకోక శివుడు రెండవ కంటకూడా రక్తం చిందిస్తాడు. వెంటనే తన రెండవ కంటినికూడా పెకలించి, శివునికి పెట్ట డానికి ఉద్యుక్తుడవుతాడు తిన్నడు. ఇంతలో అతనికి ఒక సందేహం వస్తుంది. రెండవ కన్ను పెట్టేసిన తరువాత మూడవ కంటినుంచికూడా శివుడు రక్తాన్ని కారిస్తే? ఆ సందేహానికి ఇలా జవాబు చెప్తాడు తిన్నడు :

> "లాలాటలోచనంబునఁ
> గీలాలము దొరఁగెనేనిఁ గేవల భక్తిన్
> గీలించి మనోదృష్టికి
> మూలంబగు నాదు ప్రాణములు నీకిత్తున్" [3-117]

తిన్నని భక్తికి మెచ్చి శివుడు సాక్షాత్కరించి, రెండవ కంటిని పెకలించబోతున్న తిన్నని వారించి ఎప్పటి స్థితిని అనుగ్రహిస్తాడు. అనన్యసామాన్యమైన తిన్నని భక్తిని

దర్శించి, తన పూర్వపు ఆలోచనలకు పశ్చాత్తాప పడి, తిన్నని సరసకు చేరుతాడు శివబ్రాహ్మణుడు. వారిరువురునీ శివుడు వరం కోరుకోమంటాడు. శరీరంపై తీపినీ, భవబంధాన్నీ తొలగిస్తే చాలంటారు వాళ్లు. ఆ సందర్భంలో శివబ్రాహ్మణుడు ఇలా అంటాడు :

"ఇతఁడు కిరాతుం డే దు
ర్మతి ; మమ్మడిగియె మహేశ ! మన్నించి ప్రస
న్నతఁ జూపితి ? రీతెఱఁగున
హితలీల, భవప్రయాన మెడలింపఁగదే !" [3-125]

ఈ మాటల్లో గహనమైన అర్థం ఎంతో ఉంది. ఇతడు కిరాతుడు, నేను దుర్మతిని అంటున్నాడు. అంటే కిరాతుడైన తిన్ననిది భౌతికంగా మలినమైన రూపం. అతని ప్రవర్తనకూడా మోటుగా ఉంటుంది. ఇక, తనది మానసికంగా మలినమైన వ్యక్తిత్వం. భౌతికంగా శుచిశుభ్రాలను పాటిస్తున్న తాను (శివబ్రాహ్మణుడు) మానసికంగా సమదృష్టి, విశ్వప్రేమ కోల్పోవడంవల్ల దుర్మతి అయ్యాడు. ఇలాంటి మా ఇద్దర్నీ మమ్మ అడక్కుండానే మీ అక్కున చేర్చుకున్నారు—అన్న శివబ్రాహ్మణుడి వాక్యంలో ధూర్జటి ఈ కథను స్వీకరించి విస్తరించడానికి గల కారణం అంతా సూచింపబడింది. ఏ దృక్పథంతో ఈ రెండు పాత్రల్ని కవి స్వీకరించాడో, ఏ సందేశాన్ని ఈ పాత్రలద్వారా ఈయదలచాడో ఈ వాక్యంలోనే సూచింప బడింది. ఈ దృష్టితో ఈ కథను మరల మరల చదివితే ఈ రెండు పాత్రల స్వరూప స్వభావాలూ చదువరికి మరింత స్పష్టపడతాయి.

ఇలాంటిదే నత్కీరుని పాత్రకూడా. నత్కీరుడు మధురరాజు ఆస్థానకవి. ఆ రాజు కొలువులో శంఖఫలకమనే కవులకూటమి ఉండేది. ఏ కవి ఆ సభలోనికి కవిత్వాన్ని వినిపించడానికి వచ్చినా ఆ శంఖఫలకం మెప్పుపొందాలి. ఆ శంఖ ఫలకాన్ని మెప్పించి, ఒప్పించిన కవిని రాజు ఘనంగా సత్కరిస్తాడు.

ఒకసారి ఆ రాజ్యంలో కనీవినీ యెరుగని కరవు వచ్చింది. మనిషిని మనిషి తినేటంత కరవు అది. చేసేదిలేక ఒక బీద బ్రాహ్మణుడు ఆ ఊరుని విడిచి వెళ్లబోతూ శివుడికి నమస్కరిస్తాడు. శివుడు ప్రత్యక్షమై వెళ్లవద్దని ఓదార్చి, ఒక పద్యాన్ని వ్రాసి యిచ్చి, రాజసభలో వినిపించి ధనాన్ని తెచ్చుకోమంటాడు. బీదబ్రాహ్మణుడు శంఖఫలకం సమక్షంలో రాజుకు పద్యం వినిపిస్తాడు. ఆ పద్యంలో పార్వతీదేవి కేశపాశం సహజ సుగంధమైనది అని వర్ణించబడుతుంది. వెంటనే నత్కీరుడు లేచి, 'ఇది అసంభవం, ఇలా వర్ణించడానికి వీల్లేదు.' అని అడ్డుకోవడంతో బీద బ్రాహ్మణుడు బిక్కచచ్చి ఆ పద్యం తనది కాదనీ, శివుడిదనీ చెప్పి, శివుడిచెంతకు వచ్చి, చేయకూడని పని చేశానని బాధపడుతూ—

"తా నెఱిఁగిన విద్య, నృపా
స్థానములో నెఱపఁ, గీర్తి సమకూరుంగా
కేనరునకుఁ బరవిద్యా
ధీనత, భూపాలసభలఁ దేజముగలచే ?" [3-162]

"నీ మాట నమ్మిపోయిన
నా మోనముఁ జెప్పనేల ? నత్కీరునిచే
నేమాట పడ్డ దుఃఖము
క్షామవ్యథ కొలఁది గాదు ; నద్భక్త నిధీ !" [3-163]

అని మొరపెట్టుకొన్నాడు. శివుడు అతణ్ణి ఓదార్చి, జంగం వేషంలో రాజసభలో ప్రవేశించి 'పద్యంలో తప్పుపట్టింది ఎవ్వరు ? ఏమా తప్పు ?' అని ప్రశ్నించాడు. నేనేఅని లేచాడు నత్కీరుడు. పార్వతీదేవి జడ సహజ సుగంధమని వర్ణించడం అసంబద్ధమన్నాడు నత్కీరుడు. 'అది సత్యం, సహజం, నేను చెబుతున్నాను' అన్నాడు శంకరుడు. 'పార్వతీదేవికి అలా ఉండవచ్చు. భూమ్మీద ఎవ్వరికీ అలా ఉండదు. ఇది గగన ప్రసూనవాదం. నీ లూలాపాలవు మాటలు కట్టిపెట్టు' అన్నాడు నత్కీరుడు. శివుడు తానెవ్వరో తెలియజెప్పాలని నిటలనేత్రం చూపించాడు. నత్కీరుడు అప్పటికీ లొంగలేదు. చెప్పింది శివుడైనప్పుడు, విషయం పార్వతికి సంబంధించింది అయినప్పుడు, కాదనడానికి తానెవ్వరు ? అని కూడా అతనికి అనిపించలేదు. పంతానికి పోయి, మరింత మొండికేసి—

"తలచుట్టు వాఱఁ గన్నులు
గలిగిన పద్యంబు తప్పుగాదన వశమే ?
వలదిచ్చట నీ మాయా
విలసనములు ; పనికిరావు ; విడువుమటన్నన్" [3-171]

అన్నాడు. శివుడు కోపించి, 'నీవు కుష్ఠురోగి వవుతా'వని నత్కీరుణ్ణి శపించాడు. వెంటనే నత్కీరుడు 'స్వామీ ! ద్రోహము చేసితిం దెలుపవే శాపాంత'మన్నాడు.

ఇంతకీ ఏం జరిగింది ? నత్కీరుడు తాను ద్రోహంచేసినట్లు ఒప్పుకుంటున్నాడు. ఏమిటా ద్రోహం ? ఆఁకటితోవచ్చి బీదబ్రాహ్మణుడు పద్యాన్ని చదివినప్పుడు పద్యంలో తప్పుందని పట్టుకున్నాడే తప్ప, అతడు ఎలాంటి పరిస్థితుల్లో వచ్చి ఆ పద్యాన్ని దేని నాశించి చదువుతున్నాడో గమనించలేకపోయాడు. మానవ నిర్మితమైన శాస్త్రాన్ని నిలబెట్టాలని చూశాడేతప్ప, మానవ సహజమైన క్షుద్బాధను బోధపరచుకోలేకపోయాడు. కనుకనే తనను శివుడు శపించాడని ఆ శపిస్తున్న క్షణాల్లో నత్కీరుడు గ్రహించగలిగాడు. ఒళ్లు తెలియకుండా ప్రవర్తించిన నత్కీరుడు ఒంటినిండా కారుతున్న చీమునెత్తురులతో దుర్వాసనతో, నలుగురిచేతా చీదరింప

బడితే తప్ప సత్యం బోధపడదని శివుడు అలా శపించాడు. శపిస్తున్న క్షణాల్లోనే సత్యాన్ని గ్రహించాడు గనుక, కైలాసశిఖరాన్ని చూస్తే శాపవిమోచనం జరుగుతుంది అన్నాడు. ఆపైన కుమారస్వామి సలహాపై నత్కీరుడు దక్షిణకైలాసమైన కాళహస్తిలో సువర్ణముఖీనదిలో స్నానంచేసి శాపవిమోచనాన్ని పొందుతాడు.

ఈవిధంగా ధూర్జటి పాత్రలు ఎంతటి సహజమైనవో అంతవిచిత్రమైనవి. ఎంత విచిత్రమైనవో అంత విశిష్టమైనవి. తగిన జాగరూకత వహించినకొద్దీ ఈ పాత్రల యెడల పదువరి చక్షువు కావలసినమేరకు ఉన్మీలితమవుతుంది.

వర్ణనలు :

ఈ కావ్యంలోని వర్ణనలన్నీ సహజంగా సాగాయి. సందర్భశుద్ధిని కలిగి ఉంటాయి. పరిమాణంలో పరిమితమైనవైనా అపరిమితమైన ప్రభావాన్ని చదువరి మనస్సుపై చూపగలవి. ఇవి కథాగతికి అడ్డురాకపోగా కథల్ని చదువరి మనస్సులో శాశ్వతంగా నిలిచిపోయేటట్లు చేయగల సామర్థ్యం గలవి.

ఈ కావ్యంలో పురవర్ణన, సూర్యోదయాస్తమయ వర్ణన, ఋతువర్ణన, యుద్ధవర్ణన, మృగయా (వేట) వర్ణన, కుమారోదయ (తిన్నని జనన సందర్భంలో) వర్ణన మొదలైన అష్టాదశ వర్ణనలన్నీ అమరాయి.

అగస్త్యుని తాపాన్ని వర్ణించే సందర్భంలో ఎండాకాలంలోని తాపాన్ని ఎంత సహజంగా వర్ణిస్తాడో చూడండి :

> ఎండెఁగొలంకులెల్లను, మహీధరము ల్దవ వహ్నికీలలన్
> మండె ధరాతలం బినుప మంగలముంబలెనుండెఁగాలి యా
> యెండల 'నేమిసెప్పఁబరమేశ్వర' యూవరణాంబురాశి లే
> కుండిన, నాడె పొక్కిపడకుండునె పద్మభవాండ భాండముల్.

[1–123]

ఎండాకాలం జీవుల్ని ఎంతగా తపింపచేస్తోందో ఈ ఒక్క పద్యంలో మరచిపోలేనట్లుగా చెప్పగలిగాడు ధూర్జటి. సముద్రమే లేకపోతే బ్రహ్మాండాలనే కుండలు ముక్కలైపడిపోయేవిట.

చంద్రోదయంలో ధూర్జటి శివసాక్షాత్కారాన్ని దర్శింపచేస్తాడు కాళ-హస్తుల వృత్తాంతం చెప్పేటప్పుడు,

> ఉదయగ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా
> ర్ధి, ధరధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీపప్రభారాజి కౌ
> ముది, తారానివహంబు లర్పితసుమంబుల్గాఁ దమోదూర సౌ
> ఖ్యదమై శీతగభస్తి బింబ శివలింగంబొప్పెఁ బ్రాచీదిశన్.

[2–133]

ఉదయపర్వతం పానవట్టంగా, సముద్రం అభిషేకోదకంగా, చీకటి ధూప ధూమంగా, వెన్నెల దీపాల కాంతిపుంజంగా, తారలు పూలుగా అమరగా, చంద్రుడు శివలింగమై వెలిశాడుట. కాళహస్తులతోబాటు ధూర్జటికిగూడా సర్వమూ శివమయమే గదా !

వర్ణనలో తాను వర్ణింపదలచిన దృశ్యాన్ని చదువరి కళ్లకు సాక్షాత్కరింప జేయడంలో ధూర్జటి కడునేర్పరి. శివుణ్ణి చేరుతున్న తిన్నణ్ణి ఎలా వర్ణిస్తున్నాడో చూడండి :

> విల్లొకచంక, నంపపొది వీపున, దొప్పలు కేలఁదోయిఁ బు
> క్కిళ్లఁ బవిత్రకాంచనముఖీ జలమొప్పగవచ్చి, భక్తి రా
> జిల్లఁ దదంబు మజ్జనముసేయుచు, దొప్పలనంజు డద్రిరా
> జల్లుని నారగింపుమన, నాపరమేశ్వరుఁ డూరకుండినన్.

[3–87]

తిన్నడు మన కళ్లముందు నడచివెళ్లి శివుణ్ణిచేరి బ్రతిమాలుతున్న అనుభూతిని కలిగిస్తుంది ఈపద్యం. సహజంగా, సంక్షిప్తంగా సాగుతూనే సమగ్రమైన దృశ్యసాక్షాత్కారాన్ని అందించడంలోను శివసాన్నిధ్యాన్ని అనుభవింపజేయడం లోను సాటిలేనివి ఇతని వర్ణనలు.

రసపోషణ :

భక్తిభావగమ్యమైన శాంతం ఈకావ్యంలో ప్రధాన రసం. వీరం, కరుణ, బీభత్సం, శృంగారం సందర్భాలను పురస్కరించుకొని వర్ణింపబడ్డ అంగరసాలు.

కావ్యప్రారంభంలో శివునికీ, రాజపరిచారికకూ నడుమ శృంగారం. బ్రహ్మ నుండి పుట్టిన ఉగ్రుడు రాక్షసులైన తమ్ముళ్లపై విజృంభించినపుడు వీరం, నత్కీరుడు శపించబడ్డ తరువాత కరుణం, నత్కీరుడు భూతానికి చిక్కినపుడు భయానకబీభత్సాలు అంగరసాలుగా చక్కగా తగుమాత్రంగా పోషింపబడ్డాయి. నదులు సముద్రంలో లీనమైనట్లు ఇవన్నీ ప్రధానమైన శాంతంలో లీనమౌతాయి.

ఈకావ్య రచనలో వర్ణాలు వర్ణాలుగాగాక ధూర్జటి భక్తిభావనను చదువరులకు పట్టియిచ్చే పాత్రలుగా పనిచేస్తాయి. తానున్న శాంతస్థితిలోనికి క్రమంగా చదువరిని గాథల చేయూతనిచ్చి కొనిపోతాడు ధూర్జటి. భక్తిభావనని జీవితక్షేత్రంలో పండించు కొని భగవంతునితో అద్వైతసిద్ధిని పొందిన వాడుతప్ప శాంతాన్ని ఈ స్థాయిలో పోషించలేడు.

ఆత్మీయత :

ఈ కావ్యంలో ప్రతిఅక్షరం కవి ఆత్మీయత నుండి దిగివచ్చినదే. ధూర్జటే ఇందరిభక్తుల పాత్రల్ని ధరించి శివుణ్ణి అర్చించుకున్నాడా అన్నట్లు ఉంటుంది.

ఈ కావ్యం మనసుపెట్టి చదువుకోగల చదువరినికూడా ఆ భక్తులపాత్రలన్నిటినీ దర్శింప జేయగలడీకవి. అయస్కాంతం ఇనుపముక్కలోని అయస్కాంతధర్మాన్ని మేల్కొల్పగలిగినట్లు చదువరిలోని సంస్కారాన్ని మేల్కొల్పి తీర్చిదిద్దగలశక్తి ధూర్జటి ఆత్మీయతకుంది. కవి కృషిచేసి రూపుదిద్దిన కావ్యంకాదిది. కవి ఋషిగా రూపొందినపుడు వ్యక్తమైన కావ్యమిది. కవి అనుభూతి దాల్చిన అక్షరాకృతే ఈకృతి.

## కఠినపదాలకు అర్థాలు

తెప్పలాగ = సమృద్ధిగా
కస్తిపడగా = బాధపడగా
కారాకూరంబులుచేసిన = క్షోభపెట్టిన
తేకువ = సంపూర్ణత
అట్టొఁకలఁబెట్టక = బాధపెట్టక
పలాశనము = మాంసము
కైసేయన్ = అలంకరింపగా
స్నపనము = స్నానము
నీరువట్టు = నీటిచారలు
లలాటలోచనము = నుదుటికన్ను
కీలాలము = రక్తము
ఆవరణాంబురాశి = చుట్టునున్న సముద్రం
పద్మభవాండభాండముల్ = బ్రహ్మాండాలనే కుండలు
ఉదయగ్రావము = ఉదయపర్వతము
పానవట్టము = లింగాన్ని స్థాపించే పీఠము
ధరధ్వాంతము = నేలమీదిచీకటి
శీతగభస్తిబింబ శివలింగము = చంద్రుడనే శివలింగము.

## ఆధార గ్రంథాలు


1) శ్రీకాళహస్తి మాహాత్మ్యం — వెంకట్రామ అండ్ కో వారి ప్రతి
2) ఆంధ్ర ప్రబంధము — అవతరణ వికాసములు — డా॥ కె.వి. ఆర్. నరసింహం
3) సమగ్ర ఆంధ్రసాహిత్యం — ఆరుద్ర (7వ సంపుటం)
4) కావ్యపరిమళము — కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ
5) విజయనగర ఆంధ్రకవులు — శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి.

# రాజశేఖర చరిత్రము—మాదయగారి మల్లన

సమీక్ష . శ్రీ యెందుగుల జగన్నాథనాయుడు, ఎం. ఏ.

[ జన్మస్థలం : సతివాడ, బొబ్బిలి తాలూకా, విజయనగరం జిల్లా. జననం 1–7–1952. ఎం.ఏ. 1979 అక్టోబరు, నవంబరు మాసాల్లో 'ఈనాడు' దినపత్రిక, హైదరాబాదులో భాషా పరామర్శ అసిస్టెంటు. ముద్రితవ్యాసాలు—బొబ్బిలియుద్ధకథలో బుస్సీపాత్ర ; రంగరాయునిపాత్ర ; బొబ్బిలి యుద్ధము—విజయరామరాజు [సమాలోచన]. ప్రస్తుతము "వీరగాథాపదాలు—బొబ్బిలికథ" అనే అంశముపై పిహెచ్.డి. కి పరిశోధన —తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు]

కవి జీవితాదులు :

మాదయ్యగారి మల్లన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానములోని అష్టదిగ్గజాల్లో ఒకడు. ఈ మల్లన జన్మస్థలం అయ్యంకిగ్రామము. ఇది కృష్ణామండలములోని చల్లపల్లి సంస్థానములోనిది. ఈతడు క్రీ. శ. 1480 ప్రాంతంలో జన్మించాడు. ఈ కవి కృష్ణదేవరాయల రాజ్యకాలము అనగా క్రీ. శ. 1509 – 30 సం॥ల ప్రాంతములోకూడ ఉన్నాడు. అఘోర శివాచార్యులకు శిష్యుడు. మల్లన తండ్రి మాదయ్య. ఈతని నివాస గ్రామమున మరికొందరు మల్లనలుండుటనుబట్టియో, ప్రౌఢకవి మల్లన మొదలుగా మరికొందరు మల్లన్నలు కవులలోనుండుటనుబట్టియో, ఇతనిని తండ్రిపేరుతోజేర్చి మాదయ్యగారి మల్లన అంటున్నారు. మల్లన ఆరువేల నియోగి, తాను వ్రాసిన రాజశేఖర చరిత్రను వినుకొండ గుత్తిసీమల పరిపాలకుడయినా నాదెండ అప్పయమంత్రి కంకితమిచ్చాడు. ఈ అప్పయమంత్రి మహామంత్రి తిమ్మరుసయ్య మేనల్లుడు. అల్లుడుకూడా. ఎప్పుడో అప్పయమంత్రి సిఫారసువల్ల మల్లన రాయల ఆస్థానియై యుండును. అయితే రాయల ఆస్థానియైన తరువాత అతడు రచించిన కృతులు కనబడలేదు. అతనిదని తెలియవచ్చినది, ఉపలబ్ధమైనది ఒక్క రాజశేఖర చరిత్రము మాత్రమే.

కథాసంగ్రహం :

అవంతిక నగరానికి రాజు హేమధన్వుడు. అతని రాజ్యంలో నెలకు మూడు వర్షాలు కురుస్తున్నాయి. అన్నిపంటలు పండుతున్నాయి. మునుల తపస్సులు నిర్విఘ్నంగా కొనసాగుతున్నాయి. హేమధన్వుని పరిపాలనలో ప్రజలంతా సుఖశాంతులతో ఉన్నారు. రాజుభార్య పేరు పాలిక. వీరికి సంతానము లేదు. శంభుసేవే

కొరతని తలంచి ఒక దేవాలయం కట్టించి శివపూజలు జరుపుతుండేవాడు. హరవర ప్రసాదమున రాణి గర్భిణి అయింది. ఒక కుమారుడు జన్మించాడు. ఆ బాలుడికి రాజశేఖరుడని పేరుపెట్టారు. శుద్ధాంత కాంతామణుల ఉపచారాలతో ఆ బాలుడు పెరిగి యౌవనంలో అడుగుపెట్టాడు.

ఒకనాడు హేమధన్వుడు నిండుసభలో ఉన్నాడు. అంతలో సుడిగాలివలె జటిల కౌశికుడనుముని అచటికి వచ్చాడు. అతని నివాసము బదరికాశ్రమము. ఆ ముని వరతంతు మహాముని శిష్యుడు. బహువేదవిద్యా మహనీయుడు. అతడు వచ్చిన వెంటనే రాజు సింహాసనము దిగి వినయవినమితుడయ్యాడు. ఆ ముని విశంకటుడనే రాక్షసునివల్ల ఆ యాశ్రమవాసుల జప తపోనిష్ఠలేవీ సాగుటలేదని చెప్పాడు. ఆ రాక్షసుడు ఒక పర్యాయం సింహమయి బెదరిస్తాడు. ఒకప్పుడు లేడియయి దగ్గర నిల్చుంటాడు. మరొకప్పుడు చెట్లను పెకలిస్తాడు. మరో సమయంలో శరభంలా కనిపిస్తాడు. ఇంకో సమయంలో మునిగా వస్తాడు. ఒక పర్యాయం అగ్నిఅయి, మరోపర్యాయం మేఘమయి, ఇంకోపర్యాయం శైలమయి, బదరికాశ్రమవాసులయిన తాపసులకు హడలుపుట్టిస్తున్నాడు. ఈ విధంగా ఆ ముని విశంకటాసురకృత్యాలను చెప్పి, ఆ రాక్షసు డెత్తుకొనిపోయిన తన కుమార్తెను విడిపించడానికి తనవెంట రాజశేఖరుని పంపవలసినదిగా హేమధన్వుని కోరాడు. ఆ రాజకుమారుని తనవెంట తీసికొనిపోయి మాయాభేదిని అను విద్యనుపదేశించాడు. రాజశేఖరుడు రాక్షసుని జయించి మునికుమార్తెను విడిపించి కాళికాదేవి నుండి ఒక దివ్యమణిని, ఒకయోగినుండి త్రికాలవేదియగు నొకచిలుకను పొందాడు. తరువాత రాజశేఖరుడు ఒక కాసారంలో స్నానం చేశాడు. దేవీదత్తమణి ప్రభావం చేత రాజుకు పాయస సహితఘృత భోజనం లభించింది. తరువాత ఆ వనంలో విశ్రమించియుండగా సింధురాజపుత్రి కాంతిమతి అతని కంటబడింది. రాజపుత్రి, రాజు పరస్పరము చూచుకొన్నారు. రాజు చూపు మరలించి చిలుకవద్దకువెళ్ళి ఆమె వృత్తాంతం తెలిసికొన్నాడు.

అరుణపురంలో ముకుందుడు, అరుణుడు అను యిద్దరు బ్రాహ్మణులున్నారు. ఇద్దరూ పండితులే. మొదటివాడు ధని. రెండోవాడు నిర్ధని. భార్య ప్రోత్సాహం వల్ల అరుణుడు యమునానదికి పోయి హరిని గురించి తపస్సు చేస్తున్నాడు. గంధర్వుడగు పుష్పవతీ దేశాధిపుని కూతురు లత, కనకమంజరి అనే మంత్రి కూతురులు అచ్చటకు వచ్చారు. ఇద్దరు పూలవిషయమయి తగవులాడారు. తపస్సు చేస్తున్న బ్రాహ్మణుని వరింపగలుగువారు గెల్చెదరని లత కనకమంజరితో అన్నది. ఆ ప్రకారమే లతపోయి బ్రాహ్మణునికి తపోభంగం కలిగించింది. బ్రాహ్మణుడామెను మనుష్యలోకంలో పుట్టమని శపించాడు. చెలులప్రార్థన నంగీకరించి, ఈమె రాజశేఖరుని పెండ్లాడునని చెప్పాడు. శుకముచెప్పిన ఈ వృత్తాంతం విని రాజశేఖరుడు

కాంతిమతిని వివాహమాడగోరాడు. కాంతిమతి విరహవేదన పొందునపుడు శుకమామెకడకువచ్చి తండ్రియెదుట రాజశేఖరుని పొగిడింది. పిమ్మట కాంతిమతీ రాజశేఖరుల వివాహం జరిగింది. ఒంటరిగాపోయి జంటగావచ్చిన కొడుకునుచూచి హేమధన్వుడు సంతోషపడినాడు.

వస్తుతత్త్వం :

మల్లన రచించిన 'రాజశేఖరచరిత్రము' 516 పద్యాలుగల మూడాశ్వాసముల కావ్యము. ఈ రాజశేఖర చరిత్ర కేవలము కల్పిత కథ. ఆ కాలంలో సాహసించి స్వతంత్రేతి వృత్తంతో కావ్యనిర్మాణం చేసిన మల్లన పూనిక ప్రశంసనీయం. ఈకథ కెచ్చటా ఆధారం కనబడదు. అయితే యిట్టికథలు ప్రాచీనము లయిన కథా సరిత్సాగ రాదులందు కోకొల్లలు. ఇందలి పూర్వ ఖండ కథ రామాయణములోని దశరథ విశ్వామిత్ర ఘట్టాన్ని తలపిస్తుంది. కడమ సన్నివేశంలో మన కాశీమజిలీ కథల బాణి కనబడుతుంది. వస్తుసృష్టికన్న నిర్మాణ శిల్పం కవి ప్రతిభకు శాణరేఖ. ఆ కవి అనాడిట్లు స్వతంత్రేతి వృత్తం గ్రహించినాడన్నదే విశేషము కాని కథకొక శిల్పఘటన కాని ప్రయోజనసిద్ధి గాని లేవు.

మల్లన తన కావ్యంలో అమరభాషాకవివర్యులకు నమోవాకము లర్పించాడు. ఒక్క కాళిదాసునకు మాత్రమే మొదటి మ్రొక్కు. మిగతా కవులకు ఒకసారి చేతులు జోడించి అందరిని పంచుకొమ్మన్నాడు. కవిత్రయమునకు మాత్ర మాతడు నమస్కార మొనరించాడు.

పాత్ర చిత్రణ :

ఈ కావ్యంలో నిది కల్పితకథ. కాబట్టి పాత్రలన్నీ కేవలము కల్పితములు, ఇందులో రాజశేఖరుడు, కాంతిమతి, హేమధన్వుడు, పాలిక, జటిల కౌశికుడు, చిలుక ప్రధాన పాత్రలు. విశంకటుడు, అరుణుడు, కనకమంజరి మొదలయినవారు అప్రధాన పాత్రలు.

పేద బ్రాహ్మణుని గురించి వ్రాస్తున్నపుడు ఎంతో చక్కగా పాత్ర స్వభావాలను చిత్రించాడు కవి. భర్తచదువుకోనివాడైతే, చేతకానివాడైతే భార్య 'దేవుడా ఇంతచేశావా' అని దారిద్ర్యాన్ని భరించవచ్చు. పక్కింటివాళ్ళకు విద్యలో ఏ మాత్రం తీసిపోనివాడై లేమి అనుభవిస్తే ఆ యిల్లాలు ఎంతబాధ పడుతుంది? ఆమె భర్తతో ఇలా మొరపెట్టు కొంది :

"చదివినారలు పెక్కు సంధ్యల గించిత్తు
దప్పకయుండ వేద త్రయంబు
పఠియించినారలు ప్రతిభా సమున్నిద్ర
సౌష్ఠవంబున మూల శాస్త్రవితతి

శోధించినారలు, శుద్ధమతిస్ఫూర్తి
నఖిల పురాణేతిహాస సమితి
చూచినారలు, బుధస్తోమంబు గొనియాడ
గావ్య నాటక ముఖ గ్రంథ సీమ

యేమి చెప్పెడు దాన మీ రిడకలేవు
సకల విద్యలు భూసుర సమితికెల్ల
నజున కెనవత్తు రన్నింట నకట! మీర
లలముకుందుని కన్న నే వెలితిచెపుడు" [3–20]

ఈ ఇల్లాలు ఇలా బాధపడడానికి ఇంకో కారణం కూడా వుంది. పక్కింటి ముకుందుడు మహారాజుగా జీవిసున్నందుకు బాధ లేదు. అయితే అతని సోమి దేవమ్మను చూస్తేనే ఈ పేదరాలికి బాధ. భర్తతో పొరుగు దంపతుల గూర్చి ఈసుతో మాట్లాడినప్పుడు, ఆ పేదబ్రాహ్మణుడు ఇలా అంటాడు :

"ఏరికి బుద్ధిబలంబులు
కారణములు గావు సువ్వె కలరే ధాత్రిన్
నేరిచి బ్రతికినవారలు
నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా" [3–25]

పై పద్యాల్లో వాస్తవికత ఉట్టిపడే సజీవ పాత్రలను సృష్టించాడు మల్లన :

హేమధన్వునితో జటిలకౌశికుడు :

"మత్త విరోధి వీరగుణ మర్దనశాలి కపర్ది సత్కృపా
దత్తుడనూన ధైర్య నిధి తావక పుత్రుడితండు, నేడు చే
నెత్తురుగాకయుండ నతి నిష్ఠుర శాత కృపాణ ధార చే
దుత్తుమురాడివచ్చు నల దుర్మదు నొండు దలంపకుండు మీ" [2–39]

పై పద్యంలో కుమారుని పంపడానికి వెనుకాడుతున్న హేమధన్వునితో జటిల కౌశికుడు చేసిన ఈ ప్రసంగం రాజుకు ధైర్యాన్ని యిస్తూ, తన కుమారుని శక్తిని గుర్తింపని దశరథునికి కౌశికునివలె, నచ్చచెప్పే సంభాషణాచాతుర్యము కనిపిస్తుంది.

వర్ణనలు :

రాజశేఖరుని యౌవనావిర్భవాన్ని మల్లన వినూత్నంగా జెప్పాడు. అందరకు పరిచితములైన విషయాలనే రమ్యభావనా విలసితంగా, అతి పరిచయ సహకృతావజ్ఞ భాసింపకుండ వర్ణించాడు.

రాజశేఖరుని యౌవన వర్ణన :

"వనితానేత్ర చకోర చంద్రిక, తనుస్వచ్ఛంద కాంతిచ్ఛటా
ఖని, యుత్సాహ కళాఖిలూరి మతి రేఖామంత్ర సంసిద్ధి, భో
గ నిధానంబు, లతాంత సాయక భుజాగర్వావలంబంబు యౌ
వన మప్పూనవ నాథ పుత్రునకు, మవ్వంబొప్ప నేతెంచినన్" [2–7]

యౌవనాన్ని శరీరగత పరిణామంగా కాకుండా గుణాత్మకమైన ప్రభావంగా వర్ణించడం ఈ పద్యంలో కవి చూపిన నేర్పు. ఇందులో గుణాలద్వారా యౌవనాన్ని ఊహించాలి.

మల్లన ప్రాత అలంకార సామగ్రినే స్వీకరించినప్పటికి వాటి విన్యాసంలోనే ఒక వైచిత్రిని ప్రదర్శించి 'ఓహో' అనిపిస్తాడు.

"కలితకపోల కాంతి కళికల్ దళు కొత్తనాకర్తు – తీగయు
య్యెల వడినాడు వేళ జరణాంబుజ నిర్మిత లాక్షసోకి – త
త్తల మహి జాతపల్లవ వితానము మించె – మదీయ సామ్యమున్
దల పకుమంచు దత్పదము తన్నిన నెత్తురు గ్రక్కనో యనన్"
[2–146]

యౌవనవతి చరణములను చిగురాకుల రక్తిమతోను, మార్దవముతోను పోల్చుట పూర్వ సిద్ధమే. దానినే తల దన్నుట అను జాతీయ మాధారముగా ఆమె పాదములతో చివురాకులను తన్నుటగను, తన్నుట నాధారముగా నెత్తురు కక్కుటను, ఈ నెత్తురును అంటిన లత్తుకగను ఉత్ప్రేక్షించు కొనుట సొగసైన జరీ అల్లికము వంటి నేర్పు. అరుణుని దారిద్ర్య వర్ణన :

"కుల నిర్మూలన కారణంబు, ప్రతిభా కుట్టాకముద్వేగ కో
పలతాదోహద, మాజవంజవ సుఖప్రత్యూహ, మాత్మవ్యథా
జ్వలన జ్వాలిక, కామినీ నయన వీక్షాపాత సంరోధి, ని
త్యల ఘుత్వాశ్రయ భూమిలేమి యది యాహా యేమి గావింపదే"
[3–14]

పై పద్యమందు అరుణుని దారిద్ర్యమెంత పీడించినను పద్యమును శైలీ సంపద అంత ఆదరించినది. దీని ననుసరించిన మరి రెండు పద్యములందు కూడ కవిలోక ధర్మావగాహన కొనియాడ దగినది. దారిద్ర్య స్థితిని గూర్చిన కవి పరిశీలనము 'అరుణు'ని పరిమితి దాటి ప్రపంచధర్మస్థితి వర్ణనగా విస్తృతమై దేశకాల అనవచ్ఛిన్నమైన సాధారణీ కరణంగా పాఠకునికి పొడగడుతుంది. కవి భావయిత్రిశక్తివల్ల కావ్యానికి కలిగే సార్వకాలికత యిట్టి సందర్భాల్లోనే

కన్పిస్తుంది. దారిద్ర్యమును గూర్చిన శయ్యా సౌభాగ్య భావసంపన్నమైన ఆ పద్యమొక్కటి చాలునతణ్ణి అష్టదిగ్గజాల్లో ప్రతిష్ఠించటానికి. అందలంకార చమత్కారంతో పాటు స్వభావోక్తి సుభగత్వం గూడ ఉన్నది. కవి లోకజ్ఞతకిది కరదీపిక.

మల్లన అవస్థాచిత్రణమునందు జిలుగు జిగులు ప్రదర్శించుటలో మేటి. కాంతిమతి రాజశేఖరుని కటాక్షించిన వైనము :

"చిలుక పురోహితుండగుచుఁజెంగటనుండఁగ సిగ్గుపెండెరల్
తొలఁగఁగఁద్రోచి బంధుగతిఁదోరపుఁగోర్కులు సందడింపఁగా
తలఁపులతాంగి కన్నమును తానకనుంగవ దోయిలించి చూ
పులఁటలఁబ్రాలువోసె నృపపుత్రునిపై విరహాగ్ని సాక్షిగన్" [3-131]

ఈ పద్యంలో అర్ష వివాహవిధిలోని అంశాలన్నీ చిలుకపురోహితునిలోను, కనుంగవదోయిలిలో, చూపులతలఁబ్రాలలో, విరహాగ్నిసాక్షిలో సాక్షాత్కరించాయి. వివాహక్రతు తతంగాన్ని మోహక్రతువులోని సాత్త్వికభావాలపై ఆరోపించాడు కవి. ఇది ప్రేమకు వివాహవిధికి బింబ ప్రతిబింబ భావాన్ని నిరూపిస్తుంది. ఇట్లనంతర సన్నివేశానికి ప్రాతిపదికగా ఆ వివాహపుతంతునకు రూపకల్పన మొనర్చుట అపూర్వ రమణీయము. జరుగబోవు వివాహమునకిది ఒకసూచన.

మల్లన ఉదయసంధ్యను—

"ప్రాచి యుమిసిన తాంబూల రసమనంగ
నుదయరాగంబు మెల్లనయుప్పతిల్లె" [3-152]

అని వర్ణించాడు. వర్ణన వినూత్నంగానే యుంది. ప్రాగ్దిశను స్త్రీగా పోల్చడం, సాంధ్యరక్తిమను తాంబూలరక్తిమగా పోల్చడం అపరిచితాలుకావు. ఉమిసిన తాంబూలమనడమే మల్లనగారి స్వంతము. నూత్నత్వముకోసం అభినందించినా అందులో జుగుప్స ధ్వనిస్తుంది. సంధ్యారాగాన్ని చూస్తే కలిగే అనుభవం ఉమిసిన తాంబూలంయెడల కలిగే అనుభవానికి సామ్యంలేదు. రూపసాదృశ్యమే గాని అనుభవ సాదృశ్యంలేదు.

రసపోషణ :

ఈ రాజశేఖరచరిత్ర కావ్యంలో శృంగార, వీరరసాలు ప్రధానంగాను మిగిలినవి ఆయా ఘట్టాలలో సమయోచితంగా పోషింపబడ్డాయి. ఇందులోని నాయికా నాయకులపరంగా శృంగారరసం పోషింపబడింది. రాజశేఖరుడు విశంకటరాక్షసుణ్ణి చంపిన సందర్భంలో వీరరసం పోషించాడు కవి.

కవి వ్యక్తిత్వం :

వస్తుగత చమత్కారలోపాన్ని రాజశేఖర చరిత్రలో రచన రామణీయకం పూరిస్తుంది. ఇతని కవితాదర్శనం దొడ్డది. తనవ్యక్తిత్వంగూర్చి కవి వర్ణించుకొన్న తీరిది :

"చెప్పదగు(గవిత రసముల్
చిప్పిలనప్పప్ప బళిబళీయన, లేదా!
యెప్పుడు చేయక యుండుట
యొప్పుసుమీ! సుకవి; యెంతయుచితజ్ఞుడౌకో!" [1-8]

పైపద్యంలో "యప్పప్ప"– అప్పన మంత్రియే అని ఒకరియూహ. ఇది బళి బళివంటి దియు కావచ్చును. కవిసంప్రదాయాన్ననుసరించి కుకవి నిరాసంచేసాడు. అందు గాఢార్థ ప్రతిపాదనక్రమ కళా కౌసల్యములు లేకపోవడాన్ని, వాచాధక్కార్భటిని, గర్వగ్రంధిత్వాన్ని కవులయందు నిరసించాడు. వాచాఢక్కార్భటి, కవులయందు లోపంగా పేర్కొన్నా, కొంతవరకు తనయందుగూడ కన్పిస్తుంది, కాని అతనికున్న వినయంమాటున ఇది దాగియుంది. మల్లనగారి చిలుక మల్లనగారి పాండిత్యాన్ని ఘనంగా ప్రశంసిస్తూనే 'అనుకోసిగ్గయ్యెడిన్' అనే వినయంమాటున దాచింది. తను పొందవలసినగుర్తింపు పొందనందుకు మనస్సులో కష్టపడ్డట్టు తెలుస్తుంది.

మల్లన కవిత్వంలో లాలిత్యమెంతఉందో ప్రౌఢిమకూడ అంతఉంది. శబ్దాధికారము, భావసంయమనము, వాచాఢక్కార్భటిలేని నిరాడంబరత, సమాస సంయోజన సారళ్యము, స్థిమితచిత్తస్థితి ఇతని లాలిత్యములో పొదగుకొన్నగుణాలు. ఇట్లాంటిగుణం జిగిబిగిలేని లాలిత్యం అందరికి సుసాధ్యంకాదు.

కవిగా మల్లన కన్ని యుపకరణాలున్నాయి. గొప్పవ్యుత్పన్నుడు. ప్రతిభా శాలి. కథానిర్మాణ కౌశలములేకున్నను మంచి భావసంపదగలవాడు మల్లన. అతని సమీపకాలమువాడైన కుమారధూర్జటి చెప్పినట్లు ఈ పుస్తకంలో సరససాహిత్య రచనా విస్ఫురణము, సారమధురోక్తి ఈ రెండు మల్లనయందు కన్పించు ముఖ్య కవితాగుణాలు. వానివల్లనే రాజశేఖరచరిత్రానికి కీర్తి.

## కొన్ని పదాలకు అర్థాలు

అజుడు = బ్రహ్మ
ధాత్రి = నేల
భూసురుడు = బ్రాహ్మణుడు
వితతి = సమూహము

బుధస్తోమము = విద్వాంసులసమూహము
కపర్ది = శివుడు
నిష్ఠురము = కఠినమైన
కృపాణము = కత్తి
శాతము = వాడిచేయబడినది
ఖలూరిక = సాముకూటము
లతాంతము = పుష్పము
కపోలము = చెక్కిలి
చరణము = పాదము
అంబుజము = తామర
పల్లవము = చిగురు
ఆజవంజవము = సంసారము
ప్రత్యూహము = విఘ్నము.

## ఆధార గ్రంథాలు


1. రాజశేఖరచరిత్రము—పరిష్కర్త–శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు
   ఆం. సా. అ. ప్రచురణ – 1967
2. సారస్వత నీరాజనము—రాజశేఖరచరిత్రము—
   ఆచార్య యస్వీ. జోగారావు
3. సమగ్ర ఆంధ్ర సాహిత్యము – 7వ సంపుటము— శ్రీ ఆరుద్ర
4. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక— రాజశేఖరచరిత్రము
   శ్రీ యస్. వీరేశ్వరదీక్షితులు — 1935.

# రామాభ్యుదయము — అయ్యలరాజు రామభద్రుడు

సమీక్ష : శ్రీ వానిలాల సుబ్బారావు, ఎం. ఏ.

[జన్మస్థలం : అమరావతి, గుంటూరుజిల్లా. జననం : 23–6–1940. ఎం.ఏ. గుంటూరు ఏ.సి. కాలేజిలోను, బొబ్బిలి ఆర్. ఎస్. ఆర్.కె. ఆర్. కాలేజిలోను కొంతకాలం ఉద్యోగంచేసి, 1968 నుండి అమరావతిలోని ఆర్. వి. వి. ఎస్. కాలేజిలో తెలుగుశాఖాధ్యక్షులుగా పనిచేసి, 1978 నుండి 'చలంగారికథలు — నవలలు' అన్నవిషయంపైని, ఆంధ్రవిశ్వకళాపరిషత్, తెలుగుశాఖలో ఎఫ్.ఐ.పి. స్కాలరుగా పరిశోధనచేస్తున్నారు. 'గదబ' అనే ఆటవిక భాషాపరిశీలన చేశారు. కొన్నివ్యాసాలు ప్రచురించారు.]

కవిజీవితాదులు :

అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయ కావ్యకర్త కావటంవల్ల సుప్రసిద్ధుడు. ఇతడు అష్టదిగ్గజ కవులలో ఒకడని ప్రతీతి. బహుశః రాయలవారి కాలానికి ఇతడు యౌవన ప్రథమ దశలో ఉండి ఉండవచ్చు. ఇతడు ఆరువేల నియోగి. తండ్రి అక్కయామాత్యుడు. తాత పర్వతన్న "శ్రీ మదొంటిమిట్ట రఘు వీరశతక" కర్త తిప్పయమంత్రి ఇతనికి ముత్తాత. రామభద్రకవిగూడ రామ భక్తుడు. రామానుజ మతస్థుడయిన ముమ్మడి వరదాచార్యులవారి కటాక్షానికి పాత్రుడు.

రామాభ్యుదయ ప్రబంధ రచన 1550 ప్రాంతంలో జరిగి ఉంటుందని పండితుల ఊహ. శ్రీకృష్ణదేవరాయలవారి అల్లుడు అళియరామరాయలు. ఇతని మేనల్లుడు గొబ్బూరి నరసరాజు. ఈ ప్రబంధం ఆ నరసరాజుకే అంకితం.

రామభద్రుడనే పేరుగల ఒక కవి రాయలవారి ప్రేరణవల్ల "సకల కథా సార"మనే గ్రంథాన్ని వ్రాశాడు. ఈయన, అయ్యలరాజు రామభద్రుడు ఒకరేనని కొందరు, వేర్వేరని మరికొందరు. ఉభయపక్షాలకు గట్టి పండితుల మద్దత్తే ఉందిగాని గట్టి మద్దతు మాత్రంగాదు. రామభద్రుడు రాయలవారి ఆస్థానంలో ఉన్నాడో లేడోగాని ఆ కోవలో ఉండదగినవాడని మాత్రం చెప్పవచ్చు.

కథా సంగ్రహం :

'రామాభ్యుదయం' ఎనిమిది ఆశ్వాసాల బృహత్ప్రబంధం. పద్దెనిమిదివందలకుపైగా పద్యాలున్నాయి. రామకథ ఇందులోని ప్రధాన ఇతివృత్తం. దశరథుని యౌవన జీవితం మొదటి రెండు ఆశ్వాసాల్ని ఆక్రమించింది. రామపట్టాభిషేకంతో

గ్రంథం ముగుస్తుంది. ఉత్తరరామాయణ కథను ఇందులో చేర్చలేదు. ఇందులోని ఆశ్వాస విభజనకు, వాల్మీకిరామాయణంలోని 'కాండ' విభజనకు సంబంధంలేదు.

నగరం, పుష్పలావికలు, వసంతఋతువు, భార్యలతో దశరథుని వనవిహారం, పుష్పాపచయకేళి, జలక్రీడలు, వర్ణించి ప్రథమాశ్వాసం పూర్తిచేసాడు. ద్వితీయాశ్వాసంలో దశరథునివేట, గజభ్రాంతిచే ఋషిపుత్రుణ్ణి చంపటం, శాపం, సంతానచింత. ఋశ్యశృంగుని కథ ఉన్నాయి. తర్వాతిదంతా మనమెరిగిన రామాయణ గాథే, రామకథను తెలుసుకోవటం కోసమే రామాభ్యుదయగ్రంథాన్ని చదివేవారెవరూ ఉండరు. ఇందులో వర్ణించినపాటి రామకథ అందరకు తెలుసు.

వర్ణనావకాశం ఉన్న ఘట్టాలనే విస్తారంగా వ్రాసి అందుకు అవకాశంలేని సందర్భాలను వదలివేయటమో, మరీ తప్పనిసరి అయితే మూడు ముక్కలలో అయింది అనిపించటమో చేసాడు. ఋతు సౌందర్యాన్ని నాల్గయిదు సందర్భాలలో వర్ణించే తీరిక ఉన్నదిగాని 'మంథర' ప్రేరణను, 'కైక' వరాలడగటాన్ని వివరించే ఓపికలేదు. "కైకేయీనామ స్త్రీ పతిపూర్వదత్తవర విఘ్నంబాచరింపన్'' అని ఒక్క వాక్యంలో సరిపుచ్చాడు. ఈ తీరుచూస్తే రామకథను ఏకాండీగా విశాలమయిన మహాచిత్రంగా నిర్మించే ఉద్దేశంలేదు రామభద్రునికి, తనకు మనసయిన ఘట్టాలను మాత్రం రంగులతో చిత్రించి రామాభ్యుదయమనే పేరుతో ఒకటి కూర్చుకున్నాడు.

రామాయణంలో దశరథునికి మునిశాపం వివాహానంతరం కలిగినట్లున్నది. ఇందులో దశరథ వివాహానికి ముందే శాపం వచ్చినట్లు మార్చాడు. పుత్రకామేష్టి అనంతరం పాయస విభాగం కూడ వాల్మీకిని అనుసరించికాక అధ్యాత్మ రామాయణానుసారంగా జరిగింది. ఋశ్యశృంగుని తెచ్చుటకు రోమపాదుడు వేశ్యలను పంపుట వాల్మీకము. దశరథుడే వేశ్యలను పంపుట రామభద్రీయము. ఈమార్పువలన ప్రయోజనములేకపోగా కథకు అనవసరమయిన డొంకతిరుగుడు కలిగినది.

ఇట్టి మార్పులేకాక ముఖ్యసన్నివేశముల సంక్షిప్తీకరణ కూడ ఉంది. అహల్యావృత్తాంతానికి మూడుపద్యాలు, గుహునికి రెండు పద్యాలు, కైకేయికి ఆమెవరాలకు కలిపి ఒకవాక్యంలో సీత అగ్నిప్రవేశానికి రెండేమాటలు ("పొదజొచ్చి'') – ఇట్లా మ్రొక్కుబడి తీర్చినట్లుగా ముగించాడు. కైకేయిఘట్టాన్ని సీత అగ్నిప్రవేశ ఘట్టాన్ని అప్రధానం చేయడం పాఠకునికి కొరతగా ఉంటుంది.

వాల్మీకికి నారదోపదేశం – కుశలవుల రామాయణగానం, విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు తెల్పిన అనేక కథలు, అరణ్యవాససమయంలో రామాదులు దర్శించిన అనేక ఆశ్రమాలు, శబరికథ, మైనాకుని వృత్తాంతం మొదలయిన అనేక

గాథలు ఈ ప్రబంధంలో చోటుచేసుకొలేకపోయాయి. గ్రంథాన్ని సంక్షిప్తం చేయడమే ఈ మార్పులలోని ఉద్దేశ్యం అనుకోవటానికి, అనవసరమయిన మొదటి రెండు ఆశ్వాసాలు మరికొన్ని విస్తృత వర్ణనలు అడ్డువస్తున్నాయి. కాబట్టి ప్రబంధోచిత వర్ణనా ప్రధానముగా రామకథను చెప్పటమే రామభద్రుని కోర్కె అని నిర్ణయించుకోవచ్చును. 'ఇది రామాయణమున కాక నవ్య ప్రబంధీకరణము.

రామాభ్యుదయమున ముఖ్యముగ ఆస్వాదింపదగినవి వర్ణనలు, కల్పనలు. పునరుక్తవదాభాస, శ్లేషాద్యలంకార చమత్కారములు. శైలీవిన్యాసములు, పూర్వకవుల విశిష్ట లక్షణములు వారి కావ్యాలలోని మొదటి కొన్ని ఆశ్వాసాల లోనే ప్రకాశిస్తాయి, తర్వాత నీరసిస్తాయి. కాని "రామాభ్యుదయమామూలా చూడముగ ఒక్క ధోరణిలోనే రచింపబడిన గ్రంథము." దీని అల్లికలోని జిగియు బిగియు, కల్పనాచాతుర్యము గ్రంథమంతటను ప్రతి పద్యమునను కానవచ్చు చున్నది.

శైలి :

ఇతని శైలిలో సంస్కృతం తెలుగు రెండున్నూ మనోజ్ఞమయిన మైత్రి చేసుకుంటాయి. సామర్థ్య నిరూపణంకోసమో, శిల్పావసరంగానో కొన్నిచోట్ల దీర్ఘ సమాసాల పద్యాలు వ్రాసినా మొత్తంమీద రెండు భాషలను సమవిభక్తంగానే వాడాడు. 'మృదుమధుర పదభూయిష్ఠమై శరత్కాలపు గంగాప్రవాహంలా వుంటుంది ధార' ధారాళతకు ప్రకాశం అబ్బింది. అచ్చతెలుగువాడిన అది కృతక పాండిత్యపు చచ్చుతెలుగులా ఉండదు. పదిమంది మెచ్చుతెలుగులా ఉంటుంది.

> "కల్లోల డోలా సముల్లోల లీలాస
> రాళమరాళవా చాల ఝరము"

వంటి రచనలో ఉయ్యాలలూగే శైలితోపాటు సంస్కృత భాషామాధుర్యంగూడ జోల పాడుతుంది. ఋతు వర్ణనాసమయంలో సురలు శ్రీమన్నారాయణుని సేవించిన ఘట్టంలో రామ భద్రుడు పోయిన పోకడలు చూపిన శైలీ విన్యాసాలు బహువర్ణ చిత్రాలు.

> "రట దంభోధర మాలికల్ మలసె ఘర్మ ద్రుద్వి పేంద్రంబులై
> పటుదంభోళి కృశాను ధూమవతులై ప్రావృట్ప్రరి వాడ్గటా
> ఛటలో నామెఱసెన్ మెఱుంగులు దివిన్ సంవర్త వేళామహా
> నట చూడాహి ఫణా సహస్రమణి సందర్భ ప్రభాచాతురిన్" [6—5]

శైలితోపాటు కల్పన గూడ పందానికి దిగేపద్యం. ఒక్క స్వయంపాకం తప్ప అన్ని పాకములు ఈగ్రంథమున గలవని చెళ్లాపిళ్లవారి ప్రశంసా చమత్కారము.

పదాల విరుపువల్ల కలిగే శ్లేషచమత్కారాలు, అలంకార చాతుర్యాలు. అ(శ్రమంగా నున్నగా జారినట్లువస్తయి ఇతని చేతిలోనుండి. ఈ కవికి అవి నల్లేరు పై బండి.

"ఘన ధూమోదయ మంబర
మున దార్కొన శ్రుతి మనోజ్ఞభూరి నినాదం
బున గర్జిల్లగ దాండవ
మొనరించెన్ పవన శిఖి సముత్సాహమునన్" [3–25]

'శ్రుతి' శబ్దంమీద 'శిఖి' శబ్దంమీద నిలువబడి హోమాగ్నికి నెమళ్లకు శ్లేష విన్యాసం చేసాడు.

"మాయూరు వింత డాసిన
బాయక యుండెదవు నీ తపం బీడేరున్" [2–175]

అని ఋశ్యశృంగునితో వేశ్యలన్నప్పుడు అందులోని శ్లేష (ప్రదర్శన మాత్రమేగాక సందర్భోచితి గూడ పాఠకుణ్ణి వశం చేసుకుంటుంది. పంపా సరోవరం మత్స్య కూర్మావతార సామ(గ్రితో అహిమకర వంశమున పొల్చి లక్ష్మణాన్వితమై రాముని వలె నున్నదట. ఇట్లాంటివి చమత్కార (ప్రియుల్ని అడుగడుగునా ఆహ్వానిస్తాయి.

అలంకారాలు :

ఆ భాసాలంకారాలలో ఈ కవి మొనగాడు ఈ (ప్రభావం ఇతనినుండి రామ రాజభూషణ, చేమకూర వంటి అనంతర కవులమీదకు విస్తరించింది.

"నీ లోపల బెగడొందకు
నీలోపల చిలుకరా!"

* * *

"వేదాదుల నెడబాయడు
వే దాటుల మరగినాడు వీడేరా!"

పై వాటిలోని విరుపు తెలుగు సంస్కృతాల మీద జరిగింది. రెండుభాషల మధ్య దాగుడుమూతలు

"నీలా! నీలావెంతయుమేలు"

* * *

"ఏల (పేలెదు తేటి? ఇంతేటి గలుగ?
సం(శితల సన్నగాలి! యో! సన్నగాలి!
చెల్లునే రోష రసమింత చిలుక చిలుక!
సారెఁగుందింపఁ జందమా చందమామ!" [6–25]

* * *

"పవనా! పరిచిత నవనీ పవనా"

*　　*　　*

"అవన కాంక్షా పరుడగు రాఘవుడు వనకాంక్ష నేగుచున్నాడదె"

ఇట్లాంటి అభాసాలంకారాలలో రామభద్ర కవి చేయి తిరిగిన వాడే కాదు రాటు తేలినవాడు గూడ : కనకనే వాని యందీ కవికి శక్తి యెంతో అసక్తి అంత దానివల్ల ఔచిత్యమును గూడ అతిక్రమించిన తావులున్నవి.

"కానక కన్న సంతానంబుగావున
　　గానక కన్న సంతానమయ్యె
సరయ గోత్ర నిధానమై తోచుగావున
　　సరయ గోత్ర నిధానమయ్యె నేడు
ద్విజకులాదరణ వర్ధిష్ణుడు గావున
　　ద్విజకులాదరణ వర్ధిష్ణుడయ్యె
వివిధాగమాంత సంవేద్యుడు గావున
　　వివిధాగమాంత సంవేద్య డయ్యె." [5-12]

దశరథుడు వికలమనోరథుడయి కటకటపడేసమయంలో ఇట్లా అభాసాలంకారాలు వేసుకుంటూ కూర్చుంటే రససిద్ధి కలిగేనా! కాని పద్యసౌందర్యం ఈ ప్రశ్ననే వేసుకోనివ్వదు. అలంకరణ చమత్కారంచేసే వచ్చిమోసం ఇక్కడేఉంది. రసలుబ్ధులు అలంకారలుబ్ధుల వలలో పడిపోతారు.

ఛందస్సు :

పద్యరచనలో ద్వ్యక్షర, త్ర్యక్షర ప్రాసలు, వలసినన్ని. దుష్కర ప్రాసలు గూడ ప్రదర్శించాడు. పాండిత్యంతో 'ఓహో!' అనిపించుకోవాలికాబోలు అనాడు. "దృక్త్రితయంబు... ;" "హస్త్య సురారి ;" "స్వర్ఘంటాపథసీమ" ఏడవ ఆశ్వాసంలోని ఈ దుష్కర ప్రాసపద్యాలు రామసేనావిశేషాన్ని గురించి శుకసారణులు రావణునకు వివరించే సందర్భంలోవి. రామసేన దుష్కరమయిన దని శిల్పసూచన.

వర్ణనలు :

ఈ కవి కథాభాగాల్నయినా వదలుకుంటాడు గాని వర్ణనలను విడువడు. ప్రథమాశ్వాసంలో దశరథుడు భార్యలతో వనవిహారం చేయటం, కవిగారికి వర్ణనలపై మక్కువవల్లనే గాని కావ్యావసరం వల్లగాదు. ప్రబంధ నియమనిర్వహణకు ఇంకా అవకాశాలు ముందుముందు రానున్నాయి. అట్లాంటిదే దశరథునివేట గూర్చిన వర్ణన. వీటిలో అనౌచిత్యం లేదుగాని అనవసరం ఉంది. హద్దుమీరిన ఘట్టాలుగూడ లేకపోలేదు. సీతాదేవి అవయవ సౌందర్యం పదహారు పద్యాలు

ఆక్రమించింది. కలికి చూపులు, చెక్కిళ్లు మాత్రమేగాక 'ఉదుటు జనుగవయు నాభియు' – 'అతివరోమరాజిలత యూరు మాత్రంబె యరయలక్ష్యసేయు' అంటూ వర్ణన. పైగా రామునికి విశ్వామిత్రుని నోటివెంట ఈవర్ణన వినిపించడం! సీతారాముల సంభోగ శృంగారాన్ని ఇరవైపద్యాలలో సాధారణ నాయికా నాయకుల్ని వర్ణించినట్లు వివరించాడు. తల్లిదండ్రుల శృంగారంవలె లోక పితరుల శృంగారం వర్ణనీయం కాదు గదా! ఇట్లాంటివి ప్రబంధాలలో పట్టించుకోగూడదంటే మాత్రం – వర్ణనలలో రామభద్రు డగ్రగణ్యుడు.

కథా సంపర్భంలోకన్న వర్ణనాసందర్భంలోనే రామభద్రుడు రాణిస్తాడు.

> "పంటవలంతికిన్ బొడమి భాసిలు సీతవుగానఁ జేలతో
> నంటిన ఘర్మవారిఁబడ నై పులకోదయ సస్యసంపదన్
> గెంటక యున్కి నీకతగు నేడిట నావ్యవసాయమేర్పడెన్
> గంటి నిరంతరానుభవ గౌరవసౌఖ్యము పండెగోరికల్."
>
> [1–176]

పంట వలంతికి కూతురు కావటంవల్ల ఆమెయందు అతనివ్యవసాయానికి ఫలితంగా కోర్కెలు పండాయి. ఈ తాత్పర్యం మీద విస్తరించాడు భావాన్ని. శృంగారం సున్నితంగా ఉంది.

వర్షాకాలపు కారు మొగిలులో త్రిమూర్తిత్వాన్ని దర్శిస్తాడు ఈ పద్యంలో

> "సాగర విషంబుగ్రోని ధూర్జటియు బోలె
> నా త్రివిక్రమగతి దివినాక్రమించి
> విధియుబలె నాది సృష్టి గావించు కాఱు
> మొగులు...."
>
> [6–8]

వర్షారంభానికి ప్రబంధానికి శ్లేషాను ప్రాణితంగా సామ్యాన్ని నిరూపిస్తాడు ఈ క్రింది పద్యంలో. ఇందులో రామభద్రుని శ్లేషశక్తి, వర్షర్తు ప్రబంధాలకు సామ్యసాధనా సామర్థ్యం మాత్రమేగాక అతనికి అభీష్టములైన కావ్యగుణాలు గూడ వెల్లడవుతాయి.

> "ధారాశుద్ధిఁబ్రసిద్ధి గాంచి ఘన శబ్ద స్ఫూర్తి వర్తిల్లగా
> వోరంబైన రసస్థితిన్ దరళ విద్యున్మాలికా లక్షణో
> దారంబై కవిసేవ్యమౌ వనమయూరా రూఢిఁబ్రాపించి వ
> ర్షారంభంబు ప్రబంధమట్లఖిల పద్యాక్రాంతమయ్యెందగన్"
>
> [6–13]

మగోచిన్న పద్యంలో ఋతువులు తమతమ సమయాలలో నభోమండలాన్ని గూడ

"అలశరత్కాంత దిగ్వయస్యలును దాను
విన్నకొలఁకులఁ గ్రీడించి వెడలి కడలిఁ
గన్నెయెండలఁ దలయార్చి కట్టు క్రొత్త
మడుఁగులన మించె శుభ్రా భ్రమండలములు" [6-34]

హేమంతర్తు ప్రభావాన్ని మనకే పరిమితం చెయ్యకుండా లక్ష్మీ పార్వతుల మీదగూడ ప్రసరించి వారినిగూడ భ్రాంతలుగా అలంకారంలో బంధించాడు.

"అరసి నిరుష్ణ శంకర కరాగ్ని జపాకుసుమేచ్ఛ గౌరి డ
గ్గరి యవతం స యోగ్యమని కైకొన బూను మదిన్ సరోజమం
దిరయు మురారి కౌస్తుభ మణింగని కీలయటంచు దద్భుజాం
తరమున నిల్చె దుస్తరముదగ్ర హిమాగమ మెట్టివారికిన్" [5-127]

రామభద్రుని ఋతువర్ణనలు చిన్న ఊహలో ఇమిడే లఘుచిత్రాలుకావు. భూమ్యాకాశాలునాక్రమించే భారీవర్ణ చిత్రాలు.

రసాదులు :

అనేక రసాలకు అవకాశమున్న రామకథను తీసుకున్నాడు గాని వాటికి సంపూర్ణమయిన న్యాయం చేకూర్చలేదు. కరుణరసఘట్టాలలో అలంకార చమత్కృతి మీద ఉన్నంతదృష్టి రసపోషణపై నిలపలేదు. దశరథుని పుత్రశోకంలోగాని, సీతావియోగ ఘట్టంలోగాని పాఠకుని కళ్లవెంట తడిరాదు. లోకపితరులయిన సీతారాముల శృంగారం ఆస్వాద్యంగాదు. వేశ్యల శృంగార చేష్టలకు ఋశ్యశృంగుని అమాయికత హాస్యపు మెరుగునిచ్చింది. "హృద్యముల్ చోద్యంబు లీకమండులులంచు తమ పయోధరములు నిమరిజూచు" హాస్యశృంగారాలకు మృదువయిన సమ్మేళనం యుద్ధఘట్టాలు కొంత తృప్తికరంగ నడచాయి. దశరథుడు శాపాన్ని పొందిన తర్వాతగూడ వేటసాగించటం, అరణ్యప్రవేశంచేసే వరకు కారణమేమిటో సీతకు తెలపకపోవటం ; చూస్తే సన్నివేశకల్పన యందుగూడ కవి శ్రద్ధచూపనట్లు తెలుస్తుంది.

పాత్రచిత్రణ :

అవస్థా చిత్రణలో ఉన్నంతశ్రద్ధ పాత్రచిత్రణలో ఉన్నట్లు కనిపించదు. ఈ ప్రబంధంద్వారా పాత్రలస్వభావావిష్కరణం జరుగదుగాని పరిచిత పూర్వములయిన ఆ పాత్రలకు నగిషీలు ఏర్పడ్డాయి.

సీతారాముల వివాహం అచ్చగా తెలుగు దేశపు వివాహంలాగ మధుపర్కాలు - తెరకట్టడం - తలంబ్రాలపోయడం - మంగళసూత్రం మొదలయినవి. సంస్కృత న్యాయాలను వాడినట్లే తెలుగు సామెతలుగూడ వాడాడు.

మధ్యమపురుష ఇకారానికి సంధిచేయకపోవటం క్త్వార్థక 'ఇ' కారానికి సంధిచేయటం ఇతనిలో తరచుగా కనిపిస్తుంది.

కవివ్యక్తిత్వం :

కవిలో పాండిత్యం — ఊహాశాలిత — నేర్పు ఉన్నాయిగాని రసపిద్ధి కొరవడింది. శ్లేషలో — పునరుక్తవదా భాసంలో — అచ్చ తెలుగు వాడకంలో — చిత్రకవితారీతులలో ఈతనికిగల ప్రావీణ్యం అనంతర కవులకు మేలయిన బాణీ అయింది. చమత్కారలాలసులు చిత్రకవితా ప్రియులు అయిన ఉత్తరప్రబంధ కవులకీతడు స్ఫూర్తినిచ్చాడు.

రామ కథనువ్రాస్తే పుణ్యంవస్తుందన్న ఆశ ఉందో లేదోగాని ప్రబంధ వర్ణనలకు ఇది అనువయిన కథ అన్న అంశమే అతణ్ణి ఆకర్షించి ఉండాలి. పాఠకుడు ఇందాశించవలసినవి ప్రబంధగుణాస్వాదనకేగాని వాల్మీకి రామాయణ గుణాల్నిగాదు. "....యిట్టి కవిత్వానికి లోకంలో వ్యాప్తి మాత్రం చాలతక్కువగా ఉంది" అని శ్రీ చెళ్లపిళ్లవారు నొచ్చుకున్నారు.

ఒక చిన్నకథను తీసుకొని వర్ణనా సుందరంగా ప్రస్తరించి ప్రబంధంచేయడం పూర్వుల పద్ధతి. కాని ఈయన ప్రబంధంలో పట్టనంత పెద్దకథను తీసుకున్నాడు— రామకథ అనగానే పాఠకులు దానినుండి ఆశించేవి చాలా ఉన్నాయి. భక్తి, రామ మహిమావర్ణనం — కవిత్వం — కన్నీళ్లు — ఆదర్శమూర్తి చిత్రణం. ఒకటేమిటి ? ఎన్నో ! ఇన్నింటిని పరమోన్నతంగా చిత్రించిన వాల్మీకిని చదివినతర్వాత వాటిలో దేనికి లోపంజరిగినా పాఠకుడు పెదవి విరుస్తాడు. ప్రక్కకు నెట్టేస్తాడు. అందుకనే రామాభ్యుదయానికి లోకంలో వ్యాప్తి తక్కువగాఉంది. మరి ఇంత మంచి కవిత్వంగదా ! అంటే — నిజమే రామభద్రుడు రామాయణాన్నంతాగాక ప్రబంధ పరిమితికి చాలినంతమాత్రపు కథనే తీసికొన్నట్లయితే, అతని కవిత్వం అందలం ఎక్కిఉండేది. ఇపుడు వర్ణనాప్రియులకు అలంకార చమత్కార ప్రియులకు మాత్రమే రామాభ్యుదయమంటే అల్లారుముద్దు.

కొన్ని పదాలకు అర్థాలు

సరాళము = సరళము

ఝురము = సెలయేరు

రటత్ = ధ్వనిస్తున్న

దంభోళి = వజ్రాయుధము

కృశానువు = అగ్ని

ప్రావృట్కాలము = వర్షాకాలము

పరివ్రాట్ = సన్యాసి

సంవర్తము = ప్రళయకాలము

ఘన = గొప్ప, మేఘము
శ్రుతి = వినికిడి ; వేదము
శిఖి = నెమలి ; అగ్ని
మాయూరు వింత = మా – ఊరు – వింత ; మా ఊరువు (తొడ) ఇంత
నీలోపల = నీ లోపల – నీల ఉపల + (ఇంద్రనీలమణి)
వికురము = జడ
వేదాదుల = } వే దాదుల = వేగముగా దాదులను
        } వేద + ఆదుల = వేదములు మొదలగువానిని
తేటి = తుమ్మెద
ఇంతేటి = ఇంత + ఏటి
సన్నగాలి = పిల్ల తెమ్మెర
లసన్నగాలి = లసత్ – నగ – ఆలి = గొప్ప పర్వతసమూహము
నవనీపవనా = నవ నీప వనము = క్రొత్త కడిమితోట
కానక = చిరకాలమునకు కలిగిన ; అడవికే
గోత్రము = వంశము, పర్వతము
ద్విజ = పక్షి, బ్రాహ్మణుడు
అగమాంతము = వేదాంతము ; మార్గాంతము
గెంటక = చలింపక
చేలతో = పొలములతో ; వస్త్రముతో
ధార = ధారాళత
తోరము = అధికము
రసస్థితి = కావ్యరసము ; జలస్థితి
తరళవిద్యున్మాలికలు = ప్రకాశవంతమయిన మెరుపులు ; తరళము – విద్యున్మాలికి ఛందో విశేషములు
కవి = కావ్యకర్త ; నీటిపక్షి
వనమయూరము = అడవినెమలి – ఛందోవిశేషము
పద్యము = మార్గము ; పద్యము
జపాకుసుమము = మంకెనపువ్వు – ఇది ఎఱ్ఱగానుండును
అవతంసము = కర్ణాభరణము.

## ఆధార గ్రంథాలు


1. రామాభ్యుదయము – ఆం. ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురణ ఆచార్య కె.వి.ఆర్. నరసింహంగారి పీఠిక.
2. కథలు గాథలు – చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి
3. రామాభ్యుదయ సిద్ధాంత గ్రంథం – కె.కె. విశ్వేశ్వరరావు.

# ఉద్భటారాధ్య చరిత్ర—తెనాలిరామకృష్ణకవి

సమీక్ష : పమూరి నారదపరాజు శ్రీవల్లి, ఎం. ఏ.

[జన్మస్థలం — చీరాల, ప్రకాశం జిల్లా. జననం 8-1-1953. ఎం.ఏ., యు.జి.సి. పరిశోధక విద్యార్థిని, తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు, 'రామనాటకములు — విమర్శ' అనే అంశంపై పిహెచ్.డి. పట్టానికి పరిశోధన చేస్తున్నారు. ప్రచురణలు — హనుమన్నాటకము — అంగదుడు; సమాలోచన పత్రికలో ప్రచురితమయింది, 'తెలుగునాటక సాహిత్యము — పాదుకా పట్టాభిషేకము' అనేశీర్షికతో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 1979 అక్టోబరులో ఆం. ప్ర. ప్రాచ్య భాషాసదస్సు ద్వితీయసదస్సులో పరిశోధనపత్రం సమర్పించారు. రేడియో ప్రసంగాలు — రామాయణ వైభవం; ఎఱ్ఱాప్రెగడసాహితీ వ్యక్తిత్వం, మొ.]

కవిపరిచయం :

శివభక్తి పారమ్యాన్ని ప్రబోధించే దివ్యగాథ "ఉద్భటారాధ్య చరిత్ర." దీన్ని ప్రబంధంగా రూపొందించిన కవి తెనాలిరామలింగడు. ఇది ఇతని రచనల్లో మొట్టమొదటిది. 'వికటకవి'గా ప్రసిద్ధికెక్కిన తెనాలి రామకృష్ణుడే ఈ తెనాలి రామలింగకవి. ఇతని కాలం సుమారు క్రీ.శ. 16 వ శతాబ్దం పూర్వభాగమని చెప్పవచ్చు. ఇతని తల్లి లక్కమాంబ. తండ్రి రామయ. గురువు పాలగుమ్మి ఎలేశ్వరుడు.

'శివుడి కంటె శివభక్తులు గొప్పవాళ్ళని, శివభక్తుల్లో ఉద్భటారాధ్యుడు ఇంకా గొప్పవాడని' తలచిన ఊరదేచమంత్రి కోరికపై రామలింగ కవి ఈ ప్రబంధం వ్రాసి, అతనికే అంకితం చేశాడు. దేచమంత్రి ఉద్భటుడి కథనే ప్రబంధీకరించమనటానికి ఒక కారణం ఉంది. దేచమంత్రికి ముదిగొండ చంద్ర శేఖరారాధ్యుడు దీక్షాగురువు. అతని వంశానికి మూలపురుషుడు ఈ ఉద్భటుడు. కనుక అతని చరిత్రనే వ్రాయమని దేచమంత్రి రామలింగణ్ణి కోరాడు.

"ఉద్భటారాధ్య చరిత్ర" రచనా కాలం నాటికే రామలింగడికి 'కుమార భారతి' అనే బిరుదున్నట్లు ఈ కావ్యంలోని ఆశ్వాసాంత గద్యవల్ల తెలుస్తోంది.

ఇతని ఇతర రచనల్లో పాండురంగ మాహాత్మ్యం, ఘటికాచల మాహాత్మ్యం లభ్యమౌతున్నాయి. లింగపురాణం, హరిలీలా విలాసం, కందర్పకేతు విలాసం, పాండురంగవిజయం అనేవి తెనాలిరామలింగకవి కృతులుగా చెలామణి అవుతున్న అలభ్య గ్రంథాలు.

కథ :

పాల్కురికి సోమనాథుడి 'బసవపురాణం'లో ఉద్భటుడి వృత్తాంతం 38 ద్విపదల్లో ఉంది. దీన్ని రామలింగడు మూడాశ్వాసాలుగా 842 గద్య పద్యాలుగా ప్రపంచించి, 'ఉద్భటారాధ్య చరిత్ర' ప్రబంధంగా సంతరించాడు కథా నాయకుడైన ఉద్భటుడు వీరశైవుడు.

నైమిశారణ్యంలో శివపార్వతుల కేళీవిలాసానికి గంధర్వులు అంతరాయం కలిగించగా శివుడు కోపించి, వాళ్ళను 'పిశాచాలు కండ'ని శపిస్తాడు. వాళ్ళు శరణు వేడగా, శాంతించిన శివుడు 'కొంతకాలానికి తనమానసపుత్రుడైన ఉద్భటు డివల్ల వాళ్ళకు శాపవిమోచనం కలుగుతుంద'ని అనుగ్రహిస్తాడు. శివుడి అంశతో పుట్టిన ఉద్భటుడు ముంజభోజుడనే రాజుకు దీక్షాగురువౌతాడు. ఇలా ఉండగా, గంధర్వుల సంగతి గుర్తుకు వచ్చి, వాళ్ళ శాపవిమోచనం కోసం ఉద్భటుడు ప్రాణత్యాగం చేస్తాడు. ఉద్భటుడి కుమారులు అతనిదేహాన్ని అగ్నికాహుతి చేస్తారు. అతని దేహం నుండి వచ్చిన 'ధూమప్రసరణం'చేత పిశాచాలకు శాపవిముక్తి కలిగి, శివసారూప్యాన్ని పొందుతారు. ఇది ఇందులోని ప్రధానకథ.

ఈ ప్రధానకథకు భంగం లేకుండా, ప్రసంగవశంగా చెప్పిన కథ 'మదాల సుడి వృత్తాంతం.' శివుడి ప్రభావాన్ని, కాశీక్షేత్ర మహిమని, చాటిచెప్పేకథ ఇది. మదాలసుడు భోగలాలసుడై తుచ్ఛజీవితాన్ని గడిపి, చివరకు కాశీక్షేత్రంలో ప్రాణాలు విడిచి శివసాయుజ్యం పొందుతాడు.

వస్తుతత్త్వం :

ఉద్భటుడనే వీరశైవుడి కథ ఇది. పాల్కురికి సోమన వ్రాసిన "పండి తారాధ్య చరిత్ర"ని అనుసరిస్తూ, రామలింగడు తన ప్రబంధాని కీ పేరు పెట్టాడు.

శైవ సంప్రదాయానుగుణంగా రామలింగడీ ప్రబంధం వ్రాశాడు. ఆద్యంతమూ శివభక్తి ప్రబోధకంగా భాసిల్లిన కావ్యమిది. ఇందులో రామలింగడు జగమంతా శివమయంగా చిత్రిస్తాడు.

రామలింగడు సందర్భోచితంగా పేర్కొన్న షోడశ శివభక్తులూ బసవ పురాణం లోని వీరశైవులే. శాపగ్రస్తులైన గంధర్వులు శివుణ్ణి శరణు వేడుకుంటూ సన్నప్ప, సాంఖ్య తొండడు, అర్జునుడు, చేరమరాజు మొదలైన శివభక్తుల్ని ప్రస్తావిస్తారు. శివభక్తులైన బడయనంబిని, శ్వేతుణ్ణి కూడా రామలింగడు పేర్కొన్నాడు. అయితే ఈ ప్రబంధంలో వీళ్ళను గురించిన వివరాలు లేవు.

శైలి :

'ఉద్భటరాధ్య చరిత్ర' లో రామలింగడి రచన సరళ సుందరంగా సాగింది. 'కుమార భారతి' బిరుదు సార్థక మయ్యేటట్లుగా ఇతని కవిత్వం 'సౌకుమార్యం' తో

అలరారుతోంది. శివపార్వతుల విహార కేళీ సమయంలో "చిగురులకుం జిగియును, గ్రొన్ననలకుం జెన్నును, విరులకు మురిపెమ్మును, పిందెలకు నందమ్మును........ గలిగించి పలాయిత హేమంతంబుగ" వసంత ఋతువు ప్రవేశించిందన్నాడు కవి. హేమంతం తర్వాత వచ్చే ఋతువు వసంతం, కనుక ఈ వసంత ఋతువును 'పలాయిత హేమంతం' అనే సమర్థవంతమైన విశేషణంతో చెప్పడం రామలింగడి పదప్రయోగ చాతుర్యాని కొక మచ్చుతునక.

కావ్యం అంతా సరళమైన శైలిలో శ్రావ్యంగా సాగిన, ప్రమథేశ్వరుడు శివుణ్ణి స్తుతించే దండకంలో మాత్రం పాండురంగవిభుని పదగుంఫనాపాటవం ప్రస్ఫుట మౌతోంది. "దేవస్రవంతీ పయోధౌత సుస్నిగ్ధ రుగ్గారి చంచజ్జటా బృంద ! ..........." ఇత్యాదిగా సాగిన దండకం అతనికి పదజాలంపై గల అధి కారాన్ని ప్రకటిస్తోంది.

రసము :

"ఉద్భటారాధ్యచరిత్రం" భక్తిరస ప్రధానమైన కావ్యం. సందర్భానికి తగినట్లుగా అక్కడక్కడ శృంగార, హాస్య, అద్భుత, భయానక రసాలు ఉన్నాయి.

నైమిశారణ్యంలోని మునులతో సూతుడు – ఇసుక రేణువుల్ని, నక్షత్రాల్ని, సముద్రపుటలల్ని లెక్కించవచ్చుగాని "బాలశశాంక శేఖరుని భవ్యచరిత్రము లెన్నవచ్చునే" అంటాడు. "కైలాసవాసు నాత్మల దలంపని మూఢుల జన్మ" — 'వాసన లేని పువ్వు, రసవర్ణన లేని కవిత్వ రేఖ, అభ్యాసం లేని చదువు, సూర్యుడు లేని దినం, చంద్రుడు లేని రాత్రి, పద్మం లేని సరస్సు వలె నిరర్థకం' అని రామలింగడి అభిప్రాయం. అందుకే "హరదూరుడగు వాఁడు పశువు" అని నిర్భయంగా ఎలుగెత్తి చాటాడు. సకల చరాచర జగత్తునూ శివమయంగా భావిస్తూ నైమిశారణ్యంలోని చెట్లను శివుడితోను, శివభక్తులతోను పోల్చడం కవి భావనా ప్రపంచం వైపు పఠితల మనసుల్ని పయనింప జేస్తు మనోహరంగా ఉంది. తీగలు మ్రాకుల్ని అల్లుకోవటంలో శివుడి అర్ధనారీశ్వరత్వం స్ఫురించడమూ, తిర్యక్కుల సైతం "శంభుఁ దలఁచి గాని" వాటి వాటి పనుల్లోకి ప్రవేశించవనడమూ, శివుడి కర్పించని ఎలాంటి ఆహారపానీయాలైనా పరిహరించాలనడమూ, చివరకు ఈశ్వరుడికి కాని పుణ్యకార్యాల్ని చేపట్టడం కూడా "పాపములు సేయు యత్నంబు పట్టి" నట్లే అనడమూ శివారాధన తత్పరతతో నిండి ఉన్నాయి.

"కారణంబులు నీవ కార్యజాలమునీవ
భావజ్ఞుడవు నీవ భావమీవ
జనకుండవును నీవ జన్యవస్తువు నీవ
ప్రాపకుండవు నీవ ప్రాప్య మీవ

ఆధారమును నీవ యాధేయమును నీవ
భోక్తవ్యమును నీవ భోక్తవీవు
రక్షకుండవు నీవ రక్షణీయము నీవ
హార్యంబు నీవ సంహర్త వీవ
పూజకుఁడ వీవ పూజ్యంపుఁ బొడవు నీవ
వాచకుఁడ వీవ తలపోయ వాచ్యమీవ
జ్ఞానమును నీవ చూడంగ జ్ఞాని వీవ
నిటలలోచన ! సకలంబు నీవ నీవ." [3-279]

అనే పద్యంలో వేదాంతసారాన్ని బోధించిన రామలింగడు ఈ కావ్యాన్ని భక్తిరస ప్రవాహంలో ఓలలాడించాడు.

క్షేత్రమహిమని ప్రతిపాదించడం కోసం చెప్పిన 'మదాలసుడి కథ' లో విప్రలంభ శృంగారాన్ని, సంభోగశృంగారాన్నికూడ సమర్థవంతంగా పోషించాడు కవి. కనకలత విరహాన్ని భరించలేని మదాలసుడు "గుడి వెళ్ళకుండంగఁ గుడి యించి కొనకొంగు పట్టి గ్రమ్మఱ ముద్దు వెట్టనైతి ................" అంటూ దుఃఖిస్తాడు. అంతేకాదు. "ఆమె వదన సన్నిధే తన పెన్నిధి"గా తలపోసి, ఆమె తోడిదే తన సర్వస్వమని భావిస్తాడు. సంభోగ శృంగారాన్ని వర్ణిస్తూ "మత్త మరాళికా తతిం బుడికెడు రాజహంస పతి పోల్కి" మదాలసుడు కనకలతను కూడి ఉన్నాడంటూ వ్యంగ్యంగా సూచించడం మనోజ్ఞంగా ఉంది.

శివుడు గంధర్వుల్ని శపించిన ఘట్టం, గంధర్వులందరికీ శాపవిమోచనం కలిగి, వజ్రదంష్ట్రుడనే వాడు పిశాచంగానే మిగిలిపోయి విలపించే ఘట్టం, మదాలసుడు కృతఘ్నుడై తన్ను రక్షించిన బ్రాహ్మణుణ్ణి, అతని పుత్రుణ్ణి వధించిన ఘట్టం కరుణ రసాత్మకంగా ఉన్నాయి.

గంధర్వులు పిశాచాలుగా మారినపుడు వాళ్ళవికృత రూపవర్ణన భయానక రసస్ఫోరకంగా ఉంది.

కనకలత మాత పరభావవేదుల సంభాషణ హాస్యరసజనకమై హృదయ రంజకంగా ఉంది.

భక్తిరస ప్రధానమైన గ్రంథం కావడం చేత కావ్యమంతటా శాంతరసం తరగలెత్తుతోంది.

పాత్రలు :

కథానాయకుడైన ఉద్భటుడు శివుడి మానస పుత్రుడు. కారణజన్ముడు. గంధర్వుల శాపం పోగొట్టడానికి మానవరూపంలో భూలోకానికి వచ్చిన పరమ

మాహేశ్వరుడు. "కోటి మన్మథ సమ శ్రావ్యాంగుడు," "సకలదేశిక రాజన్యమకుట సూత్న రత్న కోరకము," "బుధారాధ్యు" డైన ఉద్భటారాధ్యుడు "సకల శైవాగమ మార్గలక్షణ ధురీణుడు," "అలఘువిజ్ఞానుడు," "ఆదిశైవ చూడామణి," "అఖిలాత్మవేది," "ఇంద్రియ సుఖదూరుడు" అంటూ ముంజ భోజుడి స్తుతులందుకున్న అసామాన్య మూర్తి ఉద్భటారాధ్యుడు. ఇలాంటి ఉత్తముడైన గురువు లభించడం తన పూర్వజన్మ పుణ్యఫలంగా భావిస్తూ, తనకికమీద "ముక్తికురంగ లోచనా కోమల దృగ్విలాసములు" కొల్లలుగా లభిస్తాయని ముంజభోజుడు మురిసి పోవడం ఉద్భటుడి ఔన్నత్యాన్ని ఎలుగెత్తి చాటుతోంది. శివుడి ఆజ్ఞకు బద్ధుడై గంధర్వుల శాపవిమోచనం కోసం ప్రాణాలర్పించిన త్యాగశీలి ఉద్భటుడు.

ఉద్భటుడి శిష్యుడు ముంజభోజుడు. పుట్టుకతోనే శివభక్తుడు. ప్రభావతీ ప్రమథేశ్వరులకు శివప్రసాదం వల్ల పుట్టిన గారాబు సంతానం. "క్షత్ర ధర్మంబు దాన సాక్షాత్కరించిన" ఉజ్జ్వలాకార సంపన్నుడు. లింగధారుడైన ముంజ భోజుడు — కామక్రోధాల్ని జయించి, రాగద్వేషాల్ని విడిచి, యోగి వలె జీవిస్తూ "నలినీ పత్రము నంటని సలిల కణంబట్లు" రాజ్యపాలన సాగిస్తున్న ఇహపర సాధకుడైన రాజర్షి. ఇతని గురువైన ఉద్భటుడే, "నీ వంటి శిష్యుని కతమున నా వంటి గురుండు నిత్యనవ్య యశః శ్రీని" పొందుతాడని ప్రశంసిస్తాడు. శిష్యుడు చేసే పాపపుణ్యాల్ని గురువు నెత్తికి అంటకట్టడం లోకంలో సర్వసామాన్యమైన విషయం. కనుక, పేరు నిలిపే ఉత్తమ శిష్యులు దొరకడం గురువు గారి అదృష్టమనే చెప్పాలి. ముంజభోజుడు గురువు చేతనే "సచ్ఛిష్యుండు" గా మన్నన లందుకొన్న ఘనుడు. తన అదృష్టవశాత్తు లభించాడని గురువు అనడం కంటె శిష్యుడికి వేరే గర్వకారణం ఏముంటుంది? అలాంటి భాగ్యానికి నోచుకున్న అదృష్టవంతుడు ముంజభోజుడు.

శాపవిమోచన సమయానికి సమీపంలో లేకపోవటం చేత చిత్రరథుడనే గంధర్వుడు వజ్రదంష్ట్రుడనే పిశాచంగానే ఉండిపోతాడు. అతడి దుఃఖానికి జాలిపడి, ముంజభోజుడు శివుణ్ణిప్రార్థించి, అతణ్ణి మెప్పించి, చిత్రరథుడికి శివసారూప్యాన్ని కల్గిస్తాడు. చిత్రరథుడన్నట్లు 'అతనిదుర్దశను తొలగించే కార్యభారం ముంజభోజుడి తలమీద మోపడానికే' ఉద్భటుడు అతడు లేనిసమయంలో ప్రాణాలు విడిచాడు. నిజమే. ఈ గంధర్వుడు పిశాచంగా మిగలడం వల్లనే ముంజభోజుడు గురువుని మించిన శిష్యుడనే విషయం తేటతెల్లమైంది.

ముంజభోజుడి తండ్రి ప్రమథేశ్వరుడు ఈశ్వరసమానుడు. 'సకల శివభక్తమకుటాగ్ర జాతిరత్నం," "అఖిలశైవరహస్య సిద్ధాంత వేది." పల్లకీపుర పరిపాలకుడు. ఇతనిభార్య ప్రభావతి పతిదేవతామతల్లి.

ఇందులోని ఉపకథకు నాయకుడు మదాలసుడు. ఇతడు శుభకీర్తి ధీనిధులకు "కానక కన్న సంతానం." తల్లి, కూతురు, మఱదలు అనే తేడా కూడా తెలియని "పరమకాముక ముఖ్యుడు." కృతఘ్నుడు. ప్రాణావసాన సమయంలో శివసారూప్యాన్ని పొందిన ధన్యజీవి. ఇతని ఉంపుడుగత్తె కనకలత — "సానికులంబులోన గల సానులకెల్ల నవావతంస" మైన "విలాసరసదేవత." "ప్రాణసంయుక్త దర్పక బాణం" ఆమె సోయగం. ఆమె తల్లి 'శేషుడి కాకట్టు గట్టు' గలచతురురాలు. సందుదొరికితే చాలు "సావడి కొట్టంబు చంకఁ బెట్టు" గల జాణ. ఇన్నిమాట లెందుకు ? "కనకలత మాత మాయాప్రకారభూత" అన్నాడు రామలింగడు. మదాలసుడి మిత్రుడు 'పరభావవేది' సార్థక నామధేయుడు.

వర్ణనలు :

చిత్రకారుడి పనితనానికి వన్నె తెచ్చే రకరకాల రంగుల్లాగా, కవి కావ్యానికి వర్ణనలు ఎంతైనా అవసరం. ఎన్నో వర్ణనలతో తనకావ్యాన్ని అందంగా తీర్చిదిద్దుకున్నాడు రామలింగడు.

"తరుణ శశాంక శేఖర మరాళమునకు
సారగంభీర కాసార మగుచు
కైలాస గిరినాథ కలకంఠ భర్తకుఁ
గొమరారు లేమావి కొమ్మయగుచు
సురలోక వాహినీధర షట్పదమునకుఁ
బ్రాతరుద్బుద్ధ కంజాత మగుచు
రాజరాజ ప్రియ రాజకీరమునకు
మానిత పంజర స్థానమగుచు
సురగవల్లభ హార మయూరమునకుఁ
జెన్ను మీఱిన భూధర శిఖరమగుచు
లలిత సౌభాగ్య లక్షణ లక్షితాంగి..........." [1-94]

యైన పార్వతి శివుడితో విహరించే వేళలో "పంచశరు సామ్రాజ్యలక్ష్మి" లాగా ఉందిట. ఈ పద్యంలో చక్కని చమత్కారం దాగి ఉంది. ఇందులోని ప్రతిపాదంలోనూ శివుడికి ఉపమా నోపమేయాల్ని రెంటినీ చెప్పిన రామలింగడు పార్వతి విషయంలో ఉపమానాన్ని మాత్రమే ఉపయోగించాడు. అంతేకాదు. శివుడి ఉనికికి పార్వతి ఆటపట్టయినట్లు వర్ణించడం విలక్షణంగా ఉంది. ఇక్కడ రామలింగడు జగత్తున కాధారాధేయమైన శివ, శక్తి స్వరూపాన్ని ఆధ్యాత్మిక పరంగా మనోహరంగా వర్ణించాడు.

'ఇంద్రనీల మణుల్లోనూ, తుమ్మెదల్లోనూ, ఉన్న నల్లదనానికి తోడు కుటిలత్వాన్ని కూడా జతపర్చుకున్న నెఱివెంట్రుకలు కలవాళ్ళు పల్లకీపురభామినులు'—

అని చెప్పటానికి "ఇవికావు నీలంబు లివికావు తుమ్మెద లవియుఁ గావివి కుటిలాలకంబులు" అన్నాడు. వాళ్ళ సౌందర్యం ఉపమాన వస్తువుల్ని సైతం 'త్రోసిరాజనే' టట్లుందనే భావాన్ని కవి ఒక సీసంలో నిక్షిప్తం చేసాడు.

వల్లకీ పురబ్రాహ్మణులు 'ప్రౌఢవాదక్రీడలో శేషుడికే కళ్ళుకప్పగల సమర్థుల' ట. "త్రినయనుడే దైవమని రహస్యస్థితి నిగమంబులకుఁ దెల్ప"గల నేర్పరులట. 'శివుడేదేవుడు' అనే తన మనోగత అభిప్రాయాన్ని రామలింగడు వల్లకీపురబ్రాహ్మణుల ద్వారా వెల్లడించాడు. ఆ పురంలోని వీరులు పరాక్రమంలో "సమీరకుమార కుమార ముఖ్యుల్ని" మించుతారట.

ఆదిశంకరుడికీ, వల్లకీ పురనాయకుడికీ అభేదాన్ని రామలింగడు ప్రతిపాదించినతీరు మనోహరంగా ఉంది. 'జటాజూటధారణ మానేసి, తలలో పూలమాలల్ని ధరించాలనుకొని, పులితోలుకు మారుగా పట్టుపుట్టాన్ని కట్టడానికిష్టపడి, శ్మశాన భూమిని వదిలి పెద్దమేడల్లో నివసించాలనుకొని, ఎద్దునెక్కడం మానేసి గుఱ్ఱాలనెక్కడానికి మనసుపడి, అర్థనారీశ్వరత్వానికి స్వస్తిచెప్పి పూర్ణపురుషుడు కాదలచి ఈశ్వరుడు భూలోకంలో అవతరించినట్లు ఉన్నాడుట ప్రమథేశ్వరుడు.

ప్రమథేశ్వరుడి ఇల్లాలైన ప్రభావతి సుందర స్వరూపాన్ని—

"అలిపోతంబులు చంద్రలేఖ మరువిండ్లందంబు ముత్తెంపుఁ జి
ప్పలు నూఁ బువ్వసు శ్రీలు శంఖము లతల్ భద్రేభరాట్కుంభముల్
జలదాద్యంబు తరంగముల్ సుడి తమస్సారంబు చక్రంబు రం
భలు తూణీరము లబ్జముల్ మదిఁ దలంపం గాంత కాంతాంగముల్"

[2-13]

అని రామలింగడు ఉపమేయ విరహితంగా చెప్పి, వర్ణనల విషయంలో క్రొత్తదారులు తీసాడు.

ముంజభోజుడి బాల్యాన్ని వర్ణిస్తూ రామలింగడు

"ఇంత వైభవ మెద్ది హిమశైల నందనా
ప్రమథనాథులుగన్న కొమరుసామి
కిమ్మహా సౌభాగ్యమెద్ది పులోమజా
హరిహయుల్గన్న జయంతమూర్తి
కీపాటి సిరి యెద్ది యిందిరామధుకైట
భారులు గన్న పుష్పాయుధునకు
నీలాగు గారాబ మెద్ది కౌసల్యాద
శరథేశ్వరులు గన్న ఖరవిరోధి

కిట్టి గోమున నున్కి పట్టెట్టు దేవ
కియును వసుదేవుఁడును గన్న కేళిమనుజ
విగ్రహుండగు త్రైలోక్యవిభున కనఁగ(....."  [3-59]

అని పురాణపురుషులూ, అవతారమూర్తులూ అయిన దేవతలకున్కూడా ఇలాంటి అదృష్టం పట్టలేదన్నాడు.

కనకలత సౌందర్యాన్ని రామలింగడు — "తారలలోని చంద్రకళ," "తమ్మిలలోని మరాళి," "మల్లికా వారములోని గంధగలి," "వజ్రమన ముత్తెపుఁ బేరులోని విస్ఫారమణీ శలాక" గా పేర్కొన్నాడు. "కమనీయ మహిత మోహన విలాస భాసమానాంగి" అయిన కనకలత "సాకార మధులక్ష్మి," "అతనురాణి," "చిన్న హరిణాంకురేఖ" లాగా ఉందిట.

అస్తమయ సమయంలో సూర్యుడు కెంజాయలో ఉన్నాడు. ముందుగా పద్మాన్ని కలుసుకుని, తరువాత తనకోసం వచ్చినందుకు పశ్చిమదిక్కాంత కోపగించి, సూర్యుణ్ణి కాలితో తన్నగా సూర్యుడిముఖం ఎఱ్ఱబడిందిట. 'బ్రహ్మదేవుడు—పాటలపువన్నె మంకెనలబింకం, పద్మరాగమణులప్రభ, కుంకుమ రాగం, లత్తుకఅందం, చిగుళ్ళవిలాసం, కాశ్మీరపు ఉంగరాగ సోయగం, రాయంచ చంచుకాంతి, మోదుగుపూల శోభ, దొండపండు సంపద మొదలుగా గల రక్తవర్ణ సముదాయాన్నంతటినీ వినోదంకోసం ఒక్కచోటికి చేర్చాడా' అన్నట్లుగా సాయం సంధ్య ఒప్పలోందని కవి ఊహ. సంధ్యాకాలంలోని ఎఱ్ఱదనంకోసం బ్రహ్మదేవుడు ఎంతోకష్టపడి ఎఱ్ఱటి పదార్థాలసన్నిటినీ ఒకదగ్గిరకు చేర్చాడో లేదో కాని తెనాలి రామలింగడు మాత్రం పద్మరాగమణుల దగ్గిర్నుండి దొండపండువరకు గల ఎఱ్ఱటి వస్తుజాలాన్నంతటినీ ఈవర్ణనలో ఇమిడ్చి సాయంకాలాన్ని మన కన్నుల ముందుంచాడు.

సూర్యాస్తమయం అయింది. మెలమెల్లగా నక్షత్రాలు ఆకాశాన్ని ఆక్రమిస్తున్నాయి. అవి మిణుక్కు మిణుక్కుమంటుంటే—

"కాలకాముకుఁడు దిక్కాంతలపైఁజల్లు
ముదకప్పురపుఁ బల్కులో యనంగఁ
జరమ సంధ్యానాట్య చలదీశపటుజటా
గళిత గంగాఫేన కణములనఁగ
నాకాశమండలంబను మధూకంబునఁ
బుట్టిన నవకంపుఁబూవు లనఁగ
రాజురాకను నిశారమణికెలిగింప
వచ్చు పెంచిన వారువంబు లనఁగ

భావినక్షత్ర వల్లభ ప్రకట బహుళ
భరిత సత్కీర్తి చంద్రికాంకురము...." [2-178]

ల్లాగా ఉన్నాయి—అనే కవిభావన నిసర్గ సుందరంగా ఉంది.

రామలింగడు చంద్రుణ్ణి "చీకటి విచ్చు మొగ్గ," "వేల్పుల కఱవెల్లఁదీర్చుటకు బువ్వము" అని మనోజ్ఞంగా ఉత్ప్రేక్షించాడు. పున్నమ చంద్రుడు ఉదయించే టప్పుడు అస్తమయ సూర్యుడిలాగే ఎఱ్ఱగా ఉంటాడు. క్రమక్రమంగా ఎఱుపురంగు తెల్లబారుతుంది. చంద్రుడిలోని ఈ వర్ణపరిణామాన్ని ఆధారంగా చేసుకుని – సంతోషంతో "అస్తమిత భానుని వేషము" దాల్చి, వచ్చిన చంద్రుడు అనురాగం పొంగగా, తన కరాలతో (కిరణాలతో) పద్మినుల్ని తాకాడుట. సూర్యుడి ప్రేయసి కాబట్టి పద్మం చంద్రుడికి ముఖంచాటుచేసింది. అది చూసిన కలువకన్నె తన ప్రియుడికి 'తగినశాస్తి' జరిగిందన్న ఆనందంతో ఫక్కుమని నవ్విందిట. ఎంత ప్రియురాలైనా తన అవమానానికి హేళన చేయడం సహించలేని చంద్రుడు సిగ్గుతో "వెల్వెలన" అయ్యాడని వర్ణించడంలో రామలింగడి భావనా బలం ప్రస్ఫుట మవుతోంది.

చంద్రుడి రాకతో చీకట్లు తొలగిపోవడాన్ని రామలింగడు శృంగారపరంగా భావించాడు. "ఉడువల్లభ జారుఁడు ప్రేమయామినీ కులట — నల్లనిచీర మేనికిన్ దొలఁగఁగాఁ దీసెనాఁ బరగి తూలెఁదమంబు దిగంతరంబులన్" [2-184] అని తన భావాన్ని సరళసుందరంగా ప్రకటించాడు.

ఆకాశసిద్ధుడు తనదేహానికి రాసుకున్న "నూతన స్నిగ్ధ విభూతి" అని కాలమనే జాలరి అంధకారమనే చేపల్ని పట్టేందుకు విసిరిన వల అని, నిశాకాంత వంటినిండా కప్పుకున్న "చిఱుఁగవ వాఁగంపు వలిపంపు చేల" అని [2-186], "నిశాచంద్రాననాహాసం" అని వెన్నెల్ని రామలింగడు ఉత్ప్రేక్షించాడు.

"సర్వకల్మషవికారనిబర్హణ" మైన కాశీపురాన్ని శ్రీనాథుడి తర్వాత ఎక్కువగా వర్ణించిన కవి రామలింగడే. ఇతడు చాలాపద్యాల్లో కాశీపురవర్ణన చేసి, కాశీక్షేత్రమహిమని స్తుతించాడు. కాని రెండు సీస పద్యాల్లో కాశీపుర మహిమను పొందుపరచిన తీరు ఇతని రచనా చమత్కృతికి గీటురాయిగా నిలిచింది.

"ఆనందవనమున కరిగెదనని తలం
చినఁదీర్థముల కెల్లఁజనిన యట్ల
వారణాసికిఁబోయి వచ్చెదననిపల్క
సకలాగమంబు చదివినట్ల...." [2-96]

"మెట్టనీ ధర చుట్టు మెట్టకుండిన వాఁడ
మృడుని పట్టణ వీధి మెట్టఁడేని
ఆడనీ తీర్థంబు లాడకుండిన వాఁడ
యభ్రవాహినిఁదీర్థమాడఁడేని....." [2-102]

మొదటిపద్యం ఎత్తుగీతిలో కాశీపురాన్ని తేరి చూసినవాడు "ముక్తికాంతఁగల యంగఁజూచిన" వాడు అవుతాడని, రెండవ పద్యం ఎత్తుగీతిలో "కాశి కేఁగినఁగాని మోక్షంబు లేద"ని అంటాడు. నిశితంగా పరిశీలించి చూస్తే ఈ రెండు పద్యాల్లో భాష, శైలి తప్పించి, భావంలో పెద్దతేడా ఉన్నట్లు అన్పించదు.

ఈ విధంగా రామలింగడు సందర్భోచితమైన వర్ణనలు చేసి తన కావ్యానికి ప్రబంధ పద సార్థక్యాన్ని సాధించాడు.

ఆత్మీయత :

ఏ కావ్యంలో అయినా కవి ఆత్మీయతా ముద్ర అంతో ఇంతో ఉండి తీరు తుంది. ఈ ఉద్భటారాధ్యచరిత్రకూడా అందుకేమీ విరుద్ధం కాదు.

ఈ కృతి రచనాకాలం నాటికి రామలింగడు వీరశైవుడు. కాబట్టి, ఈ కావ్యం ఆద్యంతమూ శివభక్తిస్ఫోరకమై ఉంది. శివుడే దేవుడని, కాశీపురమొక్కటే పుణ్యక్షేత్రం అని ఈ కావ్యంలోని ప్రతి అక్షరమూ ఉద్బోధిస్తోంది. 'ఎలాంటి సద్గుణోపేతుడైనప్పటికి శివదీక్షలేనిదే మోక్షాన్ని పొందలేడ'ని రామలింగడి దృఢమైన అభిప్రాయం. అయితే, ఈ కావ్యరచనాకాలం నాటికే, 'త్రిమూర్తులు ఏకస్వరూపులు' అనే భావం రామలింగడి మనస్సులో చోటుచేసుకుందనటానికి —

"విష్ణుఁడన రుద్రుఁడనఁగ వాగ్విభుఁ డనంగఁ
దగిన నామాంతరంబులుదాల్చి నీవు
భ్రమము సమకూర్తు వెఱుఁగని ప్రాకృతులకు
నీమహత్త్వంబు చిత్రంబు నీలకంఠ" [3-281]

అనే పద్యమే నిదర్శనం. ఈ పద్యం త్రిమూర్తులకు భేదంలేదని సూచిస్తున్న ప్పటికీ 'నీల కంఠ' పదం రామలింగడి శివభక్తి వైపే మొగ్గుచూపుతోంది.

ఈ కావ్యంలో చెప్పిన లింగధారణదీక్ష, విభూతి పంచక వివరణం, విభూతిమహిమ, రుద్రాక్షధారణవిధి, పంచాక్షరీ మంత్రప్రభావం, షోడశోపచార పూజావిధి, షట్కాల పూజాక్రమం, మొదలైనవి రామలింగడి శైవాగమ శాస్త్ర జ్ఞానాన్ని వ్యక్తీకరిస్తున్నాయి. ప్రమథేశ్వరుడు శివుణ్ణి అర్చించిన పూజాసుమాలు రామలింగడి కాలంనాటి పూల వివరాల నందిస్తున్నాయి.

"అపుత్రస్యగతిర్నాస్తి," "గురోరాజ్ఞాం నలంఘయేత్," "త్రయంబకం యజామహే," "ప్రారబ్ధకర్మణాం దేహ భోగక్షయం," ఇత్యాదిగా ఉన్నసూక్తులు రామలింగడికి గల వేద, శ్రుతి, స్మృతుల పరిచయాన్ని ప్రకటిస్తున్నాయి.

కావ్యంలో అక్కడక్కడ ప్రయోగించిన "ఎంతవారికిఁ దప్పునే యీశ్వ రాజ్ఞ," "చెడదె యశము కామి యగు మూఢునకున్," మొదలైన సూక్తులూ, "అందని మ్రాని పండ్ల కళ్లులు సాచినట్లు," "పిచ్చుక మీద బ్రహ్మాస్త్రము" మున్నగు సామెతలూ," "ఉరుమని పిడుగు," "నేల యీనినట్లు," "తలలోని నాల్క" లాంటిజాతీయాలూ రామలింగడి సమకాలిక భాషా వ్యవహారజ్ఞానాన్ని వ్యక్తీకరిస్తున్నాయి.

ఈ విధంగా శివభక్తి తత్త్వ ప్రతిపాదకమైన "ఉద్భటారాధ్య చరిత్ర" ఒక ఉత్తమ ప్రబంధంగా సాహిత్య గౌరవాన్ని సంపాదించుకున్నది.

## కొన్ని పదాలకు అర్థాలు

భావజ్ఞుడు = భావము తెలిసినవాడు
ఆధేయము = ఉంచదగినది
భోక్తవ్యము = తినదగినది
రక్షణీయము = రక్షింప వలసినది
హార్యము = సంహరింపదగినది
నిటలలోచనుడు = శివుడు
మరాళము = హంస
కాసారము = సరస్సు
కలకంఠ భర్త = మగకోయిల
షట్పదము = తుమ్మెద
కంజాతము = పద్మము
రాజకీరము = రాచిలుక
మయూరము = నెమలి
అలిపోతంబులు = మదించిన తుమ్మెదలు
భద్రేభరాట్కుంభములు = ఏనుగు కుంభస్థలములు
జలదాధ్యంబు = సముద్రము
తరంగముల్ = అలలు
తమస్స్తోమంబు = చీకటి సమూహము
రంభలు = అరటి బోదెలు

తూణీరములు = అమ్ములపొదులు
హిమశైల నందన = పార్వతి
ప్రమథనాథుడు = శివుడు
కొమరుసామి = కుమార స్వామి
పులోమజ = శచీదేవి
హరిహయుడు = ఇంద్రుడు
ఇందిర = రుక్మిణీదేవి
మధుకైటభారి = కృష్ణుడు
పుష్పాయుధుడు = మన్మథుడు
గళిత = జారిన
ఫేనము = నురుగు
మధూకము = ఇప్పచెట్టు
వారువము = గుఱ్ఱము
అంకురము = మొలక
ఆనందవనము = కాశీనగరము
మృడుడు = శివుడు
అభ్రవాహిని = గంగానది
వాగ్విభుడు = బ్రహ్మ

## ఆధార గ్రంథాలు


1. ఉద్భటారాధ్య చరిత్రము—నిడదవోలు వేంకటరావుగారి పీఠిక
2. ఉద్భటారాధ్య చరిత్రము—వేటూరి ప్రభాకర శాస్త్రిగారి పీఠిక
3. తెనాలి రామకృష్ణుని కావ్య పరిశీలనము—
   ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారి సిద్ధాంత గ్రంథము
4. ఆంధ్ర కవి తరంగిణి 8 వ సం.—చాగంటి శేషయ్య
5. సమగ్రాంధ్ర సాహిత్యము 8 వ సం.—ఆరుద్ర
6. 'తెనాలి రామకృష్ణుడు' విమర్శ వ్యాసం—దాశరథి
   ('ప్రతిభాలహరి'—యువభారతి ప్రచురణ).

# పాండురంగ మాహాత్మ్యము—తెనాలి రామకృష్ణ కవి

సమీక్ష : డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య, ఎం.ఏ., పిహెచ్.డి.

[ జన్మస్థలం — బాపట్ల, గుంటూరు జిల్లా. జననం 11-8-1926, ఎం.ఏ., పిహెచ్.డి. గుంటూరు హిందూ కళాశాలలోను, ఆంధ్రవిశ్వవిద్యాలయం తెలుగుశాఖలోను అధ్యాపకులుగా పనిచేశారు. పండితులు 'కులపతి' బిరుదమును ప్రసాదించారు. ఈదేశంలోను, విదేశాలలోను ఆధ్యాత్మికోపన్యాసాలిస్తూ, రోగులకు ఉచిత హోమియోవైద్య సాహాయ్యం చేస్తున్నారు. World Teacher Trust (జగద్గురుపీఠం) అనే అంతర్జాతీయ సేవాసంస్థను నెలకొల్పి, శిష్యకోటిప్రగతికి తోడ్పడుతున్నారు. ముద్రితకృతులు — భాగవతరహస్య ప్రకాశం, రాసలీల, గోదావైభవం, శ్రీపతి, పద్యకావ్యాలు ; మంత్రజాలం, పురుషమేధం. మొ॥ నవలలు ; సుభద్ర మొ॥ నాటికలు.]

కవి పరిచయం :

స్వయం సంపూర్ణమైన ప్రతిభా విశేషాలతో కావ్యనిర్మాణానికి దారి చూపిన ప్రబంధ మహాకవులలో రామకృష్ణుడు ఒకడు. ఇతని గ్రంథాలలో లభ్యమైనవి మూడు : 1. ఘటికాచల మాహాత్మ్యం, 2. ఉద్భటారాధ్య చరిత్ర, 3. పాండురంగ మాహాత్మ్యం. వీటిలో ఘటికాచల మాహాత్మ్యం చాలా చిన్నతనంలో, అప్రౌఢ దశలో వ్రాసిన వైష్ణవప్రబంధం. నేడు షోళింగర్ అని పిలవబడుతున్న చోళంగిపురంలోని నృసింహస్వామి క్షేత్రమాహాత్మ్య మిది. రెండవది ఉద్భటారాధ్య చరిత్ర. ప్రౌఢమైన శైవ మహాప్రబంధం. ఉద్భటుడనే ఆరాధ్య శివగురుని చరిత్రతో బాటు మరికొన్ని ఉపాఖ్యానాలు కూడా ఇందులో ఉన్నాయి. మూడవదైన పాండురంగ మాహాత్మ్యం ప్రౌఢ నిర్భర వయస్సులో రచించిన అపురూపమైన ప్రబంధం. పండరీపురక్షేత్ర తీర్థదైవతాలను గూర్చిన రహస్యాలను వివరించే దర్శనకావ్యం. ఇది శైవవైష్ణవ శాక్తాగమాల సమన్వయమైన నూతన గ్రంథం. ఇతడు రచించిన లింగపురాణం, కందర్పకేతు విలాసం, హరిలీలావిలాసం అనే మూడు కావ్యాలు ఇంకా లభ్యంకాలేదు. ఇవి కాకుండా ఇతడు చాటుపద్యా లనేకం చెప్పినట్లు జనశ్రుతివల్ల తెలుస్తోంది. వాటిలో కొన్ని చాటువు లతనివి కావు. చిన్నతనం నుండీ ఇతడు రామకృష్ణుడనీ, రామలింగడనీ వ్యవహరింపబడుతున్నట్లు తెలుస్తున్నది. ఇతని పైతరాల వారు గుంటూరు జిల్లాలోని తెనాలి వాస్తవ్యులు. ఇంటిపేరు గార్లపాటివారు. తెనాలిలోని రామలింగేశ్వరుడు వీరి యిష్టదైవం కావచ్చును. ఇప్పటి రామలింగేశ్వర పేటలోని

ఆలయంలో వీరి పెద్దలు చేసిన దానశాసనం లభించింది. ఈ కవి తల్లి పేరు లక్ష్మమ్మ. తండ్రి రామయ్య. ఇతని తరంలో తెనాలినుండి రాయలసీమకు తరలిరావటంచేత తెనాలి వారని వ్యవహారం కలిగి తరువాత అదే ఇంటి పేరయింది. లభించిన ఆధారాలనుబట్టి ఈ మహాకవి క్రీ.శ. 1510 ప్రాంతంలో జన్మించి 1585 ప్రాంతంవరకు జీవించినట్లు తెలుస్తోంది. కృష్ణదేవరాయల ఆస్థానంలోగల అష్టదిగ్గజా లనబడే కవులలో ఇతడు వయస్సులో అందరికన్నా చిన్న దిగ్గజం. ఇతని వంశం వారు కౌండిన్యసగోత్రోద్భవులు. ప్రథమ శాఖ అనబడే శుక్లయజుర్వేద శాఖ వారు.

రామకృష్ణ మహాకవి చిన్నప్పుడే శైవ వైష్ణవాగమాలను వేదపురాణాదులతో గురువులదగ్గర సప్రమాణంగా అభ్యసించాడు. ఇతని శైవగురువు పాలగుమ్మి ఏలేశ్వరుడు. వైష్ణవగురువు భట్టరు చిక్కాచార్యులు. వైష్ణవదర్శనాచార్యులైన కందాళ అప్పలాచార్యులు గూడ ఇతనికి గురుతుల్యులు. ఇతని పెద్దతమ్ముడు శ్రీగిరికవి శ్రీశైల మాహాత్మ్యాన్ని రచించాడు. రెండవ తమ్ముడు అప్పన్న కవి సుదక్షిణా పరిణయాన్ని రచించాడు. ఇతని మనుమడు రామభద్రకవి ఇందుమతీ పరిణయాన్ని రచించాడు. రామకృష్ణకవి అల్లుడు లింగమగుంట రామయ్య బహు గ్రంథకర్త.

రామకృష్ణకవి కృష్ణరాయల వార్ధకంలో రాజాస్థానంలో ఆశ్రయం పొంది నట్లు తెలుస్తున్నది. కాని మహాకావ్యాలను రచించే టప్పటికి కృష్ణరాయలు లేకపోవడంతో మిగిలిన ప్రభువులకు అంకితమీయక, తనకు నచ్చిన సజ్జన మిత్రులకు అంకితం చేశాడు. ఉద్భటారాధ్య చరిత్రాన్ని తిమ్మరుసు మేనల్లుడైన నాదెండ్ల గోపన్నకు అంకితం చేశాడు. పాండురంగ మాహాత్మ్యాన్ని విరూరి వేదాద్రి అనబడే వ్రాయసగానికి అంకితం చేశాడు. ఘటికాచల మాహాత్మ్యాన్ని అప్రౌఢ దశలో రచించి యుండటం చేత ఎవ్వరికీ అంకితం చేయక తర్వాతి వయస్సులో మూల పెట్టాడు. తర్వాతి కాలంలో ఇతని మనుమడు దానిని వెలికి తీసి వేంకటగిరి కవిచే పీఠిక వ్రాయించి ప్రకాశమొనరించాడు. ఈ కవి మొదట శైవుడై తర్వాత వైష్ణవ మతం పుచ్చుకొన్నాడని కొందరి ఊహ. దీనికి ఆధారాలు లేవు.

కథ :

ఈ భూమిపై సర్వోత్తమమైన పుణ్యక్షేత్రం తీర్థం దైవతం కలసి ఉన్న ప్రదేశమెక్కడ ? అనే ప్రశ్నకు సమాధానమే ఈ కావ్యం. ఈ ప్రశ్నకు సమాధానంగా కైలాసంలో పరమేశ్వరుడు పార్వతికీ కుమారస్వామికీ, ఋషులకూ పుండరీకక్షేత్రంలో వెలసిన పాండురంగని కథ చెప్పాడు. పుండరీకుడు వేద

వేదాంగ శాస్త్రాలను తండ్రి దగ్గర అభ్యసించి తల్లిదండ్రులకు విధేయుడై, వినయవతి యైన భార్యను పెండ్లాడి సత్సంతతిని పొంది, వారిని ప్రబోధ విధేయమతులుగా శిక్షణమొందించి, తల్లిదండ్రులను వార్ధక్యంలో చక్కగా సేవించాడు. వారు దేహం చాలించిన తరువాత అతడు నడివయస్సు దాటినతరువాత సంసారాన్ని తీర్చిదిద్ది, ఘర్మవీరానదీ తీరంలో ఆశ్రమాన్ని కట్టుకొని యోగాభ్యాసంలో తపస్సమాధి నిమగ్నుడై బాలకృష్ణుణ్ణి ఉపాసించాడు. కృష్ణుడు ప్రత్యక్షమై వరం కోరమన్నాడు. నడుముపై చేతులు పెట్టుకొని ప్రత్యక్షమైన కృష్ణుణ్ణి చూచి పుండరీకుడు ఇలా కోరాడు : "నీవిదే రూపంలో ఇచ్చట చిరకాలం వెలసియుండు. కొలచిన భక్తులను అనుగ్రహిస్తూ వాళ్లకు కొంగుబంగారమై నిలబడు." నిస్వార్థమైన అతని కోరికను మన్నించి స్వామి అలాగే 'కటిన్యస్త హస్తుడై' ఇప్పటికీ నిలబడిఉన్నాడు. "నాకిది కావాలి అనే కోరిక నశించకుండా సన్న్యాసులైనప్పటికీ, యజ్ఞయాగాలు చేసి నప్పటికీ లాభం ఏమిటి ? ఇతణ్ణిచూచైనా వరం ఎలాకోరాలో నేర్చుకోండి. ఇతడే నిజమైన భక్తుడు" అని వెలసిన బాలకృష్ణుడు దేవతా గణాలను హెచ్చరించాడు. ఆ క్షేత్రంలో ఎందరెందరో భక్తులు తరించారు. మహాపాపాలు చేసిన నిగమశర్మ కూడా మోక్షాన్ని పొందాడు. సుశర్మ పాపాలు క్షీణించాయి. సుశీల అనే పతివ్రత భర్తతో పాండురంగణ్ణి కొలచి సశరీరంగా ముక్తిని పొందింది. గుడిలో అప్రయ త్నంగా విహరించిన కాకి, చిలుక, పాము సుశీలబిడ్డలై జన్మించి, రంగని భక్తులై తరించారు. అగస్త్యుని శిష్యుడు అయుతుడనేవాడు శాపవశాన కప్పై పాండురంగ క్షేత్రంలోగల నృసింహుని సన్నిధిలో గృహస్థాశ్రమ దీక్షను పొంది శాపవిమోచ నాన్ని పొంది తరించాడు. పుండరీకుడు తపస్సుచేసిన కాలంలోనే శతగోపుని కుమార్తె రాధాదేవి కృష్ణుని ఉపాసించి తాదాత్మ్యం పొందినది.

సమీక్ష :

స్థల మాహాత్మ్య గ్రంథాలలో ఎట్టిన నృసింహ పురాణం తర్వాత పాండు రంగ మాహాత్మ్యమే గుణముచేత ఎన్నదగిన కావ్యం. ఈ కావ్యంలో కవిచూపిన రచనా స్వతంత్రత శ్లాఘ్యమైనది. ఇందులో సృష్టించిన పాత్రల్లో పుండరీకుడు, రాధ, నిగమశర్మ, వాని అక్క, సుశీల, అయుతనియుతులు, నారదుడు, పార్వతీ పరమేశ్వరులు చాల జీవవంతమైన పాత్రలు. కవితాకళతో నిండి హృదయంగమ మైన వర్ణనలు, కథలు అన్ని ఆశ్వాసాలలోనూ ఉన్నాయి. మనుచరిత్ర, పారిజాతా పహరణాలలో మొదటి రెండున్నరాశ్వాసాలే మిక్కిలి రసవంతాలు. పాండురంగ మాహాత్మ్యం ఆద్యంతమూ రసవంతం. ఇతని పుండరీకుని పాత్ర ఉత్తమ గృహస్థాశ్రమవాసుల కాదర్శవంతమై, చతుర్విధ పురుషార్థాలను సాధించుకొన్న ప్రపన్నుని వాస్తవిక పవిత్ర జీవనాన్ని ప్రతిబింబిస్తుంది. భగవదనుగ్రహాన్ని సాధింప దలచిన పుండరీకుడు—

"వలి చీమ నేనియుఁ జా ద్రొక్క శంకించుఁ
బలుక డెన్నఁడు మృషాభాషణములు
కలుష వర్తనులున్న పాలము పొంతఁ
జనండు కలిమికుబ్బఁడు లేమి కలఁగఁడాత్మ
దలయెత్తిచూడఁ డెవ్వలనఁ బరస్త్రీల
ధైర్యంబు విడఁడెటి దద్దఱుటల
నొరుల సంపద కుసై యుపతపింపడు
లోన నిందింప డెంతటి నీచునైన
మిన్నకయ చూడఁ డాకలి కన్న కడుపు,
సర్వభూతదయోత్సవ మొనర్చు
నిగమ ఘంటాప థైకాధ్వనీనబుద్ధి
బ్రహ్మ విద్యాన వద్యుండు బ్రాహ్మణుండు." [2–6]

ఈ పాత్ర సృష్టి యందలి పవిత్రతతో బాటు సాధింపబడిన వాస్తవికతవలన ఇతడు తెలుగు లోకానికి ప్రవరాఖ్యుని కన్న ఎక్కువ సన్నిహితుడై చిరపరిచితుడైనాడు. ఆబాల గోపాలానికీ భక్తి సంకీర్తనాదులలో పాండు రంగ భజన కీర్తనలపైగల మక్కువ దొడ్డది. గోవిందనామ కీర్తనాలలో "పుండరీకవరదా! గోవిందా" అనే సంబోధన ఏడుకొండలవానికి రెండవదిగా స్థానాన్ని పొందింది.

సుప్రసిద్ధులైన మహాకవులు కల్పించిన స్త్రీ పాత్రలలో చాలవరకు తెనుగు దనం తక్కువనే చెప్పాలి. వరూథిని, గిరిక, సత్యభామ తెనుగు వారి స్త్రీలవలే కనబడరు. గోదాదేవి తమిళుల ఆడబడుచు. కాని రామకృష్ణుని సృష్టియైన సుశీల, నిగమశర్మ అక్కగారు మూడుమూర్తులా తెనుగునాటి ఆడబడుచులు. వీరి వేష భాషలలోనేకాక, హావభావాలలో ఇంగితాలలో, ఇల్లుతీర్చుకోవడంలో, జాతీయమైన తెనుగుదనం ఉట్టిపడుతూ ఉంటుంది. "ఏరాతమ్ముఁడ, ననుచూడఁ జనుదేవెన్నాళ్లో యుండి" అని తమ్ముణ్ణి పలకరించడంలో చనువుతో కలిసిఉన్న ఎత్తిపొడువు తెనుగు ముత్తైదువల సొమ్ము. "రారయ్యా" అని బాటసారిని పిలిచి భోజనము పెట్టిన సుశీల తెనుగుల వంటింటిలో తిరుగుతున్న సజ్జనకుటుంబిని. ఇలాగే రామకృష్ణుడు సృష్టించిన పురుష పాత్రలు కూడా తెనుగుతనంతో కనిపిస్తాయి. నిగమశర్మ బావగారు నవగ్రహాల రత్నాలు తాపిన చెవికాడ కుట్టించుకొన్నాడట. దానిని నిగమశర్మ నిద్రలో కత్తిరించుకొని పోయాడు. నిగమశర్మ తండ్రి వ్రేలికి దర్భముద్రిక ఉంగరం కలదట. అది ఆయనకు తండ్రినుండి సంక్రమిం చింది. నిగమశర్మ తల్లి మెడలో సుదర్శనముద్రలు గల కాసుల పేరున్నది. అది అత్తగారిచ్చినది. నిగమశర్మ అక్క ముక్కుపుడక చేయించుకొని పండుగకి పుట్టింట్లో సింగారించు కోవాలని తెచ్చుకొన్నది. ఆమె వెంటను, చంటను సంతానంతో

నడచివస్తూ ఉంటుంది. నిగమశర్మను పోకుండా చూడటానికై తన కొడుకు నెత్తుకొమ్మని అతని చంకకిచ్చింది. ఇంతటి తెనుగుదనం మిగిలిన తెలుగు కావ్యాల లోని పాత్రలలో కనబడదు.

తెనుగు గ్రామాల్లో జాతర లెలా ఉంటాయో చక్కగా వర్ణించింది ఈ కావ్యంలోనే. జాతరకు పోయే పామర స్త్రీలు గోరువెచ్చని చమురంటుకొని పసుపు నీటితో తలంటి పోసుకొని సన్నని గడిగల చీరలు గట్టి, కొప్పులలో పూలను కుక్కి, తాంబూలాలు నములుతూ బయల్దేరతారట. రెడ్లు మోటుదనపు శృంగారాలతో భార్యల్ని ముందు నడిపించు కొంటూ పోతున్నారుట. ఈ విధంగా సంఘజీవితంలోగల తెలుగుదనాన్ని తీర్చి దిద్దడంలో ఇతను శ్రీనాథు డంతటివాడు. శ్రీనాథుని చాటువులలో కనిపించే తెనుగుదనం ఇతని కావ్యపాత్రల్లో ఉదాత్తంగా రూపొందింది.

ఆత్మీయత :

ఒక కవి రచనలోగల పదప్రయోగం, సమాసఘటన, పద్యరచనాసరళి, కవితాశిల్పం ఒక్కొక్కప్పుడు అతనివి కాకపోవచ్చును. సందర్భోచితి తెలిసిన కవి సామాన్యంగా చదివేవారికి తాను పట్టుబడడు. కాని కవిస్వభావం, సంస్కృతి, ఆత్మీయత కవిముఖం లాంటివి. ఏ కవీ తన రచనలో వీటిని మరగుపరచడం సాధ్యంగాదు. ఈ దృష్టితో చూస్తే అనితర దుర్లభమైన ఒక అంశం పాండురంగ మాహాత్మ్యంలో కనిపిస్తుంది. దానిలోని దశాలు ఈ దిగువ రీతిలో విప్పారగలవు :

1. ఐహిక జీవితనిర్వహణకన్న వేరైన ఆముష్మిక సాధన సాధ్యం కాదు. ఇహపరాలను విడదీసి అర్థం చేసుకోవడం శీలంలోని దౌర్బల్యానికి చిహ్నం. భౌతిక జీవితంలో గల లోపాలు దిద్దుకోవడానికి సిద్ధంగా లేనివారు ఇహపరాలనే విభాగం చేసుకొంటూ ఉంటారు.

2. మోక్షమనేది ప్రవర్తనతో సాధించుకోవలసిన సిద్ధిగాని శాస్త్రగర్భిత మైన సత్యంకాదు. మోక్షానికి భార్య, బిడ్డలు, ఇల్లు, వాకిలి, భూమి, పశుసంపద మొదలైనవి ప్రతిబంధకాలు కాజాలవు. ఇన్నిటిలో ఇన్నిటినీ చూడక దైవాన్ని చూడనేర్చినవానికి లభించే అడ్డులేని అనుభూతే మోక్షంగాని, ఇన్నిటిని భౌతికంగా విడిచిపెట్టి పారిపోయేవాడికి లభించేదికాదు. ముక్తి అంటే అన్నిటియందూ వ్యాపించి అడ్డులేక వర్తించే తన అస్తిత్వమేగాని నిదురవంటిదీ, రాతివంటిదీ కాదు.

3. తానొకరిని నమ్మి తన కర్తవ్యాన్ని నిర్వహించడంలో, ఆ నమ్మిన గురుస్థానమైన దైవస్వరూపానికి శరణాగతి చెందినవానికి మాత్రమే దైవత్వం, మోక్షం లభిస్తాయి. ఇది కుదరనివాడు ధర్మశాస్త్రాల నెంతగా పాటించడానికి ప్రయత్నించినా ఎక్కడో అక్కడ పతనం చెందుతాడు. దీనికి అర్థవాదమే అయుతుడు

కప్ప అవటం. మోక్షవిద్య నేర్పిన గురువు పెళ్లిచేసుకోమన్నప్పుడు అయుతుడు ధిక్కరించి శాపవశాన కప్ప అయ్యాడు. మళ్లీ ఆడకప్పను వివాహమాడి పిల్లల్ని కనేవరకూ శాపవిమోచనం కలగలేదు. సరుడిగా సత్కర్మాచరణం చేయటానికి తిరస్కరించినవాడు ప్రకృతి చేతిలో జంతువులాగా కట్టుబడి అదే ధర్మాన్ని ఆచరింపక తప్పదు. నరునిలోని ఈ నరత్వం, ఆ మృగత్వం కలిపి పరిష్కారం చేసే స్థానంలో ఉండటానికే భగవంతుడు నరసింహాది రూపాలతో లీలార్థం వర్తిస్తున్నాడు.

4. మోక్షవిద్యకు గురుస్థాన మలంకరింప వలసినవాడు పార్వతీపతివలే ఉత్తమ గృహస్థైయుండాలి. నారదుని లాంటి బ్రహ్మచారికైనా అలాంటి గురువు పాదాన్ని పట్టక తప్పదు. గృహస్థుడై ధర్మార్థ కామాలను సాధించి, భార్యను గుణవతిగా చక్కదిద్దుకొని సంతతికి ప్రబోధమతులుగా శిక్షణమిచ్చి, బంధువులకు, సఖులకు, దీనులకు నిలువనీడై మెలగి, సత్యనిష్ఠకు తనయూరివారు తన్నుసాక్షిగా గొనునట్లుమెలగి ధర్మార్థకామాలను సాధించాలి. అపరవయస్సున యోగతప స్సాధనచే భగవంతుని వెలుగును నరులనడుమ స్థాపించాలి. ఈ సాధన లేనివానికి

"వలనా యేటికి నాశ్రయించిమనగా వానీరమున్ నీరమున్
తలవెట్టే పచరింపనేటికి సమిద్దానంబు దానంబు న
చ్చలమూ యేటికి నెత్తిగొట్టుకొనఁగా సన్న్యాసమున్ న్యాసమున్
కలిఁదేఁజాలుమ మదీయ భక్తిరుచి భక్తశ్రేణి కశ్రాంతమున్." [4-98]

అని నిర్భీతిగా తన సందేశాన్ని నరజాతికి ఘోషించిన ఆచార్యుడు తెనాలిరామకృష్ణ కవి.

### కొన్ని పదాలకు అర్థాలు

వాన్ = వావ
మృషా = అబద్ధమయిన
కలుషవర్తనులు = పాపపు నడవడి కలవారు
పొలయుపొంతన్ = తావువెంబడిని
అలగఁడు = చలింపడు
దద్దటుటలన్ = సంకటాలలో, కష్టాలలో
ఉపతపింపడు = సంతాపంపొందడు
నిగమ ఘంటా పథైకా ధ్వనీనబుద్ధి = వేదమార్గ మనెడి పెద్దబాట యందు ముఖ్యముగా వర్తించే బుద్ధికలవాడు
వానీరము = ప్రబ్బలిచెట్టు
సమిద్దానంబు = సమిధలనిచ్చుట (హోమము)
అచ్చలము = అగ్రహము
న్యాసము = దాచిపెట్టుట

# రాఘవపాండవీయము—పింగళిసూరన

సమీక్ష : డా॥ జోస్యుల సూర్యప్రకాశరావు, ఎం.ఎ., పిహెచ్.డి.

[జన్మస్థలం : కరుగోరుమిల్లి – పశ్చిమగోదావరి జిల్లా. జననం 18–3–1932, ఎం.ఎ. తెలుగు, హిందీ, సంస్కృతం], పిహెచ్.డి, భాషాప్రవీణ, రాష్ట్రభాషాప్రవీణ [హిందీ], సాహిత్య కోవిద [సంస్కృతం], జర్మన్ డిప్లొమా. ఉపన్యాసకుడు : తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు. ముద్రిత కృతులు – తెలుగు రామాయణాల రమణీయత ; పత్రికలలో పెక్కు వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. రేడియో ప్రసంగాలు చేశారు.]

కవిజీవితాదులు :

శ్రీకృష్ణదేవరాయల సభను అలంకరించిన అష్టదిగ్గజాల్లో 'పింగళిసూరన' ఒకడని ప్రతీతి. ఇతనిరచన 'రాఘవపాండవీయం' అనేదే తెలుగులో మొట్ట మొదటి ద్వ్యర్థికావ్యం. ఇతని పూర్వులు 'పింగళి' గ్రామంలో నివసించడంచేత వీరి వంశానికి 'పింగళి' ఇంటిపేరు అయిందిట. 'పేకి' అనే ఒక గంధర్విని స్వాధీనం చేసుకొని దానిచే సేవచేయించుకొన్న గోకనామాత్యుడు ఈ వంశానికి మూలపురుషుడు. సూరన్న ఆర్వేలనియోగి. తాత సూరనార్యుడు. అబ్బమ్మ, అమరన్నలు తలిదండ్రులు. భావనామాత్యుడు మాతామహుడు. అమలన, ఎఱ్ఱన్నలు తమ్ముళ్ళు.

సూరన, రాయలకు సమకాలంవాడు కావచ్చు. కాని మిక్కిలి చిన్నవాడు కావడంతో ఇతనికృతులు – చివరికి ఒక్కటికూడా రాయలికి అంకితంకాలేదు. ఇతనివి చిన్నచిన్నకృతులు అలావుంచితే పెద్దకృతులు అయిదు. అవి : 1. గరుడ పురాణం, 2. రాఘవపాండవీయం, 3. కళాపూర్ణోదయం, 4. ప్రభావతీప్రద్యుమ్నం, 5. గిరిజాకళ్యాణం. మొదటిదీ చివరిదీ అలభ్యాలు. ఛందోగ్రంథాల్లో కనిపించే కొన్నిపద్యాలు తప్ప. మిగిలినమూడూ మూడురకాల విశిష్టతకు ప్రతినిధులుగా నిలుస్తాయి. రాఘవపాండవీయం రెండర్థాలకావ్యం. ఉభయభాషల పాండిత్యంలో బుద్ధిచాతుర్యానికి అది గీటురాయి. కళాపూర్ణోదయం అద్భుత విచిత్ర కళా కల్పనలతో నిండిఉన్నది. కవి ప్రతిభా చాతుర్యాలకి పతాకవంటిది. ప్రభావతీ ప్రద్యుమ్నం మంచి సరసమైన కవిత్వకళలో కవికి ఉన్న ప్రజ్ఞా చాతుర్యాలకి, చమత్కారాలకి సాక్ష్యం.

ద్వ్యర్థి కావ్యపరంపరలో మొదటిదీ మొదట ఎన్నికగిందీకూడా 'రాఘవ పాండవీయ'మే. తర్వాతవచ్చిన అనేకార్థక కావ్యాలు అన్నింటికీ అది ఒజ్జబంతి. ప్రస్తుతమైన రెండర్థాల్ని ప్రతిపాదిస్తూ శబ్దార్థశక్తితో కూడినట్టిది ద్వ్యర్థి. అంటే రెండు కథావస్తువులు ఒకేకావ్యంగా రూపొంది చదువుతూంటే రెండర్థాలు స్ఫురిస్తా యన్న మాట. అకువీటి ప్రభువు పెదవెంకటాద్రి కోరికమేరకు రామాయణ భారతకథలు రెండూ జోడించి సూరన చెప్పిన కావ్యం ఇది. ఆయన అనుమతితో పంపాక్షేత్రంలో వెలసిన విరూపాక్షస్వామికి అంకితం అయింది.

నవ్యరీతిని ఏదైనా భవ్యకావ్యం వ్రాయాలనే సూరన కోరిక, అన్నిరకాల శ్లేషలూ ఉండేకావ్యం ఆ విద్వత్కవిచేత చెప్పించాలనే ప్రభువు కుతూహలం, రెండూ నెరవేరాయి. తెలుగులో రెండర్థాలువచ్చే పద్యం ఒక్కటేనా చెప్పడం కష్టంకదా! మరి కావ్యం అంతా రామాయణ భారతార్థాలు రెండూ జోడించి చెప్పగల ఘనుడెవ్వరు అనే తనప్రశ్నకు సమాధానం సూరన్నే అని, ఆ ప్రభువు అతనిచేత రాఘవపాండవీయం వ్రాయించాడు.

వస్తుతత్త్వం :

భీమన మొదట్లో రాఘవపాండవీయం వ్రాసినట్లు పెద్దలమాట ఒకటిఉన్నా, ఆ కృతి అప్పటికే పెద్దల్లో కలిసిపోయింది కనుక "నానామహిత ప్రబంధరచనా ఘనవిశ్రుతి నీకుఁగల్గుటన్, నామదిఁదద్ద్వయార్థకృతి నైపుణియుంగలడంచు నెంచెదన్" [ఆ 1-11] అంటూ ఆ ప్రభువు ద్వ్యర్థి రచనకు సూరన్నను ప్రోత్సహించాడు.

సంస్కృతంలో ద్వ్యర్థికావ్యాలు కోకొల్లలు. కవిరాజసూరి రచించిన సంస్కృత రాఘవ పాండవీయం ఒకటి ఉంది. కాని దానికీ సూరన కృతికీ ఎక్కడా పోలికలేదు. సూరన తనకు తానే మార్గదర్శకుడు. ఇతనిది స్వతంత్రద్వ్యర్థి కావ్యం. తర్వాతవచ్చిన అనేకార్థక కావ్యాలేవీ దీనిఛాయలకుక్కూడా రాలేవు. ఈ జాతి కావ్యాల్లో ఇదే సర్వోత్తమమైనది. రెండుకథలూ ఎలాగో అలాగు అతికితే చాలునని రసదృష్టిని విడిచినవాడు కాదు. రెండు కథల్లోనూ సాధ్యమైనంతమేరకు పోలికలు ఉండే సందర్భాలనే జోడించాడు. శ్లేషను సాధించడంలో పలుపోకడలు చూపి కథా తంతువుల్ని అలవోకగా అల్లాడు. శ్లేషకోసం శబ్దానికి నిఘంటువులో ఉండే అర్థాలమీదమాత్రమే ఆధారపడలేదు. ఆ శబ్దాలవిరుపులు, భాషాంతరాలు, అర్థాంతరాలు అన్వయ భేదాలలాంటి వాటితోనేకాకుండా ముఖ్యగౌణవృత్తులు, వ్యంజనాదిశబ్దశక్తులు మొదలైనవాటిద్వారా ప్రసిద్ధశబ్దాలు, శ్లేషభంగిమ వైవిధ్యం చూపించి రెండర్థాలనీ అనాయాసంగా సాధించాడు. తర్వాతి కవులు ఆ లక్షణాలను పాటించినా ఆ అర్థసౌలభ్యాన్ని మాత్రం పాటించలేకపోయారు. 'ఆంధ్ర కవితా

పితామహుఁడి మనుమరాలిభర్త అయిన సూరన ఈ రీతిగా 'ద్వ్యర్థికావ్యపితామహుఁడు' అయినాడు.

సూరన రామ భారత కథలను మేళవించడంలో మంచినేర్పు ప్రదర్శించాడు. బలం, పరాక్రమం, గుణశీలాలు – వీటిలో సమానంగాఉండేవారిని జాగ్రత్తగా ఏరి జోడించాడు. దశరథుడు – పాండురాజు ; రామాదులు – పాండవులు ; సీత – ద్రౌపది ; హనుమంతుడు – భీముడు ; సుగ్రీవుడు – కర్ణుడు ; రావణుడు – దుర్యోధనుడు – ఇట్లా. రెండుకథల్లోనూ అర్థంసరిపోయే పదాలనే ఎంచుకున్నాడు – అనిలజ, మారుతి (హనుమ, భీముడు) ; రవినందన (కర్ణ సుగ్రీవులు) ; ఇంద్రనందన (వాలి అర్జునులు) ; అయోనిజ (సీత ద్రౌపది) ఇట్లా. సూరన మంచి చమత్కారి. సంజ్ఞావాచకాల్లోకూడ చక్కని శ్లేష చూపాడు. ధృతరాష్ట్రుడు అంటే ధరింపబడిన రాష్ట్రము కలవాడు అని దశరథపరంగానూ, కౌరవులతండ్రి అని భారతపరంగానూ అన్వయిస్తుంది. అయోధ్య అంటే రామకథలో దశరథుని రాజధాని. భారతార్థంలో యుద్ధంచేయడానికి అసాధ్యమైనదని, అట్లాగే 'ఐనకుల సహదేవ' అనేది 'అయి+నకుల సహదేవ' అని విడదీస్తే భారతార్థంలోనూ, ఐనకుల =సూర్యవంశానికి, సహ = తగిన – దేవులు' అని విడదీస్తే రామాయణార్థంలోనూ అన్వయిస్తుంది.

ఇక జోడింపు చూడండి. అయోధ్య హస్తినాపురం ; దండక – ద్వైతవనం ; అలాగే ఘట్టాలు – దశరథ పాండవులకు సంతానము లేకపోవడం ; వారివేట ; శాపప్రాప్తి. కుమారుల జననం ; రామధర్మజుల వనగమనం ; శూర్పణఖా ఊర్వశుల వృత్తాంతం ; ఖరదూషణాదుల, నివాత కవచాదులవధ ; రావణుడు సీతను బలాత్కరించడం – కీచకుడు ద్రౌపదిని నిర్బంధించడం ; అక్షవధ – కీచకవధ ; అంగద కృష్ణరాయబారాలు ; విభీషణనీతి – విదురనీతి, నీలుడు, ధృష్టద్యుమ్నుడు సేనాపతులవడం ; లక్ష్మణ ఇంద్రజిత్తుల, పార్థకర్ణులయుద్ధం ; ఇంద్రజిత్తు – కర్ణులవధ ; రామ రావణయుద్ధం ; భీమ దుర్యోధనులయుద్ధం ; విభీషణ – ధర్మజుల పట్టాభిషేకాలు ; రామధర్మజుల రాజ్యపాలన ; ఇట్లా జోడింపు చక్కగాకుదిరింది.

ద్వ్యర్థి క్లేశంతోకూడిన రచన, అయినా సూరనతన మృదుమధుర కవిత్వ ధోరణి వదిలిపెట్టలేదు. రెండుకథలకే సమానఘట్టాలు—కుమార జననం, వివాహం, వేట, శాపం, వనగమనం ; రాయబారం, యుద్ధం, పట్టాభిషేకం, నగర, వన, ఋతువర్ణనలూ, ఇల్లాంటి ఘట్టాల్లో ధారాళమైన శైలి రసవత్తరం అయిన కవిత్వంచెప్పి సహృదయుల హృదయాలని ఆకట్టుకొన్నాడు. పట్టూ, విడుపూ, ఒడుపూ తెలిసినవాడు.

రెండుకథలూ జోడించటానికి వీలుగా కొన్ని మార్పులూ, చేర్పులూచేసి కొన్ని ఘట్టాలనే విడిచివేసినాడు. దశరథుని శాపం, తమసా నదీతీరాన్ని జరిగినట్లు మార్చబడింది. కుంతీ పాండవుల సంవాదంకోసం వసిష్ఠ దశరథుల సంవాదం కల్పించబడింది. నారదాగమనంకోసం రామ పరశురాముల సంవాదం వచ్చింది. ఇక అతకని ఘట్టాలు, సేతుబంధ రామాభిషేకాలు, భారతంలో కర్ణశాపం, శల్య సారథ్యం, సంజయ రాయబారాలు విడిచిపెట్టబడ్డాయి.

తన అపూర్వసృష్టిని పఠితబాగా అర్థంచేసుకొనేటందుకు పదార్థవిభాగం చేసుకొంటూ ఒకసారి రామాయణకథను, మరొకసారి భారతకథను వేర్వేరుగా చదువుకోవాలని సూరన సూత్రించాడు.

సూరన సూచించిన శ్లేష వైవిధ్యము : తెలుగుభాషలో ఉత్తరోత్తరా రెండర్థాల కావ్యాలు వ్రాసేవాళ్లు పాటింపవలసిన నియమాలు సూరన "ఆంధ్ర భాషా సంస్కృతాభిభాషాశ్లేష యొక్కొక్కచోట, నొక్కొక్కచోట నుచితశబ్ద శ్లేష...." (1–17) అనే పద్యంలో సూచించి తాను ఆచరించి చూపాడు. అవి ముఖ్యంగా ఆరు విధాలు.

1. ఆంధ్రసంస్కృత భాషాశ్లేష (మాట విరుపువల్లగాని, లేక కాని, సంస్కృతంద్వారా ఒక అర్థం, తెలుగులో మరొకఅర్థం సాధించడం) :

దశరథుడు ఏనుగు అనుకొని చీకటిలో మునిబాలుణ్ణి చంపి అతని తలి దండ్రుల దగ్గరికి చేర్చినఘట్టము.

"విని యతనిందనపైనిడు, కొనియేఁగినియమికిఁదగని ఘోరార్తియొన
ర్చినవాడ మీకు దండ్యుఁడ – నని తను దెలుపుమను వారికప్పనసేసెన్."
(1–28)

ఇక్కడ రామాయణార్థంలో, 'విని+యతనిం+దనపై+నిడుకొని' అని తెలుగులో పదవిభాగం. అదే భారతార్థంలో 'వినియత+నిందన+పైనిడుకొని' అని 'విని యత నిందన' అంటూ సంస్కృత సమాసంగా గ్రహించి 'కిందమ' మునిని చంపుటచేత' 'మిక్కిలి నియతమైన నిందను పైనవేసికొని' అని పాండురాజు పశ్చాత్తాపంపొందినట్లు అర్థంచెప్పుకోవాలి.

అట్లే "మనవియుక్తి తెఱంగు మీకనినదడవి........" [1–38] లో రామాయణార్థంలో 'మనవి = విన్నపము ; ఉక్తితెఱంగు = మాట్లాడు తీరు' అని తెలుగు భాషలో విరుపు. 'మన - ఎయుక్తి - తెఱంగు = మన యెడబాటు తీరు' అని సంస్కృత భాషలో విరుపు.

2. ఉచితశబ్దశ్లేష (ఏ భాషలోని పదాలకు ఆ భాషలోనే సభంగశ్లేష కల్పించడం ) :

> "ఏనుంగని కర మరయక
> పూనితిఁ గాకిట్టి యెడలఁ బొసఁగునె యేయన్
> గానమె కాల నియమగతి
> తో నావేఁట మునియుగముఁ ద్రుంగించెఁదుదన్." [1-25]

రామకథా పక్షంలో - 'ఏనుంగు +అని + కరము + అరయక' అని విరుపు. అంటే ఏనుగు అనుకొని ఏమీచూడకుండా అని అర్థం. 'కానమే + కాలనియమగతి' అని విరుపు. అవే భారతార్థంలో 'ఏనున్ + కనికరము + అరయక' అని, 'కాన + మెకాలు + అని + యమగతితోన్' అని భారతార్థంలో విరుపు పాటించాలి. ఇక్కడ తెలుగు పలుకులు సులువుగ విడిపోయి సొగసుకూరుస్తున్నాయి.

అట్లాగే సంస్కృత సభంగశ్లేషకు ఒక్క పద్యం :

> "ఎందు వేటరారె యితరు లేమనసుతో
> దారసంగసుఖముఁ దప్పఁద్రోచి
> తకట పాండు రాజయశమేన్న వైతతి
> క్రూర దశరథేశకుల మురోయ." [1-31]

ఇక్కడ రామాయణార్థంలో – 'ఇతరులు + ఏమన + (సుత + ఉదార) సుతోదార + సంగసుఖము ; దశరథేశ, పాండుర + అజ + యశము' (ఏమనవచ్చును ? అన్యులు వేటకురారా ? బిడ్డప్రాపువల్ల కలిగేసుఖాన్ని పోగొట్టావు. ఓ దశరథమహారాజా ! నీ తండ్రి అయిన అజమహారాజు తెల్లని కీర్తినైనా విచారించావు కావు) అని గ్రహించాలి. భారతార్థంలో 'ఓ పాండురాజా ! ఏ మనసుతో = ఏ ఆశయంతో, దారసంగసుఖము = భార్యచేరిక అయినందువల్ల కలిగేసౌఖ్యము, తప్ప ద్రోచితివి. క్రూరదశన్ = క్రౌర్యముచేత, రథేశకులము = గొప్ప రథికులైన వారికులము, రోయన్ = అసహ్యించుకోగా ; ఎన్నవైతివి = తలపవైతివికదా' అని సంస్కృత పదాల మధ్యనే సభంగశ్లేష కుదిరింది.

3. ముఖ్యగౌణవృత్తిశ్లేష (అభిధేయాలకి అంటే చెప్పవలసినవాటికి అముఖ్యాలకి అంటే ప్రస్తుతంకాని వాటికి, గౌణలక్ష్యాలకి శ్లేష. దీని వల్ల రూఢి అయిన అర్థంఉన్నపదాలకి కవి తన ప్రతిభచే వేరే అర్థాన్ని సాధిస్తాడన్న మాట)

> "ఆపట్టణమే లెడిపృథి
> వీ పాలుఁడు భృకుటి మాత్రవిముఖితసమదా
> టోపారి పంక్తిరథుఁడు
> దీపించునుదార నీతిధృత రాష్ట్రుఁడనన్" [1-2]

ఇక్కడరామాయణార్థంలో 'పంక్తిరథుడు = దశరథమహారాజు' అని. ధృత = ధరింపబడిన, రాష్ట్రుడు = దేశముకలవాడు అనేఅర్థం అతని పరంగానే అన్వ. యించుకోవాలి. భారతార్థంలో అరిపంక్తిరథుడు = శత్రుసమూహముల రథములు కలవాడు అని ధృతరాష్ట్రుడనగా కౌరవుల తండ్రి పరంగానూ అన్వయించుకోవాలి.

4. అర్థశ్లేష (పదంయొక్క అర్థాన్ని వేరువేరుగా అన్వయించడం):

"ధృతిఁగుంతిమద్ర భూపతుల నెయ్యపుఁగన్య
కలననవాలుఁ దూపుల జయించె—
యలరారునతను జయశ్రీల వరియించి......." [1–7]

ఇచట రామాయణార్థంలో 'కన్య = అప్రౌఢమైన అంటే క్రొత్తదైన, కలనన = యుద్ధమునందే' అని కన్యపదముయొక్క అర్థము 'కలన' పదార్థంతో అన్వయిస్తుంది. భారతార్థంలో 'కన్యకలన్ = కన్నియలను' అని ముందున్న 'అతను జయశ్రీలన్ = మన్మథునికి జయలక్ష్మలవంటివార'ను పదముయొక్క అర్థంతో అన్వయిస్తుంది.

5. పదముల విభిన్నాన్వయం (పదాలని విడివిడిగా అన్వయించడం):

పైపద్యంలోనే ఇదికూడా కన్పిస్తుంది. రామాయణార్థంలో 'జయించి' అనేది 'వరియించె' అనేదానితో హేతువుగా అన్వయిస్తుంది. రాజుల్ని జయించిన కారణంచేత జయలక్ష్మిని అందగలిగాడని భావం. భారతార్థంలో ఈ 'జయించి' అనే పదం 'అలరారు' అనే పదంతో ముందుకు అన్వయించి 'జయించి విలసిల్లేటటువంటి' అనే అర్థాన్ని ఇస్తుంది.

6. పెక్కుశ్లేషలకలయిక: పైన 'కన్యకలనన' అనేచోట సంస్కృతాంధ్రపదశ్లేష, శబ్దార్థాల విభిన్నాన్వయశ్లేష మేళవించాయి. అలాగే—

"పుడమిఱేఁడీ రీతిఁగడగి డెందము మృగ
వ్యాపారఖేలన మభిలషింపఁ
గానలోఁదారు మృగంబుల కైవడిఁ
గైకొనియసమాప్త కర్మకలనఁ
దనరుచొక్క పురాణమునిదంపతులు దమ
కంబులు దేరనెయ్యంబుమీఱ
ననిచిన తత్ప్రియ తనయుండవారిత
కారుణ్యుఁడై పూనికలశమంబు
మగ్నముగఁ జేయుచప్పుడు భగ్నహృదయుఁ
డగుచు వినిశిత శరవిశేషాభి హతిని
ద్రెళ్లనేసె నాఘనుల సదృష్టి నియతి
బ్రుంగఁ గేవల సారంగ బుద్ధిఁజేసి." [1–20]

ఇక్కడ రామాయణార్థంలో 'మృగవ్య + అపారఖేలన' మని భారతార్థంలో 'మృగ + వ్యాపార + ఖేలన' మనీ అన్వయించడంలో సంస్కృత సభంగ శబ్దశ్లేష. అలాగే 'తనరుచు + ఒక్క + పురాణ మునిదంపతులు' అని, 'తనరు + చొక్కపు + రాణన్ + మునిదంపతులు' అనిన్నీ 'తమకు + అంబులు + తేర' అని, 'తమకంబులు + తేర' అనిన్నీ – 'పూని + కలశము + అంబుమగ్నముగన్ + చేయు + చప్పుడు' అని 'పూని + కల + శమంబు + మగ్నముగన్ + చేయుచు + అప్పుడు' అనిన్నీ అన్వయించడంలో రామాయణభారతార్థాలు స్ఫురించి సంస్కృతాంధ్ర భాషాద్వయ శ్లేష అందగిస్తోంది. చివరగా సారంగబుద్ధి = ఏనుగు అనే భ్రమతో అని ; సారంగబుద్ధి = లేడి అనే భ్రమతో అని చెప్పుకోవడంలో సంస్కృత భాషార్థశ్లేష కన్పడుతూ ఈ పద్యంలో మూడుశ్లేషలు ముప్పేటగా ముచ్చట కొల్పుతూన్నాయి.

వర్ణనలు – పాత్రచిత్రణ :

కావ్యానికి జీవితం వ్యంగ్య వైభవం. దాన్ని వర్ణనల్లో ఎలా ఇమిడ్చినాడో ఈక్రింది అశ్వగజవర్ణనలో చూడవచ్చు.

> "జవవద్ఘోటక పాటిత క్షితి రజస్సం క్రాంతిచే నింకు సిం
> ధువులం గ్రమ్మఱ నుర్వికిన్ దివికిఁ దోడ్తోనించెఁ దన్నా గముల్
> నవనిర్యన్మదనిర్ఝ రౌఘమున శుండాశీకరోర్ధ్వ ప్రవ
> ర్షవిధిం దాననుజేసి సింధురములన్ ప్రఖ్యాతి గాంచెంగరుల్."
> [1–11]

అశ్వాల డెక్కల తాకుడుచే రేగిన ధూళిచే సముద్రాలు ఇంకిపోగా ఆ రాజు ఏనుగుల చెక్కిళ్లనుండి ఎడతెగకుండా స్రవించే మదజలంతో మరల సముద్రాలని నింపినాయాట. గజాశ్వ సమృద్ధి కలదని ధ్వని.

పాత్రల చిత్తవృత్తిని పట్టియిచ్చేదిగా ఇతని కృతిలో పాత్రచిత్రణ జరిగింది. సంతానము లేకపోవుటచే క్రుంగికృశించే దశరథ పాండవులు ఎలావాపోతున్నారో చూడండి –

> "కులవర్ధనుండగు కొడుకు గానని యట్టి
> లాఘువాస్పదుని యాలయము లయము
> సిరులకుఁ దొడవైన వరసుతుఁ బడయని
> ఘనకలుషాత్ము జీవనము వనము...." [1–46]

ఈ పద్యంలో 'ఆలయము, జీవనము, గోత్రమ్ము, భవమ్ము' అనేపదాలకు 'ముఖవర్ణహాని' అనగా మొదటి అక్షరం తొలగిస్తే 'లయము, వనము, త్రమ్ము, వమ్ము' ఏర్పడి అర్థస్ఫూర్తి నిస్తున్నాయి.

రసము, అలంకారము, గుణము, శైలి మొదలైనవి : ద్వ్యర్థి కావ్యాలలో రసపోషణ కష్టం అంటారు. కాని రెండు కథలలోను సమాంతరంగా విభావాదులు కల్పించడంతో సూరనకు రసపోషణ సాధ్యమయింది. చూడండి.

"తోరపుటల్కఁ నారిపులు దొమ్మిగఁ బైపయిఁగ్రమ్మ....
....సుబాహుఁడను వాఁడిల సద్గతిగాంచి మించగన్" [2-21]

రామాయణార్థంలో విశ్వామిత్రుని యాగం సంరక్షించే రాముడు మారీచ సుబాహులమీద బలప్రయోగం చేసిన ఘట్టం. భారతార్థంలో జలక్రీడల సమయంలో భీముడు కౌరవులమీద బలప్రయోగం నెరపిన ఘట్టం. ఇక్కడ మారీచ దుర్యోధనాదుల క్రోధభావం, రాముడు భీముడు యుద్ధాన్ని క్రీడగా భావించడంతో నాయకుల బలవీరం రసస్థితి నందినది.

రాముని శివధనుర్భంగము అర్జునుని మత్స్యయంత్ర భేదనం సూరన ఒకే పద్యంలో కూర్చినాడు.

"అనుపమ దివ్య విక్రమ సమగ్రుడు రామవిభుండు....
....జన హృదయాక్షి వర్తనముఁ జాలఁగ సద్భుత వార్థిముంచుచున్"
[2-56]

ఇక్కడ రామార్జునుల ఉత్సాహం, వీరరస పర్యవసాయి అయింది.

అట్లాగే రామాయణార్థంలో పరశురాముని పరంగా రౌద్ర రసస్ఫూర్తి భారతార్థంలో బ్రాహ్మణ గోరక్షణార్థంఉత్సాహం చూపే అర్జునుని పరంగా వీరరసస్ఫూర్తి ఈ క్రింది పద్యంలో గోచరిస్తుంది. ఇక్కడ వృత్తంకూడా 'ఉత్సాహ' కావడం మరోవిశేషం.

"అంత రహిత సమయ వృత్తి నర్జునుండు.....
......బాడబ ప్రశాంతి సలుప నేర కొండుమైన్" [2-92]

రెండర్థాలని సులభంగా సాధించడానికి సూరన తన సమగ్ర పాండిత్యాన్ని సంస్కృ తాంధ్రాల్లో అడుగడుగునా చూపించాడు. యతిప్రాసలలో కూడ విశిష్టత కనపర్చాడు. పఠితలకు ఆహ్లాదం కలిగించేలా జాతీయాలు, నానుడులు ప్రయోగించాడు. అర్థాలంకారాలతో పాటు శబ్దాలంకారాలు కూడా అప్రయత్నంగా జతపడ్డాయి. మచ్చుకి కొన్ని—

1. "తలపంజొప్పడి యొప్పెనప్పుడు తదుద్య చ్చైత్ర యాత్రా సము
త్కలి కారింఖదసంఖ్య జయవత్కంఖాణరింఖా." [1-9]

ఇక్కడ వృత్త్యను ప్రాసాలంకారము వచ్చికూర్చుంది.

2. "పొలిచె మధులక్ష్మి సురపొన్నలను బొన్నలను
దెలివి పడి పుప్పొడుల తిన్నెలను జిన్నెలను..." [2-6]

ఇక్కడ ఛేకాను ప్రాసము అందగించింది.

3. "అది సకల సదాచారంబది సర్వజ్ఞాన మది సమస్త జనిఫలం
బొదవిన కొలది నొకప్పుడు, హృదయము నీయందు జేర్తురేని పరేశా."
[3-60]

ఇచట శ్లేష అనే కావ్యగుణము తొణికిస లాడుతోంది.

4. సూరన లలాటేక్షణ భక్తి శీలుడు. పంపా విరూపాక్ష స్వామిస్తుతి చూడండి —

"ప్రాలేయాంశు వతంస ! సన్నిహిత పంపావాత శైత్యో చితీ
లీలాగూఢ నిగాఢరూపుల కాశీహేతు హార్దోదయ
స్థూలం భావుక శైలరాజ తనయా దోర్దండ నిష్పీడనో
ద్వేలో ధ్వస్తత చిత్త రాగలహరీ భీకృజ్జటా మండలా !"
[1-76]

స్వామి తలమీది జడలు పార్వతి విషయమై ఆయన హృదయాన్నుంచి వెలువడుతున్న రాగం పుంజాలుగా ఊహింపబడ్డాయి.

5. "అంత వసంత మొప్పెఁ జరమాగ్రిమ భాగ చరాఖిలర్తు సా
మంత మనంత జాలక సమంజస రంజిత కుంజకుంజరో
ద్వాంత నితాంత సాంద్ర మధుదాన విజృంభిత బంభర స్వనా
త్యంత నిరంతరీ కృత దిగంత మతాంత లతాంత కుంతమై"
[2-4]

ఇక్కడ ఔదార్యం, ఉదాత్తత, ఓజస్సు, సౌకుమార్యాలు గూడుకట్టాయి.

'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని' (అంటే కావ్యం శుభంతో మొదలై మధ్యలో శుభాలు వర్ణించి చివరకు శుభాంతం కావాలి) అన్న సూక్తికి దీటుగా మొట్టమొదటి పద్యంలోనే

"శ్రీతోఁ బుట్టి సుధామధు ద్రవముతోఁ జెన్నొందు పుష్పంబు..."
[1-1]

అంటూ సీతాదేవి లక్ష్మిదేవి ఒక్కరేనుమా అని చాటి కావ్యార్థ సూచనచేసి చూపాడు.

"చమత్కృతిమత్కృతిమత్కృతిత్వముఁ జూపెదన్" [1-15]

అని తాను పేర్కొన్నట్లుగానే చమత్కారములతో నిండిన కృతిచేసి చూపి అందర్నీ ఓహో అనిపించగల్గిన సుకృతి పింగళిసూరన అనడంలో ఎవరికీ అభ్యంతరం ఉండబోదని ఆశిద్దాం.

## కొన్ని పదాలకు అర్థాలు

అంబుమగ్నము = నీటిలోమునిగినది
అంబులు = నీరు
అతనుడు = శరీరములేనివాడు (మన్మథుడు)
అభిధేయాలు = శబ్దార్థాలు
ఆక్రాంతంబు = ఆక్రమింపబడినది
ఉదారనీతి = గొప్పదైననీతి (కలవాడు)
ఉద్యత్ = ప్రకాశించుచున్న
ఔదార్యం, ఉదాత్తత, ఓజస్సు, సౌకుమార్యాలు } ఇవి కావ్యగుణాలు. కావ్యానికి శోభను కలిగించే ధర్మాలు.
కలశము = చెంబు
కాలనియమగతి = కాలం నడచేరీతి (కాలం యొక్క ప్రేరణ)
కావ్యార్థ సూచన = రాబోవు కథను సూచించడం
క్షితిరజస్సంక్రాంతి = భూమియొక్క ధూళి సంక్రమించుట
ఖేలనము = విహారము
ఘోటక = గుఱ్ఱముల యొక్క
చమత్కృతి మత్కృతి = చమత్కారంగల కావ్యం
జని = పుట్టువు
జయవత్ = జయశీలములైన
జవవత్ = మిక్కిలివేగంగల్గిన
జైత్రయాత్రన్ = యుద్ధయాత్రయందు
తంతువులు = దారాలు
తప్పద్రోచితివి = పోగొట్టితివి
తమకంబులు = కోరికలు
త్రమ్ము = దుమ్ము
తారు = సంచరించెడి
దానము = ఏనుగులమదజలం
ధరాపరాగ = భూమియందలి ధూళియొక్క
ధృతిన్ = ధైర్యముచేత
నవ = క్రొత్తగా
నాగముల్ = ఏనుగులు

నియతిన్ = విధిచేత
నిర్ఝరౌఘములు = సెలయేళ్ల ప్రవాహములు
నిర్యత్ = బయల్వెడలుచున్న
నెయ్యపు = ఇంపైన
పంక్తిరథుడు = శ్రేణులుగా రథములు గలవాడు
పటల = పొరచేత
పతిత = పడిపోవువాడు
పాండుర = తెల్లనైన, స్వచ్ఛమైన
పురాణ = వృద్ధులైన
భుగ్నహృదయుడు = వక్రించిన మనస్సు కలవాడు
భృకుటి = బొమముడి
మత్కృతిత్వము = నా కావ్యరచన
ముఖ్యగౌణవృత్తులు = ప్రధానమైన, అప్రధానమైన అర్థాలు
మృగ = లేళ్లు
మృగవ్య = వేట (యందలి)
యమగతితోన్ = యముప్రేరణతో కూడిన
రాణన్ = అనురాగముతో
రింఖత్ = కదులాడుచున్న
రింఖా = డెక్కలచే
రూఢి = లోకంలో ప్రసిద్ధి పొందినది
లయము = శూన్యం
లలాటేక్షణ = ఈశ్వర
లసద్విమృష్టి = మంచి వివేకము
వాలుతూపులు = పువ్వుటమ్ములు
విముఖిత = పరాఙ్ముఖులుగాచేయబడిన
విశృంఖల = ఎక్కువగా
వ్యంగ్యము = అసలు అర్థం అలాఉండగా స్ఫురించే విశేషార్థము
శంఖాణ = అశ్వములయొక్క
శమంబు = ఓర్పు, నిగ్రహము
శరవిశేషము = శబ్దభేది అను బాణవిశేషము
శుండము = ఏనుగుతొండము
శుండాశీకర = తొండములనుండి చిమ్మబడు నీటి తుంపరలు
శ్లేష = రెండర్థాలకూడిక
సంఘాత = త్రొక్కబడిన

సభంగశ్లేష = మాటను రెండురకాలుగా విరచి అర్థంచెప్పుకోవడం
సమదాటోప = గర్వముతో కూడుకొనిన
సముత్కలికా = అధికమైన ఉత్కంఠచే
సారంగము = ఏనుగు, లేడి
సింధురములు = ఏనుగులు
సింధువులు = సముద్రాలు.

## ఆధార గ్రంథాలు


1. రాఘవపాండవీయం — సటీక — వావిళ్లప్రతి, 1955
2. ఆంధ్రకవిసప్తశతి — శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు
3. ద్వ్యర్థికావ్యకవులు — విజ్ఞాన సర్వస్వము 3భా.
4. తెలుగు వాఙ్మయము — } శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు
5. పింగళి సూరన్న — } " విజ్ఞాన సర్వస్వము 3భా.
6. సారస్వతనీరాజనము — ఆచార్య శ్రీ యస్వీ. జోగారావుగారు
7. వీరరసము (ఆంధ్రసారస్వతము) — డా॥ గూడా వేంకట సుబ్రహ్మణ్యం గారు
8. లక్ష్మీరంజనవ్యాసావళి — ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు
9. తెలుగుసాహిత్యము — రామకథ — శ్రీ రావూరి దొరసామిశర్మ గారు
10. సమగ్రాంధ్ర సాహిత్యం — 8వ సంపుటం — శ్రీ ఆరుద్ర.

# కళాపూర్ణోదయం—పింగళిసూరన

సమీక్ష : శ్రీ **రామవరపు శరత్‌బాబు,** ఎం.ఏ.
'శరత్ పూర్ణిమ'

[జన్మస్థలం : విజయవాడ, కృష్ణా జిల్లా. జననం 26–11–1939. ఎం.ఏ. [సంస్కృతం తెలుగు], నాటక దర్శకత్వంలో డిప్లొమా, క్యూరేటర్ ఆఫ్ మాన్యుస్క్రిప్ట్స్ అండ్ ఓరియంటల్ లాంగ్వేజెస్, డాక్టర్. వి. ఎస్. కృష్ణ మెమోరియల్ లైబ్రరీ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు. ముద్రిత రచనలు – ఆషాఢస్యప్రథమదివసే ; ముద్రారాక్షసం ; మాతృవందనం ; వేణీ సంహారం ; సమర జ్వాల. ప్రత్యేక త్రైమాసిక నాటకాలు - ఆకాశవాణి ద్వారా ప్రసారితాలు.]

కవిజీవితాదులు :

ఆంధ్రభాషాయోషామణికి అనర్ఘమణిహారం పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయం. అంబమాంబిక, అమరనార్యులకు సూర్యభగవానుని అనుగ్రహంవల్ల జన్మించాడు కాబట్టి ఈయన పేరు సూరన. ఈతడు క్రీ. శ. 1500 ప్రాంతంలో జన్మించి ఉండవచ్చును. వీరి పూర్వీకులు గుంటూరు మండలంలోని 'పింగళి' అనే గ్రామంలో నివసించారు కాబట్టి వీరి ఇంటిపేరు పింగళివారు. ఈ 'పింగళి' గ్రామం నేటి నిజామాబాదు జిల్లాకు దగ్గరలో మహారాష్ట్ర ప్రాంతంలోనిదని మరికొందరి అభిప్రాయం. ఈయన తాత తండ్రులు మొదట కృష్ణామండలంలోని 'నిడమానూరు' అగ్రహారంలో ఉన్నట్లూ, తరువాత రాయలసీమలోని కర్నూలు మండలంలో నంద్యాలకు దగ్గరగాఉన్న 'కృష్ణరాయ సముద్రం' (పెదకానాల) అనే అగ్రహారానికి తరలివచ్చినట్లు తెలుస్తోంది. ఈ ప్రబంధాన్ని ఈయన నంద్యాల కృష్ణభూపతికి అంకితంచేశాడు. ఈయన చాలా గ్రంథాలు వ్రాసినట్లు పేర్కొన్నా ప్రస్తుతం మనకు లభ్యమౌతూఉన్నవి మూడే. రాఘవపాండవీయం, కళాపూర్ణోదయం, ప్రభావతీ ప్రద్యుమ్నం. ఇవికాక గరుడపురాణం, గిరిజాకళ్యాణం కేవలం నామమాత్రావశిష్టాలు. రాఘవ పాండవీయం ద్వ్యర్థికావ్యం. కృతిభర్త కాలాన్నిబట్టీ, తక్కినమరికొన్ని ఆధారాలవల్లా 1550 లో రాఘవ పాండవీయం, 1560 లో కళాపూర్ణోదయం, 1570 లో ప్రభావతీ ప్రద్యుమ్నం ఒక ఐదేళ్లు అటూ ఇటుగా వ్రాసిఉండవచ్చని శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు అభిప్రాయపడ్డారు.

కథాసంగ్రహం :

ద్వారకానగరం పేరు అందరికీ తెలిసిందేకదా! శ్రీ కృష్ణుడు పరిపాలిస్తున్న నాటి మాట. ఆ ఊళ్ళో ఒక ప్రముఖనటుని కుమార్తె కలభాషిణి. ఆవిడ అందం –

అబ్బో! భూలోకంపట్టలేనంతగా ఉంది. నగరోద్యానంలో చెలికత్తెలతో ఆమె ఉయ్యాలలూగుతూ ఉంటే అంతరిక్షంలో నారదుడు, ఆయనశిష్యుడు మణికంధరుడూచూచి ఆమె అందాన్ని తెగమెచ్చుకుంటారు. వారిఉద్యానంలో వీరు దిగుతారు. వీరివెనుక రంభానలకూబరులు విమానంలో వెడుతుండగా కలభాషిణి చూస్తుంది. నలకూబరుని చక్కని రూపు ఆమెకు చక్కిలిగింతలు పెడుతుంది. నారదుని కొంతకాలం సేవించి ఆ మునివల్ల కామరూపవిద్యను వరంగా పొందుతుంది.

నలకూబరునిపై విరహంతో ఉన్న కలభాషిణివద్దకు ఒకసారి మణిస్తంభుడనే సిద్ధుడు వస్తాడు. తానామెను నలకూబరుని వద్దకు చేరుస్తానని మోసగించి సింహంపై ఎక్కించుకొని దేవికి బలిఇవ్వబోగా సుముఖాసత్తిఅనే వృద్ధురాలీమెకు అడ్డుపడి తన ప్రాణాలను బలిచేసి ఈమెను రక్షిస్తుంది. దైవాత్తూ మణిస్తంభుడూ, కలభాషిణీ మణికంధరుని తపోభూమిలోకి విసిరివేయబడతారు. ఆ వాతావరణంలో మణిస్తంభుడు కలభాషిణిని బలవంతం చేయబోతే హఠాత్తుగా నలకూబరుడు ప్రత్యక్షమై ఆమెను రక్షిస్తాడు. ఆ నలకూబరుని కికురించి పూర్వం నారదముని ఇచ్చిన వరప్రభావంచేత రంభగామారి అతనితో పొదరింట్లో క్రీడించి వచ్చే టప్పటికి అసలు రంభ ప్రత్యక్షమౌతుంది. 'నేనేరంభ' 'నేనేరంభ'నని ఇద్దరూ తగవులాడుకుంటారు. అసలు రంభ కత్తివేటుతో మరణం పొందుతావని కలభాషిణిని శపిస్తుంది. రంభ, నలకూబరుడూ క్రీడించబోయేలోగా మరో నలకూబరుడు అప్పటికి వస్తాడు. ఇద్దరూ పోరాడినా గెలుపు ఏ ఒక్కరికీ దక్కదు. రంభ యుక్తి వల్ల యథార్థ నలకూబరుడు క్రొత్తగావచ్చిన వ్యక్తేనని గుర్తిస్తుంది. మాయా నలకూబర రూపధారియైన మణికంధరుడు యథార్థ నలకూబరునిచే 'అల్పావశిష్టాయువు'గా శాపంపొందుతాడు. మణికంధరుడు, కలభాషిణి మాయా నలకూబరుడు, మాయా రంభలుగా మారి రతికేళి సలిపినట్లు తెలుసుకొని తమ పరస్పర పూర్వ ప్రణయాన్ని ఆవిష్కరించుకొంటారు. మణికంధరుడు సుగాత్రీ శాలీనుల కథ చెబుతాడు. వారిద్దరూ సమాధానపడతారు. మణికంధరుని కత్తివేటుతో కలభాషిణీ, భృగుపతనంచేత మణికంధరుడూ తమతనువులు చాలిస్తారు. కలభాషిణికి అడ్డుపడి ప్రాణత్యాగం చేసిన సుముఖాసత్తి అనే వృద్ధస్త్రీ దేవిప్రభావం చేత అందమైన యువతిగా మారిపోతుంది. సుముఖాసత్తీ, మణిస్తంభులు పూర్వజన్మలో సుగాత్రిశాలీనులమని గుర్తిస్తారు. కొన్నాళ్లు యోగాభ్యాసంచేసి తీర్థయాత్రలు చేసి ఒక సముద్రతీరంలో మన్మథవశులై క్రీడిస్తారు. విచిత్రంగా మణిస్తంభుడు స్త్రీగానూ, సుముఖాసత్తి పురుషుడుగానూ మారి కొన్నాళ్లు సంసారం చేస్తారు. స్త్రీగామారిన మణిస్తంభునికి పురుషునిగా మారిన సుముఖాసత్తి వల్ల కళాపూర్ణుడు జన్మిస్తాడు.

మదాశయుడనే రాజుకీ అతనిరాణి రూపానుభూతికీ కలభాషిణి మధుర లాలసయై జన్మిస్తుంది. అలఘువ్రతుడనే మలయాళబ్రాహ్మణుడు తనకు మణికంధరుడు భృగుపతనంచేస్తూ ఇచ్చినమణిని ఈ రాజుకు సమర్పిస్తాడు. రెండు నెలలపసిపాపయైన ఈ మధురలాలస మెళ్ళో హారం వేస్తారు. హారాన్ని ధరించడంతోటే విచిత్రంగా ఉయ్యాల్లో ఉన్న శిశువు తనపూర్వజన్మ వృత్తాంతం చెబుతుంది : "నేనుక్రిందటి జన్మకాక అ క్రితంజన్మలో సరస్వతీదేవి పెంపుడు చిలుకను. ఒకనాడు శారదా చతుర్ముఖులు సరస్తీరంలో ప్రణయకేళిలో ఉండగా వారిద్దరికీ ప్రణయకలహం సంభవించింది. ఆమెను ప్రసన్నను చేసికోవడం కోసం ఆయన అక్కడి సన్నివేశాన్నే పాత్రలుగా మలచి కథాకథనం ఆరంభించాడు. కొంతసేపటికి బ్రహ్మ చమత్కారాన్ని సరస్వతి పసికట్టేసింది. సరస్వతి బిగువు సడలి ప్రసన్ను రాలవడంతో బ్రహ్మ ఆమెను చుంబించి దంతక్షతం చేశాడు. అప్పుడామె కంఠంలో నుండి అపూర్వమై మధురమైన మణితస్వరం వెలువడింది. ఆ తర్వాత నేనాస్వరాన్ని సాధన చేసికొంటూ ఉంటే ఒకసారి రంభవచ్చి విని "ఎక్కడనేర్చావని" అడిగింది. నేను బ్రహ్మ అప్పుడు చెప్పిన కళాపూర్ణుని కథతో సహా జరిగిందంతా చెప్పాను. ఇంతలో సరస్వతి అక్కడకువచ్చి తనరహస్యాన్ని బయటపెట్టినందుకు నాపై ఆగ్రహించి 'భూలోకంలో లంజవైపుట్టమని నన్ను శపించింది. అప్పుడే బ్రహ్మదేవుడు వచ్చి "మరుసటి జన్మలో మధురలాలసవై కళాపూర్ణుని రాణివౌతావని" నన్ను ఊరడించాడు."ఇంకా ఆ కలవరింతలేనా?" అని సరస్వతి అంటే బ్రహ్మ "కళాపూర్ణుని కథ నిజంగా జరుగుతుంది. ఈ కథ చెప్పినవారూ, విన్నవారూ పుత్రపౌత్రాభి వృద్ధిని పొంది భూలోకంలో సుఖిస్తార" న్నాడు. నేను గతజన్మలో కలభాషిణినైపుట్టాను. అంతా బ్రహ్మ చెప్పినట్లే జరిగిందని" అక్కడ ఉన్న వారి పూర్వకథలన్నీ చెప్పి ఆశ్చర్యపరుస్తుంది. కాలక్రమంలో కళాపూర్ణుడు అభినవకౌముదీ, మధురలాలసలను వివాహమాడి, జైత్రయాత్రచేసి ధర్మపథంలో రాజ్యపాలన సాగిస్తాడు. స్థూలప్రాతిక్లుప్తంగా ఇదీకథ.

వస్తుతత్త్వం :

కళాపూర్ణోదయం ప్రప్రథమ స్వతంత్రాంధ్ర శృంగార ప్రబంధం. శృంగా ప్రబంధం అనడం కంటె 'శృంగార విజ్ఞాన సర్వస్వం' అనడం మంచి శృంగారంలో ఎన్నెన్ని పోకడలు పోవచ్చునో గాఢంగా, గూఢంగా తరచి ఆవి రించాడు కవి. సాధారణంగా తెలుగుకవులు వ్రాసిన కావ్యాలన్నిటికీ సంస్కృతం ఎక్కడో అక్కడ మూలకథ అంటూ ఉంది. కళాపూర్ణోదయానికి మూల ఎక్కడాలేదు. అంతా కల్పన చేసిందే. కవిమాటల్లో చెప్పాలంటే 'నిర్నిద్ర సా లీలా చిత్రమై'న ఈ కావ్యం ప్రధానంగా 'అత్యపూర్వ కథా సంవిధానపై

మహనీయత,' 'శృంగారప్రాయత,' 'పుణ్యవస్తు వర్ణనాకర్ణనీయత' అనే మూడు లక్షణాలతో ఒప్పుతోంది.

పాత్రచిత్రణ :

పాత్రచిత్రణలో పింగళి సూరన ప్రతిభ నాఉన్యతో దర్శనీయం. స్వతంత్ర మైనకథలో పాత్రలూ స్వతంత్రాలే అవుతాయి కనుక ఆ పాత్రలను తీర్చిదిద్దడం మరింతక్లేశంతో కూడుకున్నపని. దానిని అత్యంత సమర్థతతో నిర్వహించాడు. అందునా స్త్రీపాత్ర చిత్రణలో అతనికతడే సాటి. పాత్రల మనస్తత్వాన్ని ముందు నిర్దేశించుకొని దానికి తగిన బాహ్యస్వరూపం, తదను రూపమైన వారి మాటల చాతుర్యం ఎక్కడికక్కడే మనల్ని మంత్రముగ్ధులను చేసే విధంగా రూపొందించాడు. పాత్రలన్నిటినీ తగు పాళ్లలోనే తీర్చినా కథానాయిక, కథా నాయకుల పాత్రలను సర్వాంగ సుందరంగా చేసి అందులోనూ ప్రాధాన్యాన్ని ప్రదర్శించాడు కవి. కలభాషిణి సౌందర్యాన్ని ఆమె సంభాషణ కంటె ముందే మనకళ్లకు రూపుకట్టించి ఆమెనుండి మంచిమాట నేర్పరితనాన్ని మనం ఆశించే టట్లు చేయడం కవి నేర్పరితనానికో నిదర్శనం :

> "కూఁకటి వేణితోఁ గురులు గూడకమున్న, కుచ ప్రరోహముల్
> పోఁకలతోడి సామ్యమును బొందకమున్న, నితంబ సీమకున్
> వేఁకఁదనంబొకింత ప్రభవింపకమున్న, ప్రసూనబాణుఁడ
> ట్టాఁకలఁబెట్టెఁ, దానరవ నామెత బాలికకై విటాపళిన్" [1–27]

ఇలా ఆమె బాహ్యస్వరూపం తెలిపి ప్రకృతిశోభకు పరవశమయ్యే ఆమె అంతః ప్రవృత్తిని ఒక సీసపద్యంలో (1–35) చెబుతాడు. ఆమె వేశ్యాకులంలో పుట్టింది కనుక సర్వాభిలషణీయ ! మాటనేర్పరితనంలో ఆమె మహా గడుసు. రంభ గర్వపు మాటలు నారదునికి ఆమెపట్ల వైమనస్యాన్ని కలిగించినట్లు కనిపెట్టిన కలభాషిణి "దేవుడు మేలుచేస్తే ఆ రంభకు నువ్వు సవతివి కాలేవా ?" అని నారదుడు అడిగి నప్పుడు "అంతటిరూప శ్రీవైభవ వతికిఁగాక సిద్ధించునె, మాబోంట్ల" (1–75) ´డం "రంభమొదలైన యే యచ్చరలకునైనఁ దక్కనే నీదురూప సౌందర్య ాామ" (1–76) అని నారదునిచేత అనిపించుకోవడానికే.

సిద్ధుడు వెళ్ళివస్తానన్నప్పుడు "మహాత్మ ! నిన్ను నా పాలిభాగ్యదేవతగ నమ్మియుంటి నాజీవితంబు నేమిగాఁజేసిపోయెద" వని (3–59) అనడంలో ఎదుటివారి మనసు కరిగించేటట్లు మాట్లాడే స్త్రీలనేర్పు మనకు గోచరిస్తుంది. తాను బలిపశువు కాబోతున్నానని గ్రహించినప్పటి కలభాషిణి మనస్సులోని ఆలోచనలను అత్యంత సహజంగా చెబుతాడు కవి (3–98). పౌరుషం వృథాయై నప్పుడు దైవంమీద భారంవేసి నిబ్బరంగా ఉన్న ఆమె చిత్తవృత్తి సుముఖాసత్తి

ప్రశంస (3-111)కు పాత్రమౌతుంది. నలకూబరుని దర్శనమైన తర్వాత అతనితో సుఖించడానికి ఏ మాత్రం సమయాన్ని వ్యర్థంకానివ్వక అతడెక్కడ మణిస్తంభునితో పోరాడుతూ కూర్చుంటాడోనని అతని అనంగ క్రీడకై ప్రేరేపించడానికి "మణిస్తంభునితో మనకెందుకులే పోనిమ్మ"ని

> "........గడుదవ్వగాఁ గుచ స్తబక మొకటి
> వరుని భుజముతో నొరయ నవ్వలి తదంస
> భాగమునఁ దనకోమలపాణిఁ జేర్చి
> యను పదంబును రోమాంచితాంగి యగుచు" [3-175]

అతణ్ణి ఆవలికి తీసికెళ్ళింది! సత్యరంభ దేవలోకంలో తగవు తీర్చుకుందాం రమ్మన్నప్పుడు "ఈ పిశాచిని నాకు సరిచేసికొని దేవసభకు వాదులాటకు ఎలా బయలుదేరుతా" ననడంలో స్త్రీ స్వభావం, స్త్రీజనోచితమైన ఈర్ష్య అత్యంత సహజంగా పొడుచుకువచ్చేటట్లు చిత్రిస్తాడు కవి. తాను క్రీడించింది నలకూబరుని ఆకారంలో ఉన్న మణికంధరునితోనని తెలిసికొన్నప్పుడు "కృతార్థనైతిఁ గుటిలాత్మకుఁడెవ్వఁడు నన్నునట్లు వంచనమునఁగూడెనోయను విచారము వాసెను" (4-18) అని మణికంధరునితో అతనిపై తన పూర్వప్రేమ తీరును వాపోయిన విధం (4-18-25) భావి భర్తనుగురించి ఎన్నో ఆశాసౌధాలు నిర్మించుకొని చివరకు పరిస్థితుల్లో రాజీపడి కలిగినభర్తతోనే కాపురంచేసే సగటు భారతీయస్త్రీకి సార్వకాలికంగా అన్వయిస్తుందేమో ననిపిస్తుంది.

మణిస్తంభుని పాత్రకూడా మరోమణిశిలాకే. దేవ్యాలయంలో శాసనంచూసి దూరదృష్టి, దూరశ్రవణశక్తుల్ని సాధించిన మహాసాహసి ఇతడు. గానవిద్యా విశారదయైన వేశ్యనుబలియిస్తే మహారాజుకాపచ్చుననే ఆశతో కలభాషిణిని వంచించడానికివచ్చిన సిద్ధుడితడు. వస్తూనే భూత భవిష్యద్వర్తమానాలెఱిగిన వానిలా కలభాషిణిని కుశలప్రశ్నలడగడం ఎంతో పాత్రోచితంగా ఉంది. "దేవుడవా లేక యోగసిద్ధుడవా?" అని కలభాషిణిని రిచ్చవోయేట్లు చేస్తుంది అతనితీరు. తాను చెప్పినవిషయాలకు చిలుకచేత సాక్ష్యం చెప్పించి కలభాషిణిచేత బలవంతంగా పరీక్షచేయించి తనపై దృఢమైన నమ్మకాన్ని కలుగజేస్తాడు. మణికంధరుని తపస్సేమైందని కలభాషిణి అడిగినప్పుడు "ఇంకేం తపస్సమ్మా! రంభతో చిగురు పొదరింట్లో చిత్తజలీలలో ఉన్నా"డనటం ఆమె బలహీనతపై దెబ్బకొట్టడానికే! కలభాషిణి తనను ఎలాగైనా నలకూబరుని వద్దకు చేర్చుమన్నప్పుడు "నిన్ను సింహంమీద నావెనక ఎక్కించుకు తీసికెడితే తోటి సిద్ధులేమనుకుంటారు? నన్ను స్పృశించకుండా కూర్చోవాలిసుమా! నీవంటివారి స్పర్శకూడా మాబోంట్లకు తగనిపని" అని హెచ్చరించడంలో కవి తీసికొన్న సూక్ష్మాతి సూక్ష్మమైన జాగ్రత్త పాఠకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది.

సింహం కదలక మొరాయించినప్పుడు దాన్ని అదిలించిన తీరుకి ఒక సీస పద్యమే కేటాయిస్తాడు కవి (3-84). దేవిమహిమవల్ల కలభాషిణీ సిద్ధులు 'మెత్తని క్రొత్తలిరుఁబాన్పు మీఁద' పడ్డప్పుడు 'భయంతో మ్రాన్పడి' 'శరీరం గడగడ వడకగా' తెల్లబోయిన ముఖంతో, చకిత నేత్రాలతో 'చెమర్చిన లేఁజెక్కులనంటెడు విగళత్కచాళితో' 'వలిగుబ్బపాలిండ్ల నిలువకిట్టట్టు సంక్షోభించే పయ్యెదతో' నున్న కలభాషిణి రూపు సిద్ధునిలో మన్మథోద్రేకాన్ని రేకెత్తించడం, అట్టిస్థితిలో నున్న ఆమెను 'పరిరంభంబును గావించితినేఁజేసిన పాపముఁజెప్పవలయు'నని (3-155) అతడే చెప్పటం మణిస్తంభుని అంతఃప్రవృత్తికి దర్పణం. ఇది నిజంగా ఒక విలక్షణ శృంగారప్రకృతిని తీర్చిదిద్దడంలో కవిచూపిన నేర్పుకు నికషోపలం. ఇతడు శాలీనుడుగా నున్నప్పుడు తనభార్య సుగాత్రి సలక్షణంగా సర్వాభరణ భూషితయై శోభనంగదిలో ప్రవేశించినప్పుడు ఎట్టి వికారాన్నీ పొందక, ఆమె నిరస్తభూషయై తోటపనులు చేస్తున్నప్పుడు ఆమెను చెంతకుచేర్చి సుఖించడం, మణిస్తంభుడై తనభార్య నూత్నయౌవ్వనాన్ని పొందినప్పుడుకూడా చలించక జితేంద్రియుడై ఆమెతో యోగాభ్యాసంచేసి సముద్రంచూసి ఆ సన్నివేశానికి సంచలనంపొంది సుముఖాసత్తితో ప్రణయకేళికి ఉద్యుక్తుడవడమే కాకుండా తాను స్త్రీగా మారి, పురుషునిగా మారిన సుముఖాసత్తివల్ల సుఖపరమావధిని పొంది కుమారునికూడా కనడం నిస్సంశయంగా ఒక మహోద్వేగ విలక్షణ శృంగార ప్రకృతిని చిత్రించడంలో కవికిగల అసాధారణ ప్రజ్ఞకు నిదర్శనం.

వర్ణనలు :

సాధారణంగా కవిచాతుర్యాన్ని చర్చించేటప్పుడు ఆయనచేసిన వర్ణనలను సమీక్షించడం పరిపాటి. వర్ణన వర్ణనకోసమే కాకుండా దాంతో పాత్రల స్వభావాన్ని తెలపడంలో సూరనార్యుని ప్రతిభ అమోఘమైంది. సామాన్యంగా కవులంతా యౌవనవతులైన స్త్రీలను వర్ణించడంలో తమ నేర్పునంతా ప్రదర్శిస్తూ ఉంటారు. పెద్దనగారు పూర్ణయౌవనుడైన పురుషుని (ప్రవరాఖ్యుడు) వర్ణించి ప్రఖ్యాతిని పొందితే సూరన వృద్ధస్త్రీ వర్ణనకూడాచేసి విలక్షణతను సాధించాడు :

"పసిమి పో నెండిన కసవుబుట్టయుఁబోలె
　　　నరవెండ్రుకలు పర్వు శిరమువలన
నులిగొన్న చెలఁది పుర్వుల సూలిపళ్లనా
　　　నమరెడు ముడుత కన్బొమలవలనఁ
కడుఁజిట్టినట్టి బంగరుపూఁత పొక్కిళ్ల
　　　పడుపుచూపెడి మేని వళులవలనఁ
దునిసి వ్రేలెడు మ్రాఁకు తునుకలఁదలఁపించు
　　　బాహువక్షోజలంబనము వలన

ఘూక రవముల చొప్పున ఘోరవృత్తిఁ
దనరుఘనకాన కుహిక్కుహి ధ్వనులవలన
భావజుఁడు వెళ్ళిపోయిన పాడుమేడ
పగిదిఁగాన్పించు ముదుసలి పడఁతియొకతె" [3-89]

ఈయన వర్షవర్ణన ప్రసిద్ధమైంది. పెద్దవర్షం కురిసినప్పుడయ్యే శబ్దాన్ని పద్యంలో పొదిగిన పదవిన్యాసంలో చూపెట్టడం ఇందులోని సొగసు :

"మిగుల జగంబు బెగ్గడిలమించెఁదదుద్ధతవృష్టి యద్భుతం
బగుచు ఘనాఘనౌఘ సముదగ్ర నిరర్గళ ఘర్ఘరార్భటీ
లగన ఘనోచ్ఛలజ్జల ఝుళంఝుళ నిర్ఝర జర్ఝరీభవ
న్నగ విగళచ్ఛిలాగణ ఘణంఘణ ఘోషణ భీషణంబుగన్"
[4-88]

ద్వితీయాశ్వాసంలోని మణికంధరుని తీర్థయాత్రావర్ణనలో (2-119-162) దక్షిణభారతదేశంలోని పుణ్యస్థలాలను ప్రదర్శిస్తాడు కవి. స్వభావసిద్ధుని వృత్తాంత వర్ణనలో(5–142–181) యోగవిద్యా రహస్యాలన్నీ మనకు ఉపదేశిస్తాడు. మధురలాలస, కళాపూర్ణుల కళ్యాణ వర్ణనలో(7–57–103) ఆనాటి తెలుగువారి ఆచారవ్యవహారాలన్నీ హృద్యంగా చిత్రిస్తాడు. సత్త్వదాత్ముని రాజనీతి వర్ణనలో ప్రభువులు పాటించవలసిన విధులను చక్కగా చెబుతాడు (7–254–274). ఇంకా అష్టమాశ్వాసంలో సాయంకాల చంద్రోదయ వర్ణనలు (8–18) ఎంతో స్పృహణీయమైనవి. తెలుగువారి వంటకాలను

"కలవంటకములు బూరెలు తేనెతొనలు చా
పట్లు మండెం గలొబ్బట్లు వడలు…" [7–82]

ఇత్యాది సీసపద్యంలో వండి వార్చి మనకు విందు చేస్తాడు. రంభను చూచినప్పుడు తపోనిష్ఠలోనున్న మణికంధరునిలో చెలరేగిన సంఘర్షణను మూర్తికట్టించడం మానసిక పరిశీలనలో సూరనయొక్క మహాఘనతను చాటుతుంది :

"కొమ్మ బెడంగు సొంపుఁ గనుఁగొన్న కనుంగవ తత్తరింపఁగా
నమ్ముని యోఁప నోప కవుడల్లన ఱెప్పలు విచ్చుఁ గ్రమ్మఱం
గ్రమ్మఱఁ గృష్ణకృష్ణయని గ్రక్కునమోడ్చు మగుడ్చుఁ గ్రమ్మఱం
గ్రమ్మఱ మూయు మన్మథ వికారము ధైర్యము గ్రుమ్ములాడఁగన్"
[3–21]

విమానయానం చేస్తూ ఒకేపాత్రలోని మధువును గ్రోలి మత్తులైన స్త్రీపురుషుల విలాస కేళిని ఆరో అశ్వాసంలో మనోజ్ఞంగా వర్ణిస్తాడు(111–123). మోవులు

నంజుకొంటూ మధుపానం చేశారట! మధుపానంతో నిషా యెక్కిన వనిత పానపాత్రలో తన నీడనుచూచి పరవనితగా భావించి తనపురుషునితో "ఓరి! పరమానిని పానసహాయ యయ్యెనే? యింతటిలోన నీకు నిది యెవ్వతె?" [6-129] అంటూ అలిగి త్రాగడం మానివేసిందట! "ఋగ్వేద ఘోష సమృద్ధి పెంపొకచోట - ఒకచోట యాజుషాభ్యుదయ మహిమ" (4-41) అనే పద్యంలో ఆనాటి గురుకుల సౌభాగ్యాన్ని కళ్లకు కట్టినట్లు వర్ణిస్తాడు.

రసం :

ఇక రసవిషయానికి వస్తే కళాపూర్ణోదయం శృంగార రస ప్రధానమైన ప్రబంధం. అయితే ఎక్కడా ఔచిత్యభంగం కానీయకుండా ఈ రసపోషణ చేయడం నిజంగా కత్తిమీద సామువంటిది. దాన్ని అత్యంత ప్రతిభావంతంగా నిర్వహించాడు పింగళిసూరన. అనేక రకాల శృంగారాల్ని ఆయన వర్ణించినా తత్తత్పాత్రానుగుణంగానే రసపోషణ చేశాడు. ముఖ్యంగా మూడుజంటల శృంగారం మనకిందులో గోచరిస్తుంది. శారదా చతుర్ముఖులు, కలభాషిణీ మణికంధరులు, సుగాత్రీ శాలీనులు. ఈమూడూ మూడు విలక్షణమైన ప్రకృతులే. శారదాచతుర్ముఖుల శృంగారం దేవతా సంబంధి అయితే కలభాషిణీ మణికంధరులది గాంధర్వ శృంగారం అవుతోంది. సుగాత్రీ శాలీనులది ఆర్షసంబంధి. ఇంకా రాక్షస కామానికికూడా ఇందులో తావుంది. అవతలస్త్రీ తనపట్ల అనురక్త అయి ఉందా లేదా అనే విచక్షణైనాలేకుండా వారిదృష్టిని తమపై ఆకర్షించుకోవడానికి అవస్థలుపడే కాపురుషుల నీచశృంగారంకూడా ఇందులో చోటుచేసికొంది.

దేవతా శృంగారం సృష్టి విలసనానికి తోడైంది. గాంధర్వ ప్రణయం మునిశాపభయానికో, సాంఘిక కట్టుబాట్లకో ఒదిగిఉందేకాని నిర్మూలనం కాలేదు. ఈవిధంగా నిగృహీతమైన ప్రణయావేగంలోఉండే గాఢత లోకాన్నికికురించి తృటిలో ఆజన్మలో ఫలాన్నిపొందినా మరుజన్మలో సమగ్రమైన ఆనందానుభూతి అవధులను చూసింది. ఆర్షశృంగారం 'ప్రజాయై గృహమేధినామ్' అన్నట్లు సంతానంలో పరిణమించింది.

శైలి :

సూరన తనకంటె ప్రాచీనులను కొంతమందిని దృష్టిలో పెట్టుకొని వ్రాసినా వారి అనుకరణను తగుమాత్రంగానే చేసి తనదైన ఒక విశిష్టశైలిని ఏర్పఱచు కున్నాడు. ఆయన పద్యాల్లో 'ఉదధి సమేత పీతోద్వాంత బాడబ – జ్వాలాయితోగ్ర శంపాలతంబు' (4–89); 'పదవర్ణ సౌష్ఠవ ప్రకటనం బెంతయు – నింపు మీఱంగు రువ్విచ్చియిచ్చి' (4–42); 'తోరంపు జనుదోయి త్రుళ్ళింతలనిడంగఁ దగుచోట్ల గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి' (4–99); 'సమయ వ్యతిక్రమ సంకాశ సంరంభ — జాగ్రదుద్ధత సర్వజన చయంబు' (8–29)—ఇత్యాది సీసపద్యాలు ఆయన

ప్రౌఢరచనకీ, వృత్తాల్లో 'నీసౌందర్య విలాస భాసుర తనూ నిర్ణిద్ర సౌభాగ్యమున్' (4–19), 'గంభీర హృదయమున్వడి న్వెడలి యాకాశంబునం బాఱు'(4–157), 'అనిశము నీదు యౌవన శుభాకృతిఁ గౌఁగిటఁ జేర్చువేడుకం'(–166), "గంధర్వుం డవు జాతి యెంచఁగ శుభాకారంబు చంద్రద్రుత పా'(4–173), 'బాలికతో వనీరతుల భాసిలు తేనికిఁ గుంకుమాంక' (7–185)—ఇత్యాది పద్యాలు ఆయన ధారాశుద్ధికీ నిదర్శనాలై సూరన ప్రతిష్ఠామూలస్తంభాలవుతున్నాయి. పోతన పోకడులు ఈయన కవిత్వంలో అక్కడక్కడ గోచరిస్తాయి :

"ధీరుఁడు శూరుఁడక్షయ వితీర్ణి విహారుఁడు బంధులోక మం
దారుఁడు నీతిమార్గ సముదారుఁడు లోకపవిత్రకీర్తి వి
స్తారుఁడు దోషదూరుఁడు నితాంతగభీరుఁడు నిత్యశోభ నా
కారుఁడు ధర్మసారుఁడ వికారుఁడు తజ్జనపాలుడయ్యెడన్" [8–258]

అలాగే 'అంజనా చల గర్వభంజనా చలలీల–నీలివర్ణపు మేని డాలు దనరఁ' (2–98), 'హుంకారములతోడ నుచ్చాటనపు వద–నిక తీఁగతఅటునన్ వ్రేసివ్రేసి' (3–84) — ఇత్యాది పద్యాల్లో శ్రీనాథ తెనాలిరామకృష్ణులూ 'ఆవీణాధరు డేగి కన్గొనియెఁ బుణ్యఖ్యాతి దర్పోల్లస'(2–144),'అలరుచుఁ గాంచె ముందటనహమ్మతి నిర్మథన ప్రవీణమున్' (2–155)—ఇత్యాది పద్యాల్లో పెద్దనగారూ స్ఫురణకు వస్తారు. కాగా—'క్రొన్న నల్వల రాచ మన్ననల్ గనఁగర–మల్లికల్గొని యున్న మల్లికలును' (1–35)—ఇత్యాది పద్యాల్లోని శైలిని "కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము"లని సూరనను ఈసడించిన రామరాజభూషణుడే తన వసు చరిత్రలో సమృద్ధిగా అనుకరించాడు.

**ఆత్మీయత :**

పింగళిసూరన పూర్వం లలాటేక్షణ భక్తిశీలుడు. ఇందులో కనిపించే వైష్ణవం తెచ్చుకొన్న వైష్ణవమే! ఈయనకు కవిత్వంపట్ల ఉన్న కొన్ని నిర్దిష్టమైన భావాలు :

'పొసగ ముత్తెపు సరుల్పోహణించిన లీల
దమలోన దొరయు శబ్దములు గూర్చి'

(1–82) అనే సీసపద్యంలో స్పష్టమౌతాయి. 'కొందఱం గడకంటి చూపులఁ గొందఱన్ నెఱచూడ్కులం' (2–8) — ఇత్యాది వింత కులుకులు పోయే మత్తకోకిల పద్యంలో నమస్కరించిన తీరునుబట్టి వారి నాదరించాలనే అతని లోకజ్ఞత వెల్లడౌతుంది. 'ఘట మంచు పటమంచుఁ గాఱుయుక్తుల నెంచుదుష్టతార్కి కులకు దూరమగుచు' (8–225) — ఇత్యాది సీసపద్యంలో ఆయన సుకుమారమైన హాస్యప్రవృత్తీ, వ్యంగ్యధోరణీ వ్యక్తమౌ తాయి. 'మాయమ్మాన

సునీవే' (6–161) అనే కందపద్యం పదవిభాగం మారిస్తే సంస్కృతశ్లోకం కావడం, 'తావినువారికి సరవిగ' (6–172) అనే కందపద్యం తిరగేసి చదివితే సంస్కృతశ్లోకంకావడం ఆయన చిత్రకవితా ప్రియత్వానికి మచ్చుతునకలు.

చివరగా ఓమాట! ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం అనే మూడుగుణాలూ సమృద్ధిగా ఉన్నవాడు సూరన. అన్నిటినీ మించి కవి తనకావ్యంలో ప్రధానంగా పాటించవలసింది ఔచిత్యం. ఈ ఔచిత్య రహస్యం ఎఱిగినవారు ఏభాషాకవుల్లో నైనా కొద్దిమందేఉంటారు. అట్టి రహస్యవేత్తలలో సూరన ఒకడని నిరాక్షేపణీయంగా చెప్పుకోవచ్చు. ఈ ఔచిత్య మర్మజ్ఞతే సూరనను మహాకవిగా చేస్తోంది. దీనివల్లనే కళాపూర్ణోదయం మహాప్రబంధంగా ప్రతిష్ఠ నార్జించుకొంది.

## కొన్ని పదాలకు అర్థాలు

ప్రేఁక = అతిశయము
ఆమెత = విందు
అట్టొఁక = ఒత్తిడి
వడువు = విధము
పొక్కిలి = బొడ్డు
కానము = దగ్గు
బెగ్గడిలు = భయపడు
ఉద్ధత = గర్వించిన
వృష్టి = వాన
ఘనాఘనము = మేఘము
ఓఘము = సమూహము
ఉదగ్రము = భయంకరము
నిరర్గళ = అడ్డములేని
ఘర్ఘరార్భటి = ఘర్ఘరధ్వని
నిర్ఝరము = సెలయేఱు
కొమ్మ = స్త్రీ
బెడఁగు = అందము
మగుడ్చు = మరల్చు
వితీర్ణి = వితరణము
మందారుడు = కల్పవృక్షమువంటివాడు
నితాంతము = అధికము.

## ఆధార గ్రంథాలు

1. కళాపూర్ణోదయం — శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు పరిష్కరించినది 1957
2. ,, — శ్రీ వావిళ్లవారి ప్రతి 1968
3. ,, — ఎమెస్కో ప్రచురణ 1971
4. తెలుగు విజ్ఞాన సర్వస్వం — శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారి వ్యాసం.

# ప్రభావతీప్రద్యుమ్నము—పింగళిసూరన

సమీక్ష : కుమారి కందాళ వెంకటరమణ, ఎం.ఏ.

[జన్మస్థలం – పేరూరు అగ్రహారం, అమలాపురం తాలూకా, తూ.గో.జిల్లా. జననం – 8–9–1952. ఎం.ఏ. [తెలుగు]. సీనియర్ పోస్టుగ్రాడ్యుయేటు డిప్లొమా [సంస్కృతం]. జూనియర్ రిసెర్చి అసిస్టెంటు, తెలుగు వ్యుత్పత్తి కోశ పథకం, తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు. 'తెలుగురాజు' గారి కృతులపై విమర్శనాత్మక పరిశీలన అన్న అంశంపై పిహెచ్.డి. పట్టానికి పరిశోధన చేస్తున్నారు.]

కవిజీవితాదులు :

ప్రాచీనాంధ్ర ప్రబంధ రచనా కాలంలో అపూర్వ కథాకల్పనతో ప్రభావతీ ప్రద్యుమ్న శ్రవ్యకావ్యాన్ని తెలుగు సాహిత్యంలో ప్రథమంగా నాటకలక్షణో పేతంగా వెలయించిన మహాకవి పింగళిసూరన. 'పింగళి' వారి కుటుంబమే విద్వ త్కుటుంబము. వీరివంశానికి మూలపురుషుడుగా ప్రసిద్ధుడైన గోకనామాత్యుడు 'నందకస్తవ' మనే కృతిని రచించెనట. సూరన తండ్రి అమరనామాత్యుడు. తల్లి అబ్బమాంబిక. తాత సూరయామాత్యుడు.

కృష్ణదేవరాయల అష్టదిగ్గజాలలో పింగళి సూరన కూడా ఉన్నాడని ప్రతీతి. క్రీ. శ. 1530 నాటికే రాయలు దివంగతుడయ్యాడు. అప్పటికి సూరన పిన్న వయసువాడై యుండును. క్రీ.శ. 1545 ప్రాంతంలో ఆకువీటి పురప్రభువగు పెదవేంకటాద్రి ప్రేరణచే శ్రీ విరూపాక్ష స్వామికి రాఘవ పాండవీయాన్ని కృతి ఇచ్చినట్లు ఉంది. కాబట్టి అతని ప్రాపున ఉన్నట్లు స్పష్టమౌతోంది. కళాపూర్ణో దయాన్ని నంద్యాల సంస్థానాధిపతి యగు కృష్ణరాజుకి అంకితం చేశాడు. ప్రభా వతీ ప్రద్యుమ్నాన్ని తండ్రియగు అమరనామాత్యున కంకితం చేశాడు.

పింగళి సూరన పూర్వులు కృష్ణామండలం లోని 'పెంగళి' అనే గ్రామంలో ఉండేవారు. మహారాష్ట్రలో 'పింగళి' అనే గ్రామం ఉందని, బహుశ సూరన కుటుంబానికాగ్రామం ఉనికిపట్టు కావచ్చునని శ్రీ ఆరుద్ర గారి అభిప్రాయం. సూరన, వారి కుటుంబం వారు 'గౌతమీ పరిసరము,' 'కృష్ణకెలంకులు,' 'పలనాడు,' 'పాకనాడు' లలో ఉన్నారని చెప్పాడు. తన గ్రామానికి 'ఇట' అని మాత్రమే చెప్పటం చేత నివాస గ్రామం తెలియటం లేదు.

కృతులు :

ఈ మహాకవి గరుడ పురాణం, గిరిజా కళ్యాణం, రాఘవ పాండవీయం, కళాపూర్ణోదయం, ప్రభావతీప్రద్యుమ్నం అనే కృతుల్ని రచించాడు. వానిలో గరుడపురాణం, గిరిజా కళ్యాణం లభించటం లేదు. రాఘవ పాండవీయం రామాయణ భారతార్థాలు రెండునూ వచ్చునట్లుతడు, నాల్గాశ్వాసాల ద్వ్యర్థి కావ్యంగా రచించాడు. కళాపూర్ణోదయం అద్భుత కల్పనలతో ఎనిమిదాశ్వాసాల మహాకావ్యం. పెద్దన మనుచరిత్రలో మూడు తరాల కథ చెప్పగా, ఈతడు మూడు జన్మల కథను ముడిపెట్టి ప్రబంధాన్ని నిర్మించాడు. ప్రభావతీ ప్రద్యుమ్నం కవి పరిణతికి దర్పణం పడుతుంది.

కథాసంగ్రహం :

ప్రభావతీప్రద్యుమ్న కథ : శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుని, వజ్రనాభ తనూజ ప్రభావతిని గూర్చిన కథ. రాక్షసరాజగు వజ్రనాభుని వధించటం చేత దేవకార్యం. బ్రహ్మవర ప్రసాద గర్వితుడగు వజ్రనాభుడు స్వర్గం పై దండెత్తి ఇంద్రుని అగచాట్ల పాలు చేశాడు. ఇంద్రుడు బృహస్పతితో ఆలోచించి తమతండ్రియైన కశ్యపుని సలహా అడుగుదామని చెప్పి, అప్పటికి అతనిని శాంతింపచేసి, భూలోకంలో ద్వారకానగరంలో కృష్ణుడై జన్మించిన విష్ణువుకి తన మొర విన్పిస్తాడు. కృష్ణుడు, తనతండ్రియైన వసుదేవుడు యజ్ఞం చేస్తున్నాడని, తదనంతరం ఆలోచించ వచ్చునని చెప్పి, స్వర్గానికి పంపుతాడు. యజ్ఞసమయంలో జరిగిన వినోదంలో భద్రుడనే నటుని పటువులు అల్లరి చేసే సందర్భంలో కృష్ణునకు వజ్రపురం ప్రవేశించే మార్గం మెరుపులా స్ఫురిస్తుంది. ఇంద్రునకా విషయం చెప్పగా అతడు వజ్రనాభపురం కోనేరుల్లో విహరించే హంసల్ని రావిస్తాడు. అందు శుచిముఖి అనే హంస తాను వజ్రపురం చూచితినని, ప్రభావతికి పార్వతీదేవి కలలో ఒక చిత్రఫలకం ఇచ్చినదని, అందలి ప్రతికృతి యగు ప్రద్యుమ్నుని సౌందర్యాతిశయాన్ని ఇంద్రునకు చెబుతుంది. ఇది ప్రథమాశ్వాసం.

ఇంద్రుడు శుచిముఖి పాండిత్యానికి అబ్బురపడి నీవెవ్వరి దానవని ప్రశ్నింపగా వాణిచేత పెంచబడిన దాననని చెబుతుంది. ఇంద్రుని ఆజ్ఞపై ద్వారకలో కృష్ణుని సందర్శించి విషయం వివరించి వజ్రపురానికి పోయేదారిలో ప్రద్యుమ్నుని కాంచి, అతనికి వజ్రనాభ వధకై ఇంద్రోపేంద్రుల పన్నుగడల్ని, ప్రభావతీ సౌందర్యాన్ని, సరస్వతి తననుమెచ్చి ఇచ్చిన బిరుదు పెండెరాన్ని గూర్చి చెప్పి, వజ్రపురానికి ప్రయాణ మవటం; ప్రద్యుమ్నుడు ప్రభావతీ సౌందర్యాన్ని విని ముగ్ధుడవటం ద్వితీయాశ్వాస కథ.

ప్రద్యుమ్నుడు ప్రభావతి యందను రక్తుడవటం, అటుగా పోవుచున్న చిలుక అతని బాధను చూచి ప్రణయలేఖను కొనిపోవటం, ప్రభావతి వనవిహార సమయంలో

శుచిముఖి ప్రద్యుమ్నుని గూర్చి చెప్పడం, ప్రభావతి మోదమంది శుచిముఖితో స్నేహం నెరపి, తన విరహాన్ని తెలపటం, చిలుక వలలో తగులుకోవటం చేత ప్రభావతికి ప్రణయలేఖ లభించడం, శుచిముఖి చిలుకను వెంటాడగా అది ప్రద్యుమ్నుని దైన్య స్థితిని చెప్పటం తృతీయాశ్వాస కథ.

చిలుక ప్రణయలేఖను తెచ్చుటను చెప్పగా శుచిముఖి, చంద్రవతీ గుణవతుల విషయం చెప్పించి, వారినికలిసి వారికి సహాయం చేస్తానని చెబుతుంది. వజ్ర నాభుని పరిచయం ప్రభావతి ద్వారా కల్గించుకొని, భద్రుని గూర్చి చెప్పి, అతని ఆనతిపై ద్వారక కరిగి కృష్ణునకు వివరించి ప్రద్యుమ్న, గద, సాంబులను నటుల వేషాలలో వజ్రపురానికి రప్పిస్తుంది. వారు నాటకాలతో వజ్రపుర ప్రజల్ని మెప్పిస్తూ వీలుచూసుకొని ప్రద్యుమ్నుడు ప్రభావతిని కలియుదునని చెప్పగా, ఆమె తహతహ లాడటం వర్ణించటంతో చతుర్థాశ్వాసం ముగుస్తుంది.

భ్రమర రూపంలో ప్రద్యుమ్నుడు ప్రభావతిని చేరి, నిజరూపం ధరించి గాంధర్వ పద్ధతిలో ఆమెను పెండ్లి ఆడటం, వారి శృంగారం, ప్రద్యుమ్నుని సహాయంతో చంద్రవతీ గుణవతులు, గద సాంబులను పొంది సుఖించటం కలదు. వారు ఇష్టకేళి నుండ ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రణయ కలహం, కుమారా భ్యుదయం చెప్పబడ్డాయి. వారు పుట్టుకతోనే యువకులై సంచరి స్తూండటం చేత ఒకనాడు వజ్రనాభ భటులు వారిని చూడటం, వజ్రనాభునితో వారు యుద్ధ మొనరించటం, వజ్రనాభుని వధించటంతో ప్రబంధం ముగుస్తుంది. శ్రీకృష్ణుడు కొడుకుల్ని, కోడళ్ళని, తమ్ముని, మరదలిని, మనుమలను వెంటనిడు కొని ద్వారకకు వచ్చి సుఖంగా ఉండటంతో ఈ ప్రబంధం మంగళాంత మౌతుంది.

వస్తుతత్త్వం :

ప్రభావతీ ప్రద్యుమ్నం అయిదాశ్వాసాల ప్రబంధం. దీనికాధారం హరి వంశమని సూరన పంచమాశ్వాసాంతంలో తానే చెప్పాడు. తెలుగు హరి వంశమున [ ఎఱ్ఱన, సోమనల కృతులందు ] లేదు. ఈ కథను పరికిస్తే అనిరుద్ధ చరిత్రయందలి ఘట్టాలే ఎక్కువగా కనిపిస్తాయి. ఈ కథ సంస్కృత హరి వంశంలో విపులంగా ఉంది.

ప్రభావతీ ప్రద్యుమ్న మందలి వస్తువు చిన్నదైనా సూరన స్వీయ ప్రతిభ చే దానిని చక్కని ప్రబంధంగా మలచాడు. దీనిని చిన్నచిన్న మార్పులచే నాటకంగా మార్చవచ్చు. సూరన తన ప్రబంధాన్ని నాటక ప్రాయంగా రచించాడు. ప్రతి ఆశ్వాసము నందు సంభాషణ సరళి కన్పట్టుతోంది. ఈ కావ్యానికి శ్రీకృష్ణుడు నాయకుడు. ప్రభావతీ ప్రద్యుమ్నం అని పేరిడుట చేత ప్రద్యుమ్నుడు

నాయకుడుగా భాసించినా తన చేతి చక్రాయుధాన్ని ప్రద్యుమ్నున కొసగి, అతని విజయానికి కారకుడగుటచే కృష్ణుడు నాయకుడయ్యాడు.

రసం :

వీరం అంగిరసం. శృంగారం ప్రధాన అంగరసం. ఇది శ్రవ్యకావ్యమైనా దృశ్యకావ్య లక్షణ సమన్విత మగుటచే ప్రద్యుమ్నుడు పతాకా నాయకుడని కొందరి అభిప్రాయం.

పాత్రచిత్రణ :

సూరన పాత్రచిత్రణంలో సిద్ధహస్తుడు. ఈతడు తీర్చిదిద్దిన శుచిముఖి గొప్ప చాతుర్యం కలది. స్వాతిశయం కలహంస తరుణి. ఇంద్రుడు రాజ హంసలకు కబురు పెట్టినపుడు తనభర్తద్వారా ఇంద్రునకు పరిచయం చేయించు కొఁబడినగాని ఆతనితో మాట్లాడలేదు. వజ్రపుర విశేషాలు అప్పటికే తనకు తెలుసు. కానీ శత్రురాజ్యంలో సంచరిస్తున్నందుకు ఇంద్రునకు కోపంవస్తుంది. అందుచేత తాము వజ్రపురిలో సంచరించటం తప్పదని కారణం ఇలా చెబుతుంది.

సీ. గగన స్రవంతిలోఁగల సువర్ణాబ్జంబు
అందు మే లేర్చి తా నపహరించి,
మానసంబు శఠాత్మ మానసంబును బోలె
నిస్సారసత్వంబు నెరయఁజేసి,
బిందుసరంబులోఁ గుందనంపుం దమ్మి
పేరు లేకుండంగఁ బెల్లగించి,
సౌగంధికాఖ్య కాసారంబు జలమాత్ర
శేషమై దీనతఁ జెందఁ జేసి,

తే. గీ. మఱియుఁ గల దివ్యసరసులు నెఱయఁ జెఱిచి
తనదు కేళిదీర్ఘి కలందుఁ గనక నళిన
జాతు లెల్ల నాటించినాఁ డాతఁ డింద్ర !
యటు వసక యేఁత నడుపునే హంసములకు ?

[1-120]

అని చెప్పటంలో దేవతల చేతకానితనాన్ని కూడా వ్యంగ్యంగా చూపించింది. ఆ సందర్భంలో ప్రభావతి జన్మవృత్తాంతం, గౌరీదేవి స్వప్నంలో ప్రత్యక్షమై చిత్రఫలకం ఇవ్వడం చెప్పింది. కృష్ణునివద్ద, ప్రద్యుమ్నునివద్ద కూడ గంభీరంగా సంభాషించింది. ప్రద్యుమ్నునివద్ద సందర్భశుద్ధితో ప్రసంగ వశమున చెప్పినట్లు ప్రభావతి సౌందర్యాన్ని వర్ణించి, అతని హృదయంలో ప్రేమాంకురం నాటింది. వజ్రనాభ పురమునందు కన్యాంతఃపురం ప్రవేశించి, ప్రభావతి, రాగవల్లరులు

ప్రద్యుమ్నుని చిత్రఫలకాన్ని దర్శించి "అంతటి అందగాడు ఉన్నాడా లేక ఊహా చిత్రమా" అనే సందేహంలో ఉండగా తాను చిత్రఫలకాన్ని చూసి, అతడు ప్రద్యుమ్నుడని తెలిసియు, వివరంగా వారికి చెప్పక 'ఉన్నాడు' అని మాత్రం చెప్పి ఊరుకుంటుంది. ఉపరి "పన్నిదంపు గెలుపోటులు దీరఁగ నిప్పుడేను జెప్పినదియ చాలు" అని, ప్రభావతి ఉత్కంఠ బైటపెట్టిన గాని వివరాలు చెప్పని చతుర. అతి నిపుణతతో వ్యవహరించి ప్రద్యుమ్నుని భద్రుని వేషంలో పుర ప్రవేశం చేయించి, వారి కలయికకు సందర్భానుసారం సహకరిస్తూ కథను కంచికి చేరుస్తుంది. సూరనార్యుని ప్రతిభా విశేషాలన్నీ శుచిముఖి పాత్రచిత్రణంలో కనపడతాయి. చంద్రవతీ గుణవతులకు, గద సాంబులను వరులుగా నారదుడు చెప్పినట్లు, అప్పటినుండి వారికి ప్రేమ బీజం నాటినట్లు చెప్పి, కార్యసాఫల్యానికి వారికి ఒక పెంపుడు చిలుకను కూడ కూర్చినాడు సూరన. కాని చిలుక శుచిముఖి యంతటి ప్రజ్ఞాపాటవాలు కలిగినదిగా లేదు. దానికి తగినట్లు అది బాగుగనే తన పాత్రను నిర్వహించింది. మిగిలిన పాత్రలు వారివారి చిత్తవృత్తి ననుసరించి, తగినట్లు సూరన తీర్చి దిద్దాడు.

వర్ణనలు :

సూరన చక్కని వర్ణనా చాతుర్యం కలవాడు. చక్కని భావనాపటిమ కలవాడు. ఇంద్రుడు, సారథి, ద్వారకకు ఆకాశ మార్గంలో వచ్చేటప్పుడు, పట్టణ శోభను తిలకించడాన్ని చక్కగా వర్ణించాడు.

సీ. ధాత్రీ మహాదేవి తాల్చిన మున్నీటి
మొలనూలి రత్నంపు మొగ పసంగ,
జలధిపేరిటి పాఁప తలచుట్టు గల ధరి
త్రీ మూర్తి శివు చిత్రతిలక మనఁగ,
నపర దిక్పతి కట్టినట్టి సాగర మను
పుట్టంబు తుది వ్రాఁత మొగడ యనఁగ,
వరుణ గోపుర బద్ధ వార్ధి తోరణ మధ్య
గుంఫిత నవపుష్ప గుచ్ఛ మనఁగ,

గీ. వివిధ మణిమయ గృహ దీప్తి విసర విసర
ణోపశోభిత మగు ద్వారకా పురంబు
దవులఁ గాన్పించెఁ దనుఁ జూడ దైవవిభుఁడు
వేయి కన్నులుఁ జాలక వెఱఁగు పడఁగ. [1-54]

అనే పద్యంలో సముద్రమధ్యంలో ద్వారక ఆకాశానికి ఎలా కన్పిస్తుందో తన భావనా పటిమచే ఉత్ప్రేక్షించాడు సూరన. ఈ వర్ణన చిత్రంగా మనం భావిస్తే

ఛాయాచిత్రంలాగ మన మనోనేత్రానికి దర్శనమిస్తుంది. ఆకాశంనుంచి ఛాయా చిత్రంతీస్తే అలాగే ఉంటుంది అన్పిస్తుంది. కవి వర్ణనా నైపుణ్యానికి ఇది గీటు రాయి.

ప్రభావతి ప్రద్యుమ్నుని చిత్తరువుచూచి తన తండ్రి స్వయంవరం ప్రకటించి అందరు రాకుమారుల ఛాయాచిత్రాల్ని వేయించి చూపినాడు కాని, ప్రద్యుమ్నుని చిత్రం చూపలేదేమని కారణం ఊహిస్తూ—

చ. జనకుఁడు నప్పుడీ సకల సద్గుణ పూర్ణుని వ్రాసి చూప నా
కనుపఁడు వ్రాయునంతటి సమర్థులు లేమినొ! తా నెఱుంగఁడో!
మనుజుఁడటంచుఁగైకొనఁడొ! మత్కులవైరితనూజుఁడంచు మా
నెనొ యెఱుఁగన్ సురారి కుల నిర్మథనుండని విందుఁగేశవున్.
[3-100]

అనే పద్యంలో కారణం సహజంగా ఊహిస్తుంది. ఇంతటి అందగానిని చిత్రించ లేకపోయారో? లేక తండ్రికి తెలియదో? తెలిసియు మానవమాత్రుడని లెక్క చేయలేదో? లేక పగవాని కొడుకని మిన్నకుండెనో? అని ఆలోచిస్తుంది. అందులోనే కృష్ణుడు రాక్షసులకు పగవాడని విన్నానని చెప్పడంద్వారా అదే సరియైన కారణంగా భావిస్తోందని సూచనకూడ లేకపోలేదు. ఇందు సందేహం, కావ్యలింగం అనే అలంకారాలున్నాయి. కారణంఏదో తెలియక అదా? ఇదా? అని సందేహించడంచేత సందేహం. రాక్షస శత్రువు కృష్ణుడని విన్నానని చెప్పడంచేత సమర్థించినది కావున కావ్యలింగం.

ప్రద్యుమ్నుడు మనోధైర్యం సడలనివాడే అయినా ప్రభావతి సౌందర్యం తలచుకొని విరహాన్ని అనుభవిస్తాడు. "వినుకలిచేతనే విరహవేదన" తాను భరించలేకపోతున్నాడే చిత్రపటంచూసిన ప్రభావతి ఇంక ఎంత విరహవేదన పడుతుందో? అనుకుంటాడు. అంతటి అందగత్తె అయిన ప్రభావతి, అతని చిత్రాన్ని చూసి విరహం పొందుతోందంటే మరి తానెంత అందగాడో!? ప్రభావతికి తనవేదన ఎలా తెలియజేయాలో అర్థంకాక

సీ. కృపనెఱిఁగింపరే కీరోత్తమము లార!
వజ్రపురికిఁ బోవు వారె మీరు?
సదనుగ్రహమునఁ దుమ్మెదలార! చెప్పరే
వజ్రపురికిఁ బోవు వారె మీరు?
కరుణతో వినిపింపఁ గలరె కోయిలలార!
వజ్రపురికిఁ బోవు వారె మీరు?
తెలుపరే దయఁ జూచి మలయ వాయువులార!
వజ్రపురికిఁ బోవు వారె మీరు?

తే. గీ. చలువ లోనఁగెడు మేఘరాజంబులార!
యమల పక్షత నొప్పు రాయంచలార!
నిలిచి నా మాటలకు మాఱు పలుకరయ్య!
వజ్రపురికిని బోయెడివారె మీరు? [3-29]

అని ఉద్యానవనంలో తుమ్మెదల దగ్గరనుంచి తనకు కనిపించిన చేతనములన్నిటిని ఉన్మత్తునిలాగ ప్రశ్నిస్తాడు.

కవి వ్యక్తిత్వం :

సూరన పాత్రానుగుణంగా చక్కని జాతీయాల్ని వాడాడు. అందు 'పులినోరి కండ విడివడ్డగతిన్,' 'ఓడలు బండ్లవచ్చు, బండ్లోడలవచ్చు,' 'భేరి జోకొట్టుట,' 'పిరికి కండలేని బిరుదు మగలు,' 'వట్టి దొరతనంపునీటు ప్రకటించితి,' 'కల్ల లాడిన నీకు నాతోడు సుమ్ము,' 'నీళ్లు నములుచు,' 'గుమ్మడికాయలోన నావగింజ యుఁబోదు,' 'తడిపాఁత గుత్తుకగోయుట,' 'నీ కనుసన్నలో వత్తు,' 'తెగి తెగని చిఱుకత్తికోతగ,' మొదలైనవి కోకొల్లలు.

సూరన గొప్ప లోకజ్ఞత కలవాడు. అతని ఊహాపాత్ర అయిన శుచిముఖి బ్రహ్మరథ వాహనుడైన సారంధరుడనే వాని కూతురు. భారతీదేవిచేత పెంచ బడింది. సూరన వాణిచేత పెంచబడిన శుచిముఖిద్వారా కథ చక్కగా నడిపిస్తాడు. దీని కవిత్వాన్ని ఇంద్రుడిలా మెచ్చుకొంటాడు.

సీ. శబ్ద సంస్కార మెచ్చటను జాఱఁగ నీక,
పదమైత్రి యర్థ సంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తి దోషంబు పొంతఁ బోక
యాకాంక్షిత స్ఫూర్తి యాచరించుచును శా
ఖా చంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థ భావంబు పాదుకొ నదుకుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ

గీ. నొకటఁ బూర్వోత్తర విరోధ మొదవకుండఁ
దత్తదవయవ వాక్య తాత్పర్య భేద
ములు మహావాక్య తాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహు తపఃఫలముగాదె. [2-3]

ఇందు ఇంద్రుడు శుచిముఖి కవిత్వాన్ని మెచ్చినట్లు కనిపించినా సూరన కవిత్వానికి అది వర్తిస్తుంది. అలాగే సందర్భాన్నిబట్టి కవిత్వ లక్షణాలు, కవిత్వానికి

మాధుర్యంకూడా ఉంటేనే వన్నె తెస్తుందని, శుచిముఖిని పొగడినట్లుగా 'సహజ మాధురీ ధురీణ,' 'అఖిల జన మనోహరంబయిన,' 'వీనులకు సుధారసములు,' అనే ఉపమానాలను వేశాడు. ప్రభావతి తండ్రికి శుచిముఖినిగూర్చి చెప్పే సందర్భంలో—

> చ. శుచిముఖి యంద్రుడు దానిని వచోనిపుణత్వమునందు, సత్కథా
> రచనలయందు, నీతి విదురత్వమునందు, బహుశ్రవావలో
> కచణతయందు, నెంటు సరిగానము దానికి వేయునేల దా
> ని చతురతా విశేషములు నీవ కనన్ వలయున్ మహాత్మకా !
>
> [4-57]

అని శుచిముఖి పూర్తిపాత్ర చిత్రణను ఒక పద్యంలో నిక్షేపించాడు. శుచిముఖి తుదకు బ్రహ్మపదవికూడ తానే వహించి "అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు" అని మంగళాక్షతలు చల్లి నిష్క్రమిస్తుంది.

సూరన సంస్కృత శాస్త్రజ్ఞానంకూడ మెండుగా కలవాడు. శాస్త్ర పారిభాషిక పదాలు, న్యాయాలు అలవోకగా అతని పద్యాల్లో దొర్లుతాయి. 'విప్రవాక్యం జనార్దనః,' 'శృంగ గ్రాహికా న్యాయము,' 'స్థూలారుంధతీ న్యాయము,' 'అనుభవ సంస్కారమునకుఁ బ్రసంగ ముద్బోధకము,' 'అన్యథా సిద్ధి గలుగును,' 'అభిధా ప్రయుక్తి,' 'నహి మాయాయా మసంభావ్యమస్తి' మున్నగునవి సందర్భాను సారంగా కలిసిపోయి సహజంగా కన్పిస్తాయి.

సూరన నిశిత పరిశీలనాశక్తి, చిన్న విషయానికికూడా ప్రాధాన్యమివ్వడం మనకు అచ్చెరువు కలిగిస్తుంది. "సమయాభిజ్ఞతఁ గుక్కుటంబు" అనే పద్యంలో కోడికూతను మనోహరంగా ఉత్ప్రేక్షించాడు. "ప్రాణసఖీ ! నిను న్నెరయఁ బాసి చనన్" అనే పద్యాన్ని, "అనుచు గగన భాగమునకు నంచయెగయఁ జూచినన్" అనే పద్యాన్ని స్వభావోక్తితో చెప్పాడు. అదే భావం చిత్రగతమైతే ఎన్ని అందాలు సంతరించుకుంటుందో అనే ఊహ పాఠకునికి కల్గుతుంది.

తిక్కన తర్వాత ఇంత ప్రౌఢంగా, ఇంత మనోహరంగా, ఇంత చతురంగా కవిత్వం చెప్పిన కవిశేఖరుడు పింగళి సూరనే అనడంలో సందేహం లేదు. సూరన కావ్యసౌరభాన్ని ఆస్వాదించాలంటే కావ్యాన్ని సమగ్రంగా చదవాల్సిందేమరి.

### కొన్ని పదాలకు అర్థాలు

గగనస్రవంతి = ఆకాశగంగ
శఠాత్మ = కుత్సిత స్వభావంకలవానియొక్క
బిందుసరంబు = బిందుసరము అను పేరుగల సరస్సు

మొలనూలు = ఒడ్డాణం
రత్నంపుమొగపు = ముఖభాగమునందలి మణులు పొదిగిన బిళ్ళ
తుది = కొనయందుగల
వ్రాతమొగడ = సరిగతో నేసిన మొగ్గ ఆకృతిగల శిల్ప విశేషం
నిర్మథనుండు = నాశకుడు
అమలపక్షతన్ = తెల్లని రెక్కల కలిమితో
శాఖాచంక్రమక్రియన్ = ఆ కొమ్మనుండి ఆ కొమ్మకు పోవుచు చెట్టు దిగకుండుట
అత్యూర్జితము = మిగుల బలముగల.

## ఆధార గ్రంథాలు


1. ప్రభావతీప్రద్యుమ్నము — వావిళ్ళవారి ప్రతి
2. ప్రభావతీప్రద్యుమ్నము — ఎమెస్కో ప్రచురణ
3. ప్రభావతీప్రద్యుమ్నము — వెంపరాల సూర్యనారాయణశాస్త్రి వ్యాఖ్య (1964)
4. గౌతమ వ్యాసములు — పింగళి లక్ష్మీకాంతం
5. ఆంధ్ర కవి తరంగిణి — శ్రీ చాగంటి శేషయ్య
6. ఆంధ్ర కవి సప్తశతి — బులుసు వేంకట రమణయ్య
7. సమగ్రాంధ్ర సాహిత్యం — ఆరుద్ర (8 వ సంపుటం)
8. ప్రభావతీప్రద్యుమ్నము — నారాయణరావు, విలుకూరి (1941 భారతి, ఆగష్టు)
9. ప్రభావతీప్రద్యుమ్నములోని మెఱుగులు — రామజోగారావు, బంకుపల్లి (1942 భారతి, మే)
10. ప్రభావతీప్రద్యుమ్నము (పింగళి సూరన) — వెంకటరామయ్య, మొదలి (1945 భారతి, ఏప్రెలి)
11. ప్రభావతీప్రద్యుమ్నములోని శుచిముఖి — నరసింహశాస్త్రి, కేశవపంతుల (1950 శోభ, సెప్టెంబరు)
12. శుచిముఖి (పింగళి సూరన పోషణ) — అరవింద ప. (1954 భారతి, సెప్టెంబరు)
13. ప్రభావతీప్రద్యుమ్నము-హంస — గంగాధరం, నూతలపాటి
14. దౌత్యము (భిన్నహస్తకౌశలము) — 1965 భారతి, మార్చి
15. వికాసలహరి — యువభారతి పబ్లికేషను.

# వసుచరిత్రము — రామరాజభూషణుడు

సమీక్ష : డా॥ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి, ఎం.ఏ., పిహెచ్.డి.

[జన్మస్థలం – విశాఖమండలం. జననం – 22-9-1942 ఎం.ఏ. [తెలుగు, సంస్కృతం] పిహెచ్.డి. ఆంధ్రోపన్యాసకులు – మిసెస్. ఎ.వి.యన్. కళాశాల [1965-75] తెలుగుశాఖ – ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు [జూలై 1975 నుండి] జూన్ 1976 అమెరికాలోని విస్కాన్సిన్స్ యూనివర్సిటీకి విజిటింగ్ టీచర్. ముద్రితకృతులు – వరూథినీ ప్రవరమ్ – గీర్వాణభాషలో రచింపబడిన ఏకాంకిక; అష్టదిగ్గజాలు – ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణ; భిన్నవిషయాలపై అనేక విమర్శకవ్యాసాలు, సాహిత్యపత్రికలలో ప్రచురింపబడ్డాయి.]

కవిజీవితాదులు :

ఆంధ్రప్రబంధసాహిత్యంలో ప్రౌఢప్రబంధంగా ప్రశస్తినందిన మహాగ్రంథం వసుచరిత్ర. ఆ మహాప్రబంధ రచయిత రామరాజభూషణుడు. అతనికి భట్టుమూర్తి అనే వ్యవహారం కూడా వుంది. అతని పేరు మూర్తి అనీ అతడు భట్టుకులానికి చెందినవాడనీ అళియరామరాయలకొలువుకి అలంకారంగా ఉండడంచేత రామరాజభూషణుడనే బిరుదాన్ని పొందాడనీ అతనిఇంటిపేరు ప్రబంధాంకం వారనీ విమర్శకులు నిర్ణయించారు. అతని నివాసం బట్టుపల్లె అనే గ్రామం. అది బళ్లారి జిల్లాలోని పాలమండలం సమీపంగా ఉందని కొందరూ, కడప మండలం లోని పులివెందల దగ్గర ఉందని కొందరూ జటప్రోలు ప్రాంతంలో ఉందని మరికొందరూ అభిప్రాయపడుతున్నారు. కృష్ణాజిల్లాలోని మోదుకూరు అతని నివాసస్థలం అనికూడా కొంతమందిభావిస్తున్నారు. ఈ మహాకవి క్రీ.శ. సుమారు 1510 నుండి 1585 వరకు జీవించి వుంటాడని నిర్ణయింపబడింది.

భట్టుమూర్తి తండ్రి సూరపరాజు. భట్టుమూర్తి మొదట రామరాయల మేనల్లుడైన తొలగంటి నరసరాజునాశ్రయించి తర్వాత రామరాయల ఆస్థానంలో అలంకారంగా వుండి శుభచిహ్నాన్నీ రత్నహారహయ వేదండా గ్రహారాది సత్కారాలనీ ఆ దొడ్డప్రభువునుండి పొందాడు. అనంతరం ఆ రామరాయల తమ్ముడైన తిరుమలరాయనికి ఈ వసుచరిత్రని అంకితంచేశాడు. ఈ కవితల్లజుడు రాయల అష్టదిగ్గజాల్లో ఒకడుగా వుండేవాడనీ పెద్దనార్యుని శిష్యుడనీ జనశ్రుతి. నరసభూపాలీయం, హరిశ్చంద్రనలోపాఖ్యానం ఇతని ఇతరకృతులు. సంస్కృతంలో కూడా ఈకవి కావ్యరచనచేసి వుంటాడనడానికి ఆధారాలున్నాయి.

ఏర్పాటుచేయబడుంది.

అధిష్ఠానపురం రాజధానిగా చేదిదేశాన్ని వసుమహారాజు పాలిస్తూవుంటాడు. ఒకనాడు హిమవంతుని పుత్రుడైన కోలాహలపర్వతపతి శక్తిమతి అనే నదిపైప్రవాలి ప్రవాహాన్ని నిరోధిస్తే వసురాజు ఆ పర్వతాన్ని తన కాలిబొటన వ్రేలితో గవ్వను వలె మీటి దీనంగాపడివున్న దాన్ని తనక్రీడాశైలంగా గ్రహిస్తాడు. పర్వతాన్ని గోటికొనతో చిమ్మడానికి ఇంద్రుడు ఆనందించి వసురాజుకి చెలికాడవుతాడు క్రమంగా వసంతకాలం వస్తుంది. ఉద్యానపాలకుల ఆహ్వానాన్ని పురస్కరించుకొని ఉద్యానరామణీయకాన్ని సందర్శించడానికి వసురాజు బయల్దేరివెళ్తాడు. అక్కడ ఒక కిన్నరమిథునం అతనికొక శుభం అనన్నమౌతోందని తెలిపి కోలాహలపర్వతాగ్రానికి వెళ్లిపోతుంది.

వసురాజు నర్మసఖునితో కోలాహల క్రీడాద్రికి వెళ్లి విహరిస్తున్నసమయంలో మధురమైన సంగీతం వినబడుతుంది. ప్రభువు ఆదేశంపై పరిశీలించి నర్మసఖుడు ఆ సంగీతం ఒకత్రిలోకసుందరి వాయిస్తున్న వీణానాదం అని పేర్కొంటాడు. రాజు ఆమెను చూడాలనే ఉత్కంఠతో నర్మసచివునితో బయల్దేరివెళ్లి తీగెలచాటుననిల్చి ఆమెసౌందర్యానికి ముగ్ధుడై ఆమె వృత్తాంతాన్ని కనుక్కొని రమ్మని నర్మసఖున కాజ్ఞాపిస్తాడు. అతడు యతివేషధారియై ప్రవేశించి మంజువాణిఅనే చెలికత్తెద్వారా కోలాహలుని శక్తిమతీ బలవత్సమాగమోదాంతాన్నీ, తత్ఫలంగా కల్గిన గిరికావసు పాదుల జన్మవృత్తాంతాన్నీ, కోలాహలుణ్ణి దూరంగా చిమ్మడానికి మెచ్చి సఖుడై ఇంద్రుడు వసురాజుకి విమానాన్ని ఇచ్చిన విధాన్నీ తెలిసికొంటాడు. కొంచెంసేపు మిథ్యాధ్యానంచేసి ఈ గిరికను వసురాజు పరిగ్రహిస్తాడని చెప్పి అక్కడఉన్నవాళ్లని ఆనందింపజేస్తాడు. మంజువాణి అతనితో ప్రభువువచ్చుట అనుగ్రహించుట ఎన్నడో అని ప్రశ్నిస్తుంది. ఆ మాయా మౌని ఇప్పుడే వసురాజుని రప్పిస్తున్నానని మర్మాఅంటాడు. ఇదే సమయమని వసురాజు ప్రవేశిస్తాడు.

మంజువాణి నేర్పుగా రాజురాకని ప్రశంసించి గిరికాజననాదికాన్ని వివరిస్తుంది. ఆ యతి గిరికావసురాజుల్ని ఆశీర్వదించి నిర్గమించి వసురాజుని అన్వేషిస్తున్నట్లు నటిస్తూ తిరిగి నర్మసచివుడుగా ప్రవేశిస్తాడు. అక్కడవున్న కన్యలాతనిని తోటి మునిగా గుర్తిస్తారు. చెలికత్తెల మేలపుమాటలకు ఉలికి గిరిక తెరవెనక్కి వెళ్తుంది. ఇంతలో కలహంసి అనే శక్తిమతివయస్య వచ్చి గిరికను శక్తిమతి పిలుస్తోందని చెప్పగా ప్రభువు అనుమతిగైకొని చెలికత్తెలు గిరికను తీసికొని వెళ్లిపోతారు. గిరికావియోగానికి రాజు బాధపడుతూ వుంటే నర్మసచివుడోదార్చి యిల్లు చేరుస్తాడు.

గిరికాదేవికూడా వసురాజవియోగాన్ని భరింపలేక ఉద్యానానికి వెళ్లి శరీరత్యాగానికి ఉపక్రమిసుంది. చెలులు వెతుక్కుంటూవచ్చి ఆమె నోదార్చి పుష్పాపచయ జల క్రీడాదులు నిర్వహించి ఆమెననుగ్రహింపుమని మన్మథుని ప్రార్థిస్తారు. క్రమంగా శీతలోపచారాదులు చేసి వియోగతాపంనుండి ఆమెను కొంత తేర్చి కేళీభవనానికి చేరుస్తారు.

సూర్యుడస్తమిస్తాడు. చంద్రుడుదయిస్తాడు. చంద్రమన్మథమలయానిల విజృంభణాన్ని గిరిక తట్టుకోలేదని చెలికత్తెలు భయపడుతూవుంటారు. మంజువాణి వసురాజుచిత్తం ఎలావుందో తెలిసికొనివస్తానని గిరికాకంఠహారాన్ని గ్రహించి వెళ్తుంది. గిరికవెన్నెలబాధ భరింపలేక యెల్గెత్తి యేడుస్తుంది. చెలులు వసురాజు వచ్చి తప్పక స్వీకరిస్తాడని ఓదార్చి మంజువాణి ఇంకారాకపోవడానికి కారణం ఏమా యనుకొంటారు. అంతలో మంజువాణి ప్రవేశించి వసురాజవిరహావస్థని అభివర్ణించి తాను గిరికాహారమిచ్చి అతనినోదార్చడాన్నీ, గిరికను వసురాజు కిమ్మని కోలాహలుణ్ణి కోరడానికి ఇంద్రుడు రాబోతున్న విషయాన్నీ చెప్తుంది. వసురాజిచ్చిన అంగుళీయకాన్ని గిరికకిస్తుంది. చెలికత్తెలు ఈవృత్తాంతాన్ని శుక్తిమతీ కోలాహలులకు నివేదిస్తారు.

దిక్పాలురూ గంగాదేవీ వెంటరాగా ఇంద్రుడు కోలాహలుడి కడకు వెళ్తాడు. గంగ గిరిక నాశ్వాసిస్తుంది. ఇంద్రునికోరికపై కోలాహలుడు గిరికావివాహానికి అంగీకరిస్తాడు. నదీకాంతలు సేవింపగా శుక్తిమతి ఇంద్రుని కొలువడానికి వస్తుంది. మేనకా హిమవంతులుకూడా వివాహోత్సవం దర్శించడానికి వస్తారు. వచ్చినవారి కోసం ఇంద్రుడు ఒక మహానగరాన్ని సంకల్పంచేత నిర్మింపజేస్తాడు. బృహస్పతి ఆరాత్రే ముహూర్తాన్ని నిశ్చయిస్తాడు. ఇంద్రుడు వసురాజుకి వివాహ విషయం తెలిపి పెళ్లికొడుకునిచేసి ఒక దివ్యకమలదామంతో సత్కరిస్తాడు. పెళ్లి పెత్తనం వహిస్తాడు. పెళ్లిలో వసుమహారాజుకి ఎందరో దేవతలు ఎన్నో కానుకలు సమర్పిస్తారు. కోలాహలుడుకూడా అల్లుడికి రథ గజ తురగాదులు కట్నంగా ఇస్తాడు. శుక్తిమతి తనయొద్దఉన్న రత్నరాసుల్నీ వసుపాదుడనే కుమారుణ్ణీ వసురాజుకి అర్పిస్తుంది. వసురాజు వసుపాదుణ్ణి సేనాపతిగా నియోగిస్తాడు. ఇంద్రుడు వివాహసందర్భంలో వసుప్రభువుకి ఒకదివ్య వేణుదండాన్ని బహూకరిస్తాడు. వివాహం వైభవంగా నిర్వహింపబడుతుంది. రాజు గిరికతో స్వీయ నగరానికి వెళ్తాడు. గిరికావసురాజులు అభిమత క్రీడలనుభవిస్తారు. వసు మహారాజు రాజ్యాన్ని ధర్మబద్ధంగా పరిపాలిస్తాడు.

వస్తుతత్త్వం :

పురాణాంతర్గతమై లేశమాత్రంగా ఉండే కథని అష్టాదశ వర్ణనాత్మకంగా సర్వాంగ సుందరంగా తీర్చి దిద్ది రచించడం ప్రబంధకవుల ప్రత్యేకత. మహా

భారతంలోని ఉపరిచర వసుచరిత్రనాధారంగా రామరాజ భూషణుడు ఈ వసు చరిత్ర ప్రబంధాన్ని సంతరించాడు. వసురాజు వేటకు వెళ్లి ఒకతపోవనంలో తపస్సుచేసికొంటున్న సందర్భంలో ఆతని ధర్మబద్ధరాజ్యపాలనకీ తపః ప్రభావానికీ మెచ్చుకొని ఇంద్రుడు ఒక విమానాన్నీ ఇంద్రమాల అనే కమలమాలనీ ఒక వేణుయష్టినీఇచ్చినట్లు భారతంలో వుంటే భట్టుమూర్తి పాత్రౌచిత్యానికి ఉద్దీపకంగా వుండేటట్లు కథనుమార్చి రచించాడు.

పాత్రపోషణ :

వసుచరిత్రలో శుక్తిమతీ కోలాహలులు గిరికావసురాజులు మంజువాణీ నర్మసచివులు ప్రధానపాత్రలు. రామరాజభూషణుడు విదగ్ధుడే కాని తనశక్తి సామర్థ్యాలసర్వస్వాన్నీ శబ్దప్రయోగచాతుర్యానికే వినియోగించాడు. ఆ కారణంగా సత్యాకృష్ణులు వరూధినీ ప్రవరులు నత్కీరనిగమశర్మలూ లోకంలో ఎంతగా ప్రసిద్ధికెక్కారో అంతగా వసుచరిత్రలో ఏపాత్రకూ పెద్దగా పేరూ ప్రతిష్ఠా కిలుగలేదు.

వసుచరిత్రలో ధీరోదాత్తుడైన వసురాజు నాయకుడు. ఆ మహనీయుని భట్టుమూర్తి ఇలా ప్రవేశపెట్టాడు :

తనయశో విశదముక్తా సౌధపాళికి
నంబుదాయనము వాతాయనముగఁ
దనశౌర్యశిఖి శిఖాతతికి జాంబూనద
భూధరంబపరంజిపూదెగాఁగఁ
దనబలోద్ధతరజో దంభకుంభినికిఁదా
రా గ్రహంబులు గర్భ రత్నములుగఁ
దనదాన ధారాఖ్య వనధికి మిన్నేఱు
కల్లోలధుతవారి కణముగాఁగఁ

దనవినూతన సుగుణసంతానవల్లి
సముదయంబునకంభోజసంభవాండ
భాండములఖండఫలపరంపరలుగాఁగ
వరలు భవ్యవిభావిభావసుఁడు వసుఁడు. [1-116]

ఇందులో వసురాజుయొక్క కీర్తి శౌర్యమూ బలమూ దానమూ సుగుణసంపత్తీ మనోహరంగా కీర్తింపబడ్డాయి. ఉత్కృష్టమైన కాంతియందు వసురాజు సూర్యుడని ఉగ్గడింపబడింది. వసు శబ్దానికి కిరణమనే అర్థం ఉండడంచేత భట్టుమూర్తి వసుచరిత్రలో పెక్కుచోట్ల వసురాజుకీ సూర్యుడికీ సరిపడేటట్లు పదాల్ని చిత్రంగా శ్లేషించాడు. అది అతని శ్లేషఘటనాసామర్థ్య నిరూపకం.

ఈ కావ్యంలో గిరికాసౌందర్యం సుదీర్ఘంగా అభివర్ణింపబడింది. ఆమె నఖ శిఖపర్యంతం పరమరమణీయంగా వుందనడానికి ఈ ఒక్కపద్యం చాలు :

వనిత పాదములు ప్రవాళంబులై మించుఁ
　　గటియచలాభోగకలనఁబొదలు
పడఁతి గుబ్బలు మీఱు భద్రకుంభనిరూఢి
　　వదనమబ్జఖ్యాతి వదలకొనరుఁ
గలికి చెక్కులు చంద్రఖండంబులై పొల్చుఁ
　　గన్నులురాజీవగణనఁగాంచు
పెలఁది వేనలినీల విషధరంబైతోఁచుఁ
　　దనువెల్ల కాంచనంబనఁగ నెసఁగుఁ

బగడ మిగురాకు నిలచట్టు పసఁటులు కరి
కుంభములు దమ్మి నెల నెలకూనఁగ పుర
మబ్జములు మీలు మొగులు కాలాహి పసిఁడి
సంపఁగులఁగూర్చి నలువ నిర్మింపఁబోయి [2-33]

భట్టుమూర్తి ఈ పద్యంలో ప్రసిద్ధమైన ఉపమానసామగ్రి తీసికొని గిరికా ప్రత్యంగ సౌందర్యాన్ని పరమాహ్లాదకరంగా వర్ణించినతీరు ప్రశంసనీయం. నాయికా నాయకులు ప్రథమసమావేశ సందర్భంలోనే రాగానుబద్ధులై పరస్పరం దుస్సహ వియోగవేదనా బాధితులవడమూ, దేవేంద్రుని పెద్దరికంలో వివాహం నిర్వహింప బడడమూ చాలా హృదయంగమంగా చిత్రింపబడింది. శక్తిమతీ కోలాహల పాత్రలుకూడా సురుచిరంగా పోషింపబడ్డాయి. కోలాహలుడు శక్తిమతీ సౌంద ర్యానికి ముగ్ధుడై సమాగమ సౌఖ్యాన్ని అర్థించడమూ అమె సోపపత్తికంగానూ సవినయంగానూ నిరాకరించడమూ అతడు బలత్కారంగా మీదపడడమూ ఫలితంగా గిరికాపసు పాడులుద్భవించడమూ గిరికను శక్తిమతీకోలాహలు లిరువురూ గారాబంగా పెంచడమూ మున్నగు ఘట్టాలుకూడా రామరాజభూషణుని పాత్రపోషణ సామర్ధ్యానికి ఎత్తినపతాకలు. గిరిక నత్తవారింటికంపుతూ కూతురికి కోలాహలుడొసంగిన ఉపదేశం శాకుంతలంలో కణ్వుడు శకుంతలకుపదేశించిన ఘట్టాన్ని స్మరింపజేస్తుంది. మంజువాణి సార్థకాఖ్య. సర్మ సచివుడు విదూషక ప్రాయుడు.

వర్ణనలు :

ప్రబంధాన్ని అష్టాదశవర్ణనాబంధురంగా రచించడం ప్రబంధకవుల విశిష్టత. వసుచరిత్రలో వర్ణనలు మేలిమిబంగారునగలో మణులుపొదిగినట్లు కథలో మనోహరంగా కూర్చబడ్డాయి. వసురాజు రాజధానియైన ప్రతిష్ఠాన పురమూ

ఇంద్రసంకల్పసిద్ధమైన కోలాచలనగరమూ సాంగోపాంగంగా అపూర్వకల్పనలతో వర్ణింపబడ్డాయి. కోలాహలపర్వతవర్ణనమూ ఉద్యానవర్ణనమూ రామరాజభూషణుని వర్ణనానిపుణత్వాన్ని బహుధా నిరూపిస్తున్నాయి. గిరికాదేవితోకూడి చెలులు ఉద్యానంలో గావించిన పుష్పావచయ జలక్రీడాదులు సుకుమారసుందరంగా వర్ణింపబడ్డాయి. గిరికావసురాజుల వియోగమూ వివాహమూ మధురంగా అభివర్ణింపబడ్డాయి.

వసుచరిత్రలోని చంద్రోదయవర్ణన ప్రబంధవర్ణనా సర్వస్వానికీ తలమానికం వంటిది. చంద్రుడు రేకగ సంగోరుగ పూర్ణబింబంగా ఉదయించడం తెర క్రమక్రమంగా సడలిస్తూవుంటే కనుపించే రాత్రిఅనే నాట్యకత్తెయొక్క ముత్యాల పట్టమూ నొసలు ముఖమువలె ఉందనీ భట్టుమూర్తి అద్భుతకల్పనా చాతుర్యంతో ఇలా వర్ణించాడు—

హరిదంభోరుహలో చనల్గగనరంగాభోగ రంగత్తమో
భరనేపథ్యము నొయ్యనొయ్య సడలింపన్ రాత్రి శైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్ వక్త్రంబునుందోఁచె నా
హరిణాంకాకృతి వొల్చెరేకయి సగంబై బింబమై తూర్పునన్. [4–17]

ఇట్టివర్ణనల్లో ఉపమోత్ప్రేక్షాద్యలంకారాలు చాలా ప్రయోగింపబడ్డాయి.

రసపోషణ :

వసుచరిత్రలో గిరికావసురాజులు నాయికానాయకులుగా శృంగారరసం అంగిరసంగా పోషింపబడింది. ప్రథమావలోకనమునుండి నాయికానాయకులలో అంకురించిన అనురాగవిశేషం స్థాయిత్వమొంది శృంగారరసంగా పరిపుష్టమయింది. కోలాహలుని ఆక్రమణసందర్భంలోని శుక్తిమత్యాక్రందనంలో కరుణరసమూ, వసురాజు కోలాహలుణ్ణి ఘోరంగా నిగ్రహంలో వీరరసమూ, నర్మసచివుని చేష్టలలోను కార్యనిర్వహణలోనూ హాస్యాద్భుతాలూ, యథోచితంగా ఇతరరసాలూ అంగరసాలుగా పోషింపబడ్డాయి. కోలాహలుడు శుక్తిమతిని బలప్రయోగంతో ఉపభోగించడంలో రసాభాసం కల్పింపబడింది.

శైలి :

ప్రబంధాల్లో శైలికొక విశిష్టస్థానం ఇవ్వబడింది. వసుచరిత్రలో శైలి ప్రధానంగా నాటకీయంగానూ సముచితంగా వర్ణనాత్మకంగానూ నిర్వహింపబడింది. అంతటా సంస్కృత పదభూయిష్ఠమై శ్లేషాలంకార భూషితమై శ్రవఃపేయంగా వుంటుంది. పరిపక్వమూ మంద్రగంభీరమూ గేయానుగుణమూ అయిన భట్టుమూర్తి శైలిని సమీక్షించడానికి వసుచరిత్రలోని వసంతవైభవ వర్ణన సన్నివేశంలోని క్రిందిపద్యం చక్కని లక్ష్యం—

లలనాజనాపాంగ వలనావసదనంగ
తులనాభికాభంగ దోః ప్రసంగ
మలసానిలవిలోల దళసాసవరసాల
ఫలసాదరశుకాల వనవిశాల
మలినీగరుదనీకమలినీ కృతధునీక
మలినీ సుఖితకోక కులవధూక
మతికాంత సలతాంత లతికాంత రనితాంత
రతికాంత రణతాంత సుతను కాంత
మకృత కామోద కురవకా వికల వకుల
ముకుల సకలవనాంత ప్రమోదచలిత
కలిత కలకంఠ కులకంఠ కాకలీ వి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు. [1-126]

కవివ్యక్తిత్వం :

రామరాజభూషణుడు శ్రీరాముని పాదపద్మములారాధించి యానందించు వాడు. హనుమద్దేవతా ప్రసాదంచే కవితాధారని పొంది దినమునకొక్క ప్రబంధాన్ని గడియకొక శతకాన్ని రచింపగల సమర్థుడు. చతుర్విధకవితా నిర్వాహకుడు. సాహిత్యరసపోషణుడు. ఈ మహాకవి కావ్యమంతటా వ్యంగ్య వైభవంగా ఛందోలక్షణబద్ధంగా రచనాస్వతంత్రతతో ఆద్యంత చమత్కారమంజులంగా రచింపబడాలని కుకవినిందలో సూచించాడు. పూర్వుల వృత్తాంతాలని కల్పనా విశేషాలతో సత్కవులు రచిస్తే అట్టికావ్యాలు సానలదీరిన జాతిరత్నాలుగా వుంటాయని మరోచోట హెచ్చరించాడు. వసుచరిత్రలో వాల్మీకి రామాయణ ప్రభావమూ అభిజ్ఞాన శాకుంతలానుసరణమూ పెక్కుచోట్ల గోచరిస్తోంది. మహా కవులైన కాళిదాస దండి భవభూత్యాదులు శ్రీనాథ పెద్దనాదులు ఆరాధ్యులవడం చేత భట్టుమూర్తి వారి కవితావిశేషాలని వసుచరిత్రలో సముచితంగా వినియోగించు కొన్నాడు. ఈ మహాకవి సంగీత కళారహస్య నిధి కాబట్టి సంగీత శాస్త్ర విషయాలు ఈ కావ్యంలో చాలా చోట్ల ప్రదర్శింపబడ్డాయి. కోలాహలుడు గిరికకు కట్టించి యిచ్చిన ఇంటినిబట్టి సంగీతసాధనకు ఎటువంటిగృహం ఆవశ్యకమో తెలిసికోవచ్చు. భట్టుమూర్తి జ్యోతిర్వైద్యాది శాస్త్రజ్ఞుడవడంచే వసుచరిత్రలో ఆ యా శాస్త్ర విషయాలుకూడా నిరూపింపబడ్డాయి. రామరాజభూషణుని వాగనుశాసన దక్షతా నిరూపణకు వసుచరిత్రలో బహుధా ప్రదర్శితాలైన శ్లేషధ్వని చమత్కారాలు ప్రబల తార్కాణాలు. వసుచరిత్రలో 'శేషవృత్తికగునే విస్రంభ సంభారముల్,' 'నృపులుత్తరోత్తర పదానూన స్పృహాచంచలుల్' మొదలైన సూక్తులు సందర్భో చితంగా ప్రదర్శింపబడడంచేత భట్టుమూర్తి బహు లోకజ్ఞుడని చెప్పవచ్చు. గిరికా వసురాజుల వివాహఘట్ట రచనా సందర్భంలో ఆంధ్రాచార సంప్రదాయాలని

నిరూపించి భట్టుమూర్తి తన దేశీయాభిమానాన్ని వెల్లడించుకొన్నాడు.

ఈ వసుచరిత్రకు ఒక ఏకాశ్వాస ప్రబంధం అవతరించింది. అలాగే పురూరవశ్చరిత్రమూ కవిజనరంజనమూ శకుంతలా పరిణయమూ పిల్ల వసు చరిత్రలుగా ఉద్భవించాయి. కాళహస్తి కవీశ్వరునిచే ఈ వసుచరిత్ర సంస్కృతంలో అనువదింపబడడం ఆంధ్రలోకానికి గర్వకారణం.

## కొన్ని పదాలకు అర్థాలు

యశోవిశదముక్తాసౌధపాళి = కీర్తియనే ముత్యాలమేడల సముదాయం
అంబుదాయనము = ఆకాశం
వాతాయనము = కిటికీ
శౌర్యశిఖి శిఖాతతి = పరాక్రమం అనే అగ్నిజ్వాలా సమూహం
జాంబూనద భూధరము = మేరువు పర్వతం
అపరంజ పూదె = బంగారు పూస
బలోద్ధతరజోదంభకుంభిని = సైన్యంచే ఎగిరిన పరాగం అనే కృత్రిమభూమి
దానధారాఖ్యవనధి = దానజలధార అనే సముద్రం
మిన్నేరు = ఆకాశగంగ
కల్లోలధుతవారికణము = మహాతరంగాలవలన ఎగసిన నీటిబిందువు
అంభోజసంభవాండభండములు = బ్రహ్మాండ భాండాలు
ప్రవాళములు = పవడములు లేక చివుళ్లు
అచలా = భూమి లేదా పర్వతం
అబ్జము = కమలం లేదా చంద్రుడు
రాజీవము = కమలం లేక బెళుకు చేప
వేనలి = జడ
నీలవిషధరము = నల్లని మేఘం లేదా కృష్ణసర్పము
హరిదంభోరుహలోచనల్ = దిక్కులనెడి కాంతలు
తమోభర నేపథ్యము = చీకటి అనే తెర
శైలూషి = నాట్యకత్తె
మౌక్తికపట్టము = నొసటికి పైన ముత్యాలతోకూర్చి అడ్డంగా కట్టుకొనే పట్ట
అమానకమలదామం = వాడని పద్మాలదండ.

## ఆధార గ్రంథాలు


1. వసుచరిత్ర — సోమకవి వ్యాఖ్యోపేతం--వావిళ్లవారి ముద్రణ-1910
2. వసుచరిత్ర విమర్శనము — వఝల చినసీతారామశాస్త్రి ప్రణీతం— వావిళ్లవారి ముద్రణ-1965
3. కావ్యలహరి — ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి ఉపన్యాసాలు— యువభారతి ప్రచురణ-1971.

# రాధామాధవము — చింతలపూడి ఎల్లనార్యుడు

సమీక్ష : శ్రీ ఎలవర్తి విశ్వనాథరెడ్డి, ఎం.ఏ.

[ జన్మస్థలం – నెత్తం గ్రామం – చిత్తూరు జిల్లా. జననం – 10–2–1951. ఎం.ఏ. (తెలుగు), సీనియర్ పోస్టుగ్రాడ్యుయేట్ డిప్లొమా (సంస్కృతం). కొంతకాలం, భారతీయ విద్యాకేంద్రం జూనియర్ కళాశాలలో తెలుగు ఉపన్యాసకులుగా పనిచేశారు. ప్రస్తుతం తెలుగు వ్యుత్పత్తికోశ పథకంలో సహాయకులుగా పనిచేస్తున్నారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు స్వర్ణోత్సవాల సందర్భంగా వెలువడిన 'శారద దరహాసములు' అనే శీర్షికలో 'మనవాగ్గేయకారులు' అనే చిన్నపుస్తకం రచించారు 'తెలుగు, తమిళ భాషలలోని ఉర్దూ అన్యదేశ్యాలు- ఒక పరిశీలన' అనే అంశంమీద పిహెచ్.డి. పట్టానికి పరిశోధన, తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు. ]

కవి జీవితాదులు :

ఆంధ్ర వాఙ్మయంలో రాధామాధవుల పరస్పర ప్రేమని వర్ణించే గ్రంథాల్లో చింతలపూడి ఎల్లనార్యుని 'రాధామాధవము' మొదటిది. ఈ కవి నివాసాన్ని గూర్చి కొన్ని వాదాలున్నాయి. రాధామాధవ కవి ఇంటిపేరు చింతలపూడి వారు అని తెలుస్తుంది. సాధారణంగా ఇంటిపేర్లు గ్రామ నామాలుగా ఉండటంవల్లా ఇతనిది చింతలపూడి గ్రామం అని ఊహించవచ్చు. కాని ఈ గ్రామం విశాఖపట్టణం, గోదావరి, కృష్ణా, గుంటూరు మండలాల్లో ఉండటంవల్లా ఇందులో ఏ గ్రామమో నిర్ణయించటం కష్టం.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ప్రసిద్ధివెందిన మహాకవుల్లో ఈ రాధామాధవ కవి ఒకడు. కృష్ణదేవరాయల కడపటిదశనాటికే ఆంధ్ర గీర్వాణ భాషా పాండిత్య సంపన్నుడై, అతిశయ కవితాప్రౌఢుడై ఆ మహారాజు మెప్పును పొంది ఉండటంవల్లా ఇతడు ఇంచుమించుగా క్రీ.శ. 16 వ శతాబ్ది ప్రారంభంలో పుట్టి ఉండవచ్చు. అష్టదిగ్గజాలవంటి సుప్రసిద్ధ కవులకు పోషకుడైన శ్రీకృష్ణదేవరాయలు ఈ రాధామాధవ రసవత్కావ్యాన్ని చదివి, ఆనందించి నిండుసభలో "సెబాస్ ! కవిచంద్రమా ! నీవు నిక్కముగ రాధామాధవుఁడవే !" అని బహూకరించి పలికిన పలికే ఈ కవికి సాటిలేని బిరుదభూషణమైనది. ప్రథమాశ్వాసంలోని "రాధామాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢక్రియం జెప్పి,............" అనే పద్యాన్ని బట్టి కూడా ఇతని బిరుదు రాధామాధవమని తెలుస్తుంది.

ఇతని తండ్రి కామనార్యుడు, తల్లి లచ్చమాంబ. ఇతడు ఆరువేల నియోగి. ఇతడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాల పట్టికలో లేకపోవటంవల్లా

ఇతడు రాయల కడపటి దివసాల్లో ఆస్థానకవిగా చేరినట్లు గ్రహింపవచ్చు. కృష్ణ దేవరాయల అనంతరం విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన అచ్యుత దేవరాయల మంత్రుల్లో ఒకడైన నంజయ తిమ్మరుసు ఈ రాధామాధవకవి రచించిన 'తారక బ్రహ్మరాజీయము'ను తన ఇష్టదైవమైనశ్రీరామ విభునికి కృతిగా ఇవ్వమని కోరినట్లు "పరమహితుఁడవు....నాకభిమతముగ," అనే తారకబ్రహ్మ రాజీయములోని పద్యంవల్లా అచ్యుతదేవరాయల ఆశ్రయాన్ని పొందినట్లుకూడా తెలుస్తుంది. ఇంతవరకు ఈ కవి రచించిన మూడు గ్రంథాలు లభించాయి. అవి 1. రాధామాధవము; 2. విష్ణుమాయావిలాసము; 3. తారకబ్రహ్మరాజీయము.

ఒకప్పుడీకవి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానానికి వెళ్లగా అల్లసాని పెద్దనార్యుడు 'నగరు, తగరు, తొగరు, వగరు' అనే పదాల్ని ప్రాసస్థానంలో ఉంచి రామాయణ పరంగా పద్యాలు చెప్పమన్నాడట. వెంటనే ఆశువుగా "నగరు పగాయె నింక విపినంబుల కేఁగుఁడు........" అనే రమ్యమైన పద్యాన్ని చెప్పి సభలో ఉన్నవారిని అందర్నీ ఆనందపరిచాడట! తర్వాత భారత భాగవత పరంగాకూడా చెప్పినట్టు కృష్ణదేవరాయలు అతన్ని విశేషంగా మెచ్చుకొని బహూకరించినట్లు కవిజీవితాదుల వల్లా తెలుస్తుంది.

ఎల్లనార్యుని ఇష్టదైవం మదనగోపాలస్వామి. అందువల్లా ఈ కావ్యాన్ని అతనికే అంకిత మిచ్చాడు. ఈ కవి తన గ్రంథంలో ఇష్టదేవతాస్తుతిలో దేవీ సహితులైన విష్ణు, శంకర, బ్రహ్మల్ని క్రమంగా స్తుతించి తర్వాత గణనాయకుల్ని స్తుతించాడు. తర్వాత వాల్మీకి, నన్నయ, తిక్కన, శంభుదాస, శ్రీనాథుల్ని మాత్రం కీర్తించాడు. ఈ గ్రంథంలో ప్రథమాశ్వాసంలోని 17వ పద్యాన్ని మొదలుకొని 27వ పద్యంవరకు ఉన్న అవతారికాభాగాన్ని పరిశీలిస్తే ఇతడు విష్ణుభక్తుడని చెప్పవచ్చు.

కథాసంగ్రహం :

రాధామాధవము 5 ఆశ్వాసాల పద్య కావ్యం. ఇందులో సహస్రగోపుని కూతురు రాధ, కృష్ణావతారాన్ని ధరించిన విష్ణువు, నాయికానాయకులు. లోక సంరక్షణార్థం శివుడు, మహావిష్ణువును కృష్ణునిగా లక్ష్మీదేవిని రాధగా భూలోకంలో జన్మించమని చెప్తూ, మదనగోపాలుని వేషంలో చేయవలసిన తన కర్తవ్యాన్ని తెలియజేస్తాడు; ఇంద్రాది దేవతల్ని పిలిచి వారిని, వారి భార్యల్ని కృష్ణుని సేవార్థం గొల్లల రూపాల్ని ధరించి అతనికి సేవచేయమని, శేషుడు బలరాముడు పేరుతో కృష్ణునికి అగ్రజుడుగా జన్మిస్తాడని చెప్పి, నిష్క్రమిస్తాడు.

కొంతకాలానికి విష్ణువు భూలోకంలో దేవకీ వసుదేవుల కుమారుడుగా జన్మించి నందయశోదల దగ్గర రేపల్లెలో పెరుగుతుంటాడు. చిన్నతనంలోనే

పూతన అనే రాక్షసిని, తృణావర్త, వృష, ధేనుకాది రాక్షసుల్ని సంహరిస్తాడు. గోవర్ధన పర్వతాన్ని వేలితో ఎత్తిపట్టి ఇంద్రప్రేరితమైన రాళ్ళవర్షంబారినుంచి, కాళీయగర్వాన్నిహరించి తద్విషభయంనుంచి రేపల్లెలోని జనాన్ని కాపాడుతాడు. ఆశ్చర్యాన్ని కలిగించేవిధంగా బాల్యక్రీడల్ని జరుపుతూ శుక్లపక్షచంద్రుడువలె పెరిగి యవ్వనవంతుడై మూడు లోకాల్లోని కామినీమణుల హృదయాల్ని లోబరచు కొంటాడు.

ఇదేవిధంగా లక్ష్మీదేవి రాధ అవతారంలో సహస్రగోపుని కూతురుగా జన్మించి గొప్ప గుణగణాలతో, అందచందాలతో పెరిగి పెద్దదౌతుంది. వెలికత్తెల ద్వారా కృష్ణునిగూర్చి విని అతన్ని ప్రేమిస్తుంది. నారదమహామునిద్వారా రాధ అందాన్నిగూర్చి కృష్ణుడు వింటాడు. మధురవాణి దౌత్యంవల్లా రాధామాధవులకు తాము పరస్పరం ప్రేమించుకున్నట్లు తెలుస్తుంది. నారదమహామునిని, తన కూతురు రాధకు తగిన వరుని చూడమని సహస్రగోపుడు కోరగా కృష్ణుడు తప్ప వేరెవరూ రాధకు తగిన వరులు కారని ఆ దేవముని తన నిర్ణయాన్ని చెప్తాడు. తర్వాత స్వయంవరం, చిలుక రాయబారం జరుగుతాయి. కృష్ణునికి తన సోదరి రాధను ఇవ్వటం ఇష్టంలేని భద్రకుడు అడ్డుపెడతాడు. అప్పుడు కృష్ణునితో యుద్ధం జరుగుతుంది. తర్వాత కృష్ణుని విజయం, రాధతో వివాహం, శృంగార లీలల వర్ణనలతో కథ పూర్తవుతుంది.

వస్తుతత్త్వం :

రాధామాధవుల పరస్పర ప్రేమని వర్ణించే గ్రంథాలు చాలా వచ్చాయి. అందులో కృష్ణదాసు రాధామాధవ విలాసం, ఎడపల్లి వేంకటపతి రాధామాధవ సంవాదం, సముఖము వేంకటకృష్ణప్పనాయని రాధికా సాంత్వనం, ముద్దుపళని రాధికా సాంత్వనం, శ్రీ గోపీనాథము వేంకటకవి రాధికా పరిణయం మొదలైనవి ప్రసిద్ధంగా కనబడతాయి. కాని వాటికీ ఎల్ల నార్యుని రాధామాధవానికి కథావస్తువు తత్త్వంలోనే భేదం ఉంది. ఎల్లనార్యుడు రాధని కేవలం ఆదిలక్ష్మి అవతారంగా, శ్రీమహావిష్ణువుని మాధవుడుగా ప్రతిపాదించాడు. ఇతర గ్రంథాల్లో రాధ, శ్రీకృష్ణుడికి మేనత్త అయినట్లు తనకన్నా చిన్నవాడైనా కృష్ణుణ్ణి ప్రేమించినట్లు ఉంది. వీటిలో రాధ పరకీయ ; కృష్ణునికి స్వీయ కాదు. దేవీ భాగవతంలోను, బ్రహ్మవైవర్త పురాణంలోను రాధ పరాశక్తి రూపమని చెప్పబడింది. ఆమె మహిమోత్కృష్టత విశేషంగా వర్ణింపబడింది. ఎల్లనార్యునికి ఇదే ఆధారమైనా ఇతడు కొన్ని మార్పులతో రాధామాధవ పాత్రలను ఉత్తమోత్తమంగా పోషించి, తన గ్రంథాన్ని భక్తి శృంగార రసబంధురమైన ప్రబంధంగా రూపొందించి ధన్యుడయ్యాడు.

పాత్ర చిత్రణ వర్ణనలు :

రాధామాధవ కవిత్వం సహజధారావిలసితమై, మృదుమధురపదగుంఫితమై ప్రౌఢమై, హృదయంగమమై ఇతనికిగల ఆంధ్ర గీర్వాణ భాషాపాండిత్య విశేషాన్ని తెలియజేస్తుంది. హృదయాన్ని ఆకర్షించగల అపూర్వ భావసౌందర్యాన్ని కలిగించే వినూత్న కల్పనలు ఇందులో తరచుగా కనబడతాయి. ఈ గ్రంథంలో కవి తన కవితామాధుర్యాన్నిగూర్చి ఈ విధంగా రాస్తాడు.

> "సరసులు ! చిత్తగింపు(డని చాటను మామక వాణి సన్మనో
> హరయగు నేనివారి హృదయం బులకింపొనరింపకున్నె ? యె
> వ్వరు పిలువంగ వచ్చి యళివర్గము లాత్మల( జొక్కు దేనియల్
> గురియు ప్రసూనగుచ్ఛభర కుంచితమల్లి మతల్లి కావనిన్"
>
> [1–16 ప.]

ఇందులో ప్రదర్శించుకొన్న ఆత్మగౌరవానికి తగినట్లుగానే, ఈమనోహర ప్రబంధ రాజం రసనిర్భరమై ఉంది. ఈ రాధామాధవ కావ్యాన్ని వీనులారవిని మనసార ఆమోదించి, శ్రీకృష్ణ దేవరాయలు ఈకవిని 'రాధామాధవుడని' ప్రశంసించాడు. ఇదే విధంగా రాధామాధవ కవి కూడ కృష్ణరాయని 'కవితా శ్రీలోల' త్యాది విశిష్ట గుణపూర్ణతని మెచ్చుకొని, రాధామాధవ కావ్యంలో —

> "మఱచిరి గృహకృత్యంబులు,
> మఱచిరి లజ్జాభయములు, మఱచిరి మగలన్,
> మఱచిరి సర్వము గోపిక
> లఱిముఱి శ్రీకృష్ణరాయ(డాత్మ( గరంపన్." [1–106 ప.]

అని తన ఇష్టదైవమైన శ్రీకృష్ణ దేవునికీ, శ్రీకృష్ణ దేవరాయలకీ, అభేదాన్ని పాటిస్తూ వ్యవహరించి, ఆ మహారాజు మీద తనకున్న గౌరవాన్ని వ్యక్తం చేశాడు.

> "వాక్యములిట్లయౌ ! హృదయవాసన యెట్టిదొకాని ! శౌరితో
> నైక్యము గల్గెనేని వినవమ్మ ! సువర్ణకలాప యుక్తమా
> ణిక్యశలాకవోలె రమణీయత( దాల్పవెనీవు ? నవ్యచం
> ద్రకృధి రాజ బద్ధసమతా భరణక్షమ కేశమంజరీ !" [2–90 ప.]

> "ఏ(టికి ననుమానించెదు ?
> జోటీ ! యామేటి(గవయ(జూడక యొరునిం
> గేట సమానుని మదిలో(
> బాటింతునె ? హరిణి వృకముపై( బడ(జనునే ?" [2–92 ప.]

పై పద్యాల్లో, దూతిక అయిన మధురవాణి, రాధా దేవి మనసుని పరీక్షించటానికి చూపించిన నేర్పుని, రాద తన అభిప్రాయాన్ని వెల్లడి చేయడంలో చూపిన నిశ్చిత త్వాన్ని కవి ఎంతో రమ్యంగా వ్యక్తీకరించాడు.

ద్వితీయాశ్వాసంలో రాధాదేవిని గూర్చి వర్ణిస్తూ —

"అబల వేనలిలోని యర్ధభాగముగాదె
పరగఁ జాచినఁగృష్ణ పక్షతమము ?
హరిమధ్యగతిలోని యష్టభాగముగాదె
తక్కిన యైరావతంపు నడక ?
సుదతి ఫాలములోని షోడశాంశముగాదె
హరు మౌళి శశిఖండ మరసి చూడ ?
లోలాక్షి చూపులలోని వేయవ పాలుగాదె
శంకింపంగఁ గమల దళము ?

కోకములు, పాట లాధరగురు కుచములు
వియ్యములుగావె ? వెడవిల్తు వింటి నారి,
కామినీ మణినూఁగారుఁ గవలు గావె ?
యెట్లు వర్ణింపవచ్చు నీయిందుముఖిని ?" [2-58 ప.]

అంటాడు. ఈ పద్యంలో రాధా దేవి లోకోత్తర సౌందర్యం, పరమోత్కృష్టము, దివ్యతమము అయినట్లు, అద్భుతంగా, అతి ప్రౌఢంగా అనుభవ గమ్యంగా వర్ణించాడు.

వాగ్దేవి శ్రీకృష్ణుని స్తోత్రం చేసే సందర్భాన్ని కవి రమ్యంగా రచించాడు, ఈకవి ఏవిషయాన్నైనా కళ్ళకు కట్టినట్లు తనరచనలతో నిరూపిస్తాడు అనటానికి ఈ కింది పద్యాన్ని ఉదాహరణగా తీసుకోవచ్చు.

"పసిఁడి పావల మీఁద నొసపరిమువ్వంక
బాగున దివ్య రూపంబు దనర,
డాపలి కర్ణకుండల మొకించుక వ్రాలి
యంస దేశంబున నత్తమిల్లఁ,
దిర్యక్కృతంబులై తీగ వెన్నెల మించు
తళుకుఁ జూపులు కెలంకుల నటింప,
లాలితో దంచిత భ్రూలతా యుగళి
నేర్పడి న వళిత్రయీ ఫాలమలర

రాధికా భుజ నిహితదోర్దండుఁడైన
మంచి తాంగుళి పల్లవ న్యాసములను
రంధ్ర ముఖముల సప్తస్వరములు గూర్చి
మురళి వాయించె నాజగన్మోహ నుండు." [5-192 ప.]

అమృతోపమానమైన ఈ మనోహర పద్యరాజంలో ఈ రాధా మాధవకావ్య సర్వస్వం మూర్తీ భవించిఉంది. ఈ మధుర మోహన మురళీగాన జనితమైన ఆనందం, పాఠకలోకాన్ని తన్మయ భావంతో పరవశింప జేస్తుంది.

ఈ కవికి శ్రీనాథుని కవితపై మక్కువ ఉన్నట్లు కనబడుతుంది. నైషధంలో దమయంతి దూతయైన హంసతో—

"అనల సంబంధ వాంఛ నా కగున యేని
అనల సంబంధ వాంఛ నాకగును జువ్వె"

అని పలికినట్లే మన రాధామాధవంలో రాధ మధురవాణితో

"కృష్ణవర్త్మాభి ముఖతఁ దక్కించి రేని
కృష్ణవర్త్మాభి ముఖతఁ దక్కింపఁగలరె" [2 95 ప.]

అని చెప్పింది. చతుర్థాశ్వాసంలో స్వయంవరరాజ వర్ణన, నైషధంలోని రాజవర్ణనాన్ని గుర్తుకి తెస్తుంది.

ఇదేవిధంగా ఈ రాధా మాధవకథా విధాన మంతా పోతనభాగవతంలోని రుక్మిణీకల్యాణకథా ప్రణాళికని అనుసరించి రచించినట్లున్నది. రుక్మిణీకల్యాణంలో తన తండ్రిఇంటికి వచ్చే అతిథి జనులవల్ల కృష్ణుని రూపబలగుణాదుల్ని విని రుక్మిణికి అతని మీద ప్రేమ జనిస్తుంది. అదే విధంగా చెలికత్తెలవల్ల మదనగోపాల లీలా, రూపలావణ్య తేజోగుణాల్ని రాధ విని మోహపరవశ అవుతుంది. రుక్మిణీ కల్యాణంలో బ్రాహ్మణరాయబారానికి సరిగా రాధామాధవంలో చిలుక రాయబారం నడుపుతుంది. భీష్మకుడు తనకూతురు రుక్మిణిని కృష్ణునికి ఇవ్వటానికి ఒప్పుకొంటాడు. కాని పుత్రుడు రుక్మి తిరస్కరిస్తాడు. రాధా మాధవంలో సింహాద్రి గోపుడు తన కుమార్తె రాధని కృష్ణునికి ఇవ్వటానికి నిశ్చయిస్తే పుత్రుడైన భద్రకుడు అడ్డగిస్తాడు. వధువును ఎత్తుకొని పోయేటపుడు శత్రురాజులు ఎదు ర్కోవటం, వారిని ఓడించి బావమరదిని భంగపరచటం, రెండిట్లో సమానమే. ఆతర్వాత కల్యాణమహోత్సవం జరిగినట్లుంది. కథాసంవిధానంలో ఈ విధంగా రెండు రచనలూ సాదృశ్యాన్ని కలిగిఉన్నాయి. పద్యరచనలో కూడా రెండింటికి పోలికలున్నాయి. ఇదేవిధంగా నన్నెచోడుఁడు మొదలైన మహా కవుల పద్యాలను తలపించే పద్యాలు, రాధామాధవంలో చాలా ఉన్నాయి.

రసం, శైలి :

ఈకావ్యంలో ప్రధానరసం శృంగారరసం. కవిత మృదు మధురం. ఇతని కవిత్వంలో దీర్ఘసమాసాలుగాని, కేవల శబ్దాలంకారాలుగాని, అస్వా భావిక వర్ణనలుగాని కనబడవు. మధురమైన పదాలతో కవిత్వం వినటానికి ఇంపుగాఉం టుంది. ఇందులోని పద్యాలు కొన్ని ఇతర ప్రబంధంలోనేకాకుండా, భావరీతిలో కూడా ఐక్యాన్ని సూచించే విధంగా ఉన్నాయి. మొత్తంమీద కావ్యమంతా ప్రౌఢమై, ద్రాక్షాపాక లలితమై, మనసుని కదిలించే విధంగాఉంది.

కవివ్యక్తిత్వం :

ఇతని కావ్యాన్ని పరిశీలిస్తే ఇతడు విష్ణు భక్తుడని చెప్పడానికి అవకాశంఉంది. కాని ఇతడు మతభేదాన్ని పాటించినట్లులేదు. వైకుంఠనగరంలో శివుడు, విష్ణువు, కలుసుకునే సందర్భాన్ని వర్ణిస్తూ ఇతడు శివకేశవుల ప్రాధాన్య విషయంలో భేధాన్ని చూపలేదు. ఉపరి, విష్ణుదేవుని చేతనే హరిహరా భేదతత్త్వాన్ని ప్రతిపాదింపజేశాడు.

## కొన్ని పదాలకు అర్థాలు

అంసదేశము = భుజ ప్రదేశం
అత్తమిల్లు = పడు
అలిమలి = కలత
అళి = తుమ్మెద
ఇందుముఖి = చంద్రుని వంటిముఖం కలది
ఒసపరి = సుందరుడు
కలాపము = ఒడ్డాణం
కుంచిత = వంచబడిన
కృష్ణ వర్త్మ = అగ్ని
కెలఁకు = పక్క
జోటి = ఆడది
డాపల = ఎడమవైపు
తమము = చీకటి
తిర్యక్కృతము = తిరస్కరించబడిన
నిహిత = ఉంచబడిన
నూఁగారు = పొట్టమీది వెంట్రుకలు
న్యాసము = ఉంచటం
పల్లవము = చిగురు

పసిఁడి = బంగారం
ప్రసూన = పువ్వు
పాటల = తెలుపునుమించినఎరుపు
ఫాలము = నుదురు
యుగళి = జత
లోలాక్షి = చలించే కనులుకలది
వళి = ముడత
వృకము = తోడేలు
శలాక = కడ్డీ, తీగ
శశి = చంద్రుడు
షోడశాంశము = చంద్రకళ
సుదతి = స్త్రీ
హరిణి = లేడి.

## ఆధార గ్రంథాలు


1. శ్రీరాధామాధవము — చింతలపూడి ఎల్లనార్యుడు
2. మాధురీమహిమ — శ్రీపిల్లలమఱ్ఱి వేంకటహనుమంతరావు
3. చింతలపూడి రాధామాధవకవి — శేషాద్రిరమణకవులు, 1930 భారతి — సెప్టెంబరు 7 (9)
4. రాధామాధవము — శ్రీనిడదవోలు వెంకటరావు, 1936, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 25 (2) 73
5. శ్రీ చింతలపూడి ఎల్లయ కవి—రాధామాధవుడు (బిరుదము) 1925, భారతి — ఏప్రిల్, 2 [4] క్రోధనచైత్ర, 65,67.

# చిత్రభారతము — చరిగొండ ధర్మన

సమీక్ష : కుమారి ఢరిగి అన్నపూర్ణ, ఎం.ఏ.

[జన్మస్థలం — విజయనగరం, విజయనగరంజిల్లా, జననం 8–1–1956. ఎం.ఏ. 'చిత్రభారతం—విమర్శనాత్మక పరిశీలనము' అనే అంశంపై పిహెచ్.డి. పట్టానికి పరిశోధన — తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు. ప్రచురణలు : చిత్రభారతము - చిత్తాబుఖాను, సంస్కృతాంధ్ర సాహిత్యములలో సత్యభామ, మొదలగు వ్యాసాలు 'నవభారతి' సాహిత్యమాసపత్రికలో ప్రచురింపబడ్డాయి. రేడియోప్రసంగాలు 'ఎఱ్ఱాప్రగడ సాహితీవ్యక్తిత్వం,' 'విశ్వవిద్యాలయంలో ప్రేమ పెళ్ళికి ఎంతవరకు దారితీస్తోంది'.]

కవిజీవితాదులు :

మహాభారతాన్ని తెలియనివాళ్ళుండరంటే అతిశయోక్తికాదు. అది అందరికీ పరిచితమైందే. అలాంటి భారతంలోని ప్రసిద్ధపాత్రల్ని తీసుకుని విచిత్రంగా మలచిన కావ్యం 'చిత్రభారతం.' దీన్ని చరిగొండ ధర్మన వ్రాశాడు.

ఇతని నివాసం తెలంగాణాలోని చరిగొండ గ్రామం. ఇతను క్రీ.శ. 1470-1530 ప్రాంతాలకు చెందినవాడు. ఇతని తండ్రి తిమ్మనమంత్రి. తల్లి మాదమ. గురువు భట్టపరాశర ప్రభురంగ గురుడు.

ఇతను తన కావ్యాన్ని ఎనుములపల్లి పెద్దయామాత్యుడికి అంకితంచేశాడు. ఈ పెద్దయ ఓరుగంటిని పరిపాలించిన చిత్తాబుఖాను ప్రభువుకి మంత్రి.

ధర్మనకి 'శతలేఖినీ సురత్రాణ' మనే బిరుదు ఉంది. ఇతను గొప్ప విష్ణుభక్తుడు.

చిత్రభారతంలో ఎనిమిది ఆశ్వాసాలున్నాయి. పదమూడు వందల పద్యాలుగల గద్యపద్యాల్లో ఈ కథ నడిచింది. సూతుడు శౌనకాది మునులకు చెప్పిన ఈ కథని శుకమహర్షి ఇలావంతుడికి చెప్పాడు.

కథాసంగ్రహం :

పూర్వం తుల్యుడనే ముని శ్రీమహావిష్ణువును గురించి తపస్సుచేస్తూండగా, అతనికి తపోభంగం కలిగించడానికి దేవేంద్రుడు రంభను పంపించాడు. తుల్యుడు

కోపంతో ఆమెను గుఱ్ఱమైపొమ్మని శపించాడు. అప్పుడు రంభ శాపవిమోచనాన్ని అనుగ్రహించమని ప్రార్థించింది. కుండిన నగరాధిపతి అయిన చతుర్ధన మహారాజుకి వాహనమై ముల్లోకాల్నీ త్రిప్పిచూపించిన వెంటనే నిజరూపాన్ని పొందగలవని చెప్పాడు తుల్యుడు.

ఆ తర్వాత రంభ అశ్వరూపాన్ని ధరించి చతుర్ధనుడికి వాహనమై ఆకాశ మార్గంలో సంచరించసాగింది. ఆ గుఱ్ఱంనోటినుండి వచ్చిన నురుగు యమునా నదీతీరంలో సూర్యుడికి అర్ఘ్యమిస్తున్న కృష్ణుడి దోసిట్లో పడింది. కృష్ణుడు కోపించి ఈ అపచారానికి కారణమైన వాణ్ణి ఒక్క నెలలోగా సంహరిస్తానని ప్రతిజ్ఞచేసాడు.

చతుర్ధనుడికి ముల్లోకాలూ చూపించిన రంభ తక్షణం నిజరూపాన్ని ధరించింది. తన శాపం తీరిపోవడానికి కారకుడైన ఆ రాజుకి 'నారాయణ మంత్రా'న్ని ఉపదేశించి మాయమైంది.

కృష్ణుడి ప్రతిజ్ఞను నారదుడిద్వారా విని చతుర్ధనుడు భయకంపితు డయ్యాడు. నారాయణ మంత్రాన్ని విధి విధానం ప్రకారం ఆచరించి, తన్ను రక్షించవలసిందిగా దేవేంద్రుణ్ణి ప్రార్థించాడు. అప్పుడు దేవేంద్రుడు 'పారిజాతాప హరణ వృత్తాంతా'న్ని వివరించి కృష్ణుణ్ణి ఎదిరించేశక్తి తనకు లేదన్నాడు. చతుర్ధనుడు శివుణ్ణి ఆశ్రయించాడు. శివుడు కూడా శ్రీకృష్ణుడినుంచి కాపాడేశక్తి తనకులేదని 'బాణాసుర వృత్తాంతా'న్ని చెప్పాడు. చతుర్ధనుడు బ్రహ్మను శరణు వేడుకున్నాడు. బ్రహ్మ, ఒకప్పుడు తానూ కృష్ణుడి చేతిలో భంగపాటుపొందిన వాణ్ణేనని, కాబట్టి చతుర్ధనుణ్ణి రక్షించేశక్తి తనకు లేదని చెప్పాడు.

ముల్లోకాలూ తిరిగినా తన్ను రక్షించేవాళ్లులేరని నిరాశచెందిన చతుర్ధనుడు చివరికి అర్జునుణ్ణి శరణు వేడుకున్నాడు. తాను ఎవరినుంచి రక్షణకోరుకుంటున్నాడో అర్జునుడికి ముందుగా చెప్పలేదు. విషయం తెలియకుండానే అర్జునుడు అభయ మిచ్చాడు. చతుర్ధనుణ్ణి రక్షిస్తానని శపథంచేశాడు.

ఈ కారణంవల్ల యాదవ బలానికి కౌరవపాండవ సైన్యాలకి ఘోరయుద్ధం సంభవించింది. యాదవులకి శ్రీకృష్ణుడు నాయకుడుకాగా, అర్జునుడు కురుపాండ వుల సేనాపతి అయ్యాడు. యుద్ధంలో అర్జునుడిపక్షంలో ధర్మరాజు తప్ప తక్కిన వాళ్ళందరూ మరణించారు. అప్పుడు కృష్ణుడు మరణించినయోధుల్లో ఒకణ్ణి బ్రతికిస్తానన్నాడు. ధర్మరాజు సంతోషంతో 'శరణాగతుడైవచ్చిన చతుర్ధనుణ్ణి బ్రతికించమ'ని కోరుకున్నాడు. శరణాగత ధర్మానికి, సత్యవ్రతానికి నిలబడిన ధర్మరాజునిచూసి సంతోషంతో శ్రీకృష్ణుడు యుద్ధంలో మరణించిన వాళ్ళందర్నీ తిరిగి బ్రతికించాడు. చిత్రంగాముగిసిన ఈ భారతకథకు 'చిత్ర భారతం' అని పేరుపెట్టాడు ధర్మన.

వస్తుతత్త్వం :

ఈ కథ చాలావిచిత్రమైంది. దీనికి మూలం బ్రహ్మాండ పురాణంలో ఉందని కవి స్వయంగా చెప్పుకున్నాడు (1-11). ఈ చిత్రభారతంలో సందర్భోచితంగా పారిజాతాపహరణ కథ, ఉషాపరిణయగాథ, బ్రహ్మ భంగపాటు మొదలైనవి ప్రస్తావించబడ్డాయి. అయినా ఇందులోని వస్త్వైక్యానికి భంగం కలుగలేదు. ఈ కథలో భారతంలోవలెనే కురుక్షేత్రయుద్ధం పద్దెనిమిదిరోజుల్లో జరిగినట్లు వర్ణించబడింది. శరణాగత రక్షణమనే ధర్మం ఎంతగొప్పదో ఈ కథద్వారా చక్కగా నిరూపించాడు కవి.

రసం :

శరణాగతరక్షణమనే ధర్మాన్ని నిర్వర్తించడానికి పాండవులుచేసిన విశేషమైన ప్రయత్నమే ఈ కథకు జీవం. అదే వీరరసం. ఇందులో కేవలం యుద్ధవీరమేగాకుండా, తుల్యుడిలో తపోవీరం, సహదేవరాయబారంలో మానవీరం పోషింపబడ్డాయి.

> "సకలరాజన్య చారు కిరీట ఘృష్ట పాద ద్వంద్వుడగు సుయోధనుని కంటె;
> మత్ప్రాణసములు భీమప్రతాపులునైన మరుదుద్భవాది సోదరులకంటె ;
> పరమపుణ్యులు కృపాపరులైన కర్ణగాంగేయ గురుద్రౌణి కృపుల కంటె ;
> బలవంతులగు మత్స్యపాంచాల కేకయ పాండ్యాది విశ్వభూపతుల కంటె ;
> నిష్ఠురుడైనట్టి కుండినాధీశునిమ్మ ; చాలునిదియె సమస్తవిశ్వంభరాధి
> పత్యమిచ్చుట, యేరికిఁబడయరాని బ్రహ్మ పదమునొసంగుట పద్మనాభ !"
> (8-115)

అని శరణార్థియైవచ్చిన చతుర్ధనుణ్ణి బ్రతికించమని కోరుకున్న ధర్మరాజులో ధర్మవీరం ప్రస్ఫుటమైంది.

వీరరసమొక్కటేగాక, ఇంకా ఇందులో ఉషాఅనిరుద్ధుల కథలో శృంగారం, తన్ను రక్షించవలసిందిగా చతుర్ధనుడు దేవతల్ని దీనంగా ప్రార్థించడంలో కరుణరసం, చతుర్ధనుడు అశ్వారూఢుడై ముల్లోకాలూ తిరిగే సందర్భంలో అద్భుతరసం, యుద్ధవర్ణనల్లో భీభత్స, రౌద్ర, భయానకరసాలూ సమయోచితంగా పోషింపబడ్డాయి.

పాత్రచిత్రణ :

శ్రవ్యకావ్యమే అయినా దృశ్యకావ్యంలో వలే పాత్రచిత్రణలో తనప్రజ్ఞను కనఁబరచాడు ధర్మన. ఇందులో పాత్రలసంఖ్య ఎక్కువ అనే చెప్పాలి. [illegible]

పాత్రలుకూడా కన్పిస్తాయి. ఇవికాక ప్రసంగవశాన వచ్చిన పారిజాతాపహరణ కథలో సత్యా కృష్ణుల పాత్రలు, ఉషాపరిణయగాథలో అనిరుద్ధుడు, ఉషాకన్య, బాణాసురుడు కన్పిస్తారు. ఈ ప్రబంధంలో నాయికపాత్ర లేదు.

కథా ప్రారంభంలో తుల్యుణ్ణి పరిచయంచేస్తూ, ఆ మహర్షి సుఖ దుఃఖాల్ని సమానంగా భావించగలవాడు, శత్రుమిత్రుల విషయంలో ఒకేవిధంగా ఉండ గలడని చెప్తూ, సమభావంతో వ్యవహరించడంవల్ల, అతనికి తుల్యుడనే పేరు సార్థకమైందని పేర్కొన్నాడు (1-46).

చతుర్దనుడు, నారదుడిద్వారా శ్రీకృష్ణుడిప్రతిజ్ఞ విని

"ఏటికి వేఁటఁబోయితట నేటికి మాయవుఁదేజిఁగంటి ? నే
నేటికి దానిఁబట్టికొన నేటికి నెక్కితి నిత్తెఱంగు నా
కేటికి వచ్చె ? నివ్విధికి నెవ్వని పాదము పట్టికొందు నీ
వేఁటయు నన్నుఁబొందు పృథివీపతి భంగిఁగలంచె దైవమా !"

(5-66)

అని విచారించే సందర్భంలో ఆ పాత్ర పొందిన మానసిక వేదనని కవి చక్కగా చిత్రించాడు.

అర్జునుడు ముందుగా అభయమిచ్చి, తరువాత చతుర్థనుణ్ణి తాను రక్షించ వలసింది శ్రీకృష్ణుడిబారినుంచి అని తెలిసినప్పుడు అతనుపొందిన మనస్తాపాన్ని ధర్మన చక్కగా వర్ణించాడు.

"ఆ నరనాథు వాక్యము భయంకరమై తన వీనులందును
గ్రానల కీలసోకిన క్రియం బరితాపమునొంచ జేయఁగ
న్గోనల నశ్రులుప్పతిల గుండెలు జల్లన వెచ్చనూర్చుచు
న్మానసవీథిఁజింతిలుచు మ్రాన్పడియుండె నరుండు దుఃఖియై"

(5-198)

ఇందులో అర్జునుడిబాధ, భయం ఏమీచేయలేని నిస్సహాయత, పరితాపం మొదలైన భావాలతో కూడిన అతని విచారవదనం కన్నులగట్టినట్లు కన్పిస్తోంది.

పాండవుల్లో పెద్దవాడైన ధర్మరాజు, కడగొట్టువాడైన సహదేవుడుకూడా ఈ కావ్యంలో సముచితంగా చిత్రించబడ్డాడు. వాళ్ళ సంభాషణలద్వారా ఆ పాత్రల మనస్తత్వాల్ని చక్కగా నిరూపించాడు కవి. పాండవమధ్యముడైన అర్జునుడు శరణాగత రక్షణ ధర్మాన్ని నిర్వర్తించాలనుకున్నాడు. అందుకు స్థిరంగా కట్టు బడి నిలబడ్డారు అన్నదమ్ములు అయిదుగురూ. సహదేవుణ్ణి శ్రీకృష్ణుడి దగ్గరకి రాయబారిగా పంపిస్తూ రాయబారం అనుకూలించకపోయినా, యాదవులు మితి మీరి మాట్లాడినా బెదరకుమని వెన్నుతట్టి ప్రోత్సహించాడు ధర్మరాజు. వీరోచిత

ప్రసంగం చేసి తమప్రతిష్ఠను కాపాడమని తమ్ముడికి సూచించాడు. ధర్మరాజు పౌరుషం, రాజనీతిచాతుర్యం, ధర్మవీరదీక్ష ఈ మాటల్లో వ్యక్తమవుతున్నాయి. అన్న చెప్పినమాటను అక్షరాలా పాటించాడు సహదేవుడు. యాదవుల కొలువు కూటంలో రాయబారిగా నిలబడి మొదట సౌమ్యంగా నచ్చచెప్పాడు. 'యుద్ధం వద్ద'న్నాడు. 'శరణన్నవాడి కాశ్రయమివ్వాలిమేగాని, నీతోమాకు వైరంలేదే ?' అన్నాడు. అయినా యాదవులుతిరస్కారంగా మాట్లాడినప్పుడు అంతకంటె రోషంగానే సమాధానమిచ్చాడు.

యాదవ సభలో రాయబారిగా వచ్చిన సహదేవుణ్ణి బలరామకృష్ణులు లెక్క చెయ్యలేదు. 'నా అండదండలున్నప్పుడే అర్జునుడు శివుడంతటివాడు. నా సహాయం లేకపోతే కేవలం మానవుడే' (6-147) అన్నాడు కృష్ణుడు. అదివిని అదిరిపడ్డాడు సహదేవుడు. తమను చులకన చేసినందుకు రెచ్చిపోయాడు. 'గురుదక్షిణ కోసం ద్రుపదుణ్ణి బంధించి తెచ్చినప్పుడు, మత్స్య యంత్రాన్ని కొట్టినప్పుడు, ద్రౌపదికోసం రాజులందర్నీ జయించినప్పుడు, సైంధవుడి గర్వాన్ని అణచినప్పుడూ అర్జునుడికి నీసహాయం ఎక్కడుంది ?' [6-149] అంటూ తగిన సమాధానం చెప్పాడు. రాయబారిగా సహదేవుడి పాత్రను సమర్థ వంతంగా నిర్వహించాడు ధర్మన.

ప్రధానకథలోని పాత్రల్నే కాకుండా ప్రసంగవశంగా వచ్చిన కథల్లోని పాత్రల్ని కూడా కవి నేర్పుతో చిత్రించాడు. పారిజాతాపహరణ కథలోని సత్యభామ పాత్ర ఇందుకు చక్కని ఉదాహరణ. పారిజాతపుష్పాన్ని శచీదేవి సత్యభామ కివ్వకుండా, మానవకాంతలకు అర్హతలేదని నిందించింది. అప్పుడు సత్యభామ ఏడుస్తూ తనబాధను కృష్ణుడితో చెప్పిన సందర్భంలో ఆమె అమాయ కత్వాన్ని, పసిపిల్ల మనస్తత్వాన్ని నిరూపించాడు ధర్మన (5-95). అలాగే ఉషా అనిరుద్ధుల కథలోని పాత్రల్ని కూడా తగినరీతిలో మలచాడు కవి. పాత్రచిత్రణలో ఇతని నైపుణ్యం ప్రశంసనీయం.

శైలి :

చదివిన వెంటనే పఠితల హృదయాల్ని ఆకట్టుకునే రచనావిధానాన్నే 'శైలి' అంటాం. సత్రయాగానికి వచ్చిన మునుల్ని ఒక సీసపద్యంలో వర్ణిస్తూ "అరుణ జటాబంధ ధరులు, భస్మత్రిపుండ్రాంకితాలికులు, కృష్ణాజినోత్తరీయులు, వల్క కౌశేయులు, రుద్రాక్షభూషితదేహులు...." (1-6) ఇత్యాదిగా గలవాళ్ళు వచ్చారని చెప్పాడు. ఇందులో ఏ పదసమూహాన్ని తీసుకున్నా మునిరూపం గోచరిస్తుంది. మొత్తంమీద అన్నింటినీ సంఘటించి చూసినా మహర్షుల సంపూర్ణ చిత్రం కన్నులముందు మెదులుతుంది. ఇదే ఇక్కడి రచనలో వున్న చమత్కారం.

ఉషాకన్య అనిరుద్ధుణ్ణి కలలోచూసి విరహంతో ఎదుటలేని అతనితో మాట్లాడే సమయంలో "వెన్నెలచేత నాకనుంగలువల మోడ్పుమాన్పుము" అంటుంది (5-114). కలువలు వికసించాలంటే చంద్రుడు రావాలి. అంటే ఆమె కళ్ళలో ఆనందం కన్పించాలంటే అనిరుద్ధుడు రావాలి. కళ్ళను కలువల తోను, అనిరుద్ధుణ్ణి వెన్నెలతోను పోల్చి చెప్పడం మనోహరంగా ఉంది. "ముంచేతి కంకణముల కద్దమేల." "నూనియతోడి కప్పురపు నుగ్గు తెఱంగున," "హస్తిమశకాంతర మెరసిచూడ," "క్షీరమున్‌నీరముబోలె," "నాల్కపై నువ్వు గింజైన నాననట్టి...." మొదలైన లోకోక్తుల్ని సందర్భోచితంగా ప్రయోగించాడు. "పదియైదునాళ్ళపని, రెండొక్కడిగాగచేసె, పిచ్చుకమీద వేయుదురె బ్రహ్మా స్త్రంబు...." మొదలైన జాతీయాలతో రచన సాగించాడు.

కొన్నిచోట్ల పద్యాన్ని క్రియాపదంతో మొదలుపెట్టి నేర్పుచూపించాడు ధర్మన. "కలడు మహాత్ముడొక్కడు...." అనియు, "ఉన్నారు విష్ణుభక్తిన్," "కనియెఁబద్మదళాక్షుఁ గౌస్తుభమణివక్షు...." మొదలైన పద్యాల్ని ఉదాహరించ వచ్చు.

వర్ణనలు :

ప్రబంధసుందరి అందాన్ని ఇనుమడింప జేసేవి వర్ణనలు. ధర్మన తన కావ్యంలో పురవర్ణన, సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణనలు, వసంత కాలవర్ణన, యుద్ధవర్ణనలు మొదలైనవన్నీ చొప్పించాడు. తక్కిన కావ్యాల్లోవలె గాక ఇందులో కావ్యాంతంలోకూడా పురవర్ణనాదులుండడం ఒకవిశేషం. ద్వారకా పురంలోని "హర్మ్యములు చంద్రసామ్యము దాల్చెన్" (8-129) అని అతిశ యోక్తితో చమత్కరించాడు. ఇలావంతుణ్ణి వర్ణించే సందర్భంలో "ధర్మవర్తన, భీమప్రతాప మహిమ. అర్జునఖ్యాతి" అతనిలో ఉన్నాయని చెప్తూ "సత్యమున, సత్త్వమున, శరాసన నిరూఢి మీఱి...." అని వారి ముగ్గురి గుణాలూ అతనిలో ఉన్నాయని పేర్కొన్నాడు (1-30).

రంభాసౌందర్యాన్ని ధర్మన చాలా విశేషంగా వర్ణించాడు. ఆమె తన చెలికత్తెలతో జలకమాడే సందర్భంలో కళ్ళూ, కాళ్ళూ, చేతులూ, ముఖమూ అన్నీ పద్మాల్లా ఉన్న ఆ "తరుణులు పద్మినులెయనుట తథ్యంబయ్యెన్" (3-15) అని చమత్కరించాడు. రంభ, ఆమె చెలికత్తెలు మన్మథుడి పట్టపుటేనుగుల్లా ఉన్నారని చెప్తూ వాళ్ళస్తనమండలాలు కుంభయుగ్మాల్లా, ఊరువులు తొండాల్లా పలువరుసకాంతి ఏనుగు దంతాల కాంతిలా, చెక్కుల వెంట జారుతున్న కస్తూరి బొట్లు మదజలంలా ఉన్నాయని, వాళ్ళు మందగమనంతో ఉన్నారని వర్ణించాడు (2-158). రంభ అవయవాలన్నింటిని దేశాలతోపోలుస్తూ, ఆ దేశాలన్నింటికి

సార్వభౌముడిగా మన్మథుణ్ణి వర్ణించాడు (3-55). రంభ, ఆమె చెలికత్తెలు వన విహారం సాగిస్తుంటే, అందులో ఒకామె మాధవీపుష్పంలో వున్న తుమ్మెదని చూసి, అది నేరేడుపండనుకుని పట్టుకోబోతే, చేతిమీదకుట్టగా ఉలిక్కిపడిందని వర్ణించాడు (2-151). తుల్యుడికి తపోభంగం కలిగించటానికి వచ్చిన రంభ తనలో పొంగిపొరలే శృంగార రసాన్ని నీరుగా భావించి, ఆ మునికి అభిషేకం చేసింది. తన చిరునవ్వు వెన్నెలకు వస్త్రంగా ఇచ్చింది. తేనెలొలికే మాటల్ని పుష్పాలుగా పూజ చేసింది. వాలుచూపుల్ని నీరాజనం చేసింది. అమృతరసం ఉట్టిపడే అధరబింబాన్ని నైవేద్యంగా పెట్టిందని చమత్కరించాడు (3-78).

సగపాలు సాంధ్యరాగం, సగపాలు నలుపురంగుతో ఆకాశం గురివింద గింజలా ఉందని చక్కగా పోల్చాడు (6–107). సూర్యుణ్ణి "జలజాలయానాథు చక్కని కుడికన్ను, జగములమించు తేజముల వెన్ను, ద్విజసమూహములు సేవించు మ్రొక్కుల దిన్న, చదువుల కొనియాడు మొదలిపన్న, గాఢాంధకార సంఘమునకు వెఱగొంగ, ధరణీజలంబుల దార్చుదొంగ...." (4-106) అని, చంద్రుణ్ణి "సురవరులమృతంబు వరుస గ్రోలెడి, కోర, కాముకశ్రేణికి ఖడ్గధార, శివుని యౌదలమీది చిన్ని క్రొవ్విరి మొగ్గ, మిసిమిమించిన సుధారసము బుగ్గ, తోయజ బాంధవుతోడుజోడు, నిఖిలలోకంబుల నిక్కు చీకటిమిత్తి, విలసిల్లు షోడశ కళల గుత్తి, కలువలకువిందు, తామరగముల కుందు...." (4–110) అంటూ చమత్కారంగా వర్ణించేడు. నక్షత్రాల్ని వర్ణిస్తూ, చంద్రుడు రాత్రి అనే స్త్రీని పెళ్ళాడినప్పుడు దేవతాస్త్రీలు వేడుకగా ముత్యాలముగ్గులుపెట్టినట్లుగా ఆకాశంపై చుక్కలు నిండుగా ఉన్నాయని చెప్పాడు (6-108). చంద్రుడు అస్తమించే వేళ చుక్కలు, కలువలు కాంతి విహీనమైఉండడాన్ని, సూర్యోదయసమయంలో చక్రవాకాలూ, పద్మాలూ వికసించడాన్ని వర్ణిస్తూ ఒకరు విచారంతో ఉన్నప్పుడు వేరొకరు సంతోషించడాన్ని స్ఫురింపజేశాడు కవి (6-121).

వసంత ప్రకృతిని వర్ణిస్తూ, మోడులైవున్న చెట్లకు నవయౌవనాన్ని ప్రసాదించే సంజీవనాది ఔషధులా కలకలలాడుతూ వసంతం వచ్చిందని పేర్కొన్నాడు (2–100).

సాధారణమైన విషయాన్ని కూడా చమత్కారంగా చెప్పగల నేర్పరి ధర్మన. 'చలి'ని వర్ణిస్తూ "కమలాలకు శత్రువైన హేమంత రాత్రి చలివల్ల ఎక్కువైందిట. కమలాలకు ఆప్తుడైన సూర్యుడి వెలుగు ఉండేసమయం తగ్గిపోయిందిట" (2–30). శీతకాలంలో పగటిసమయం తక్కువగాను, రాత్రి వేళ ఎక్కువగాను ఉంటుందికదా! దాన్నే ఈ విధంగా చమత్కరించాడు. వర్షానంతరం కదిలి పోతున్న మబ్బుల్ని వయసుడిగిన వృద్ధులతో పోల్చి వర్ణించడం సముచితంగా ఉంది (2–28).

ఇతని యుద్ధవర్ణనలు వీరరసస్ఫోరకంగా ఉన్నాయి. యుద్ధంలో గాయపడి రక్తసిక్తమైన దేహాలతో ప్రకాశిస్తున్న యోధుల్ని "వీరరసంబు వెల్వడిన వీకను రక్తముగ్రమ్మనద్దొరల్కొరకి తోరు కింశుకములో యను" నట్లున్నారని కన్నుల గట్టినట్లు చూపించాడు (7–129). వీరుల దేహాలు రక్తంతో ఉన్నప్పుడు, మొగ్గతొడిగినమోదుగులా అనేటట్లున్నాయని ఉత్ప్రేక్షించాడు. ఇలాంటి యుద్ధసన్నివేశాల్లోకూడా అక్కడక్కడ చమత్కారం ఉట్టిపడే పద్యాలు కూడా వ్రాశాడు ధర్మన.

> "సకల యాదవసేన యుత్సవముతోడ
> సింహనాదంబులొనరింప సింహనాద
> ములయటంచును భీతి పెంపునఁ గిరీటి
> బలములోఁగల కుంజరములు వడంకె." (7-68)

యాదవసైన్యం మహోత్సాహంతో సింహనాదాలు చేస్తుంటే, అవి సింహగర్జనలే అనుకుని పాండవసేనలోని ఏనుగులు భయంతో వణికిపోయాయిట. ఇందులోని చమత్కారం ఎవరికైనా చిఱునవ్వు తెప్పించక మానదు.

ఏడ్పును కూడా హృదయరంజకంగా వర్ణించాడు ధర్మన. తనకు అవమానం జరిగినందుకు సత్యభామ "కోమల నూతనస్వరముఁ గ్రోలుచు కోయిల పిల్లయో" అన్నట్లుగా ఏడ్చిందట (5-94). ఇంత సుకుమారంగా ఏడ్పును వర్ణించడం కవి వర్ణనాసామర్థ్యాన్ని చాటుతోంది.

ఆత్మీయత :

ధర్మన దృష్టిలో సత్ప్రబంధము, ఉత్తమహయమూ ఒకేవిధంగా ఉంటాయి. ఈ విషయాన్ని తానే స్వయంగా ఈ కావ్యంలో

> "పదముల బొప్పును వడి యొ
> ప్పిదము నలంకార లక్ష్మి పేర్మియు ధారా
> స్పద భావముఁగల్గి శుభ
> ప్రదమై హయమమరె సత్ప్రబంధమురీతిన్." (3-160)

అని చెప్పాడు. ఇతని వాక్యాలు రసపూరితంగా, మధురంగా ఉంటాయని కృతి పతి ప్రశంసించాడు.

ధర్మన నారాయణధ్యాన తత్పరుడు. తన గ్రంథంలో పూర్వ కవిస్తుతిలో వాల్మీకి, వ్యాస, బాణ, మయూరాది సంస్కృత కవుల్ని, నన్నయ, తిక్కనాది తెలుగు కవుల్ని పేర్కొనడం వల్ల ఈ కవి వారు వ్రాసిన గ్రంథాలన్నీ చదివిన

వృత్పన్నుడని తెలుస్తోంది. ఈ అభిప్రాయాన్ని ఈ ప్రబంధరచనా వి
సమర్థిస్తోంది.

ధర్మనామాత్యుడు వ్యవహార జ్ఞానం గల దిట్ట. తన కాలంనాటి సాం
రాజకీయపరిస్థితుల్ని కథకు అన్వయించి రచన సాగించాడు. చతుర్దనుడు స
చేసే ఘట్టాన్ని వర్ణించే సందర్భంలో ఆభరణాలన్నీ తీసివేసి బంగారు
కూర్చోనడం, పరిచారిక వచ్చి సంపంగి నూనెతో తలంటి మర్దన చేయ
బంగారు కుండలతో అభిషేకించడం, తలతుడవడం మొదలైనవి, తెల్లని
వస్త్రం కట్టడం, ఆభరణాలతో అలంకరించడం, కేశాలంకరణ చేయడం, స
తిలకం దిద్దడం, షడ్రసోపేతమైన రుచిరాన్న భోజనం, కర్పూరతాం
మొదలైనవాటిని వర్ణించడం ద్వారా రాజగృహంలోని వ్యవహారవిధానం వ్యక్త
తోంది. దిష్టితీయడం, మంచి చూసి బయలుదేరడం, శుభసూచకంగా కు
ముందుపెట్టడం మొదలైన ఆచారాలు కూడా ఆ రోజుల్లో ఉండేవని ఈ క
వల్ల తెలుస్తోంది. రాజులు చారులమూలంగా ప్రజాభిప్రాయాన్ని తెలుసు
వాళ్ళని చెప్తూ "చారులు రాజుకు దూరము కనిపించు కన్నులోయి" వంటి
తెలియ జేశాడు కవి. ఈ విధంగా ఆనాటి సాంఘిక రాజకీయవాతావరణాన్ని
కావ్యంలో కొంతవరకు పొందుపరచాడు ధర్మన.

"విచిత్రగతి, నలంకారసరణిమీఱ, రసములు సిప్పిల, మెచ్చు" (పీఠిక
లొలికే విధంగా ధర్మనా మాత్యుడు సంతరించిన ఈ చిత్ర భారత ప్ర
చిరస్మరణీయంగా నిలుస్తుంది.

## కొన్ని పదాలకు అర్థాలు

ఘృష్ట = రాపిడి
మరుదుద్భవుడు = భీముడు
విశ్వంభరము = భూమి
లేజి = గుఱ్ఱము
అనలము = అగ్ని
కీల = జ్వాల
సత్త్వము = బలము
శరాసననిరూఢి = విలువిద్యలో ఆరితేరినతనము
కుంజరము = ఏనుగు
వడి = వేగము, యతి
పేర్మి = ఎక్కువ

హయము = గుఱ్ఱము
కోరకిత = మొగ్గతొడిగిన
కింశుకము = మోదుగుపూవు.

## ఆధార గ్రంథాలు

1. చిత్రభారతము — వావిళ్ళవారి ప్రతి
2. వీరరసము — డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం
3. ఆంధ్ర కవి తరంగిణి (సంపు. 8) — చాగంటి శేషయ్య
4. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (సంపు. 7) — ఆరుద్ర.

# యయాతిచరిత్రము—పొన్నికంటి తెలగనార్యుడు

సమీక్ష : శ్రీ ఆదిభట్ల సూర్యనారాయణ, ఎం.ఏ.

[ జన్మస్థలం. అజ్జార అగ్రహారం, బొబ్బిలి తాలూకా, విజయనగరం జిల్లా. జననం: 1–7–1948. ఎం.ఏ. ఆంధ్రోపన్యాసకుడు, మిసెస్ ఎ.వి.యన్. కళాశాల, విశాఖపట్టణము. చతుర వచస్వి – చారుమనస్వి ; తెలుగు ఋతువులు మొదలగు వ్యాసాలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి.

ప్రస్తుతం "మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి రచనలు – ఆంధ్ర పురాణముపైన ప్రత్యేక పరిశీలన" అన్న విషయముపై పి.హెచ్.డి. పట్టమునకు పరిశోధన, తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు. ]

కవిజీవితాదులు :

ఈ గ్రంథాన్ని పొన్నికంటి తెలగనార్యుడు రచించేడు. ఇది ఒక అచ్చతెనుగు కావ్యం. ఆంధ్ర సాహిత్యంలో మొట్టమొదటి అచ్చ తెనుగుకావ్యం ఇదే. ఇతనిగురించి మనకెక్కువ వివరాలు తెలియవు. గ్రంథాధారం బట్టి యితడు భావనామాత్యుని కుమారుడని ఇతనికి మదన గోపాల మంత్రోపాసన వల్ల కవిత్వం అబ్బిందని తెలుస్తోంది. యయాతిచరిత్ర 737 గద్యపద్యాలతో అయిదాశ్వాసాల్లో రచింపబడింది. కృతిభర్త అమీర్ ఖాన్ అనే మహమ్మదీయుడు. ఇతడు క్రీ॥ శ॥ 1550 నుండి 80 వరకు గోల్కొండని పాలించిన ఇబ్రహిం కుతుబ్ షా సర్దారుల్లో ఒకడు. ఇబ్రహింకుతుబ్షానే మన ఆంధ్ర కవులు మల్కిభరాముడని కీర్తించేరు. తెలగనార్యుడు ఈ గ్రంథాన్ని క్రీ॥ శ॥ 1576–80 సం॥ ల మధ్య కాలంలో రాసినట్టు గ్రంథావతారిక సాక్ష్యం ఇస్తోంది. అంటే ఇతడు పదహారో శతాబ్దపు కవి అని గోల్కొండ సమీపవర్తి అని తెలుస్తోంది.

కథా సంగ్రహం :

ప్రతిష్ఠాన పురాన్ని యయాతి మహారాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఒక రోజున చెంచులు వచ్చి వేటకిరమ్మని కోరుతారు. వేటకి వెళ్ళిన యయాతి ఒకలేడిని తరుముకుంటూ జాబాలి ముని ఉన్న హిమవత్పర్వత ప్రాంతాన్ని సమీపిస్తాడు. ఈ విధంగా ఒంటరిగా రావడం మంచిది కాదని రాముడిలాగే మోసపోయేడని జాబాలి చెప్పగా తనకాకథ చెప్పమని యయాతి అడుగుతాడు.

రావణుని స్వర్గ జైత్రయాత్రతో ప్రారంభించి, రంభని మానభంగం చేసి స్వర్గంపై దాడి వెడలడం మొదలు రావణున్ని రాముడు సంహరించినవరకు గల

రామకథని సంగ్రహంగా జాబిలి చెబుతాడు. యయాతి సెలవుతీసుకొని వెళుతూ దాహం వెయ్యగా అడవిలో నున్న ఒక నూతిని సమీపిస్తాడు. అందులో అప్స రసల్ని తలదన్నే సౌందర్యవతిని చూచి ఆమెని బయటకి లాగి ఎవ్వరి దానవని ప్రశ్నిస్తాడు. ఆమెని వెతుక్కుంటూ వచ్చిన ఘూర్ణిక అనే చెలికత్తె ఆ వన్నెలాడి రాక్షస గురువైన శుక్రాచార్యుని కుమార్తె దేవయాని అని, రాక్షస రాజైన వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ తో సహా చెలులు రాగా జలక్రీడలాడడం, గాలికి ఒడ్డుమీద ఉన్న వాళ్ల చీరలు కలగాపులగం అవడం దానికి శర్మిష్ఠ కోపించి దేవయానిని నిందించి ఆమె ప్రతిఘటించగా నూతిలోకి నెట్టి వాళ్లందరు వెళ్ళిపోవ డము వరకు జరిగిన వృత్తాంతాన్ని విని విచారించి తనదారిన తాను వెళ్లిపోతాడు.

ఇంత అవమానం జరిగిన తర్వాత వృషపర్వుని రాజ్యంలో అడుగుపెట్ట నని దేవయాని భీష్మించుక్కూర్చుంది. శుక్రుడు వచ్చి బతిమాలినా వినలేదు. ఆఖరికి వృషపర్వుడు వచ్చి దేవయాని కోరిక ప్రకారం శర్మిష్ఠని ఆమెకి దాసీగా చేసి ప్రసంగవశాత్తూ దేవయానికి వివాహం చెయ్యమని సలహాఇస్తాడు. శుక్రుడు విచారించి, కచుడు బ్రాహ్మణుడెవ్వడూ ఈమెని వివాహమాడడని శపించేడని చెబుతాడు. తదకా వృత్తాంతం చెప్పమని వృషపర్వుడడుగుతాడు.

దేవదానవయుద్ధాల్లో శుక్రుని మృత సంజీవని ప్రభావం వల్ల రాక్షసులు పునర్జీవితులవడం చూసి దేవతలు బృహస్పతి పుత్రుడైన కచుని సమీపించి మృత సంజీవనిని శుక్రుని వద్దనుండి గ్రహించుకొని రమ్మని పంపుతారు. శుక్రునికి కచుడు శుశ్రూష చేస్తూ ఉండగా అసూయతో రాక్షసులు కచుణ్ని చంపి చెట్టుకి కట్టేస్తారు. దేవయాని ప్రార్థింపగా శుక్రుడు సంజీవని వల్ల బతికిస్తాడు. ఇలా కాదని రాక్షసులు మళ్లా, కచుణ్ని చంపి ఆ బూడిదని కల్లుతో కలిపి శుక్రుడి చేతే తాగిస్తారు. దేవయాని పోరు పడలేక తనకడుపులో ఉన్న కచుడ్ని గుర్తించి మృతసంజీవని నుపదేశించి పొట్టచీల్చుకురమ్మని చెబుతాడు. ఆ ప్రకారం వచ్చి తనగురువుగార్ని మృతసంజీవని వల్ల బతికించి కొంతకాలం అయింతర్వాత శుక్రుని వద్దసెలవుతీసుకొని వెళుతూ ఉండగా దేవయాని తనని వివాహంచేసుకో మంటుంది. కచుడధర్మమని తిరస్కరిస్తాడు. దేవయాని కోపంతో, అయితే నీకు సంజీవని పనిచెయ్యదని శపిస్తుంది. తనవద్ద ' నేర్చుకున్నవాళ్లకి పనిచేస్తుందని చెప్పి కచుడు అధర్మంగా మాట్లాడిన దేవయానిని బ్రాహ్మణుడెవ్వడూ వివాహ మాడడని ప్రతిశాపం ఇచ్చి స్వర్గానికి వెళిపోతాడు. ఈ కథ విని వృషపర్వాదులు తమ నగరానికి వెళ్లిపోతారు.

ఒక రోజున దేవయాని, శర్మిష్ఠ, చెలికత్తెలు ఉద్యానవనానికి వెళతారు. యయాతి అక్కడకివచ్చి శర్మిష్ఠ సౌందర్యానికి ముగ్ధుడై ఏమీఎరగనట్టు మీరెవరని దేవయానినడుగుతాడు. దేవయాని శర్మిష్ఠని పరిచయంచేసి తనని

వివాహమాడమంటుంది. శుక్రుని అనుమతితో ఆమెని వివాహంచేసుకొని ఆమె దాసీ అయిన శర్మిష్ఠతో సహా యయాతి తననగరానికి వెళ్లిపోతాడు. దేవయాని వల్ల యదు, తుర్వసులన్న కొడుకుల్ని పొందుతాడు. యౌవనంతో అనాథగా ఉన్న శర్మిష్ఠని చూసి సనాథని చెయ్యాలని ఆమెని కూడా ఉద్ధరించి ద్రుహ్యుడు, అనుడు, పూరుడు అన్న కొడుకుల్ని పొంది, అయిదుగురు కొడుకులు తన ఆజ్ఞపాటిస్తూ ఉండగా హాయిగా రాజ్యాన్ని ఏలుతాడు.

వస్తుతత్త్వం :

తెలగనార్యుని యయాతిచరిత్రకాధారం మహాభారతం తృతీయాశ్వాసంలో ఉన్న యయాతిచరిత్ర. భారతం ఇతిహాసం. తనదికావ్యం గనుక మూల కథని యథాతథంగా తీసుకోకుండా కొంతకథని వదలి, గ్రహించినదానిలోకూడా కొన్ని మార్పులు చేసేడు.

1. సంస్కృతభారతంలోగాని తెలుగు భారతంలోగాని యయాతి ప్రతిష్ఠాన పురాన్ని పాలించినట్టు ఎక్కడా చెప్పబడలేదు. కావ్యం నగర వర్ణనతో ప్రారంభమవాలన్న సంప్రదాయాన్ననుసరించి ప్రతిష్ఠాన పురవర్ణనతో, కావ్యాన్ని ప్రారంభించేడు.

2. భారతంలో, యయాతిచరిత్ర మొదట కచుని వృత్తాంతంతో ప్రారంభమయి తరవాత దేవయాని నూతిలో పడినవైనం మొదలయినవిషయాలతో ఉంది. ఇందులో కథ తారుమారైంది.

3. భారతంలో దేవయాని, తనచరిత్రని, తన విహారాదుల్ని యయాతికి సంక్షిప్తంగా చెబుతుంది. ఇందులో ఘూర్ణిక అన్న చెలికత్తె కొంచెం సుదీర్ఘంగా వర్ణించి చెబుతుంది.

4. మూలంలో శర్మిష్ఠాదేవయానుల చీరలు గాలికి తారుమారుకాఁగా (సంస్కృత భారతంలో ఇంద్రప్రేరణంవల్ల చీరలు తారుమారయేయి) మొదట, దేవయాని శర్మిష్ఠని నిందిస్తుంది. ఇందులో మొదట శర్మిష్ఠే నిందిస్తుంది. కాలప్రభావంవల్ల వచ్చిన మార్పిది.

5. భారతంలో, కచదేవయానుల వృత్తాంతం, జనమేజయుడడుగ, వైశంపాయనుడుచెప్పగా, ఇందులో వృషపర్వుడడుగగా శుక్రాచార్యులు చెప్పినట్టు మార్చబడింది.

6. మూలంలో ఋతుమతియైన శర్మిష్ఠతో యయాతి కలుస్తాడు. ఇందులో ఉభయతారకమైన మదనవేదనకారణం.

7. మూలంలో యయాతి శర్మిష్ఠల పొందుకి కోపించి దేవయాని శుక్రునికి చెప్పడం, శుక్రశాపము, తరవాత కొంతకాలానికి యయాతి స్వర సద్భవనాదుల

ప్రయాణం మొదలైన కథంతా గ్రంథాన్ని సుఖాంతం చెయ్యడానికి తెలగ నార్యుడు వదలి పెట్టేడు.

8. మూలంలో యయాతి చరిత్రకి ఆదిమధ్యాంతాల్లో ఎక్కడా రామాయణ ప్రసక్తిలేదు.

శైలి :

తెలుగు భాష తత్సమ, తద్భవ, దేశ్య, అన్యదేశ్యాలతోకూడిన మిశ్రభాష. మనతెలుగు వాళ్లంతా ఈ మిశ్రభాషనే అశ్రమంగా అర్థంచేసుకోగలరు. అందులోకి ముఖ్యంగా తత్సమాలు లేకపోతే 'అన్నం' కూడా అడగలేం. అలాటిది ఆ తత్సమాలు పూర్తిగా వదలిపెట్టి అచ్చతెనుగులో కావ్యంరాయడ మంటే మాట లా ! తెలగ నార్యునికి పూర్వం ఎవ్వరూ కావ్యాన్ని అచ్చతెనుగులో రాయలేదు ఆఖరికి శైవ వాఙ్మయ పితామహుడు, దేశి కవితోద్ధరణబద్ధ కంకణుడు అయిన పాల్కురికి సోమనాధుడు (క్రీ॥ శ॥ 12వ శతాబ్ది) కూడా తన వృషాధిప శతకంలో ఒకే ఒక అచ్చతెనుగు పద్యాన్ని రాసేడు. కేవలం తద్భవాలు, దేశ్యాలు అక్కడ క్కడ అన్యదేశ్యాలతో అచ్చతెనుగు కావ్యంరాసిన ఘనత పొన్నికంటి తెలగ నార్యునిదే.

క్రీ॥ శ॥ 16వ శతాబ్దం నాటికే, కవిత్రయంవారి కవనయోగ్యమైన కథా గమనం, అందునా ఎఱ్ఱన వర్ణనాత్మకశైలీ, నన్నెచోడ, పినవీర భద్రుల కారణంగా అష్టాదశ వర్ణనలతో నున్న ప్రబంధ ధోరణి, శ్రీనాథ యుగపుపద్యశిల్ప సౌందర్యం ఆంధ్రసాహిత్యాన్నా క్రమించుకున్నాయి. పెద్దన, నందితిమ్మన, రామరాజ భూషణుడు, పింగళిసూరన, తెనాలి రామలింగడు ఆంధ్రసాహిత్యరమకి హారతి పట్టి కవిత్వాని కొకమార్గాన్ని ఏర్పాటుచేసేరు.

వర్ణనలు :

తెలగనార్యుడు పూర్వకవుల మార్గాన్నే అనుసరించి అష్టాదశవర్ణనల్ని కవిసమయాల్ని తుచ తప్పకుండా తనకావ్యంలో కూర్చేడు. అయితే భాషలోనే భేదం. కథ కోసం కవిత్వంకాకుండా కవిత్వం కోసం కథనిగ్రహించి తన వర్ణనావైదగ్ధ్యాన్ని బహుధాప్రదర్శించేడు తెలగనార్యుడు. తన స్వకపోల కల్పిత భావుకతకి బావుటాలెత్తిన పద్యాలెన్నో వున్నాయిాగ్రంథంలో. ముఖ్యంగా ద్వితీయాశ్వాసంలో నగరవర్ణన తృతీయాశ్వాసంలో శర్మిష్ఠా దేవయాన్యాదుల జలక్రీడావర్ణన చతుర్థాశ్వాసంలో వసంతర్తువర్ణన పంచమాశ్వాసంలో ఉద్యాన, విరహ వర్ణనలు తెలగనార్యుని ప్రతిభకి గీటురాళ్లు. చిత్రమేమిటంటే సలక్షణమైన గ్రాంథిక భాషలో తత్సమాలు వదలి, మృదు మధురమైన కవితాధారతో శ్రోతని

ఉఱ్ఱూతలూగిస్తాడు తెలగన్న. భావపుష్టితో, రసంపిచ్చరింపజేసి అనర్గళమైన శైలీసౌభాగ్యంతో, తెలుగు పలుకు పొలుపు గుబాళించేటట్టు రచించేడు.

ఈ రోజుల్లోలా కాకుండా, పూర్వం పువ్వుల్ని వన్నెల విసనికఱ్ఱలు, వలపులగిలకలు అమ్మేవాళ్లు. వాళ్లనెలా వర్ణిస్తున్నాడో చూడండి.

బెళుకులై తళుకులు గులుకు కన్నులచెన్ను
కలువల కొకవింత చెలువు గొలుప
గొప్పలై యొప్పులకుప్పలై పాలిండ్లు
విరి బంతులకు వింతసరవిఁ గఱపఁ
బొలుపులై వలరాచబులుపులై పలుమొనల్
మొల్లల కొకవింత మురువునింపఁ
దళుకులై తేనెలు చిలుకు మోవుల రంగు
చెందొవలకు వింత సిరులఁజేయ

సొలపు వలపును గొలుపు నిచ్చలపుఁ దెలుపు
నగవు మల్లెల కొకవింత నయముఁదెలుపఁ
గోడెకాండ్రకు విరులమ్ము కొందు రెపుడుఁ
బువ్వులమ్మెడు చెల్వలా ప్రోలిలోన. [1–84]

ఇందులోవన్నీ అచ్చతెనుగు పదాలే. మరి భావమో! పదహారణాలాంధ్రుడిది.

ప్రకృతిలో ఉన్న సౌందర్యం మానవుడిలో ఉండదు. కవి శబ్దవాచ్యుడికి శృంగార రిరంస ఉండాలి. ఊహాశాలిత దానికి పదును పెడుతుంది.

పూనికఁదగు నీటిరేని పసిండియు
ప్పరిగె వాకిటి తోఁపు తెరయనంగఁ
గ్రుంకు మెట్టున వెల్వఁగొమ్మ లాడుచుఁ జల్లఁ
దులకించు చెంద్రవు దుమ్మనంగ
గడుసొంపుచే నొప్పు పడమటి మలమీఁది
చెఱులందుఁగెంపుల చాయ లనగఁ
దమినాడు తెఱగంటి కొమరులు గావింపఁ
బొలు పొందు పగడంపుఁబలుక యనగఁ

బ్రొద్దు వాసినవంత లోఁబొడముచుండ
ముణుగు కెందమ్మి రేకుల మూఁక యనగ
విరియు చెందొవననలకు వెన్నపెట్టి
నిండె నెఱసంజ కన్నుల పండువగుచు. [2–70]

చీకట్లో మిణుగురు పురుగుల్ని కవి భావించినతీరు నిరుపమానంగా ఉంది —

"తనకుఁ బగయగు ప్రొద్దున వెనకి కనక
కనలు చీకటి రక్కసి కన్నులందుఁ
దొరుఁగు కనకన మను నిప్పు తునకలనగఁ
బొలిచెనెడనెడ మిణుఁగురుఁబుర్వులంత" [2-77]

రావణుడు రంభని చూసేడు. ఎటువంటి రంభనో పద్యం అంతా అక్కర్లేదు.
మరుడు తోడుగఁ జనుదెంచు మగువగాంచి [2-88]

శర్మిష్ఠ, దేవయాని, చెలికత్తెలు జలక్రీడలాడడానికి వెళ్లేరు. సరోవర సౌం
దర్యాన్ని కవి స్త్రీ శరీరావయవాల కెలా ముడిపెట్టేడో చూడండి —

తమ మోములకు నుల్కి తగవడం కెడునట్లు
తళ్లు గొట్టెడు నీటి తమ్ములలరఁ
తమ చన్నుగవల యందముల కోడుటఁబోలె
జక్కవ లొక్కమైఁ జదల నెగయఁ
దమ కొప్పులకు లోఁగి తలగి పోయెననంగఁ
గప్పు విప్పగు నాఁచు కడకుఁ బోవఁ
దమ కన్నులకు వీఁగి తలఁకు చందంబునఁ
బెల్లుగాఁ [illegible]లు తల్లడిల్లఁ
బూని తమ చూపులకు నోడి పోవు కరణిఁ
బలు మొగమ్ములఁ దుమ్మెదల్ గలఁగి పఱవ
ముందు ముందుగఁ జెలరేగి మూఁకలగుచు
నీటి లోనికిఁ జనుదెంచి నెలఁతలలరి. [3-64]

ఈ విధంగా జలక్రీడ లాడుతూ నీటి నెగర గొట్టుకుంటున్నారు. ఆ సమయంలో
కవి సంభావన ఉత్తమ భావుకలక్షణాన్ని పట్టియిస్తుంది.

చల్లులాడగ నప్పుడు చదల నెగసి
మగుడు తెలినీటి తుంపరల్ దగియెఁజూడ
వారినీరాటకును మెచ్చి వలపు రాయఁ
డాని కురియించు పువ్వుల వానలనగ [3-65]

వివాహ సమయంలో తన కాలంనాటి వైవాహిక వ్యవస్థని కన్నులకు కట్టినట్టు
వర్ణించేడు. అంతటితో ఆపితే బాగుండును. శోభనాన్ని కూడా వర్ణించేడు. శోభ
నం ముందు దేవయాని చెలికత్తె లామెనెలా ఆటాడిస్తున్నారో చూడండి —

బంగారు కుండలఁ బగట నీ గబ్బిగు
బ్బలమీఁది మేలు గలుగు నేడు
జగడాలఁ బగడాలఁ దెగడు నీమోవికిఁ
బొలుపైన యొకడాలు కలుగు నేడు

మెఱుగు చేఁగ్రొమ్మించు మించు నీమేనికి
నలరింప నొక యింపు గలుగునేఁడు
తళుకులై ముద్దులు గుల్కు నీచెక్కుల
కెలమిగా నొక సొంపు గలుగు నేఁడు

తాళుకో ప్రొద్దు గ్రుంకిన దాఁక ననుచుఁ
బలుకఁ దనలోని కూరిమి బయలు వడఁగ
నీక కన్నుల జంకించి యేమొ గొణుగు
దేవయానిఁ గనుంగొని తెలవ యొకతె [5–4]

మొట్ట మొదట భర్తని సమీపించిన దేవయాని స్థితి ఎంత స్వభావ సుందరంగా ఉందో చూడండి —

"నడుము వడంక సిబ్బితి విప్పగు గొప్ప కప్పు క్రొ
మ్ముడి విడి జారు నందియల మ్రోఁతఁకుఁదోడుగఁదమ్మి కెంపుపెం
దొడవులు మ్రోవఁబయ్యెద చనుంగవ చక్కినొకింత చూపఁగా
వడి మగు డంగనేఁగు చెలువంగని నవ్వుచు నింతు లింపునన్"
[5–14]

రసం :

ఈ విధంగా సంభోగ శృంగారానికి ప్రాంగణరంగవల్లిక లల్లడం పద హారోశతాబ్దం తరువాత నించి పందొమ్మిదో శతాబ్దం ప్రారంభం వరకు ఆంధ్ర సాహిత్యంలో పదే పదే కనిపిస్తుంది.

లబ్ధ ప్రతిష్ఠులైన తన పూర్వకవుల మధుర భావాలకి ముగ్ధుడైన తెలగ నార్యుడు సందర్భోచితంగా వాళ్లని అనుకరించేడు.

1. కచదేవయానుల వృత్తాంతాన్ని, నూతబడిన దేవయానిని వర్ణించేటప్పు డు, భర్తృ ప్రాప్తికి పరితపించిన శర్మిష్ఠని వర్ణించేటప్పుడు నన్నయగారి అడుగు జాడల్లో వెళ్లేడు.

2. సంగ్రహ రామాయణ కథనంలో ఉన్న రంభారావణ సంవాదం రావణుని జైత్రయాత్రోత్సాహం తిక్కనగారి నిర్వచనోత్తరరామాయణ ప్రభా వాన్ని చాటుతాయి. రంభా రావణ సంవాదంలో తిక్కనగారి కంటె కొంత సంభాషణా వైపుల్యం ఉంది. కాని ఇదే సన్నివేశం ఇతని తరువాత వాడైన కంకంటి పాపరాజు ఉత్తర రామాయణంలో శ్రేష్ఠంగా ఉంది.

3. తృతీయాశ్వాసంలో చీకటిని వర్ణించే సందర్భం ఎఱ్ఱన నృసింహ పురాణంలో అదే సందర్భంలో ఉన్న పద్యానికి ఛాయ.

4. తెలగనార్యుని వేటవర్ణన పినవీరన, పెద్దనల వేటవర్ణనని జ్ఞప్తికి తెస్తుంది.

5. చతుర్థాశ్వాసంలోని ఉద్యానవన వర్ణన, దేవయాని సౌందర్య వర్ణన సుదీర్ఘంగా పందొమ్మిది పద్యాల్లో సాగిన శర్మిష్ఠ అంగాంగ వర్ణన అందులోని సీస పద్యాల తూగు వసుచరిత్రని స్మరింపజేస్తాయి. ఇంతేకాకుండా వసుచరిత్రలో ముక్కుమీద అందంగా చెప్పబడిన 'నానాసూనవితాన వాసనల' అన్న పద్యం ఇందులో

"పెలచఁదమ దాయమైన సంపంగ విరిని
దెలిచెనని ముక్కు నిరుగడఁ గొలిచి యుండి
త్రుళ్లి యాడెడు తుమ్మెద పిల్లలనగఁ
బొలుచు నెలఁతుక చూపులు చెలువ మమర" [4–38]

అన్నవిధంగా కేవలం భావం మాత్రం గ్రహించి రచించేడు. అందులో ఉన్న పదప్రయోగం, శయ్యాసౌభాగ్యం భావ వ్యక్తీకరణ ఇందులోలేవు. ఇంతకీ ఈ పద్యం వసుచరిత్రకారుని సొంతం కాదు. అగస్త్యకృత నలకీర్తికౌముది అన్న సంస్కృత గ్రంథంలో ఉంది.

భృంగానవాప్తి ప్రతిపన్నఖేదా
కృత్యావనే గంధఫలీతపోఽలమ్
తన్నాసికా భూదను భూతగన్ధా
స్వపార్శ్వ నేత్రీ కృత భృంగసేవ్యా

(న.కీ.కా. 2–74)

6. యయాతి శర్మిష్ఠను చూచినపుడు వర్ణించిన —

తమ్ములు చుక్కలుతాఁ బేళ్లు మరుసొదు
ల్పసిఁడి యనంటులు నిసుకతిప్ప [4–33]

అన్న స్త్రీ పరమైన సర్వోపమానవస్తువుల నేకరువుపెట్టి పద్యరచన చేయుట శ్రీనాధుని భీమఖండమునగలదు. దీనికదె మాతృక.

"అంబుధర శ్రేణి హరిణలాంచన రేఖ
క్రమకార్ముకవల్లికామతల్లి (భీమ. 1–94)

7. ద్వితీయాశ్వాసంలో వెన్నెలని వర్ణిస్తూచెప్పిన —

"వేల్పురాయఁడు దన వెలిమావుఁదెలిగొరు
నీగి మాఁకులఁగానకెదఁలంగ (2–82)

అన్నపద్యం భోజ ప్రబంధంలో, భోజునికీర్తిపరముగ కాళిదాసునిచే చెప్పబడిన —

"మహారాజశ్రీమాన్జగతియశసా తేధవళితే
పయఃపారావారం పరమపురుషోఽయం మృగయతే
కపర్దీకైలాసం కరివరమభౌమం కులిశభృ
త్కళానాథం రాహుః కమలభవనోహంసమధునా"

(భో.ప్ర. 82 శ్లో)

అన్న శ్లోకానికి ఒక్క 'కలానాథం రాహుః' అన్నది విడిస్తే యథానువాదమే.

అయితే పై అనుకరణలు చాలాస్వల్పం. పూర్వ కవులయందామాత్రం గౌరవం అవశ్యం ఉండాలి. తెలగ నార్యుడు వర్ణనలవిషయంలో ప్రదర్శించిన ప్రతిభ ఇతివృత్తనిర్వహణలో ప్రదర్శించలేదు. అది కారణంగా పాత్ర చిత్రణలో కొంతలోపంఉంది. రాముడెవ్వరో, వృషపర్వుడెవ్వరో తెలియనియయాతి, కచదేవయానుల, వృత్తాంతం తెలియని వృషపర్వుడు పాఠకునికి కొంత చికాకుకలిగిస్తారు. యయాతిచరిత్రలో సంక్షిప్తంగానైనా రామకథ అనవసరం, ఇదిపురాణం కాదు.

అచ్చతెనుగు కావ్యాల్లో కొన్ని పలుకుబళ్లు తత్సమాలని ఊహించుకుంటే తప్ప వెంటనే అర్థంకావు. కలిమితొయ్యలిగేస్తు, గాలిమేపరితేని, గట్టుచూలు, చివ్వ కూటితబిసి, రాచపగసేలవేలుపు, అకుటెల్లు, కడిదిపులుగు, కొమ్మమెకములు మొదలైన ప్రయోగాలు సామాన్యపాఠకుడికి కొంతవరకు ప్రతిబంధకాలే!

ఇది ఆంధ్రసాహిత్యంలో మొదటి అచ్చతెనుగు కావ్యం అయినా తెలగనార్యుడు భావసంపదకి, వ్యక్తీకరణకి, ఏమాత్రములోటురాకుండా, అకుంఠిత శైలితో కావ్యనిర్మాణంచేసి అచ్చతెనుగుకవులలో ఆద్యుడేకాక ఆరాధ్యుడుకూడా అయ్యేడు.

## కొన్ని పదాలకు అర్థాలు

ఆకుటిల్లు = ఉద్యానవనము
ఉప్పరిగె = మేడ
కడిదిపులుగు = పెద్దపక్షి (జటాయువు)
కలిమితొయ్యలిగేస్తుడు = విష్ణువు
కెందమ్మి = ఎఱ్ఱతామర
కొమ్మమెకము = కోతి
క్రుంకుమెట్టు = పశ్చిమపర్వతము
గట్టుచూలు = పార్వతి
గాలిమేపరితేడు = ఆదిశేషుడు

చదలు = ఆకాశము
చెల్వ = స్త్రీ
డాలు = కాంతి
తులకించు = ప్రకాశించు
తెరగంటికొమరులు = దేవతాపురుషులు
తోపు = ఎరుపు
దాయ = శత్రువు
నిచ్చలము = స్వచ్ఛమైన
నెలత = వనిత
పగటు = ప్రకటించు
పెలుచ = ఆగ్రహము
ప్రొద్దు = సూర్యుడు
ప్రోలు = పట్టణము
మల = కొండ
మురువు = సౌందర్యము
రాచపగనే వేలుపు = పరశురాముడు
వలరాజు = మన్మథుడు
విరిబంతి = పూబంతి
వేల్పుకొమ్మ = దేవతాస్త్రీ
సరలి = క్రమము.

## ఆధార గ్రంథాలు


1. యయాతిచరిత్ర — ఆం.ప్ర. సాహిత్య అకాడమీ
2. ఆంధ్ర ప్రతాపరుద్రయశోభూషణ వ్యాఖ్య, అవతారిక పుట 44 — చెలమచెర్ల రంగాచార్యులు
3. నిర్వచనోత్తరరామాయణము — (ఆం.ప్ర. సాహిత్య అకాడమీ)
4. భీమఖండము — (వావిళ్లప్రతి)
5. భోజ ప్రబంధము (సంస్కృతము)
6. వసుచరిత్ర (వావిళ్లప్రతి)
7. తెలుగు విజ్ఞానసర్వస్వము — (తృ. సంపు.)
8. ఉత్తర రామాయణము — పాపరాజు (వావిళ్లప్రతి).

# వాల్మీకి చరిత్రము — రఘునాథనాయకుడు

సమీక్ష : శ్రీ వేదుల వెంకట కాశీ సూర్యనారాయణ

[జన్మస్థలం — పెదనందిపల్లి అగ్రహారం, విశాఖ జిల్లా. జననం 17–3–1951. భాషాప్రవీణ, ఎం.ఏ. ఆంధ్రోపన్యాసకుడు, మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాల, విశాఖపట్టణం. 'విష్ణుపురాణం' పైని పిహెచ్.డి. పట్టమునకు పరిశోధన – తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు.]

కవికాలాదులు :

దాక్షిణాత్య ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో రఘునాథ నాయకుడు స్వర్ణ యుగం సృష్టించిన ప్రభువు. ఇతని తాత చినచెవ్వప్ప నాయకుడు. తండ్రి అచ్యుతప్ప నాయకుడు. తల్లి మూర్తిమాంబ. ఇతని జన్మస్థలము తంజావూరు. సుమారు క్రీ.శ. 1580 – 1633 సంవత్సరముల నడిమకాలమున నితడు జీవించి నాడు. తాత తండ్రుల తరువాత నితడు తంజావుర రాజ్యమును పాలించినాడు. తంజాపురము విజయనగరమునకు సామంతరాజ్యము. తంజావుర రాజ్యమునకు మహామంత్రియగు గోవిందదీక్షితుడు రఘునాథుని గురువు.

ఇక రఘునాథనాయకుడు సంగీతసుధ అనే శాస్త్రగ్రంథం రచించినాడు. అంతేగాక జయంతసేనమనే క్రొత్త రాగాన్ని, రామానందమనే క్రొత్త తాళాన్ని, రఘునాథమేళ అనే వీణను (తదుపరి 'తంజావూరివీణ' అని ప్రసిద్ధమైన దానిని) కనుగొన్నాడు. సంస్కృతాంధ్ర భాషలలో నితడు అనేక గ్రంథములను వ్రాసినట్లు చెబుతారు. గాని అవి అన్నియు నేడు లభించుటలేదు. నలచరిత్రఅనే ద్విపద కావ్యం, రామాయణం, వాల్మీకిచరిత్ర లభ్యమైన గ్రంథాలు. ఇందులో రామాయణం పూర్తిగా లభ్యంకాలేదు. రఘునాథుడు రామకథను రచించుటేకాక ప్రథమముగా రాముని చరితమును వెలువరించిన వాల్మీకిమహర్షి చరితమునుగూడ రచించిన మహనీయుడు.

కథా సంగ్రహము :

ఒకనాడు నారదుడు శౌనకాది ఋషులున్న బదరికాశ్రమానికి వస్తాడు. వారు విష్ణు కథలను వివరించవలసినదిగా నారదుణ్ణి కోరుతారు. నారదుడు తన సఖుడైన పర్వతునికి ఆ పని అప్పగించి తాను వైకుంఠానికి వెళతాడు. పర్వతుడు శౌన కాదులకు హరినామ సంకీర్తనము యొక్క గొప్పదనాన్ని ఈ విధంగా చెబుతాడు.

ఒకప్పుడు సప్తర్షులు శ్వేతద్వీపంలో శ్రీమహావిష్ణువును సేవించుకొని ద్వీపాలు, పర్వతాలు, నదీనదాలు కడచి తామ్రపర్ణి చేరుకొంటారు. అక్కడ గజ తీర్థం చూసి సేతువుకి వెళతారు. అక్కడనుండి అనేక ప్రాంతాలుచూస్తూ హిమవత్పర్వతానికి ప్రయాణం సాగిస్తారు. ఇంతలో గ్రీష్మఋతువు వస్తుంది. వారు ప్రయాణం సాగిస్తూ తమసా తీరానికి వస్తారు. అక్కడ వారు ఒక అరణ్యమున ప్రవేశించి దారితప్పి ఒక బోయపల్లెగల ప్రాంతమునకు చేరుకొంటారు. అట ఒక బోయ, వారిని అడ్డగించి ధనమునిమ్మని వారిని అనేకవిధముల హింసిస్తాడు. ఋషుల కాతనిపై దయగలుగుతుంది. వారు ఆ కిరాతునికి తత్త్వబోధచేసి రామ మంత్రాన్ని తిరగవేసి ఉపదేశించి వెళతారు.

కిరాతునిలో మార్పు వస్తుంది. అతడు దీక్షగా రామమంత్రాన్ని జపిస్తూ తపస్సు చేస్తూంటాడు. అతడ్ని తపస్సునుండి మరల్చటానికి ఆలు,బిడ్డలు ప్రయత్నించి విఫలులవుతారు.

ఇక దేవలోకంలో రంభ, ఊర్వశులలో ఎవరుగొప్ప అని వివాదం వస్తుంది. అప్పుడు ఇంద్రుడు వారిలో ఎవరు భూలోకంలో కిరాతుని తపమును విఘ్నము చేస్తారో వారే గొప్పవారని అంటాడు. రంభోర్వశులు ఇంద్రుని మాటపై కిరాతుని తపస్సును భంగపరచడానికి ప్రయత్నించి విఫలులవుతారు. క్రమంగా కిరాతుడు తపస్సుచేసే ప్రదేశంలో ఋష్యాశ్రమ వాతావరణం ఏర్పడుతుంది. కిరాతునిపై పుట్టలు ఏర్పడతాయి.

ఇంతలో హిమవత్పర్వతమునకేగిన సప్తర్షులు తిరిగి తమసా తీరానికి వస్తారు. పూర్వం కిరాతుడు తమను హింసించినచోట గొప్ప మార్పును గమనిస్తారు. ఇలా జరగటానికి కారణమేమిటని ఆలోచిస్తూండగా ఆకాశవాణి కిరాతుడు వల్మీకములో తపస్సు చేస్తున్నాడని చెబుతుంది. ఋషుల రాకను గుర్తించిన కిరాతుడు వల్మీకమునుండి బయటకువచ్చి వారిని సేవిస్తాడు. రామమంత్ర మహిమను కొనియాడుతూ వారు వెళ్ళిపోతారు. వల్మీకములోంచి వచ్చినవాడు కనుక అతడు వాల్మీకి ఔతాడు. అతని తపస్సుకు మెచ్చి రాముడు ప్రత్యక్షమై తన కథను వ్రాయవలసినదిగా ఆదేశిస్తాడు. వాల్మీకి రామాయణాన్ని రచిస్తాడు. ఇది శౌనకాదులకు పర్వతుడుచెప్పిన కథ.

వస్తుతత్త్వం :

వాల్మీకి చరిత్రము మూడాశ్వాసముల గ్రంథము. ఈ కథ సంస్కృత ధర్మఖండంలో అత్యల్పముగా నున్నదని అంటారు. రఘునాథుడు ఆ కథను బాగుగా పెంచి ఒక కావ్యముగా తీర్చిదిద్దినాడు. ఈ కావ్యం సుమనోహరములైన వర్ణనలతోను, కల్పనలతోను కూడివుంది. రామమంత్ర ప్రభావాన్ని వివరించటం

ఈ కావ్యంయొక్క ప్రధానోద్దేశంగా కనబడుతూంది. దాన్ని కవి చక్కగా నిరూపించేడు. ప్రధానకథ అల్పతరమే అయినప్పటికి సందర్భోచితముగా అనేక విషయములు వివరించుచూ కవి తనఉద్దేశాన్ని నిరూపించేడు. రఘునాథుడు సంగీతపరిజ్ఞానము గలవాడవడంచేత ఆ శాస్త్రానికి సంబంధించిన విషయాలు ఇందు వివరించబడ్డాయి. కథకి అంతగా అవసరం లేకపోయినప్పటికి ప్రథమాశ్వాసము అంతా వివిధ తీర్థములను వర్ణించడం జరిగింది. ద్వితీయాశ్వాసం అంతా రంభోర్వశుల వివాదంతో సరిపోయింది. వాల్మీకి తపస్సుయొక్క తీవ్రతను తెలియజేయడానికి ఈ ఘట్టం వివరించబడింది. ప్రధానకథకు సంబంధించిన విషయం తృతీయాశ్వాసంలో అధికంగా ఉంది. ఎన్ని అవాంతరములు వచ్చినా కిరాతుని తపస్సు ఫలించింది అనే విషయం వివరించడముచే ఇందు వస్త్వైక్యం ఉందని చెప్పవచ్చును.

రస పోషణము :

వాల్మీకి చరిత్ర కావ్యంలో శాంతరసం ప్రధానంగా వుంది. మహర్షిగా పరిణత చెందిన కిరాతుడు ఆలంబనంగా శాంతరసం పోషింపబడింది. మిగిలిన రసాలకు ఈ కావ్యమున తగినంత ప్రాధాన్యం ఇవ్వబడలేదు. రంభోర్వశుల జగడంలో శృంగారము కొంత వర్ణించబడింది. కిరాతుడు వాల్మీకిగా పేరు గాంచడం రామచంద్రుడు అతని తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమవడంతో శాంతరసం పరిపుష్టిని పొందింది.

పాత్రచిత్రణ :

పాత్రచిత్రణమున రఘునాథుడు అద్భుత నైపుణ్యమును ప్రదర్శించినాడు. ఈ కావ్యమున వాల్మీకియే నాయకుడు. అతడు తన భక్తిభావంతో పరమేశ్వరుడైన శ్రీరామ చంద్రుని మెప్పించినాడు. అజ్ఞానియైన కిరాతుడు పరమ భక్తుడైన వాల్మీకిగా మారుటను కవి చక్కగా నిరూపించినాడు. కిరాతుని తపమును భంగపరచుటకు యత్నించిన రంభోర్వశుల పాత్రలను కవి మనోహరముగా చిత్రించినాడు. దేవ వేశ్యల వైభవం కనులకు కట్టినట్లు చిత్రించడంలో కవి చూపిన నేర్పు నిరుపమానము.

శైలి :

పద ప్రయోగ నిపుణత, సమాస రచన, రసపోషణ అలంకారముల నుపయోగించు నేర్పు, పాత్రచిత్రణ, వర్ణనలతీరు మొదలయిన వాని సమష్టి విధానమే శైలి యనవచ్చును. కవులు తమరచనలలో ప్రత్యేకమైన పద్ధతులను అవలంబిస్తూ వుంటారు.

రఘునాథుడు స్వతంత్రమైన రచన చేశాడు. నిరర్గళ ధారతో ఇతని రచన సాగింది. ఇతని కవిత్వం విరిపొట్లంవిప్పినట్లు ఘుమ్మని పరిమళాలను వెదజల్లు తూంటుంది. శబ్దాలంకారములను ప్రయోగించి ఇతడు కవితాకన్యకు క్రొత్త సోయగములను చూపినాడు.

ఇతని రచనలో కేవలము అచ్చతెనుగు పద్యములుకొన్ని అలరారుచున్నవి. కిరాతుని తపస్సునుండి మరల్చుటకై ఆతని ఆలుబిడ్డలాతనితో నిట్లనిరి.

తెల్లవారిన గుండంగి కోళ్ళ లీల
నీళ్ల మునుఁగుచు నొడలెల్లఁదెల్లఁబనియె
నిట్రుపాసంబులను గూటి నెవ్వఁదొడరు
వెడగు బాపల తగులునఁబడితి వేల.

పై పద్యములో అలతి యలతి పదములతో చక్కనిభావం ప్రకటించబడింది. అలంకారయుక్తంగా కూడావుంది. ఇట్టివి ఇతని రచనలో అనేకములు. అట్లే కేవలం సుదీర్ఘ సంస్కృత సమాసాలతో కూడిన వర్ణనలు కొన్నిగలవు. సప్త ఋషులు తీర్థయాత్రలు గావించుచున్న సందర్భమునందు

చం. "చని చన్న కాంచిరంత హరి చందన భూరుహీ చారువాటికా
వని వనితా సహాయ సురవైణిక తల్ల జపాణి వల్లకే
ఘన నినదాను కారి మణి కందర జాలముఁబంచవర్ణకాం
చన కలవింక చంక్రమల సద్ధ్వని శీలము శేషశైలమున్."

[2–51]

అను పద్యము చెప్పబడినది. ఇది నాచన సోమనాథుని రచనను పోలియున్నది. పద్యాన్నంతటిని అచ్చతెనుగున వ్రాసి మధ్య ఒక సంస్కృత పదాన్ని వేసి రచనలో ఒక చమత్కారాన్ని చూపడం ఈ కవిరాజు ప్రత్యేకత. ఇట్టి పద్యాలితని రచనలో అనేకములు గలవు. శబ్దాలంకారము లితని రచనలో అధికముగ నున్నవి. భాగవతమున పోతన శబ్దాలంకారము లనేక విధంగా ప్రయోగించి ఎట్టి విధమగు మాధుర్యాన్ని కలిగించినాడో అట్టి మాధుర్యమునే ఈ కవిరాజు తన కావ్యమున కలిగించేడు. సంస్కృతాంధ్రభాషలలో గొప్ప పాండిత్యము గల వాడగుటచే ఇతని రచన నదీప్రవాహములా సాగిపోతూంటుంది. ఎక్కడను విసుగు కలగదు. స్వతంత్రమగు కల్పనలు, సుమనోహరమగు వర్ణనలు ఇతని రచనలో గలవు.

వర్ణనలు :

ఈ కావ్యంలో వర్ణనలకు అధిక ప్రాధాన్యం యివ్వబడింది. ప్రతి విషయాన్ని కవి కళ్ళకు కట్టినట్లు వర్ణించుతాడు. కొన్ని చోట్ల వర్ణనలు ప్రధాన కథకు

అంతరాయాన్ని కలిగించేటంతగా వున్నాయి. అయినప్పటికి వర్ణనలు ఎచ్చటను విసుగు గలిగించవు. ఈ కవి గ్రీష్మమును వర్ణించుచూ

కాకోల కంఠ తార్తీ
యాక విలోచనమునందు నెసఁగెడు సెగలే
పై కొనియె ననఁగలోకం
బాకుల పడఁదోచె గ్రీష్మమతి భీష్మంబై. [2-71]

గ్రీష్మం లోకాన్ని కలవర పరచింది ఎలాగంటే శివుని మూడవ కంటి మంటల సెగలే వ్యాపించేయి అన్నట్లుగా. ఇది ఒక చక్కని ఊహ.

ఈ కావ్యంలో ప్రత్యేకము పదునెనిమిది వర్ణనలు లేకపోయినప్పటికిని ఉన్న వర్ణనలు సందర్భమునకు తగినట్లున్నవి.

రఘునాథుడు పుళింద స్త్రీని వర్ణించిన తీరు చూడండి.

చం. "కుదురుగ జంగ సాచి చనుగుబ్బలు మీటుగఁబొఱుటాకుఁ బ
య్యెద పొదలంగ నెన్నుదురొకింత చెమర్పఁగ మేచకాళినే
ర్పుదొరలఁబాడి చందనపు ఱోలున నేనుగు కొమ్ము రోఁకటన్
బ్రిదిలెడు కొప్పుతో వెదురు బియ్యము గుప్పు నిజ ప్రియాంగనన్." [2-115]

పైపద్యమున పులింద స్త్రీని వర్ణించినటులగనే పురుషుల వర్ణన గూడ గలదు. వారి చేష్టల నితడు కళ్ళకు కట్టినట్లు వర్ణించేడు. ఇతని వర్ణనలో కృత్రిమత్వము కనిపించదు.

రఘునాథుడు అత్యంత సుందరముగా వర్ణించిన ఘట్టము రంభోర్వశుల సంవాదము. ప్రధాన కథ యెంత ఉందో ఈ ఘట్టం కూడా అంతే ఉంది. తన కాలము నాటి, వేశ్యల వైభవాన్ని కవి ఈ ఘట్టములో బాగుగా వర్ణించేడు. తాపసి దీక్షను భంగముగావించుటకై రంభోర్వశులు వెళుతూ ఏమి తీసుకు వెళ్ళేరో చూడుడు.

సీ. దంట నీలంపు చిక్కంటెలు దంతంపు
దువ్వెనల్ కుంకుమ పువ్వుఁమఱపు
నకినెల మంచముల్ చౌకంపు హొరాంబట్టు
బటువులు రావిల్క పంజరములు
పరిమళంబుల యుబ్బు బరిణలు చంద్ర కాం
తపు కోరలు విరికుందనపు గిండ్లు
నిలువు టద్దములు వీణియలు దండియలును
తాళముల్ వేణు వాద్యములురుములు

నావ జంబులు ముఖ వీణలానకములు
మద్దెలలుపాంగములు సర్వమండలములు
మొదలుగాఁగల సాధనంబులు ధరించి
కొందఱరిగిరి వెనువెంటఁగూడి యపుడు. [3–89]

పై పద్యములో వర్ణించబడిన సంభారములన్ని రంభోర్వశులవనుట కంటె రఘునాథుని కాలమునాటి వేశ్యలవే అనుట సమంజసము.

ఈ కావ్యములో వర్ణనలు సుదీర్ఘములు, సుమనోహరములు. అలంకార బంధురమైన రచన ఇందు ఎక్కువ. ఈ అలంకారముల వల్లే కావ్యానికి ఒక వినూత్న శోభ గలిగిందని చెప్పవచ్చు.

ఆత్మీయత :

రఘునాథ నాయకుడు శ్రీ రామచంద్రుని భక్తుడు. రామ మంత్రమహిమను కావ్యమున కవి చక్కగా నిరూపించేడు. కవికి సంగీత శాస్త్రము నందధికమైన పాండిత్యం ఉందని చెప్పవచ్చు. రంభోర్వశుల సంవాదమునందిది స్పష్టముగా కనబడుతుంది. రఘునాథునకు కొంచెము కూడ అహంకారమున్నటుల కనబడడు. ఇతడు తనను గూర్చి కావ్యమున చెప్పుకొన్నప్పటికిని అవియన్నియు యథాక్షర సత్యములే. ఇతడు వ్యాస వాల్మీక్యాది సంస్కృత కవులను పేర్కొనినాడు. నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలను కొనియాడినాడు. శ్రీనాథుని మాత్రము ప్రత్యేకముగా పేర్కొనినాడు. దీనికి కారణము శ్రీనాథునిపై నీతనికిగల యాదరమే. శ్రీనాథుని రచనను పోలిన రచన ఇతని కావ్యమున ఎడ నెడ గలదు.

యతి ప్రాసలు సరిగా నున్నంత మాత్రాన కవిత్వము గాదని రసపుష్టి యున్నదే నిజమైన కవిత్వమని పేర్కొని ఇతడట్టి కవిత్వమును చెప్పినాడు.

కప్పురము కుప్పలు పోసినట్లుగను, కుంకుమ పై పై గుప్పినట్లుగను, విరిపొట్లము విప్పినట్లుగను కవిత్వ ముండవలెనని చెప్పి అట్టి కవిత్వమునే చెప్పి సహృదయుల మెప్పు పొందినాడు.

రఘునాథుడు గొప్ప పరాక్రమ శాలి. ఇతడు తన సాటిలేని పరాక్రమముతో విజయనగర ప్రభువును, సింహళ ప్రభువును అపదల నుండి తప్పించినాడు.

రఘునాథునికి సంగీత సాహిత్యాది లలితకళల యందభిమానము ఎక్కువ. ఇతని ఆస్థానమునందు సంస్కృతాంధ్ర కవులెందరో విరాజిల్లిరి. ఇతని గురువగు గోవింద దీక్షితుడు గొప్పపండితుడు. అనేక గ్రంథములను రచించినాడు. గోవింద దీక్షితుని కుమారుడగు యజ్ఞనారాయణ దీక్షితుడు రఘునాథుని శిష్యుడు. రఘునాథుని పేర "రఘునాథ భూప విజయము," "రఘునాథ విలాసము" అను

గ్రంథములను ఇతడు రచించినాడు. ఇంకను సాహిత్య రత్నాకరము మొదలగు గ్రంథముల వ్రాసిన దిట్ట యజ్ఞనారాయణ దీక్షితుడు. ఇట్టి శిష్యుని గల్గిన రఘునాథుడెంత పండితుడో వేరే చెప్పనవసరములేదు గదా. రఘునాథుని ఆస్థానమున నున్న కవులలో చేమకూర వేంకటకవి ముఖ్యుడు. ఈతడు విజయ విలాసము, సారంగధర చరిత్ర అను ప్రబంధములను రచించినాడు. రఘునాథుని ఆస్థాన విదుషీమణి రామభద్రాంబ రఘునాథాభ్యుదయం అనే చారిత్రక కావ్యాన్ని వ్రాసింది.

రఘునాథుడు రాజ్యము చేయుచునే భగవదర్పితముగా గ్రంథముల రచించి అనేకులగు కవి పండితులను పోషించి ఆంధ్రభాషకు అపారమైన సేవ చేసిన ధన్యజీవి.

### కొన్ని పదాలకు అర్థాలు

అవజము = చర్మవాద్యము
అనకము = తప్పెట
ఉరుము = పెద్దభేరి
కందర జాలము = పర్వత గుహల సమూహము
కలవింక = ఊరబిచ్చుక
కాకోల కంఠుడు = శివుడు
కోరలు = గిన్నెలు
గుండంగి కోళ్ళు = నీటికోళ్ళు
గుప్పు = దంచు
చిక్కంటులు = చిక్కుతీసికొను దువ్వెనలు
జంగ సాచు = కాళ్ళు చాపు
తల్లజ = శ్రేష్ఠమైన
తార్తీయీకము = మూడవది
దంట = దిట్టమైన
దండియ = తంబురా
నిట్రుపాసము = కటిక ఉపవాసము
నెవ్వ = దుఃఖము
పాఋటాకు = వస్త్రమునకు బదులు కట్టుకొను ఆకు
ప్రిదిలెడు = జారెడు
పొంగములు = వాద్యవిశేషములు
బటువులు = గుండ్రని తలగడలు

మేచకాళి = నల్లని వెంట్రుకలు
వల్లకి = వీణ
వాటిక = ప్రదేశము
విరికుందనపు గిండ్లు = పువ్వులనే బంగరు గిన్నెలు
సకినెల మంచములు = కీచుకీచుమను మంచములు
హొరాంబట్టు = బంగారు జరి.

## ఆధార గ్రంథాలు


1. వాల్మీకి చరిత్రము – రఘునాథుడు – సాహిత్య అకాడమి – 1968
2. ఆంధ్ర కవి తరంగిణి, 12వ సంపుటం – చాగంటి శేషయ్య – 1958
3. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర – దివాకర్ల వేంకటావధాని – 1968
4. తంజాపుర ఆంధ్ర సాహిత్య చరిత్ర – కొకొ్ండ సత్యవతి – 1965
5. దక్షిణాంధ్రయుగ వాఙ్మయ చరిత్ర – కె.వి.ఆర్. నరసింహము – 1955
6. సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర, 10వ సంపుటం – ఆరుద్ర – 1965.

# రఘునాథనాయకాభ్యుదయము—విజయరాఘవనాయకుడు

సమీక్ష : శ్రీ ముచ్చు సీతారామయ్య, ఎం. ఏ.

[జన్మస్థలం – అలవలపాడు, అద్దంకితాలూకా, ప్రకాశం జిల్లా, జననం 2–5–1950. ఎం.ఏ. జూనియర్ రిసెర్చి అసిస్టెంటు, తెలుగు వ్యుత్పత్తి పదకోశం, తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు "ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి - విశ్వనాథవారి పరివస్య" - అన్న అంశంపైని పిహెచ్.డి. పట్టానికి పరిశోధన చేస్తున్నారు. అనేక వ్యాసాలు సాహిత్య పత్రికలలో ప్రచురించారు.]

కవిజీవితాదులు :

విజయరాఘవనాయకభూపాలుడు క్రీ.శ. 1633 సం॥ నుండి 1673 సం॥ వరకు తంజాపురరాజ్యాన్ని పాలించాడు. విజయరాఘవుడి తండ్రి సంగీత సాహిత్య సార్వభౌముడైన రఘునాథనాయకుడు, తల్లి కళావతి. విజయరాఘవుడు రాజగోపాలస్వామిభక్తుడు. తిరుమల తాతాచార్యులుగారి శిష్యుడు.

విజయరాఘవుడు ఎంత మహావీరుడో అంత రసికుడు. ఎంత రసికుడో అంత కళాకోవిదుడు, కళాపోషకుడు. సాహిత్యాన్నే దృష్టిలో పెట్టుకొని చూస్తే విజయరాఘవుడు తండ్రిని మించిన తనయుడని చెప్పక తప్పదు. విజయరాఘవుడు సాహిత్యరాయ పెండేర బిరుదాంచితుడు, అష్టభాషావిశారదుడు, చతుర్విధ కవితానిర్వాహకసార్వభౌముడు, వావదూ కాగ్రగణ్యుడు, కవిసమాజభోజభూజాని, గాన కళావిశారదుడు, వదాన్యుడు. రాజ్యం ఏలిన నలభైయేళ్లు ఆంధ్ర భాషాసేవలో కాలంగడిపిన బహువిధకృతులకర్త, భర్త.

విజయరాఘవుని కొలువుకూటం వాణీవిలాసమందిరం. అతనిరాజ్యానికే అలంకారమైన శారదాధ్వజంక్రింద కామరసు వెంకటపతి సోమయాజి, కోనేటి దీక్షితచంద్రుడు, చెంగల్వకాళకవి, పురుషోత్తమ దీక్షితులు, కృష్ణాజమ్మ, రంగాజమ్మ మొదలైన విద్వాంసులు, విదుషీమణులు విలసిల్లారు.

విజయరాఘవ విరచిత 'ప్రహ్లాదచరిత్ర' అనే యక్షగానారంభంలోని సుదీర్ఘ సీసమాలికలో విజయరాఘవుని కృతుల వివరాలున్నాయి. ఇతనికాలంలో యక్షగాన వాఙ్మయం పరాకాష్ఠకు చేరింది. రాజగోపాలవిలాసం, చెంగమలవల్లీ పరిణయం, గోవర్ధనోద్ధరణం, రతీమన్మథవిలాసం, రాసక్రీడ, నవనీతచోరం, పారిజాతాపహరణం, రుక్మిణీ కల్యాణం, రాధామాధవం, సత్యభామవివాహం, ఉషాపరిణయం, దక్షిణద్వారకాస్థలవర్ణనం, కాళియమర్దనం, రఘునాథాభ్యుద

యం, ప్రహ్లాదచరిత్ర, పూతనాహరణం, విప్రనారాయణ చరిత్ర, సముద్ర మథనం, కృష్ణవిలాసం, జానకీకల్యాణం, ప్రణయకలహం, కంసవిజయం అనే యక్షగానాల్ని, పాదుకాసహస్రం, మోహినీవిలాసం, రఘునాథనాయకాభ్యుదయం అనే ద్విపద కావ్యాల్ని రచించి, గోపికాగీతాల్ని, భ్రమరగీతాల్ని తెనిగించాడు. పైన చెప్పినవేగాక ఫాల్గుణోత్సవరగడ, రాజగోపాలస్వామిదండకం, వీర శృంగారసాంగత్యం, మన్నారు సాంగత్యం, వేడికోలు, విన్నపాలు, దరువులు, ఏలలు, విడిపదాలు మొ॥వి అనేకం వెలయించిన కవిరాజు విజయరాఘవుడు.

కథాసంగ్రహం :

ఒకరోజున రఘునాథుడు పురవీథుల్లో స్వారీ చేస్తూ వెళ్లతుండగా, పౌర కాంతలందరూ కన్నులపండుగ్గా ఉన్న అతని రూప సౌందర్యాన్ని ఠీవినీ ఠేవనూ చూసి ప్రశంసావీక్షణాలతో మంగళాశాసనాలు కురిపిస్తారు. అదేసమయంలో 'చిత్రరేఖ' అనే ఒక చిన్నదికూడా చూసి ఆరాజ కందర్పుడ్ని వలచి విరహ వేదనతో క్రుమ్మగ్గుతూంటుంది. చెలులు ఆమె మన్మథ సంతాపాన్ని మాపటానికి ఉద్యానవనానికి తీసుకెళ్లి శైత్యోపచారాలు చేస్తారు. కాని ప్రయోజనం శూన్యం. అప్పుడు చిత్రరేఖ పెంపుడు చిలక జాలిపడి ఉద్యానవనంలో విహరిస్తున్న రఘునాథుడిదగ్గరకువెళ్లి తనయేలిక సాని పడుతున్న విరహాన్ని రాజుకు జాలిపుట్టే విధంగా వర్ణిస్తుంది. చిలకపలుకులకు రాజుమనస్సు రాగాయత్తమౌతుంది. రాజు చిత్రరేఖతో సుఖించటాని కంగీకరిస్తాడు. ఇది రఘునాథనాయకాభ్యుదయంలోని కథ.

పురాణప్రసిద్ధులైన నలదమయంతులకు రాజహంస రాయబారం నడిపింది. అప్పటినుండి ఈపక్షిరాయబారాలు మొదలైనాయి. ప్రభావతీప్రద్యుమ్నంలో, రాధామాధవంలో, రాధికాసాంత్వనంలో, లక్షణాపరిణయంలో, అలాగే రఘు నాథనాయకాభ్యుదయంలోనూ ఈ పక్షిరాయబారాలు కొనసాగాయి.

వస్తుతత్త్వం :

రఘునాథనాయకాభ్యుదయం మూడాశ్వాసాల ద్విపద ప్రబంధం. మొత్తం రెండువేల పదహారుపంక్తులున్నవి. ఇందలి కథానాయకుడు రఘునాథనాయకుడు. నాయిక చిత్రరేఖ. విజయరాఘవుడు రఘునాథ నాయకాభ్యుదయాన్ని తన ఇష్టదైవం అయిన రాజగోపాలస్వామికి అంకితం ఇచ్చాడు.

తమతండ్రుల పూర్వవృత్తాంతాల్ని తెలిపే ఇటువంటిరచనలకి రఘునాథ నాయకుడే మార్గదర్శకుడు. అతడు తనతండ్రి అచ్యుతప్పనాయకుని చరిత్రను 'అచ్యుతాభ్యుదయం' అనే పేరుతో రచించాడు. దీన్ననుసరించే విజయరాఘవుడు

రఘునాథనాయకాభ్యుదయాన్ని రచించాడు. అలాగే విజయరాఘవుని కుమారుడు మన్నారుదేవుడు విజయరాఘవనాయకాభ్యుదయాన్ని వెలయించాడు.

రఘునాథనాయకాభ్యుదయంలో కథాసంవిధానమున నవ్యత కన్పించదు. అయినప్పటికీ ఆంధ్రనాయకరాజుల కాలాన రాజజీవితం ఏవిధంగా ఉండేదో తెలుసుకోటానికి చక్కగా ఉపకరిస్తుంది. రాయవాచకం తరువాత ఆనాటి ఆంధ్రరాజుల దైనిక జీవితాల్ని కళ్లకుకట్టినట్లుగా చూపిందీ రఘునాథనాయకాభ్యుదయమే. ఇందలి ఇతివృత్తంతోనే తదుపరి యక్షగానాలమీద మమకారం ఎక్కువై విజయరాఘవుడు 'రఘునాథాభ్యుదయం' అనే యక్షగానాన్ని కూడా వ్రాశాడు. తన ఆస్థానకవులందరినీ యక్షగానరచనకు ప్రోత్సహించాడు. రంగాజమ్మ మన్నారుదాసవిలాసం ఇలాగే పరివర్తితమై మన్నారు దాసవిలాస నాటకంగా వెలసింది.

రఘునాథనాయకాభ్యుదయంలోని కవిత్వం పాల్కురికిసోమనాథ, రంగనాథాదుల కవిత్వం అంతటి ప్రౌఢమైంది కాకపోయినా చక్కని ధారాశుద్ధితో వొప్పారుతుంది. అలాగే కథ దీర్ఘంగానూ, అనేకసంఘటనలతోనూ నిండక సామాన్యమైన తమిళదేశపు 'ఉలా' ప్రబంధపద్ధతిని అనుసరించింది. కారణం ? తమిళసాహిత్య ప్రభావమే !

పాత్ర చిత్రణ :

పాత్ర చిత్రణ పాత్రల స్వభావ జీవలక్షణాన్ని పట్టియిచ్చేవిధంగా ఉండాలి. రఘునాథనాయకాభ్యుదయంలో తంజావురజనులందరూ పాత్రలే. అయినప్పటికి ముఖ్యంగా పేర్కొనదగినవారు రఘునాథ భూపాలుడు, చిత్రరేఖ—వీరిని చుట్టి అనేక చిల్లర పాత్రలునూ పోషింప బడ్డాయి.

రఘునాథుడి పాత్ర చిత్రణలో కవిరాజు ఆ పాత్రలోని రాజఠీవిని, దైవ భక్తిని, బ్రాహ్మణ భక్తిని, సంగీత సాహిత్యాది వివిధ కళల్లో అతనికిగల అభిరుచిని, అభినివేశాన్ని చక్కగా చిత్రించాడు.

రఘునాథుడి స్వభావాన్ని పట్టిచ్చే ఈ పంక్తుల్ని తిలకించండి.

"మేటి రాజుల కెల్ల మేల్బంతి యగుచు
ధరణిపై గృతయుగ ధర్మంబు నడపఁ
బరమ దయాళుడై ప్రజలఁ బాలించె"

[ప్ర. ఆశ్వా. పం. 471–73]

"నిదుర మేల్కొని పెద్దనిలువు టద్దంబు
కపిల ధేనువు పూర్ణ కలశముల్ చూచి
యపుడు భూదేవ ద్వయంబు నీక్షించి"

[ప్ర. ఆశ్వా. పం. 116–18]

"తిరుచూర్ణ రేఖతో దిరుమణి నుదుట
ధరియించి మేన ద్వాదశపుండ్రములను"

[ప్ర. ఆశ్వా. పం. 564-65]

రసం :

రఘునాథ నాయకాభ్యుదయంలో పోషింపబడ్డ రసం శృంగారం. నాయిక సామాన్య. ప్రియుడి కోసం అలంకరించుకొని ఎదురు చూస్తూంటుంది కనుక వాసక సజ్జిక. నాయకుడు ధీరోదాత్తుడు. అందులోనూ బహు వల్లభుడవటంవల్ల దక్షిణుడు. ఈ రకం కావ్యాలనే తమిళ సాహిత్యంలో "ఉలా" ప్రబంధా లంటారు.

చిత్రరేఖకు చేయబడిన అలంకరణ రసోత్పత్తికి ఉద్దీపన కలిగించటమేగాక ఆనాటి స్త్రీలు ధరించే ఆభరణ విశేషాల్నికూడా తెలియ జేస్తుంది.

చెలి కత్తెలు చిత్రరేఖను చక్కగా అలంకరిస్తారు. సువాసనలు గుమాయించే మైపూతలు పూస్తారు. తరువాత ఆమె ధరించే ఆభరణాలు చూడండి :

ముంగాముఠారియు ముత్యాలకంటె
రంగుమీరిన పెంచురతనాలకుచ్చు
మెచ్చుగ సలికెడు మేటికిరీటి
పచ్చతా పలకల పాదపల్లవము
ముంగరముత్యాల మురవుల బవిర
లుంగరంబులు మించు నొడ్డాణములును
కంఠ సరంబులుఁ గంఠమాలికలు
గంటలమొలనూలు కంకణంబులును
పుంజాల దండలు బుగడలుఁగమ్మ
పంజుల పదముల్ బన్నసరములు
సందిలి దండలు జాళువా గొలుసు
లందియల్ మట్టియ లాదిగాఁ గల్గు
నవరత్న మణిభూషణంబులందీయ
వివిధాంగ శృంగార విధులాచరించి

[తృ. ఆశ్వా. పం. 493-506]

వర్ణనలు :

రఘునాథ నాయకుని దేవ భూదేవ పూజనం, దానాదికాలూ, మజ్జనభోజ నాదులూ, కొలువుకూటం విశేషాలూ, విద్యావినోదాలూ, పురవీథుల విహారయాత్ర, ఆరామ విహారం మొదలైన వాని వర్ణనల్ని చదువునప్పుడు ఆ కాలంలో ఉన్నట్లే ఆ విశేషాల్ని మనం సందర్శిస్తున్నట్లే భావిస్తాం. కవి ఆనాటి చారిత్రక, సాంఘిక

పరిస్థితుల్ని అంత వాస్తవికంగా తీర్చి దిద్దాడు. అసలీ కావ్యం అవి తెలుసుకోటా నికే చదవాలి.

రఘునాథ నాయకాభ్యుదయం తంజావుర వర్ణనతో ప్రారంభమౌతుంది. ఆ వర్ణన నూరు పంక్తుల్లో రమణీయంగా జరిగింది. విజయరాఘవుడు తాను నిత్యం నివసిస్తూ, చూస్తూ విహరించే నగరం తంజావురం. కాబట్టి దాని నిర్మాణ వైభవాదుల మీద ప్రత్యేక గౌరవాభిమానాలు చూపాడు.

క్రీడాభిరామంలోకూడా ఓరుగల్లు నగరవర్ణన చేయబడింది. కాని ఆ వర్ణనలో లేని ఐక్యాన్ని విజయరాఘవుడు తంజావుర వర్ణనల్లో చక్కగా ప్రదర్శించాడు.

తంజావుర కోటవర్ణన తిలకించండి.

"కోట బైట జలంబు గ్రోలనేతెంచు
మేటి మత్తేభముల్ మేఘముల్ గాఁగ
పాతాళముననున్న పన్నగ రాజ
శాతోదరులు తటిజ్జాతముల్ గాఁగఁ
దగు పుండరీకముల్ తారలు గాఁగ
గగన సమానమై గను పట్టు పరిఘ"

[ప్ర. ఆశ్వా. పం. 348 353]

ఈ విధంగా కోట వరన ఒక క్రమవిధానాన్ననుసరించి రమణీయంగా వర్ణించబడింది.

విజయరాఘవుడు తన కాలంనాటి వివిధ వినోదాల్ని కూడ విపులంగా వర్ణించాడు. పదచాళి, పేరణి, జక్కిణి, దురుపద, కొరవంజి, శివలీల, గుజరాతి వంటి వివిధ నాట్యాలు ఆనాడు రాజుల సభామందిరాల్లో ప్రదర్శింపబడేవి. ఆనాడు గాన వాద్య వినోదాలు కూడా అనేకం ఉండేవి. వీణ, మురళి, రబాబు, తంబుర, దండె, చెంగు, స్వరమండలం, రావణహస్తం మొ॥వి అనేకం వాద్యాలుండేవి. అలాగే సాహిత్య గోష్ఠులు జరిగేవి. ఈ గోష్ఠులలో రఘునాథుడు రచించిన కావ్యాలు పఠించటం, సమస్యలు పూరించటం వంటివి అనేకం జరిగేవి.

రఘునాథుడు ఆరగించే విందులోని పదార్థాలు కూడా నోరూరే విధంగా వర్ణించబడ్డాయి. ఆ విందులో వివిధ శాకాహార, మాంసాహార పదార్థాలూ, పిండి వంటలు వడ్డించబడేవి. ఈ వర్ణన తృతీయాశ్వాసంలో ఇరవైయేడు పంక్తుల్లో జరిగింది. అలాగే రఘునాథుడు సాయంవేళ వాహ్యాళికి వెళ్లడానికి అలంకరించబడిన ఏనుగు వర్ణన కొంత అతిశయోక్తులతో కూడినప్పటికి మనోజ్ఞంగా వర్ణించబడింది.

ఈ విధంగా విజయరాఘవుడు తనకాలంనాటి వివిధ విషయాల్ని విపులంగా వర్ణించి రఘునాథ నాయకాభ్యుదయానికి ఎనలేని సాంఘిక ప్రాధాన్యాన్ని సంతరించాడు.

కవి వ్యక్తిత్వం :

విజయరాఘవుడు రాజకవి. పరిపాలనామర్మాలేగాక కళామర్మాలుకూడా కూలంకషంగా తెలిసినవాడు. కత్తిపట్టటంలో ఎంతటిధీరుడో కలంపట్టటంలో అంతకుమించిన సహృదయ సమ్రాట్టు. మొదట్లో రాజకీయాధికారంకోసం కర్కశంగా ప్రవర్తించినా తరువాత స్థిరపడి, రాజ్యంలో శాంతిభద్రతలు నెలకొల్పి, కళాలక్ష్మికి భద్రపీఠం స్థాపించాడు. అనువంశికంగా వస్తున్న పితృభక్తిని, దైవభక్తిని, గురుభక్తిని వినమ్రమనస్కుడై ప్రదర్శించాడు. విజయరాఘవుడు తన వంశ ప్రతిష్ఠను ఇనుమడింపజేసి, తనకాలంనాటి చారిత్రక, సాంఘిక పరిస్థితులకు రఘునాథ నాయకాభ్యుదయంలో అద్దంపట్టాడు. అడుగడుగున తనవ్యక్తిత్వ ముద్ర నిలిపాడు. తాను రాజకవినన్న విషయాన్ని సార్థకంచేసుకున్నాడు విజయ రాఘవ మహీపాలుడు.

## కొన్ని పదాలకు అర్థాలు

వావదూకాగ్రగణ్యుడు = యుక్తియుక్తంగా మాట్లాడటంలో మొదట లెక్కింపదగినవాడు

వదాన్యుడు = దాత

కపిలధేనువు = పుల్లావు

ముంగామురారి = ముంజేతధరించే ఆభరణ విశేషం

పుంజాలదండ = ఆడవాళ్లుధరించే కంఠాభరణ విశేషం

సందిటిదండ = సందిటకట్టుకొను ఆభరణం

శాతోదరులు = కృశించిన కడుపుగల ఆడవాళ్లు

తటిత్తు = మెరుపు, విద్యుత్తు

పరిఘ = కోటగవను.

## ఆధార గ్రంథాలు

1. రఘునాథనాయకాభ్యుదయము – మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పీఠిక - తంజావూరు సరస్వతీమహలువారు ప్రచురించినది
2. తంజావూరు తెలుగుకవులు – శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి
3. తంజావూరాంధ్ర సాహిత్యచరిత్ర – కొక్కొండ సత్యవతి
4. దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము – నేలటూరి వేంకటరమణయ్య
5. ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర – డా॥ యస్వీ జోగారావు.

## అనిరుద్ధచరిత్రము — కనుపర్తి అబ్బయామాత్యుడు

సమీక్ష : శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, ఎం.ఏ.

[జన్మస్థలం – మచిలీపట్నం, కృష్ణాజిల్లా. జననం – 26–12–1954. ఎం.ఏ., యు. జి. సి. పరిశోధకవిద్యార్థి, తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు. 'భాగవతము – భక్తితత్త్వము' అనే అంశంపై పి. హెచ్‌డి. పట్టానికి పరిశోధనచేస్తున్నారు. ప్రచురణలు – 'భక్తి'; భగవద్గీత; ఏటికోళ్ల కవితానమీక్ష ; – మొ. వ్యాసాలు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. రేడియోప్రసంగాలు – 'నిరక్షరాస్యతా నిర్మూలనం'; ఎఱ్ఱాప్రగడ సాహితీ వ్యక్తిత్వం. మొ విశాఖ భగవద్గీతాజయంతి నమితి నిర్వహించిన వ్యాసరచన పోటీలో 1978లో ప్రథమబహుమతి.]

కవిజీవితాదులు :

ఒక మధుర ప్రణయగాథ "అనిరుద్ధచరిత్ర" దీన్ని సరసమైన శృంగార ప్రబంధంగా సంతరించిన కవిశిల్పి కనుపర్తి అబ్బయామాత్యుడు. 18వ శతాబ్దంలో గుంటూరుమండలంలోని 'కనుపర్తి'లో ఇతనిమనుగడ సాగింది. ఇతని తల్లి నరసమాంబ. తండ్రి రాయనమంత్రి.

అబ్బయామాత్యుడు 'పురూరవశ్చరితమ'నే గ్రంథంకూడా వ్రాశాడు. దీనికే 'కవిరాజమనోరంజనమ'ని మరోపేరు.

ఈ కవి మంగళగిరి నరసింహస్వామి భక్తుడు. 'నృసింహకృపా ప్రసాద సంప్రాప్త విద్యావైభవం' కలవాడు. తన రచనలు రెండింటిని నరసింహస్వామికే అంకితం చేశాడు.

అనిరుద్ధుడి కథ భాగవతంలోను, హరివంశంలోను ఉంది. అయితే, రెండు గ్రంథాల్లోనూ ఉన్న కథాఘట్టాల్లో చిన్నచిన్న తేడాలున్నాయి. అబ్బయామాత్యుడు భాగవతంలోని కథనే ఎక్కువగా అనుసరించాడు.

'అనిరుద్ధ చరిత్ర'లో ఐదాశ్వాసాలున్నాయి. దాదాపు ఆరువందలకు పైగా గద్యపద్యాల్లో ఈ కథ నడిచింది.

కథ :

ద్వారకాపుర నాయకుడైన శ్రీకృష్ణుడికి మనుమడు అనిరుద్ధుడు. శృంగార రస స్వరూపుడు. అతని మేనమామ కూతురైన రుక్మలోచన రూప సంపన్న. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుని కొత్తకాపురంలో సుఖంగా ఉన్నారు.

అదేకాలంలో శోణపురాన్ని పాలించే బాణాసురుడు తన వాద్య విద్యా నైపుణ్యంతో శివుణ్ణి మెప్పించి వరం సంపాదించుకున్నాడు. బాణుడికిచ్చిన వరానికి కట్టుబడి అతని నగరివాకిట కావలి ఉండటానికి సమ్మతించాడు శివుడు.

బాణుడికూతురైన ఉష సంగీత సాహిత్యాది సరస విద్యలన్నీ నేర్చింది. ఆమె సౌందర్యం సాటిలేనిది. మంత్రతంత్రాది యోగవిద్యల్లో ఆరితేరిన చిత్రరేఖ ఉషాకన్యకు ప్రాణ స్నేహితురాలు.

ఉషాకన్య ఒకనాటిరాత్రి 'కామినీ హృదయ పాంచాలుడొకడు' తనతో రతి కేళి సాగించినట్లు కలగన్నది. అప్పట్నుంచీ అతనికోసం విరహంతో వేగి పోయింది. ఆమెవేదనకు కారణమడిగి తెలుసుకుంది చిత్రరేఖ. ఉషాకన్యను ఊరడించి, యోగబలంతో ఆకాశమార్గాన ద్వారక చేరింది. సమ్మోహన విద్యతో అనిరుద్ధుణ్ణి ఉన్నపళంగా ఉషాకన్యఉంటున్న అంతఃపురానికి చేర్చింది.

ఉషా అనిరుద్ధులు కొన్నాళ్ళు శృంగారంలో ఓలలాడారు. ఆమె గర్భవతి అయింది. అనిరుద్ధుడి రహస్యం బయటపడింది. బాణాసురుడతన్ని బంధించాడు.

ఇక్కడి పరిస్థితి ఇలాఉండగా, ద్వారకలో అనిరుద్ధుడి తలిదండ్రులు, భార్య అతనికోసం కలవర పడసాగారు. ఒకనాడు అక్కడికివచ్చిన నారదుడు అనిరుద్ధుడి సమాచారమంతా తెలియచెప్పాడు. కృష్ణుడు సైన్యసమేతుడై శోణ పురాన్ని ముట్టడించాడు. నగరివాకిట కాపలాఉన్న శివుడితో కొంత సేపు యుద్ధంచేసాడు. తర్వాత కృష్ణుణ్ణి బాణాసురుడెదుర్కొన్నాడు. కృష్ణుడు ప్రయో గించిన సుదర్శనచక్రం బాణుడి సహస్ర బాహువుల్లోనూ నాలిగింటిని మిగిల్చి తక్కిన చేతుల్ని ఖండించింది. శివుడు స్తుతించగా కృష్ణుడు శాంతించి భక్తుడిపట్ల శివుడికున్న వాత్సల్యానికి సంతోషించాడు. 'ప్రహ్లాదుడి వంశంలోనివాడు కాబట్టి బాణుణ్ణి క్షమించి, విడిచిపెట్టేస్తున్నా'నన్నాడు. ప్రమథగణాల్లో ఉత్తముడై శివ సాన్నిధ్యం పొందగలడని అతన్ని అనుగ్రహించాడు కృష్ణుడు.

బాణుడు బుద్ధితెచ్చుకుని ఉషా అనిరుద్ధుల్ని సగౌరవంగా కృష్ణుడివెంట పంపించాడు. అనిరుద్ధుడు ద్వారకచేరి ఇద్దరు భార్యల్ని సమానంగా ఆదరిస్తూ, దక్షిణనాయకుడయ్యాడు. కొన్నాళ్లకి ఉషాసుందరికి వజ్రుడనే కొడుకు పుట్టాడు. నారదుడు వజ్రుడి సాముద్రిక లక్షణాలన్నీ పరిశీలించి, అతను ఉత్తమపురుషుడవుతాడని దీవించాడు. అనిరుద్ధుడు ఆత్మజ్ఞానంతో జీవితం గడుపసాగాడు. ఇదీ ఇందులో కథ.

వస్తుతత్త్వం :

ఈ కథ చాల వింతైనకథ. చాలామంది తెలుగుకవుల మాదిరిగానే అబ్బయా మాత్యుడు కూడా కలగన్నాడు. కలలో అతని ఇష్టదైవం నరసింహస్వామి

కనిపించి 'అనిరుద్ధచరిత్ర' ప్రబంధం వ్రాసి తనకు అంకితం ఇమ్మన్నాడు. కల కల్ల కాకుండా కమ్మని కావ్యంగా రూపుదిద్దుకుంది. ఈ కావ్యంలో కథకూడా ఇంతే. కావ్యనాయిక కలగన్నది. ఆ కల కరిగిపోలేదు. కలగన్న ఉషాకన్య మాత్రం అని రుద్ధుడి కౌగిట్లో కరిగిపోయింది. శృంగార రసోద్దీప్తికి అనువైన కథావస్తువు ఈ కావ్యంలో ఉంది. అనిరుద్ధుడు సాగించిన ప్రణయకలాపమంతా రసవంతంగా తీర్చిదిద్దాడు కవి. ఈ కథలో శృంగారమే ప్రధానరసం. రుక్మలోచన విషయంలో వివాహానంతర ప్రణయాన్ని, ఉషాకన్య విషయంలో రహస్య ప్రణయాన్ని వర్ణించాడు కవి.

రసం :

రుక్మలోచనతో అనిరుద్ధుడి శృంగారాన్ని వర్ణించే సందర్భంలో ఆమెను ముద్దరాలుగా చిత్రిస్తూ, "విభుని తమకంబుతో వెలది సిగ్గుపోరుపెల్ల" వ్యర్థ మన్నాడు. 'అలయించిన పిమ్మట సౌఖ్యదాయకమయ్యే కన్యకారతి నారికేళఫల పాక'మని పేర్కొన్నాడు. ఉషాకన్య కౌగిలి తనరాజధానిగా మన్మథ సామ్రాజ్యాన్ని పరిపాలించే అనిరుద్ధుడు "వలపుఁబేరురులొడ్డి జగంబు వారిమొగ్గించెడివాని పెద్ద కొడుకే" అంటూ అతని శృంగార చాతుర్యాన్ని సమర్ధించాడు.

కేవలం సంభోగ శృంగారాన్నేకాక విప్రలంభాన్నికూడా వర్ణిస్తేనే శృంగా రానికి వన్నె. కలలో "ఏమేమొ ఆగడం"చేసిన అనిరుద్ధుడికోసం ఉషాకన్య 'చలువ వెన్నెల సెగలై' విరహవేదన పొందినట్లు వర్ణించాడు కవి. అనిరుద్ధుడు బందీఅయినప్పుడు ఉషాకన్య పొందిన మనోవ్యథ ఆమె ముఖంలో ఎలా ప్రస్ఫుట మైందో చక్కగా నిరూపించాడు కవి. 'తెల్లవారగనే కాంతితప్పిన చంద్రబింబంలా ఆమెముఖం తెల్లబోయిందిట. మునిమాపు వేళకు వాడిపోయే తమ్మిరేకుల్లా కళ్ళల్లో దైన్యరేఖ కన్పించిందిట. మంచు బిందువులంటిన తమలపాకుదళాల్లా చెక్కిళ్లు చెమర్చాయిట.' ఇలా ఈ కథలోని శృంగారాన్ని చరమస్థాయికి నడిపించాడు కవి.

శృంగారరస ప్రధానమైన ఈ కావ్యంలో అక్కడక్కడ వీరరసంకూడా పొడసూపుతోంది. ఈ కథలోని యుద్ధసన్నివేశాల్ని కఠినపదాలతో, దీర్ఘసమా సాలతో వీర రస స్ఫోరకంగా వర్ణించాడుకవి. వీర రసానికి సన్నిహితంగా ఉండే రౌద్ర బీభత్సాదుల స్పర్శకూడా ఉంది.

పాత్రలు :

ఈ కావ్యంలో దివ్యులైన శ్రీకృష్ణుడు, శివుడు, రాక్షసుడైన బాణుడు కన్పిస్తారు. అంతా తనకు తెలిసికూడా ఏమీ తెలియనట్లు ఊరుకున్న మాయా మానుష వేషుడు శ్రీకృష్ణుడు. శివుడు సరే, అడిగింది తడవుగా ఇంకేదీ ఆలోచించ కుండా వరాలిచ్చే బోళాశంకరుడు. శివుణ్ణిగురించి కవి స్వయంగా 'ఎంత సులభుడు

పార్వతీకాంతు డహహ'అన్నాడు. బాణుడు వరగర్వితుడు. దురహంకారి. చేతులారా చేటు తెచ్చుకున్న మూర్ఖుడు. కావ్యనాయకుడైన అనిరుద్ధుడు 'త్రిలోక సుందర శుభాకారుడు.' చతురుడైన శృంగార నాయకుడు. సమర్థుడైన దక్షిణ నాయకుడు. చివరకు ఆత్మజ్ఞాని. 'గురుతెఱుంగనివాని కూర్మికాశించి,' నెచ్చెలి సహకారంతో తన అభీష్టం నెరవేర్చుకున్న అదృష్టవంతురాలు ఉషాకన్య. రుక్మలోచన ముగ్ధ.

శైలి :

ఈ ప్రణయగాథ అబ్బయామాత్యుడి రచనలో సుందరమైన శృంగార కావ్యంగా అవతరించింది. 'చల్లనిరాజు', 'మనసుచల్ల'బడేటట్లు, 'మాటలువేయు నేమిటికి,' 'కానున్న కార్యమయ్యెడు,' వంటివి సందర్భానుసారంగా తెలుగు నుడికారాన్ని ప్రయోగించగలిగిన కవి నేర్పరితనాన్ని చాటుతున్నాయి. 'మదను పాదుశహా'వంటి అన్యదేశ్యంకూడా కవి ప్రయోగించాడు. పదాలను సాభిప్రాయంగా ప్రయోగించే నేర్పు ఇతనిలో కన్పిస్తుంది. ఉషాకన్య విరహంతో బాధపడుతుంటే చెలికత్తెలు మలయమారుతాన్ని దూషిస్తూ, 'నీ గుణంబుకద దాక్షిణ్యంబు? – అది విడిచి ఎందుకిలా బాధపెడుతున్నావ'ని ప్రశ్నించారు. 'దాక్షిణ్యము' అంటే దయ. అంతేకాక దక్షిణసంబంధమైంది దాక్షిణ్యం. మలయమారుతం దక్షిణదిశ నుంచి వీస్తుంది కాబట్టి దాక్షిణ్యందాని లక్షణం. ఇలా 'దాక్షిణ్యం' అనే పదంమీద సునిసితమైన చమత్కారంచేశాడు కవి.

ఒకొక్క భావప్రకటనలో ఈ కవి అద్భుతమైన నేర్పు చూపించాడు. కలగన్నది మొదలుగా కలతచెందిన ఉషాకన్య బాధనుమాన్పే ప్రయత్నంలో ముల్లోకాల్లోనూ ఉన్న సుందర పురుషుల బొమ్మలన్నీవేసింది చిత్రరేఖ. అప్పుడు కవి, "వ్రాతకజుఁడు కర్త సేతకు తాకర్త" అనేమాట చిత్రరేఖ విషయంలో వ్యతిరేక మైందన్నాడు. సాధారణంగా నుదుటిరాతకు కర్త బ్రహ్మదేవుడని, మన చేతలకు మనం కర్తలమని అనుకుంటాం. ఇక్కడ ఆ బొమ్మలన్నీ వ్రాసి చిత్రరేఖ 'వ్రాతకు తా కర్త'అయిందిట. ఇక చిత్రపటంలో ఉన్న అనిరుద్ధుణ్ణి ఉషాకన్యకు సంఘటింపచేసే 'చేతకు' – 'అజుడేకర్త' కదా! అని చమత్కరించాడు కవి.

అనిరుద్ధుడికోసం విరహంతో విలపిస్తూ బరువుగా కాలం గడుపుతున్న ఉషాకన్య మనస్సు క్రమ పరిణామరూపంలో ఏ స్థితికి లోనైందో చక్కగా నిరూపించాడు.

"తొలుత నాతని రూపుఁ గన్న యాదిగా
    మగువకు దినములే యుగము లయ్యెఁ,
బటముపై నతని రూపముఁ జూచినది మొదల్
    మగువకు జాములే యుగము లయ్యెఁ,

సఖి వానిఁ దోడితేఁ జనిన యంతట నుండి
యువిదకు గడియలే యుగము లయ్యె.
దరువాత నతఁడు నిద్దుర లేచు నంతకు
యువతికి నిమిషముల్ యుగము లయ్యె.
నతఁడు గ్గాగిఁటఁ గదియించు నంతలోన
నుత్పలదళాయతాక్షి కొక్కొక్క క్షణమె
యుగ సహస్రంబులై తోఁచు చుండెనపుడు" (3–72)

అంటూ "వనిత తమకంబుఁ దెలుప నెవ్వరి వశంబు ?" అని ప్రశ్నించాడు గాని, 'చతురకవిత్వతత్త్వపటు సంపద' గలవాళ్ళు ఏ భావాన్నైనా తమవశంచేసుకుని చెప్పగలరు కదా !

వెన్నెలతో సమానమైన అనిరుద్ధుడి ముఖకాంతికి తనహృదయం చంద్రకాంత శిలలా కరిగిపోయిందని ఉషాకన్య వేదనచెందే సందర్భంలో మనోధర్మానికి తగినపోలిక మనోహరంగా ఉంది. ద్వారకాపురానికి వచ్చిన నారదుడు యతి వేషములో ఉన్న కల్పవృక్షంలా ఉన్నాడని పోల్చాడు కవి. నారదుడి దివ్యత్వాన్ని, పవిత్రతను తెలియజేసే ఈ ఉపమానం అతని స్వరూపానికి, స్వభావానికి కూడా సరిపోయేటట్లుంది. భర్తతో ప్రయాణమవుతున్న ఉషాకన్య 'కందర్పుని రాజ్యలక్ష్మిలా ఉందని వర్ణించడం మున్ముందు గడుపబోయే సుఖ ప్రదమైన దాంపత్య జీవితాన్ని సూచిస్తూ సమంజసంగా ఉంది.

రుక్మలోచన వివాహసమయంలో తెరతీయగానే "మొయిలు తొలగిన చక్కగచెలువొందు పూర్ణచంద్రుఁడా" అన్నట్లు ఆమె ముఖకాంతి ప్రకాశించిందని అందంగా ఉత్ప్రేక్షించాడు కవి.

ఉషాకన్య చెలికత్తెలు మన్మథుణ్ణి దూషిస్తూ 'మునుపొకసారి శివుడి జోలికి పోయి మాడి మసైపోయావు కదా ! అప్పటినుంచైనా ఇతరులను బాధపెట్టడం మానవెందుకు ?' అని ప్రశ్నిస్తూ, "కాపురుషులు రాజదండనము పొందియు నైజం మానరే కదా!" అని సమర్థించడం సందర్భోచితంగా ఉంది. యుద్ధ సన్నద్ధుడై వచ్చిన బాణుడు తన పరాక్రమాన్ని తానే పొగుడుకుంటూంటే కృష్ణుడు 'యుద్ధానికి వచ్చి వ్యర్థపు మాటలెందుకు' అంటూ "ఆకొని భుజియింప బోవుచును కూరల మేలడుగంగ నేటికిన్" [4–81] అనే అర్థాంతరన్యాసంతో సమర్థించుకున్నాడు. 'తినబోతూ రుచులెందుకు' అనే నానుడిని సన్నివేశానికి తగినట్లు ఉపయోగించుకున్నాడు కవి. ఉషాకన్య సౌందర్యాన్ని వర్ణిస్తూ, "ఇరుల సిరులు దొరలు కురులు... సుమచాపుతూపు రూపుమాపు చూపు కోపు" [2–28] వంటి అనుప్రాసల్ని అందంగా ప్రయోగించాడు. శ్లేష, యమక రచనల్లో

కూడా ఈ కవి సిద్ధహస్తుడు. ఇలా ప్రబంధానికి తగిన ఆలంకారిక రచనలో తన నేర్పు చూపించాడు అబ్బయామాత్యుడు.

వర్ణనలు :

కావ్యమనే చిత్రపటానికి వర్ణనలే రంగులు. కథలో కలిసిపోయే చక్కని వర్ణనలతో అబ్బయామాత్యుడు తన కావ్యాన్ని అందంగా మలచుకున్నాడు. ప్రబంధ శైలికి అనువుగా పురవర్ణన, సూర్యాస్తమయ, చంద్రోదయ, సూర్యోదయ వర్ణనలు, వసంత కాలవర్ణన మొదలైనవన్నీ ఈ కావ్యంలో చోటుచేసుకున్నాయి. కావ్యారంభంలోనే ద్వారకాపుర వర్ణనలో ప్రాకారగోపుర "ప్రాసాద పద్మరాగ ప్రభా చుంచితగగనతలము" అంటూ అతిశయోక్తులతో కూడిన చమత్కారం సాక్షాత్కరిస్తుంది. ద్వారకలోని బ్రాహ్మణులను గురించి చెప్తూ, 'బ్రహ్మ నాలుగు ముఖాలతో చదివిన చదువు వీళ్ళు ఒక్కముఖంతోనే చదువుకున్నార'ని చమత్కరించాడు కవి.

ఉషాకన్య నిండు జవ్వనాన్ని, సౌందర్యాన్ని, "అరవిందములు మన్మథాస్త్రంబులైనట్లు" ఆమె వాల్గనుల కొనలు పటుసు తేరి ఉన్నాయని వర్ణించాడు. మన్మథుడి రథంలా కదిలివస్తూన్న ఆమె సౌందర్యాన్ని అబ్బయామాత్యుడు వర్ణించిన తీరు అతని భావనాబలానికి నిదర్శనం. ఆమె కాలి అందెలకు చెక్కిన వజ్రాలమీద కాలిగోళ్ళ కాంతి తళుక్కుమందిట, ముక్కెర మీది కెంపు పెదవి కాంతిలో మెరిసిందిట. ఇలా "తొడవులకు నెల్ల తన మేను తొడవు కాగా...." ఆమె సౌందర్యం అతిశయించిందని వర్ణించాడు కవి.

రుక్మలోచన వివాహ సందర్భంలో వధూవరుల మధ్య తెర కట్టారుట. అన్యోన్యానురాగంతో వాళ్ళిద్దరి చూపులూ తెరదాటి ప్రసరిస్తూంటే, "మొగ మెఱుంగని చుట్టరికం" చేసాయిట వాళ్ళ హృదయాలు. భౌతిక వర్ణనతో ఆగిపోకుండా పాత్రల హృదయాల్లోని సుకుమార భావాల్ని కూడా సున్నితంగా వర్ణించాడు అబ్బయామాత్యుడు.

ప్రకృతి వర్ణనలో అబ్బయామాత్యుడు ప్రశంసనీయమైన ప్రతిభను ప్రదర్శించాడు. వసంతకాలపు ప్రకృతి శోభను నిసర్గసుందరంగా మన కన్నుల ముందుంచాడు. "ఇంపలరెడు కాంతులతో" వున్న చిగురాకులు "వనలక్ష్మి మేన పొడసూపెడు రాగ రసాంకురంబులు—వలపులవేల్పు కైదువులు – పాంథ జనంబుల పాలి యగ్నికీలలు" అన్నాడు.

"శుక భరద్వాజముఖ సద్ద్విజకుల రక్షఁ
దనరి, సుమనస్సమూహ వర్ధన మొనర్చి,
ఘనతరాగమ వేద్యుఁడై వినుతిఁ గాంచె,
మహిత వనవాస లీలల మాధవుండు." [2-42]

అనే పద్యంలో వసంతుడని, శ్రీకృష్ణుడని రెండర్థాలకు సరిపోయే విధంగా 'మాధవ' శబ్దంపై శ్లేష చమత్కారం చేశాడు. చిలుకలకు, ఏత్రింత పక్షులకు మొదలైన వాటికి రక్షణ కల్పించి, పూలను విస్తారంగా పెంచి, రాగరంజకమైతోటంతా పరచుకున్నాడు వసంతుడు. రెండో అర్థంలో శుక భరద్వాజ మహర్షులను సంరక్షిస్తూ, మంచివాళ్ళను కాపాడే వేదవేద్యుడైన శ్రీకృష్ణుడు స్ఫురిస్తున్నాడు.

సూర్యాస్తమయ వేళకు ముకుళించే పద్మాలను—

> "ఇనుఁడు కరంబులం బొదివి, యింపుగ సంగమ మాచరింపఁ, బ
> ద్మిని వదనంబున న్నగవుమీఱ వికాస విలాస మూని, లో
> నన ద్రవముబ్బి, సొక్కి, నయనంబులు మూయుచు నిద్రఁజెందెనో
> యన, ముకుళీభవించె, దివసాంతము నందుఁ బయోజషండముల్."
>
> [3-5]

అనే ఊహతో మనముందు ప్రదర్శించాడు.

సాయంత్రంవేళకు సరోవరానికి సమీపంగా ఉన్న చెట్లనీడలు మరింత పొడవుగా సాగి సరస్సులో పడుతున్న దృశ్యం కవిని భావనావీథిలో విహరింప చేసింది. సూర్యాస్తమయంతో పద్మానికి, సూర్యుడికి ఎడబాటు సంఘటిస్తుంది, విరహంతో పరితపిస్తున్న తన ప్రియురాల్ని ఓదారుస్తూ, 'మళ్ళీ నాలుగు జాముల కల్లా కలుసుకుంటాంలే' అని కబురందించడానికి చెట్లనీడల్ని దూతలుగా పంపించాడు సూర్యుడు. ఇదీ కవి ఊహ. పద్మానికీ, సూర్యుడికి నాయికా నాయక బాంధవ్యం ప్రసిద్ధమైన కవి సమయం. ఆ కవిసమయాన్ని ఆధారం చేసుకుని సూర్యాస్తమయాన్ని అద్భుతంగా వర్ణించాడు కవి.

సూర్యుడస్తమించగానే "భువన బంధుఁడు లేని యరాజకంబుచే లోకం చీకటి పాలైంది" అన్నాడు. 'భువనబంధుడు' (సూర్యుడు) కన్పించని రాత్రిసమయంలోనే కదా! దుష్కృత్యాలకి అవకాశం ఎక్కువ. అందుకే అతడు లేనప్పుడు లోకం చీకటి పాలైందంటూ 'భువన బంధుడు' అనే పదాన్ని అర్థవంతంగా ప్రయోగించాడు కవి.

క్రమక్రమంగా ఆకాశమంతా పరచుకునే తారకల్ని, చంద్రోదయాన్ని కూడా కవి చమత్కారంగా వర్ణించాడు. తనప్రియుడైన చంద్రుడి కోసం ఎదురుచూస్తూ రాత్రి అనే నాయిక పరచిన పానుపేమో అన్నట్లు, ఆకాశం తలమీద దిక్పాలకులు పూజచేసిన పువ్వులేమో అన్నట్లు, చీకటి గర్వాన్ని అణచడానికి దండెత్తి వస్తున్న రేరాజు ముందుగా నడిపిస్తున్న సైన్యమా అన్నట్లు, ఊర్ధ్వలోకాల్ని జయించాలని మన్మథుడు పైకి విసురుతున్న పుష్పబాణాలా అన్నట్లు నక్షత్రాలు కన్నుల పండుగై కన్పిస్తున్నాయిట. ఆ తర్వాత 'చల్లనిరాజువ'ని లోకం ప్రశంసిస్తుండగా

చంద్రుడు, తూర్పుకొండ అనే సింహాసనాన్ని అధిరోహించాడని చంద్రోదయాన్ని వర్ణించాడు.

ప్రభాత వర్ణనలో ఉదయ సూర్యుణ్ణి యోగితో పోలుస్తూ—

"తమముం బాయగఁజేసి, రాగగుణముం దప్పించి, సన్మార్గవ
ర్తిమతం బొప్పఁ, దపంబు పెంపునను వర్ధిష్ణుత్వముం గాంచి, లో
కము లెల్లం గనుఁగొంచు, సజ్జన నమస్కారార్ఘ్య దానంబులం
బ్రమదం బొంది, వెలింగె, యోగి కరణిం బ్రద్యోతనుం డయ్యెడన్."
(3-89)

అనే పద్యంలో అద్భుతంగా వర్ణించాడు. ఇలా ఏవర్ణన తీసుకున్నా కవి ప్రతిభకు గీటురాయిగా నిలుస్తుంది.

ఆత్మీయత :

కవిత్వంపట్ల ఇతని దృక్పథం చాలా విశిష్టమైంది. అవతారికలో—

"చతుర కవిత్వతత్త్వపటు సంపద యొక్కరి సొమ్ముగాదు, భా
రతి దయ సౌధవార్ధి, కవిరాజుల మానసముల్ ఘటంబు, లా
యతము కొలంది లబ్ధమగు నయ్యమృతం, బటుగాఁ దలంచి య
ద్యతన కవీంద్రులార ! కృప దప్పక, మత్కృతి నాదరింపుఁడీ !"
(అవ. 9)

అని విన్నవించుకున్నాడు. కాళిదాసాది సంస్కృత కవుల్నీ, నన్నయాది తెలుగుకవుల్నీ స్తుతించడంవల్ల ఈ కవి వాళ్ళగ్రంథాలన్నీ చదివిన పండితుడని తెలుస్తోంది. అబ్బయామాత్యుడు విద్వత్కవి. కావ్యంలో ఒకటి రెండు చోట్ల తన శాస్త్రవైదుష్యాన్ని ప్రకటించుకున్నాడు. రుక్మలోచన సౌందర్యాన్ని గురించి ఏం చెప్పినా, ఆమెపట్ల సార్థకమే అవుతుంది కాబట్టి ఎలాగైనా వర్ణించవచ్చును అంటూ "నిరంకుశుల్ గారెకవులు" అన్నాడు. యుద్ధప్రియుడైనబాణుడు "నీచాః కలహమిచ్ఛన్తి" అనే పెద్దల మాటకు సాక్షిగా ఉన్నాడని బాణుడి మూర్ఖత్వాన్ని తెలియజెప్పాడు.

లోకజ్ఞుడైన కవి అబ్బయామాత్యుడు. రుక్మలోచన వివాహ వర్ణనలో ఆనాటి వ్యవహార సరళిని తెలియజేశాడు. అలాగే "పరమాన్నంబులు, పిండివంటలును, సూపంబులు...." అంటూ ఆనాటి పిండివంటల్నికూడా వివరంగా పేర్కొన్నాడు.

తన కవిత్వంలో తప్పులుంటే బాలుడికి బుద్ధి చెప్పినట్లుగా సరిదిద్దమన్నాడు. కేవలం తప్పులెన్నడమే స్వభావంగాగల కుకవుల్ని తీవ్రంగా నిరసించాడు. భగవదర్పితమైన తనకావ్యంలో తప్పులెన్నడం తగదని సవిన

యంగా మనవిచేస్తూ కిరీటం పెట్టుకున్న తలకి సుత్తులెక్క పెట్టడం మంచి పద్ధతి కాదని హెచ్చరించాడు. దైవాంకితమైన కావ్యం ఎలాంటిదైనా పూలదండలో దారంలా ఆదరణీయమని, నరాంకితమైన కావ్యం ఎంతగొప్పదైనా హీనుణ్ణిపొందిన వేశ్యలా నిరాకరణీయమని అభిప్రాయపడ్డాడు.

కృతిస్వీకారం పొంది కవుల్ని ఆదరించే ప్రభువులకి కీర్తి లభిస్తుంది. కాని, కావ్యాలను దైవాంకితం **చే**సిన కవుల్ని కూడా ఆదరించి గౌరవించే ప్రభువు మరింత గొప్పవాడని చెప్తూ అతని 'కీర్తికే కీర్తి' లభిస్తుందన్నాడు అబ్బయా మాత్యుడు. అందుకే 'తుచ్ఛసంపద' కోసం సత్కవులు నరస్తుతి చెయ్యరని స్పష్టంగా చెప్పాడు. భక్తిభావంతో కూడిన స్వతంత్రమైన వ్యక్తిత్వం ఈ కవిలో కన్పి స్తుంది.

ఆంధ్ర కావ్యకన్య అందచందాలకు మరిన్ని మెఱుగులు దిద్దిన విశిష్ట సాహితీమూర్తి కనుపర్తి అబ్బయామాత్యుడు. అవును. "చతుర కవిత్వ తత్త్వ పటుసంపద యొక్కరి సొమ్ము గాదు" (1–9) కదా!

## కొన్ని పదాలకు అర్థాలు

మొయిలు = మబ్బు
ఇరులు = చీకటి
సుమచాపుడు = మన్మథుడు
తూపు = బాణము
తొడవు = ఆభరణము
వలపుల వేల్పు = మన్మథుడు
కైదువు = ఆయుధము
రేరాజు = చంద్రుడు
జాము = ఏడున్నర గడియల కాలము (3గం॥ కాలము)
కవిసమయము = కవిత్వంలో సంప్రదాయంగా వస్తున్న స్థిరమైన ఊహ
ద్విజ = బ్రాహ్మణుడు, పక్షి
సుమనస్ = మంచిమనస్సు, పూవు
శుక = శుకమహర్షి, చిలుక
భరద్వాజ = భరద్వాజమహర్షి, ఏట్రింత పక్షి
ఆగమము = వేదము
దివసాంతము = సాయంత్రము
పయోజము = పద్మము
షండము = సమూహము

వర్ధిష్ణుత్వము = అభివృద్ధి పొందే లక్షణం
ప్రమదము = ఆనందము
ప్రద్యోతనుడు = సూర్యుడు
కరణి = వలె
సౌధవార్ధి = అమృత సముద్రము
ఆయతము = పరిమాణము
అద్యతనము = ప్రస్తుతము.

## ఆధార గ్రంథాలు


1. అనిరుద్ధ చరిత్రము – ఎమెస్కో ప్రచురణ
2. అనిరుద్ధ చరిత్రము – అకాడమీ ప్రతి
3. సమగ్రాంధ్ర సాహిత్యం (సం. 10.) – ఆరుద్ర.

# అచ్చతెలుఁగు రామాయణము – కూచిమంచి తిమ్మకవి

సమీక్ష : శ్రీ పప్పు వేణుగోపాలరావు, ఎం.ఏ.

[జన్మస్థలం – బొబ్బిలి, విజయనగరం జిల్లా. జననం 30–6–1948, ఎం.ఏ. (తెలుగు, సంస్కృతం), బి. యస్సీ., బి.ఇడి. కొంతకాలం –ఆంధ్రోపన్యాసకుడు, మిసెస్.ఎ.వి.ఎన్. కళాశాల, విశాఖపట్టణం. బిరుదములు – ఆశుకవిశేఖర, అష్టావధాని. ఇంతవరకు 15 అవధానాలు, రాష్ట్రంలోను ఇతర రాష్ట్రాలలోనుచేశారు. ప్రచురణలు – హిందీ, కన్నడము, ఆంగ్లములలోకొన్ని వ్యాసాలు, గేయాలు, పద్యాలు, భారతభాగవతముల స్వరూపస్వభావములు, వినాయక – వేంకటనాయకుల చరిత్రలపై వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. భారత – భాగవతములు విషయసంశోధన అన్నఅంశంపై పిహెచ్.డి. పట్టానికి పరిశోధన – తెలుగుశాఖ ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు.]

## కవి జీవితాదులు :

అచ్చతెలుఁగు రామాయణం రచించినవాడు కూచిమంచి తిమ్మకవి. ఆరువేల నియోగి. ఇతని ముత్తాత బయ్యనామాత్యుడు. తాత తిమ్మయార్యుడు. తండ్రి గంగనామాత్యుడు. తల్లి లచ్చమాంబ. సింగన్న, జగ్గన్న, సూరన్న ఇతనికి తమ్ములు. జగ్గకవి సాహిత్యలోకంలో అందరెరిగినవాడు. గొట్టిముక్కల రామయమంత్రిగారి కుమార్తె బుచ్చమ్మ మనతిమ్మకవి భార్య. తిమ్మకవి పదిహేడవ శతాబ్దపు నాలుగవభాగంలో జన్మించి, పద్దెనిమిదవ శతాబ్దపు రెండవభాగం వరకు జీవించి ఉండేవాడని విమర్శకులు, చారిత్రకులు చెప్తున్నారు. ఇతను పిఠాపురం సంస్థానంలోని కందరాడ గ్రామానికి కరణమట! పిఠాపురాన్ని ఆరోజుల్లో శ్రీరావు మాధవ రాయుడు పరిపాలించేవాడు. అతనే ఇతనికి 'కవిసార్వభౌమ' బిరుదాన్నిచ్చేడు. అయినా తిమ్మకవి మాత్రం తనగ్రంథాలను పిఠాపురపు కుక్కుటేశ్వరస్వామికి అంకితం చేసేడు. ఈ 'అచ్చతెలుఁగు రామాయణం' కాక తిమ్మకవి వ్రాసిన గ్రంథాలు చాలా ఉన్నాయి. అందులోకొన్ని దొరకలేదు. దొరికిన గ్రంథాలన్నీ ముద్రితాలే! అవి : 1. రుక్మిణీపరిణయం ; 2. సింహాచల మాహాత్మ్యం ; 3. నీలాసుందరీ పరిణయము ; 4. రాజశేఖరవిలాసం ; 5. రసిక జనమనోభిరామం ; 6. సర్వలక్షణసారసంగ్రహం ; 7. సర్పపురమాహాత్మ్యం ; 8. శివలీలా విలాసం ; 9. కుక్కుటేశ్వరశతకం.

## కథాసంగ్రహం :

రామాయణం కథ తెలియని భారతీయుడుంటాడా ? అందునా తెలుగు దేశంలో రామాయణం చాలా ప్రాచుర్యంగల గ్రంథం. కాబట్టి కథా సంగ్రహం

చెప్పవలసిన పనిలేదు. కాని తెలుగు రామాయణాల్లో కొంత తెలుగుదనం చేర్చబడింది. ఈ కథ ఆంధ్రదేశానికి సంబంధించిందా అనే ఒక భ్రమ కలిగించడానికి కవులు ఇలాంటి తమాషాలు చేస్తూఉంటారు. మచ్చుకి కొన్ని ముచ్చటిస్తాను. ఈ మార్పులు అవాల్మీకాలు. అంటే వాల్మీకి రామాయణంలో లేనివి. తెలుగు రామాయణాల్లో ఉన్నవి. ప్రత్యేకించి ఇలాంటి మార్పులు అచ్చతెలుఁగు రామాయణంలో ఏం ఉన్నాయోచూద్దాం. అంతటి ఉద్గ్రంథాన్ని 1326 పద్యాలలో సంగ్రహించడమే మొదటిమార్పు. ఇంక కథలో అవాల్మీకాలు :

1. అహల్య తన కథ తానై రాముడికి చెప్పుకోవడం.
2. శబరి – సుగ్రీవుని వద్దకు వెళ్లి అతనితో స్నేహం చేస్తే కార్య సాఫల్యం జరుగుతుందని రామునితో చెప్పడం.
3. వాలి ఏడు వంకర తాటిచెట్లను పట్టి వాటి ఆకులు కోసేవాడు కాబట్టి రాముడు ఆఏడు తాటిచెట్లను ఒక బాణంతో కొడితేగాని వాలిని గెలవలేడనే ఒక సిద్ధాంతం.
4. లంకకు వెళ్లేముందు హనుమంతుడు సీతాశిరోరత్నాన్ని తెస్తానని చెప్పడం.
5. రావణుడు "కోతులను కొండముచ్చులను కూడగట్టుకొని రాముడు నాతోయుద్ధమేమిచెయ్యగలడని" ఎగతాళిచెయ్యడం.
6. లంకలోసీతను హనుమంతుడు "సీతలమానికమ్మ నెమ్మియలరార నానవాలిమ్మునాకు" అని అడగడం.
7. లంకనుండి వచ్చేముందు హనుమంతుడు లంకిణితో యుద్ధంచేయడం.
8. నీలునిచేత కొండలువేయిస్తే తేలుతాయని వారధికట్టడానికి సముద్రుడు ఉపాయం చెప్పడం, మొదలైనవి కొన్ని అవాల్మీకాలు.

అచ్చతెలుఁగు అంటే ఏమిటి ? :

ఆంధ్రభాషలో పదాలు నాలుగు రకములని వైయాకరుణులు తెలియజేసేరు. అది – తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము. ఇందులో తత్సమం రెండువిధములు – 1. సంస్కృతసమము, 2. ప్రాకృతసమము. సంస్కృత సమేతరమైన భాషనే అచ్చతెలుఁగు అంటారు. అందుచేత ఈ భాషలో ప్రాకృత సమాలు, తద్భవాలు, దేశ్యాలు ఉంటాయి. గ్రామ్యం లక్షణవిరుద్ధం కాబట్టి ప్రయోగానికి పనికిరాదని లాక్షణికులు చెప్పేరు. కాని ఆయాజాతుల ప్రయోగాన్ని బట్టి ఉపయోగించవచ్చని కొందరంటారు. ఇవికాక కొంతమంది కవులు అన్య దేశ్యాలుకూడా అచ్చతెనుగున ఉపయోగించేరు. కనుక దీని నంతటినీ కలిపి అచ్చ తెలుఁగని 'వికృతి' అని అంటారు. అచ్చ తెలుఁగులో వ్రాయ

బడిన రామాయణంకాబట్టి దీన్ని అచ్చ తెలుఁగు రామాయణం అని వ్యవహరిస్తారు. కాని రామాయణం అన్న పదం మాత్రం అచ్చతెలుగు కాకపోవడం గమనించదగ్గ విషయం. సంజ్ఞావాచకాలకు భాషతో పనిలేదు. అచ్చతెలుగు కావ్యరచనకు మార్గదర్శి పొన్నిగంటి తెలగనార్యుడు (16శ. అతనికృతియయాతి చరిత్ర) ఆ మార్గంలో సుదూరగామి సుప్రసిద్ధుడు తిమ్మకవి.

వస్తుతత్త్వం – తన్నిర్వహణ :

కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుగులో రామకథను వ్రాయడానికి వాల్మీకి రామాయణాన్ని అనువదించేడా ? లేక కథ తానెరిగినది కాబట్టి అక్కడక్కడ వాల్మీకాన్ని పరామర్శిస్తూ స్వతంత్రకావ్యంగానే ఈ గ్రంథాన్ని రచించేడా ? అనేది ఒకప్రశ్న. అనువాదంకాదేమో అనిపిస్తుంది. ఎందుచేతనంటే సుమారు ఇరవై నాల్గువేల శ్లోకాలుగల వాల్మీకిరామాయణానికి సుమారు 13 వందల పద్యాలు అనువాదం ఎలా అవుతుంది ? ఎంతతగ్గించినా ఇంతగాతగ్గించడం శక్యమా ? కాని తిమ్మకవి బాలకాండంలో మొదటనే ఇలా చెప్పుకున్నాడు.

తే॥ అప్పనంబుగ నా నేర్చునట్లొనర్ప
గడగు నిప్పన్నియపు బలుకబ్బమునకు
గత తెఱంగెట్టులన్న మున్గలనుదిండి
తపసిగని కల్గుకానుపు తపసివలికె (1–1)

అంచేత వాల్మీకాన్ని పరామర్శిస్తూనే తనకు తోచినవిధంగా వ్రాశాడన్నమాట ! ఈ విధంగా కవి ప్రసిద్ధవస్తువుగల ఈ రామాయణాన్ని కుంచించాడేకాని వస్త్వైక్యానికేమీ లోపం రానివ్వలేదు.

రసపోషణము :

రామాయణంలో (ఉత్తరకాండ కలిస్తే) కరుణం ప్రధానరసమని కొందఱి అభిప్రాయం. ఆరుకాండల అచ్చ తెనుగు రామాయణం కొంతవరకు ఈ మార్గాన్నే త్రొక్కింది. ప్రతికాండనీ పరిశీలిస్తే ఒకొక్కచో ఒకొక్క రసం కనిపిస్తుంది. బాలకాండలో అక్కడక్కడ అద్భుతరసం, అయోధ్యకాండలోను, అరణ్యకాండలోను, సుందరకాండలోను కరుణరసం, యుద్ధకాండలో వీరరసం బాలా చక్కగా పోషించబడ్డాయి. తెలుగుదనం ఉట్టిపడే తిమ్మకవి రచనలో రసిక జన మనోభిరామ కర్తయైన తిమ్మకవి రచనలో ఒకకాండనుంచి మరో కాండానికి వెళ్తున్నకొలది మధురమైన రచన, చమత్కారం, శైలి, రసం కనిపిస్తాయి.

పాత్రపోషణ - వర్ణనలు :

అనువాదంలో ఎంతో స్వాతంత్ర్యం చూపించినా పాత్రపోషణలో వాల్మీకి గీసిన గిరి దాటకుండా ఆయాపాత్రలను అలాగే పోషించాడు కవి. రామాయణంలో

ముఖ్యపాత్రలు – ఆయాపాత్రల లక్షణాలు అందరెరిగినవే. నాయకుడిగా రాముడిపాత్ర ఉదాత్తంగా కన్పిస్తుంది. ప్రతినాయకుడుగా రావణుడు పాత్రోచితమైన రీతిలో చిత్రీకరింపబడ్డాడు. సీత నాయికగా, సాధ్విగా, అత్యుత్తమ ఆదర్శ స్త్రీగా చిత్రీకరింపబడింది.

శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులను పెంచినతీరు కవి ఇలా వర్ణించేడు -

సీ॥ చిన్ని క్రొన్నెల నెన్ను నెన్నొసళ్లనొయారి
యలతి కస్తురిరేక లనువుమీఱ
గేలు దామరల మేల్జాళు వామురుగులు
కెంపు లుంగరములు సొంపునెఱప
మొలలహంబట్టు క్రొందలుకు దట్టీలపై
రతనంపు మొలత్రాళ్లు రంగులీన
నెదలనున్పులిగోళ్లు పొదవిన పతకముల్
తెలిముత్తియంపు పేరులు సెలంగ

తే॥ జెవుల గలిమానికపు పోగుగవలు మెఱయ
మొలక నగవులు మురిపంపు జిలుఁగునడలు
ముద్దు బలుకులు గులకంగ ప్రోలనాడు
కొమరులను జూచి మది నుబ్బుకొనుచునుండె [1-61]

ఎంత తెలుఁగుదన ముట్టిపడుతోందీపద్యంలో ! సీతాకల్యాణ సందర్భంలో సీత అందాన్ని వర్ణిస్తూ, సూర్యాస్తమయాన్ని కవి చాలా చమత్కారంగా వర్ణించేడు— ఇలా

తే॥ పగలు సేయుచువేడిమి, మిగుల జగము
గ్రాఁచు జమునబ్బ మున్నీట గలిసెననియొ
తొగవెలందుక నగియె నమ్మగువ పెంపు
గని, సయింపక తమ్మి మొగంబు మొగిచె [2-14]

తండ్రిమాటను పాటించి అడవికి వెళ్తున్న రాముడిని ఉద్దేశించి దశరథుడు పడిన బాధ నిలా వర్ణించాడు కవి. ఇది తిక్కనగారి బాణి. 'చంద్రరేఖావిలాపం'లో ఇతని తమ్ముడు జగ్గకవి కూడా ఈ బాణీలో ఓ పద్యం వ్రాసేడు.

ఉ॥ కాయనుమేటితప్పుకొడుకాయను నిద్దపుబూతమావిమో
కాయను బంజరంపు జిలుకాయను నబ్రపుసోయగంపు బో
కాయను బల్కువేమి యలుకాయను బంతము దీరెనోటుకై
కాయను నేరయిట్లు దుడుకాయనుఁ బాయగకోరికాయనున్. [2-902]

అరణ్యకాండలో సీతావియోగసందర్భంలో రాముడు విలపించినతీరు వర్ణించిన ఈ పద్యం చాలచక్కని కవిత్వానికి, తెలుఁగుదనానికి, నికషోపలం.

సీ॥ ఆకుటిక్కలు నాడెమైన మాడువులయ్యె
మంటి దుంపలు పిండి వంటలయ్యె
నారచీరలు జిల్గు నలువు బుట్టములయ్యె
బడుకు సెజ్జలు పూవు బాన్పులయ్యె
వాకనీరులు దియ్యవలిపానకములయ్యె
బిగువునేలలు పైడి జిగిలులయ్యె
..............................................
..............................................

తే॥ దిప్పలెల్లను గ్రపంపు దిప్పలయ్యె
గార్మెకంబులు దలగని కాపులయ్యె
నిన్నుదగగూడి యడవులనున్నయపుడు
చాన ఎడబాసియింకనెట్టు సైచువాడ ! [3-102]

హనుమంతుడు లంకను చేరడానికి సముద్రాన్ని లంఘించే సందర్భంలో అత్యంత సహజంగా ఆ సంఘటనను వర్ణించాడు కవి.

తే॥ అడుగులూనద్రొక్కి మెడయుజేతులు సాచి
తోకయూచి మేను వీక బెంచి
చెవులు నిక్కజేసి చివ్వన జుక్కల
దారి కెగసి కడలి దాటి వేగ [4-101]

పారాయణ సౌలభ్యంగల సుందరకాండ రామాయణంలో అతిప్రశస్తమైన భాగంగా పేర్కొనబడింది. అందులో సీత హనుమను కామరూపుడైన రాక్షసుడేమో నని సందియపడుతుంది. అయితే నమ్మకంకోసం తనరాముణ్ణి వర్ణించమంటుంది. ఆ సందర్భంలో హనుమద్వారా కవి చేసిన రామవర్ణన అనన్యసామాన్యం.

సీ॥ మొలక నవ్వులవాడు తలకారు తొలుకారు
బలుకార్మొగుల గేరుపొలుపువాడు
నిడుదచేతులవాడు నిద్దంపు టద్దంపు
సుద్దంపు నెటిచెక్కుజోటివాడు
వెడద కన్నులవాడు విప్పారి యొప్పారు
గొప్ప నెన్నుదురుచే నొప్పువాడు
పటువు పేరెదవాడు పరువంపు గరువంపు
నెలవోని నెమ్మొము కలుగువాడు

తే॥ గీ॥ ........................................

........................................

............ముజ్జగంబులునువలచు
సోయగమువాడు సువ్వెనీ రాయడింతి [5–83]

అశోకవనంలో వృక్షనిర్మూలనంచేసి రాక్షసులతో కోరి యుద్ధం తెచ్చుకొని చాలమందిని చంపి, చివరికి ఇంద్రజిత్తువేసిన బ్రహ్మాస్త్రాన్ని గౌరవించడానికి పట్టుబడ్డ ఆంజనేయుణ్ణి, రావణుని కొలువుకు తీసుకువెళ్లేరు రాక్షసులు. అప్పుడు హనుమ రావణునితో ఇలా అన్నాడు—

ఆ॥ నిన్నుజూచి కూర్మినివ్వటిల్లగ గొన్ని
బుద్ధులెఱుగ జెప్పి బుజ్జగింప
దలచి పట్టువడితి తప్పక నామాట
దిటముచేసి బ్రతుకు తెరువుకనుము [5–143]

కాని ఆ మాటలు పెడచెవిని పెట్టిన రావణునితో హనుమంతుడు ఇలా అన్నాడు—

తే॥ ... .... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ...

అహహ చెడుగోరు కొనివానికరయ నొరుల
పలుకు సెవులకు గొఱవియై పరగకున్నె (5–156)

ఈ విధంగా నాటకీయత, జాతీయత జోడించిన కవిత్వం కూచిమంచి తిమ్మన సొత్తు.

యుద్ధకాండలో కోతుల ఆగడాలను భరించలేక రాక్షసులు కోతులను తిట్టి నప్పటి పద్యాలు సహజ సుందరంగా ఉన్నాయి. హాస్యం, చతురోక్తి కూచిమంచి వంశానికే చెల్లాయా అనిపిస్తా యీవర్ణనలు. మచ్చుకో రెండు ముచ్చటిస్తాను.

ఆ॥ ఓరి కోతికూళలార కాఱడవుల
దూఱి కాయగసరు లేరుక తిని
బ్రదుక లేక రాచగుదియతో బొత్తాని
పొలసుదిండ్ల నెదిరి పోరదగునె? (6–286)

ఆ॥ అలి నప్పగించి యంతట బోక, మి
మ్మప్పగింప దెచ్చె నఱ దలంచి
రాచవాని నమ్మ రాదన్న మాట, మీ
రెఱుగరైతి రింక నేమి కలదు! (6–287)

ఇలా ఎన్నో చతురోక్తులతో, ప్రౌఢ వర్ణనలతో రసజ్ఞుల సహృదయాల నానందింప జేస్తాడు తిమ్మకవి. చివరిగా రామ రావణ యుద్ధంలోని ఒకపద్యాన్ని ఉదాహ రిస్తాను. రాముడు రావణునితో ఏ విధంగా యుద్ధం చేసేడో ఈ పద్యం కంటికి కనిపించేటట్టు వివరిస్తుంది.

సీ॥ కప్పు కుత్తుకసామి కంటి మంటలబోలు
తూపులు బుజముల దూర్చి తూర్చి
మిత్తికోఱలతోడ మేలమాడు మెఱుంగు
గోలలుఱొమ్ముల గ్రుచ్చి గ్రుచ్చి
పిడుగుల కెనయగు బెడిదంపు ములుకులు
ప్రక్కల నఱిముఱి బఱపి పఱపి
విసము గ్రక్కిన మేటి వీనులకంటి వా
ల్చెనయు గిట్టలు మేన జొనిపి చొనిపి

... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... (6–543)

ఇలా హృద్యమైన వర్ణనలతో రామాయణాన్ని రమణీయంగా తీర్చిదిద్దాడు తిమ్మకవి.

ఆత్మీయత :

కవి సహజంగా సరసుడు. కూచిమంచి తిమ్మకవి వంశానుగుణంగా సరసుడు. తమ్ముడు జగ్గకవి ఒకబాణీలో నడిస్తే ఇతను మరొక బాణీలో నడిచినా, హృదయస్థమైన భావావేశం ఒకటే! తానొక కరణమైనా, రాజు తనని గౌరవించి, సన్మానించి బిరుదప్రదానాదులు చేసినా, ఏ కృతినీ రాజుకంకితమియ్య లేదీకవి. ఇది ఇతని వ్యక్తిత్వానికి నిదర్శనం. అచ్చ తెలుఁగు రామాయణరచనమే ఒకయజ్ఞం అది చేయ సంకల్పించడమే ఒక మహాయత్నం. అంతటి స్వతంత్ర భావం గలవాడు గనుకనే అనువాదమనే మాట మరపించేలా వ్రాయగలిగేడు రామాయణం.

అంతటి రసికశేఖరుడైన కవిలేఖిని నుండి వెలువడిన గ్రంథరాజం 'అచ్చ తెలుఁగు రామాయణం.' ఇది ఆంధ్రుల నోముల ఫలం.

## కొన్ని పదాలకు అర్థాలు

బలుకబ్బము = గొప్ప పుస్తకం, మహాకావ్యం
కలను దిండితపసి = నారదుడు

క్గలుకానుపు తపసి = వాల్మీకి
జాళువామురుగులు = బంగారు కంకణములు
ముత్తియంపు పేరులు = ముత్యాలహారాలు
జమునబ్బ = యమధర్మరాజు తండ్రి (సూర్యుడు)
తొగవెలందుకలు = కలువలనెడు స్త్రీలు
తమ్మి = తామరపువ్వు
మాడువు = ప్రాసాదము
పైడిజిగిలి = బంగారుమయం
కేరు = అపహసించు
చిటము = స్థిరము
కప్పుకుత్తుకసామి = నీలకంఠుడు
మిత్తికోరలు = మృత్యుదంష్ట్రలు
గిట్టలు = బాణములు.

ఆధార గ్రంథాలు

1. అచ్చతెలుగు రామాయణము – వావిళ్లప్రతి, 1954
2. వాల్మీకి రామాయణం [సంస్కృతం] – గోరఖ్‌పూర్‌ప్రతి.